# విజ్ఞప్తి.

ఆస్తికవరేణ్యులారా! భాషాసేవకులారా!

అరుణాచలఖండము ముద్రణము కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ మున్నగు బిరుదముల నంది తెలుఁగుదేశమున సుప్రసిద్ధకవివతంసులని పేరు గాంచిన కీ. శే. బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు విక్రమవత్సరమున ఆరంభింపఁజేసిరి. ఆర్థికదశనుబట్టి మెల్లమెల్లగా సాగినముద్రణము ముగిసినది. గ్రంథము వ్రాయుటకు వారివ్రాతప్రతియందు "విక్రమసంవత్సరవైశాఖ బ౧౦ శుక్రవారము జన్నవాడ భగవత్సాన్నిధ్యమునందు గర్కాటకలగ్నమున నారంభింపఁబడినది" అని గలదు. వారు దివంతులగునప్పటికే యీపొత్తము ముద్రణము ముగిసినది.

గ్రంథము శ్రీమదరుణాచలక్షేత్రమహిమను దెల్పుచున్నది. ఇయ్యది శ్రీస్కాందపురాణాంతర్గతము. అనువాదము హెచ్చుతగ్గులులేక యథామూలముగ సాగినది. భావ మెంతమాత్రమేని వదలఁబడలేదు. వీరి రచనలఁజవిగొన్న పాఠకులకుఁ బ్రత్యేకముగ విన్నవింపవలసిన విషయములేదు.

శ్రీశర్మగారు పరమపదించినతర్వాతఁ బెక్కుచోట్ల సంతాపసభలు జరుపఁబడినవి. తీర్మానము లంపఁబడినవి. వారిభాషాసేవ మున్నగు కార్యములఁగూర్చి ప్రశంసలు జరిగినవి. పత్రికలు వేనోళ్లఁబొగడినవి. వారికావ్యములు రచనలు వ్యాప్తికిఁ దెచ్చుటకు నాపేరు సూచించినవ్యక్తులు, పత్రికలు కలవు.

హస్తిమశకాంతరమున నుండునేను తద్రచనల నెట్లు లోకమున కందింపఁ గలనా యనువిచారము మిక్కుటమైనది. అట్టిమహానుభావులకు సోదరుఁడ ననుపేరుకైనఁ దగనియేను తద్రచనల ముద్రణమగునట్లు చేసి యెట్లు వెలువరింపఁగల్గుదును? కొన్ని యసంపూర్ణములు గలవు. వాని

నెట్లు పూరింపఁగలను? శ్రీశర్మగారియెడ సానుభూతిగలవారితోడ్పాటు పరిపూర్ణముగనుండిన వారిరచనలనన్నింటిని వెలువరింప సాధ్యమగునేకాని లేకున్న నసాధ్యము. అముద్రితములై వ్రాఁతలోనుండు గ్రంథములను నిం దుదాహరించుచున్నవాఁడను. సహృదయులై యారసి శక్తివంచనలేని యట్లు తోడ్పడుదురని మనవి.

| | | | | పద్యములు. |
|---|---|---|---|---|
| 1. కేదారఖండము. | శ్రీస్కాంధపురాణములోనిది | | 5000 | ,, |
| 2. గిరీశవిజయము | స్వతంత్రకావ్యము. | | 3000 | ,, |
| 3. హృదయానందము | ,, | అసంపూర్ణము | 5000 | ,, |
| 4. శ్రీకృష్ణదేవరాయచరిత్రము | ,, | ,, | 5000 | ,, |
| 5. శ్రీశంకరాచార్యచరిత్రము | ,, | ,, | 5000 | ,, |
| 6. కలివిలాసము రెండవభాగము | ,, | ,, | 2000 | ,, |
| 7. నీటుకత్తె సంపూర్ణము | | | 500 | ,, |
| 8. వైజయంతి. ఒకనాటకము | | అసమగ్రము | | |
| 9. నవరత్నహారము. చిత్రకవిత్వము అలంకారశాస్త్రము. | | ,, | | |
| 10. శ్రీరామావతారతత్త్వము 12 వ సంపుటము. | | ,, | 80 | పుటలు |
| నాలుగు ఫారము లచ్చయినది. | | అసంపూర్ణము | | |
| 11. దుష్ప్రభుత్వము - వచనము | | ,, | | |

ప్రారంభించి ఏఁబది యఱువదిపద్యములు వ్రాసినగ్రంథము లెన్నో కలవు. ఈకార్యభారము ఎట్లు నిర్వహించునది? తలఁచిన కొలఁది మనమునఁ గలవిలపాటు మిక్కుటమగుచున్నది. మొదలే గురువియోగభారమును వహింపఁజాలక యల్లాడుచుండు నాకు నీకృతిసంపూర్తి యన్నఁదలంపు విభ్రాంతునిజేయుచున్నది. శ్రీకళాప్రపూర్ణులు నాకు రామశబ్దము నారం భించి పండితపదవిని సమర్థతతో నిర్వహింపఁగలశక్తి యలవడునంతవఱకుఁ గఱపినగురువులు. నాయభ్యుదయమునుగోరి పెక్కుచిక్కులఁ జక్కదిద్దిన మహామహులు. వారితోడ్పాటును గూర్చి నేను బదునైదువత్సరముల క్రిందట ననువదించి ముగించి యచ్చొత్తించుటకు శక్తిలేక యింట నిలిపి

పూజించుచున్న మహాభాగవతమున విశదముగ వ్రాసికొనియున్నాఁడను. భగవతి దయవలనఁ బ్రకటితముగు నేనివిదితమగునని యిందు వ్రాయనైతిని.

కీర్తిశేషులగు మద్గురువులు నాకుఁగావించిన సాయమునకు నేను లేశమయినను ఋణముతీర్చుకొనఁజాలను. ఈ గ్రంథముద్రణమున కెవరెవరు ధన దానరూపమునఁ దోడ్పడిరో వారినామధేయము లేనెఱుంగ. అట్టివారికి నాకృతజ్ఞతఁ దెలుపుచున్నాఁడను.

ఈ గ్రంథమును భక్తులు, శిష్యులు, శర్మగారియభిమానులు, మున్నగువారు దయయుంచి స్వీకరించి ముద్రితముకాని గ్రంథరత్నముల వ్యాప్తికిఁ దెచ్చుటకుఁ దోడ్పడుదురని మనవిచేయుచున్నాఁడను.

విమర్శకశిరోమణులు, అసమానపాండిత్యవిరాజితులు, గోదావరీతీరవాసులు, వేగేశ్వరపురవాస్తవ్యులు, శ్రీ శేషాద్రిశర్మగారిప్రియమిత్రులు, బ్రహ్మశ్రీ యేబూరిపాటి రామభద్రచయనులుగారు ఈ గ్రంథమునకు దయతోఁ బీఠిక వ్రాసియిచ్చిరి. వారియందుఁ గనఁబఱచు నభిమానమే నాయందును గనఁబఱచి విషయమును దెల్పినంతనే యరుణాచలగ్రంథమును బంపుమని వ్రాసి, పీఠిక వ్రాసి యొసంగుటచే వారికి మత్కృతజ్ఞత నమస్కృతిపురస్సరముగ నివేదించుచున్నాఁడను.

శ్రీకళాప్రపూర్ణుల ఈయరుణాచలఖండమును గూర్చి ప్రశంసించుచు శ్రీపిఠాపురము తాలూకా కిరికెర గ్రామము, గౌతమనికేతన నివాసులు, ఆంధ్రకర్ణాటక కవిశేఖర, కవికేసరి, మహాకవి, రెడ్డి భీమరావుగారు పంపినపద్యరత్నములు ఇందుఁ బొందుపఱచితి. చిత్తగింపుఁడు.

తప్పులక్షమింప వేఁడికోలు.

శ్రీలలితావిలాసము<br>
కడప<br>
వికృతి శ్రావణపూర్ణిమ

పండిత జనవిధేయుఁడు,<br>
జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.<br>
శ్రీ శ్రీ శ్రీ

# పీఠిక.

---

జయంతి తే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్.

పురాణములను మహాపురాణములు, ఉపపురాణములు, ఇతిహాసములు, సంహితలు అను నయిదుభాగములుగ విభజింపవచ్చును. పురాణసంహితలను నొకపెద్దభాగము మొదట వ్యాపించియుండవచ్చును. వేదమునకుఁ బదక్రమములువలెఁ బురాణములుకూడ విభజింపఁబడియుండనోపు. కాని జటక్రమములువలె సంఖ్య నంటియుండక యల్లికలుకలిగి వేర్వేఱు త్రోవలఁ బోవుచు వచ్చినవి. మహాపురాణనిర్వచన మిది. 'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ.' ఇందు వంశమందు మన్వంతరాదులు చేరవచ్చును. "సర్గశ్చాపి విసృష్టిశ్చ స్థితి స్తేషాంచ పాలనం, కర్మణాం వాసనావార్తా మనూనాంతు క్రమేణచ, వర్ణనం ప్రళయానాంచ మోక్షస్యచ నిరూపణం, తత్కీర్తనం హరే రేవ దేవానాంచ పృథక్పృథక్." పదునాలుగు విద్యలలో నొకభాగముగ పురాణములుకూడ నిర్వచింపఁబడినవి. "అంగానివేదా శ్చత్వారో మీమాంసాన్యాయవిస్తరః, పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహ్యేతాశ్చతుర్దశ."పురాణములలో నిత్యజీవితమున కెంతయవకాశముండునో తెలియుచున్నదికదా !

మహాపురాణములు పదునెనిమిది. "భద్వయం మద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయం అ, నా, ప, లిం, గకూ, స్కాని" ఉపపురాణములుకూడ పదునెనిమిది. ఉపపురాణములసంఖ్య నేటికిఁ దేలలేదు. పురాణములకుఁగూడ మతద్వేష మున్నది. పురాణనిర్వచనములో గొన్నిపురాణములు తమతోడివానిని జేర్కొనలేదు. ఇదియే శైవవాయుపురాణముల కలిమికి భేదజనకముగ నుండుహేతువు. చూడుఁడు : త్రిలిఙ్గపత్రికలో నాచే వ్రాయఁబడిన కీ॥ శే॥ శేషాద్రిశర్మగారి బ్రహ్మబ్రహ్మాండపురాణముల విమర్శనము. పురాణములకలిమి నుపనిష

ద్బ్రాహ్మణము లంగీకరించుచున్నవి. చాందోగ్యోపనిషత్, తృతీయ ప్రపాఠకచతుర్థఖండము ౧-౨ అనువాకములో 'ఇతిహాసః పురాణం' అనుచు రెండుసారులు పురాణశబ్దమును వాడినది. ౭ వ ప్రపాఠకములో "సహోవాచ ఋగ్వేదో భగవోధ్యేమి,యజుర్వేదం సామవేదమథర్వాణం చతుర్థమితిహాసం పురాణం పంచమం వేదానాం వేదమిత్యాది. గోపథబ్రాహ్మణము.ఏవ మిమే సర్వే వేదా నిర్మితా స్సకల్పాస్సరహస్యాబ్రాహ్మణాస్సోపనిషత్కా స్సేతిహాసా స్సాన్వయాఖ్యాతాస్సపురాణాస్సస్వరాస్ససంస్కారాస్సనిరుక్తాస్సానుశాసనా స్సానుమార్జనా స్సవాకో వాకా స్తేషాం యజ్ఞమభిపత్యమానానాం చిద్యతేనామధేయం యజ్ఞమిత్యేవాచక్షతే" మనుస్మృతిలో, "స్వాధ్యాయం శ్రావయే త్పిత్ర్యే ధర్మశాస్త్రాణిచైవహి, ఆఖ్యానా నీతిహాసాంశ్చ పురాణా న్యఖిలానిచ" పురాణోపపురాణములు ముప్పదియాఱుకాక సంఖ్యానిశ్చయములేని ఉపపురాణములు కూడ పితృకర్మలయందు పాఠ్యములగుచున్నది. స్మృతి-పురాణములు పురాతనకథలనుట కిది యుదాహరణము:—

కొన్నిపురాణములలో మూఁడవదిగను గొన్నిటఁ బదమూఁడవదిగను బేర్కొనఁబడినస్కాందపురాణము శైవపురాణములు పదిలో నొకటిగను దామసపురాణములారిట నొకటిగను నున్నది. లక్షశ్లోకపరిమితమీపురాణమని పురాణములును లోకప్రవాదము నుడువుచుండఁగ దేవీభాగవతముమాత్ర మియ్యది యెనుబదియొకవేయిశ్లోకముల దగుచున్నది. స్కాందము పంచాశత్ఖండమండితము. ఆఱుసంహితలు కలది. ఆద్యంబగు సనత్కుమారసంహిత ఏఁబదియయిదువేల శ్లోకములు కలది. రెండవది: సూతసంహిత ఆఱువేలసంఖ్యకలది. మూఁడవది: శంకరసంహిత ముప్పదివేలశ్లోకములది. వైష్ణవసంహిత : అయిదువేల శ్లోకములుకలది. బ్రహ్మసంహిత అయిదవది: మూఁడువేలఆఱువదిశ్లోకములది. ఇందలి శంకరసంహిత పన్నెండుఖండములుగ విభజింపఁబడెను. ఆద్యంబగు నుమామహేశ్వరఖండమున నరుణాచలఖండము మూఁడువేల శ్లోకములు కలది. కౌమారికాఖండమును ఆఱువేలనాలుగువందలఏఁబది శ్లోకముల దానిని శేషాద్రిశర్మగారే తెలిఁగించిరి. ఈస్కాందము శివునిపరమోత్కృష్టతనుమాత్రమే చెప్పును "కవింపురాణ మనుశాసితారం" అని

శివపురాణము ఎనిమిదవ అధ్యాయమునఁ గలదు. పార్వతీపరమేశ్వర ప్రద క్షిణ మొకపర్యాయముచేసినను భూప్రదక్షిణపుణ్యా మబ్బునని యందు న్నది. అరుణాచలఖండమున నియ్యది పేర్కొనఁబడినదియే. ఈఅరుణాచల మునే శోణాచలముఁగఁగూడఁబిలిచెదరని అరుణాచలఖండమే చెప్పుచున్నది. శోణానది, శోణనదము మొదలయినవి పలుపొత్తములఁ బేర్కొనబడినవి. శోణ=ఎఱుపురంగుకలది. శోణాచలమయి శోణారుణశబ్దము లేకార్థము కలవికావున అరుణాచలమైనచో ఋ=ఋణ అరుణమని ఈమూలమున జెప్పఁబడుటకుఁ గారణమేమో "ఋణద్ధి సర్వలోకేభ్యః పరమం పాపసం చయం, మణో న విద్యతే యస్మి న్దృష్టే తే నారుణాచలః" ఈక్షేత్రము నిట్లుగూడ వాడనగునట. శివలోకము, గౌరీనగరము, జ్ఞాననగరము, తేజోనగరము, ముక్తినగరము, వాయునగరము, తిరువణ్ణామలస్థలేశ్వ రము, దక్షిణకైలాసము, అరుణగిరి, అరుణాచలము, అరుణాద్రి, శోణాచ లము. ఇందలి ఈశ్వరునిపేరు అరుణాచలేశ్వరుడు. దేవి అపీతకుచ. ఈమె శివునిగురించి తపస్సుచేయుటకు తనసంతానమునకుఁ బాలిచ్చుటను మాని వెళ్లినదగుట పానముచేయఁబడని స్తన్యముకలదని స్థలము చెప్పుచున్నది. స్థలవృక్షముండవలె నను నియమ మున్నట్లున్నది. కాంచిలో నామ్రవృక్ష మువలె నిటవకుళ (పొగడ) వృక్షము కథితము. కృతయుగమున నగ్నిపర్వ తముగను త్రేతను మణిపర్వతముగను ద్వాపరమున హాటకముగను గలిని మరకతశైలముగను బిలువఁబడునని ఈపురాణమే చెప్పుచున్నది. ఇది యుగాంతమున నశింపదుకాఁబోలు! శివపురాణమునఁగలతైజసలింగ ప్రాదు ర్భావ మిందుఁ బ్రధానముగ వర్ణితము. అరుణాచలఖండమునఁ దేజోలింగ మును వెదకుట గజకేశవులు రెండుమాఱులు ప్రయత్నించెదరు.

"తైజసలింగంబు సకలదైవతపూజ్యం, బైనదిగా నొందును"
ఆ శివుని రాణివాసము, పేశలకరుణాలయం బపీతకుచ యనఁ
శ్రీశివ రాణించును భవ, పాశంబులఁ ద్రుంచు భక్తపాళి కనువుగాఁ.
వ. అందలితీర్థం బసాధారణంబు.

శివపురాణము లింగవైభవఖండము ౧ అధ్యాయము 75, 76 పద్య ములు శ్రీశివపురపు నాగవీరయ్యశాస్త్రిగారిది. "తేజోమయమరుణాద్రిఁ" కాంచీక్షేత్రమాహాత్మ్యమున నియ్యది దిట్లుచెప్పబడినది. "దర్శనాదభ్ర

సదపి జననాత్కమలాలయే కాశ్యాం తు మరణా న్ముక్తిః స్మరణా దరుణా చలే" "స్మరణాదరుణాన్ముక్తిః" ఇట్లే స్వామిపైఁ గీర్తనలుకూడ వెలసినవి. సారంగ రాగము-రూపకము దీక్షితులుగారు వ్రాసినది.-

అరుణాచలనాథం స్మరామి. అనిశమపీతకుచాంబాసమేతం స్మరణా త్కైవల్య ప్రదచరణారవిందం। తరుణాదిత్యకోటిసంకాశం చిదానందం, కరుణారసాదికందం శర ణాగతసురబృందం......పతంగం. ఇట్లే దేవినిగూడ స్తుతించుశ్లోకములు కలవు.

"అనర్ఘ్యమణిభూషణా మఖిలలోకరక్షాకరాం
అరాళశశిశేఖరా మసితకుంతలాలంకృతాం,
అఖండఫలదాయినీ మరుణశైలమూలాలయాం
అపీత కుచనాయికా మహరహ ర్నమస్కుర్మహే."

తొంబదిఆఱుగురు బ్రహ్మలు గతించినపిమ్మట తత్కాలపు టింద్రుఁడు బ్రహ్మ చేయుచున్న తపస్సును భంగమొందింపఁగోర సరస్వతీనది స్త్రీరూపమునఁ బుట్టును.అబలను మోహించి పట్టుకొనఁ బఱుగులువాఱును. విధి అరుణాచల మును దఱిసి శరణొందఁగ శివుఁడు ధనుర్యుతుఁడై ప్రత్యక్షముగాఁగ మో హము తగ్గి పరిచర్య సలుపును. తేజోలింగాన్వేషణము వామనపురాణమునఁ గూడ వర్ణితము. ఆపురాణమున మొగలిపూవు పూజానర్హముగ శపింపఁబ డును. గోవును విష్ణువు సాక్ష్య ముండగోరుటయు నయ్యది ముఖమును వ్యతిరేకముగను వాలము ననుకూలముగను సూచించుటచే గోముఖము నుషఃకాల ప్రథమదర్శనమున నిషేధము నొందించినట్లును వాలమును జూచుట పుణ్యదాయక మనియు నా వామనమే చెప్పుచున్నది. స్థలమహా త్మ్యములు దేశకాలౌచితిని బాటించుట లోపించునని పురాణములే సాక్ష్య మొసఁగును. అరుణాచలమాహాత్మ్యము పాణినిని, గాఢనియమపరతంతుని జేసి, వ్యాకరణరచనమును సాగించునట్లు జేయును. పాణిని క్రీ. శ. పూర్వము 8 వ శతాబ్దివాఁడు. పాటలీపుత్రమున నున్నవాఁడు. ఈ అరు ణాచలఖండము (స్కాంధము)నఁ బ్రవేశించినాఁడు.

క్రీ.శ.1928 వ వత్సరమున శ్రీమదీశ్వరయతీంద్రులు ద్రావిడభాషలో నీయరుణాచలమాహాత్మ్యమును వచనమున రచింపఁగ శ్రీ. వి. గోపాల

రావుగారును దెలుఁగున వచనమున వెలువఱచిరి. మొన్న నీనడుమనే సిద్ధి నొందిన మహర్షి రమణస్వామి మునీశ్వరయతీంద్రులును, గలిసి కొంతకాల మున్నట్లున్నది. రమణమహర్షి చరిత మాంధ్రదేశముననేకాక యన్నిదేశ ముల మిక్కిలి వ్యాప్తినొందినది. రమణమహర్షి వలనఁగూడ నేఁ డరుణాచల మతిప్రఖ్యాతి నందినది. యాత్రికులు పలువురు నిత్య మీక్షేత్రదర్శనమున ధన్యత నొందుచుండిరి. సకలజనాకర్షణమునకు రమణమహర్షి కారకుఁడగు చుండెడివారు. వారి నిరంతరవ్యాసంగతివలన భక్తు లట స్థిరవాసము లేర్ప ఱచుకొనిరి. స్వామియుఁ దమదర్శనార్థ మరుదెంచు వారలకు భోజన,వైద్య, విశ్రాంతి సౌకర్యములు తగురీతి నొసంగి మన్నించుచుండిరి. వారితరులు సంఘసంస్థలను నిర్వహింప రనుభయమునఁ దన బంధువర్గమునందు నిలిపి జాగ్రతగ నడుపుచుండిరి. నేఁడు వారినిర్యాణమువలన నేలోపమును దోఁపనీయకుండునట్లు నిర్వాహకులు యత్నింపకమాన రని చెప్పవచ్చును. ఈక్షేత్ర ముత్తరార్కాడుజిల్లాలోనిది. కాట్పాడి విల్లుపురం స్టేషనులకు మధ్య నున్నది. ఇటఁ జక్కగ నిర్వహింపఁబడుచున్న వేదపాఠశాల కలదు. నాటుకోట సెట్టులచేఁ గట్టబడిన గొప్పసత్రము కలదు. ఇందలి జ్యోతిర్వి గ్రహదర్శనమున, ననిర్వాచ్యభక్తి యేర్పడితీఱునని యనుభవమువలనఁ జెప్పఁగలను.

ఈ అరుణాచలఖండమును కీ. శే. జనమంచి శేషాద్రిశర్మగారు తెనిఁగించిరి.

"ధంభం నోద్వహతేన నిందతి పరా న్నో భాషతే నిష్ఠురం
ప్రోక్తం కేనచి దప్రియంచ సహతే క్రోధంచ నాలంబతే,
జ్ఞాత్వా శాస్త్ర మపి ప్రభూత మనిశం సంతిష్ఠతే మూకవత్
దోషా నాఛ్ఛదయతే గుణాన్వితనుతే చాష్టా గుణపండితే"

ఈశ్లోకము శర్మగారినిగుఱించియే వ్రాయబఁడినదో యన్నట్లున్నది. వీరు రచి. చిన గ్రంథములు నూటికి మించినవి. సరళధోరణిని గవితారచనను సాగించిం మహాకవి ఈయన. వీరిగ్రంథములు కొన్నిముద్రణ మందక నిల్చియున్నవిన శర్మగారి యకస్మాన్మృతివలనఁ దెలుఁగుభారతి మందభాగ్య అయినదని చెప్ప వచ్చును. అరుణాచలఖండము ననువదించుచున్నట్లు నాతోఁ జెప్పుటయు జాబులు వ్రాయుటయు జరిగినది. నెల్లూరున జబ్బుతో నిలిచినయప్పు డీమూ

లమును జూచి వ్రాసితినని చెప్పియుండిరి. నాతో వారింట నేనున్నప్పు డీ పొత్తమునకుఁ బీఠికను వ్రాయుమని కోరియుండిరి. ముద్రణ మందినపిమ్మట నట్లేచేసెదనని చెప్పుకొంటిని. నేనందులకుఁ దగకున్నను వారియాజ్ఞను మీఱ లేకుంటిని. ముద్రణ మందిన వెంటనే కాపీ నంపెదనని చెప్పిన వీరట్లుచేయక ఆకస్మికముగ మోసపుచ్చుట జరిగినది. తరువాత శ్రీజనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారిపై విషయ మెఱిగియున్న వారగుట నీపొత్తము నంపినవారైరి. మూలముకొఱకుఁ బ్రయత్నించితిని. వారిభాండారమున లేకపోయినది. ఇతరకార్యవ్యాకృతివలన నేటికిఁగాని పీఠికను వ్రాయలేకపోతిని. అరుణాచలఖండములో నందందు మూలశ్లోకముల నుదహరించుచు వచ్చుటచే వాని నాధారపఱచుకొని యనువాదమును జూతును. ఇది ప్రబంధము కాదు. పురాణానువాదము. మూలమునకుఁ దలయొగ్గవలెను. కవితాసరళత కలిగియుండినఁ జాలును. శర్మగారిరచనములో దానికై వెదకుకొనవలసినపని లేదు.

సు॥ ప్రసన్నుఁడవగుము నీశుభదతూప, దర్శనంబున హితఫలతతులు గలుగు
భువనహితమును గోరియే భూతనాథ!, యుదయమందుదు నెప్పుడో యుగ్ర! శర్వ!
(ద్వి. ఆ. 111 పద్యము)

మండలమెు మండ లార్థంబొ మహితనియతి, విధిని సంకల్ప మొనరించి వేడ్కఁ జేయ
బంచినఁ రాజ్యభూతిఁ జలించ దెపుడు, శత్రుసాధ్వసమే లేదు సత్యమిద్ది.
(9 ఆ. 569 ప)

అనువాద నిర్దుష్టత.

ఆసన్నప్రసవా నారీ యథా గచ్ఛే దనాకులం
తథా ప్రదక్షిణం కుర్యా దశృణ్వంశ్చ పదధ్వనిం.
స్నాతో విశుద్ధవేష స్సన్నభస్మ రుద్రాక్షభూషితః,
శివస్మరణ సంతుష్టో మందం దద్యా త్పదం బుధః. (9 ఆ.)
ప్రసవము దాపున నుండెడు, బిసరుహాలోచన యదెట్లు వెస మాని గతిం
బ్రసరింపఁజేయు నవ్విధి, నెసఁగు గతి వలగొనంగ నెంచఁగవలయున్.
(9 అ 536 పేజీ 79)

తనువ నాకులముగఁ దగియుండెఁదగుఁ బ్రదక్షిణమునందు నొరులచెవికిఁ బదము
నిడఁగ నిస్వనంబ దించుకే వినఁబడ, రాదు గమననియమ మాఁదగి యిటు.
(9 అ 537 పేజీ 77)

స్నాతుఁడై శుద్ధవేషంబు గనంబడ మందగతి న్స్వామి యందుఁ బదము.
పెట్టఁగా దగియుండుఁ బ్రియముగ భస్మరుద్రాక్షభూషితుఁడయి వారు స్మరించు
చును ప్రదక్షిణము విశుద్ధ మనం బొప్ప నొనరింపగాఁదగియుండు...

నాస్తి శోణాద్రితః క్షేత్రం నాస్తి పంచాక్షరా న్మనుః
నాస్తి మాహేశ్వరా ద్ధర్మో నాస్తి దేవో మహేశ్వరాత్॥
నాస్తి జ్ఞానం శివజ్ఞానా న్నాస్తి శ్రీరుద్రతః శ్రుతిః
నాస్తి శైవాగ్రణి ర్విష్ణో ర్నాస్తి రక్షాకరా ద్గురుః
నాస్తి రుద్రాక్షతో భూషా నాస్తి శాస్త్రం శివాగమాత్॥
నాస్తి బిల్వదళా త్పత్రం నాస్తి పుష్పం సువర్ణకాత్
నాస్తి వైరాగ్య తత్సౌఖ్యం నాస్తి ముక్తేః పరంపదమ్,

కావున శోణాద్రికంటె మిన్నయగు క్షేత్రంబు లేదు. పంచాక్షర మంత్రంబుకంటె శ్రేష్ఠ మగుమంత్రంబు లేదు. మఱియు,

మాహేశ్వర ధర్మంబుల నేమాడ్కిం బోలఁజాలు నేకర్మంబుల్
భూమిన్ గానఁ గరావో, క్ష్మామర! దైవంబు లేడు. శంభునకంటెన్. (5 అ. 112 ప)
జ్ఞానము లేదెందు శివ, జ్ఞానమ్ముంబోలునట్టి శంభు శ్రుతితోఁ
గానఁబడ దీడు నేయం, గానైనది యదియొ రుద్రుకరుణాప్రదమా (5 అ. 113 ప)
శివభక్తులలోపల విష్ణువుతోఁ దుల్యుండు లేడు శుభ్రవిభూతిన్
దవిలిన భక్తిం దాల్చిన, నవు రక్షయె దానిఁబోలునది లేదొదున్. (5 అ. 114)
లేదు సదా చార మేదియే భక్తినిమించినయది; యొరు మేలుమదిని
గోరి కాపాడినవారికంటె గురుండు, రుద్రాక్షమించిన భద్రభూష
ణము లేదు; శంకరాగమముకంటెను శాస్త్ర మెయ్యది లేదని యెంచఁదగును.
బిల్వదళము మించు ప్రియపత్రమే లేదు, క్షితి సువర్ణకము మించి తగుపుష్ప
మరయ లేదు వైరాగ్యము నతిశయించు సౌఖ్యమే లేదు ముక్తికి సరియగు పర
మపదమన లేదు సత్యమీ మాట మాని, వర్య! స్వాంతమ్మున న్బహువారము లిటు,
(5 అ. 115 ప)

శర్మగారి యనువాదధోరణిని జూపుటకు మూలము నిలుకడగ నావద్దనుండమిని వీలుచిక్కలేదు. ఉదుకుపస దెలుపుట కొక కణము జాలునందురు సుధాగ్రణులు. శర్మగా రిట్టి గ్రంథములనే చేపట్టి వ్రాసి యుండుట ధర్మమునకుఁ బటుకొమ్మగ నెన్నవచ్చును.

పీఠికను గ్రంథముకంటె పెంచిన ట్లగుచుండుట వారియముద్రిత గ్రంథముల వెలువఱచుభారము నాంధ్రమహాజనులఁబూనఁగోరుచును,

శర్మగారియాత్మకు శాంతిని బ్రసాదింపఁ బరమేశ్వరు నరుణాచలేశ్వరుఁ బ్రార్థించుచు నింతతో ముగించుచున్నాను.

కొన్ని పద్యములు.

తే. అతివ స్తన్యంబు గోరెడు నర్భకుని ద్యజించి పోయితి వట్లొట క్షితి నపీత
కుచయనం బేరుఁ గాంచుము కూడి నన్ను, నిట వసింపుము భక్తుల నెపుడు కావ. (11 అ, 629 ప.

క. ధారణి శోణాద్రిమదా, కారమ్మగు దాని కెవడు కడుభక్తి నమ
స్కారము ప్రదక్షిణాన్విత, మై రంజిలఁ జేయు నతఁడు మార్గము పొంగన్. (13 అ 681 ప)

తే. నాదు సారూప్యములఁ బొంద నర్హుఁడగుఁ బ్ర
దక్షిణము శైలమునకు నీతం డొనర్పఁ
బరమపావనుఁ డయ్యెనే నజుఁడు వీని
పదరజము నొందు నుత్కృష్టపదమునందు. (13. అ. 682)

చ. సుమతి రజోగుణాప్తి మెయి శోభిల కుండుట ధర్మసంగ్రహం।
బమరదుగా! గురూత్తము దయాసులభం బది యంతరాయసం।
ఘము లాగిఁ గాచియుండు వడిఁగార్యము సాగక యుండఁ జేయనే।
ర్పమరఁగ వాని దాఁటిన మహార్థము సిద్ధిని గాంచుగా! మునీ!

వేగేశ్వరపురము.
పడమటి గోదావరి జిల్లా. }

ఇట్లు
యేలూరు పాటి రామభద్రయనులు.

---

కళాప్రపూర్ణనకుఁ గైమోడ్పు-నవరత్నములు.

క. శ్రీ లలితాంబ పదాంబుజ, మోలిం భజియించి మహిమనొంది కవిత్వ
శ్రీ లావణ్యముఁ గాంచుచు, మేలొందిన పుణ్యమూర్తి మేదినిదివిజా. ౧

ఆ. హృదయమందు లలిత వదనంబునను వాణి, శాంతి వాక్కునందు సత్యపరతఁ
జెలఁగి వెలుఁగునట్టి శేషాద్రిశర్మ! నీ, సవతుగలరె ధాత్రి? సత్కవీంద్ర! ౨

క. అరుణాచలఖండంబును, విరచించితి వాంధ్రమందు విశ్రుతభణితిన్
బరివర్తన మెన్నఁగ నీ, కరగతమై వెలయు నెప్పుగాదె మహాత్మా!

మ. కనుకట్టో! మఱి యింద్రజాలమొ? చమత్కారంబొ కానున్న నం
జన సామర్థ్యమొ? మాయయో? యిఁక నదే సామర్థ్యమో? గారడీ
పనియో? నిన్నుఁ గళాప్రపూర్ణుఁడని సంభావించి పూజించుచున్
జనముల్ పిల్చి పురస్కరింపఁ గనుచో సాదాఖ్య నాచిత్కళా
జనయిత్రీకృత పక్షపాతములె యా సారస్య మిందున్నదే.

మ. వినలే దెందు నజాతశత్రుఁడను ఈవిశ్వంబులో మానవున్
జనముల్ పేర్కొన ధర్మసూనుఁ డొకఁడున్ సర్వజ్ఞుఁ డొక్కండు నా
వినుతిం గాంచిరి; మర్త్యమాత్రుఁడవు తద్విఖ్యాతి నార్జింప నే
పని గావించితొ? చేతఁగానితనమున్ బాటించి రేమందు? మూ
లను గూర్చుందువు ముక్కుమూసికొని నీ లక్ష్యం బిఁకే దానికో?

ఉ. ఈతఁ డజాతశత్రుఁడను చెన్నికఁ గాంచెఁ గవీంద్రకోటిలోఁ
బ్రీతి మహాకవీంద్రుఁడని పేర్కొనుచుండఁ గళాప్రపూర్ణుఁడన్
ఖ్యాతి గడించె జార్జిప్రభు కైజరిహిందనె నట్టివానినే
నే తెఱఁ గొప్ప, బిల్తునొ! మహీసురచంద్రుఁడు మంత్రమూర్తి భ
క్త్యాతిశయంబునన్ గురుఁడె యాట వచించెద నట్లు నింపుఁగాన్.

చం. ప్రవిమల జీవితంబు శతవత్సరయుగ్మము సాఁగఁ బద్మసం
భవు మదిఁ గోరి, మాకు విభవంబునఁ గూరిచి ముందుగానె, స
త్కవిత వచించి యుండిన నిదాన మెలర్పఁ బఠించి తృప్తులై
యవునను చుంటి మిప్పుడన, నాయువు హ్రాస్వము గ్రంథ సృష్టిహే
కవియు నొనర్ప నట్టిది! యిఁకన్ జనమంచి కులంబువారు! భూ
దివిజులు! దూరదృష్టి కలదే! మిము మంచి యనంగఁ జెల్లునే!

చం. తనయులు గాకయుందురె! బుధప్రవరుల్ వినుతింపరే! జగ
జ్జననికిఁ బక్షపాతమె! వశంవదరై నిను జాటుసంతతిన్
జనువునఁ గూర్చి లోకమున శాశ్వతమై వెలుగొందఁ జేయునే
పనితనమయ్య! నీయది యబద్ధములాడక చెప్పఁగల్గుదే?

ఆ.వె. బాలచంద్రమౌళి భక్తి నర్చించితి, తొంటిపున్నె మెల్ల జంట నుండెఁ
గలముఁ బట్టినంతఁ బలుకుల తొయ్యలి, పలుకఁజేయు నెట్టి భవ్యమతివొ!

గౌతమనికేతనము
కిరికెర,
హిందూపురము.

ఇట్లు నమస్కరించు శిష్యపరమాణువు,
ఆంధ్రకర్ణాటక కవికేసరి, మహాకవి,
రెడ్డి భీమరావు.

# విషయసూచిక.

## కథారంభము.—పూర్వభాగము.



## ఉత్తరభాగము.

---

# సవరణ

114 పద్యము–15 పుట "వలగొని యనునది పనివడి" యని చదువవలయును.

పూర్వకముగ––పూర్వకము

352 పద్యము–119 పుట "భక్తివశంబొప్పఁగ" అనిమార్చవలయును.

261 పద్యము–172 పుట "వనరుహానూతి యభ్రమును వానుఁ దధో తలముం జొరంగ" అని సవరింపవలయును.

శ్రీ ర స్తు.

శ్రీమదాంధ్రస్కాందపురాణము

# అరుణాచలఖండము

## పీఠిక.

---

శా. శ్రీమంతంబు బుధార్చితంబు త్రిజగత్సేవ్యం బచింత్యంబు బ్ర
హ్మోమాధీశ రమేశ శీర్షధృతమంహోరాశివిచ్ఛేదనో
ద్దామ ప్రక్రమ మాశ్రిత ప్రకర చిత్తస్ఫార వాంఛా ప్రదా
నామోదంబు భజింతు దివ్యమహ మిష్టార్థాప్తికై భక్తితోఁ. ౧

శా. శ్రీమద్దివ్యమునీంద్ర సన్నుతశుభాంఘ్రిప్రాభవుఁ సంతతే
చ్ఛామూర్త్యంచితు నాశ్రితావనరతస్వాంతుఁ జగన్నాథు శ్రీ
కామాక్షీశ్వరు జన్నవాడనిలయుఁ జ్ఞానప్రదుఁ నిత్యస
ద్ధాముఁ శ్రీకరుమల్లికార్జునునెదఁ ధ్యానింతు నిష్టాప్తికై. ౨

ఉ. ఆదియు నంతముం దెలియ కద్భుత మొంది విరించి విష్ణువుల్
భేదముఁ గాంచలేక నిజవృత్తి నహంకృతి వీడి భక్తి నే
వాదము లాడఁజాల కెద వైభవముల్ వినుతింప నెంతయుఁ
మోదమునందు దివ్యతనుమూర్తిని గొల్తు నభీష్టసిద్ధికై.

వ. అని యిష్టదేవతావందనంబుఁ గావించి గురుగణపతి వాగీశ్వరి చర
ణాంబురుహముల నాత్మ ధ్యానించి పరదేవతాపదపద్మంబుల స్వాంత
మునం దలంచుచుఁ బరమకల్యాణంబులం బ్రాపించు పరమేశ్వరు మహి
మానువర్ణనంబుఁ జేయఁబూనినవాఁడనై శ్రీస్కాందమహాపురాణంబు
పురాణంబుల తలమానికం బని తలఁచి కౌమారికాఖండమును దెలుం
గుఁ జేసితి నిఁకమీఁద నరుణాచలఖండంబు తేజోమయలింగ మహిమా

విరాజితంబు దీనిని తెలుంగు పద్యమయంబుగ రచించి యావలఁ గేదార ఖండంబును రచింపవలయుననియు, నిట్లె శ్రీస్కాందంబునందలి ఖండములను దెలుఁగు బాసం బద్య రూపంబున ననువదించి భాషాసేవ చేసిన నిహపరసాధనం బగు నని యెంచి ప్రకృతము వింధ్య దక్షిణభాగంబునం గల యరుణాచల మహిమంబుఁ దెలుపు నరుణాచల ఖండంబును వ్రాయఁ బూనినాఁడ.

సీ. తెలుఁగు దేశంబున దివ్యపినాకినీ
    తీరానఁ గడపనాఁ బేర్మిఁ గనిన
పట్టణంబున నుండువాఁడఁ బరాంబికా
    పాదపద్మధ్యానమోదితుఁడను
జనమంచి వంశసంజనితసుబ్రహ్మణ్య
    పండితునకును దత్పత్నియైన
పరమపతివ్రతా వైభవోపేతకా
    మాక్ష్యంబకు సుతుండ; ననవరతము
తే. గ్రంథరచనానియతిగల్గి గడపువాఁడఁ
గాలమును లోకసేవకై మేలుగోరి
నన్ను శేషాద్రిశర్మయం చెన్నువారు
జనము లెంతయుఁ బ్రీతితోఁ జనవు మెఱయ.
తే. వ్రాసినాఁడను బెక్కుపురాణములను
గద్యపద్యప్రబంధాల హృద్యశైలి
ననుచుఁ దెల్గుదేశమునందు జనులకెల్లఁ
దెలియు నీక నవ్వి యేనేల తెలుపవలయు ?
తే. వ్రాసినట్టిగ్రంథాలు భద్రముగ వ్రాఁత
లోన నున్నవి ముద్రించి లోకమందు
వెలయఁజేయుట యెన్నఁడో, తెలియఁజాల
వరపరాశక్తియాజ్ఞ యెక్కరణిఁగలదొ?

క. హృదయానందము మున్నగు
సదమలకావ్యములు గలవు చతురత మెఱయన్
బదిలమగుశాస్త్రచర్చలఁ
బొదలు వచనగ్రంథరత్నములుగల వింటన్.

తే. చక్రవర్తి యనంగ శాశ్వతపదంబుఁ
గన్న శ్రీకృష్ణరాయని యున్నతిఁ గడు
విశదముగఁ దెల్పుకావ్యంబు విబుధకోటి
మెచ్చఁగా వ్రాసితిని గొంత మిగిలెఁ గొంత.

తే. వ్రాసితిని శంకరాచార్యవరచరితముఁ
బెద్ద లొసఁగినయాజ్ఞచే నొద్దికగను,
సర్వమతముల సారంబు చర్చచేసి
నిగ్గుఁదేలఁగ విజ్ఞులనియతి వెలయ.

తే. కాళిదాసాది సంస్కృతకవుల కెల్ల
నొక్కజోత యొనర్తు మహోత్తమమగు
భక్తి సంయుక్తిసత్కావ్యవర్యరచన
చేసి సంసిద్ధి నందినసిద్ధు లనుచు.

తే. నన్నయార్యుఁడు మున్నుగా నెన్నికఁగను
కవులపాదాంబుజములకుఁ గడు నియతిని
భవ్యమూర్తుల సుకృతుల భద్రమతుల
వందనంబులఁ గావించువాఁడ నెపుడు.

వ. ఇట్లు సంగ్రహముగా నస్మద్వంశంబును, బూర్వకవీశ్వరసంస్తుతియును గావించి వర్తమానకవులకుం బ్రణమిల్లి, నాచరిత్రంబంతయు మద్రచితంబులగు నితరగ్రంథంబులందుఁ గల దని మనవిచేసి కౌమారికాఖండంబును యజ్ఞవాటికా (జన్నవాడ) నిలయ యగు పరమానందాత్మిక శ్రీకామాక్ష్యంబ పాదకమలములకు నంకితము గావించితిం గాన నరుణాచలఖండంబును శ్రీ మల్లికార్జున దేవుని చరణసర

సీజముల సన్నిధానమున సమర్పించినఁ బార్వతీపరమేశ్వరులకుఁ బ్రకృతి పురుషులకు సపర్యయొనర్చినవాఁడ నగుదు నని భావించి.

క. నతజనరక్షామణికిని
సతతకృపాపూర్ణదృష్టిచంచద్ఘృణికిన్
వితతసకలగుణమణికిన్
ధృతసకల జగత్ప్రభావధీవితరణికిన్.

క. శ్రీజన్నవాడవసతికిఁ
తేజోయుతవిశదమూర్తి ధృతసద్గతికిన్
భాజన్మనోజ్ఞమునిజన
పూజితచరణాబ్జయుతికిఁ బుణ్యాకృతికిన్.

క. వరభక్తరక్షకునకును
బరమాద్భుతచర్యునకును వాంఛితసకలా
మరసుప్రసన్నహృదయున
కరవిందోద్భవము ఖార్చితాంఘ్రియుగునకున్.

క. శ్రీ మత్పినాకినీతట
ధామునకును జన్నవాడ ధన్యవిహారణో
ద్దామునకు మల్లికార్జున
నామ మహాదేవునకు ననంతాకృతికిన్.

క. శ్రీమల్లికార్జునప్రియ
నామార్చితునకును మునిజనస్తుతునకును
ద్దామప్రభావయుతునకుఁ
గామాక్షీశునకు సకలకామితదునకున్.

వ. అంకితంబుగా నాయనుపదింపఁబూనిన యరుణాచలఖండంబునకుఁ గథావిధానం బెట్టి దనిన.

శ్రీః

# అరుణాచలఖండము

## ప్రథమాధ్యాయము



### కథారంభము

#### తేజోలింగప్రాదుర్భావము.

శా. బాలం బందుఁ ద్రిపుండ్రముత్తమరుచి స్ఫారోత్తమస్థానమై
క్రాలంజాలు లలాటమందు విలసత్కస్తూరికావాసనా
శ్రీలంజల్లు మనోజ్ఞమౌ తిలకముల్ క్షేమప్రదద్యోతముల్
మాలాళుల్ హృదయంబునన్ వెలయ సమ్మానార్హరూపంబునన్.

క. విలసత్కటికౌపీనో,జ్జ్వలవస్త్రము దుర్భరమున భాసిలుఫణిరా
జలలిత కలాపవరహా,దల శశికళ దానిచెంతఁ దనరారంగన్. 2

ఆ. సర్వభక్తజనుల సతతంబు గాపాడఁ, జాలి వెలయు నరుణశైలయోగి
భద్రదుండు భూరిభవతారకుండు సం,తతము చెలఁగుచుండు వితతశక్తి.

ఉ. నైమిశికాననంబునన నారతముల్ వసియించి పామర
స్తోమము నుద్ధరించు మదితో సమయంబును బుచ్చుచుండు నా
భూమిసురర్షు లొక్కతఱి భూతవిభుం దలపోయుచున్ దద
ద్యామలగాథలన్ వినఁగ నాదృతి గ్రమ్మఁగ సూతమౌనితో. 4

క. అరుణాచలమాహాత్మ్యము, గురుతర మని విందు మేము గోరిక కల్గెన్
జరితం బాదృతిఁ దెల్పుము, పరమమునీ! సేవచేయు బ్రహ్మమునులకున్.

చ. అరుణగిరిన్ వసించు మహిమాఢ్యుని శంకరు ధ్యానయోగత
త్పరతసతంబు గాంతువు కదా మునినాయక! తత్పవిత్రమౌ
చరితముఁ దెల్పుమన్న ముని సంతతిఁ గాంచి వచించె శారదా
వరుసనకుండు మున్నడిగె భద్రద మంచు వినంగఁ గోరికన్. 6

చ. అతనికి బ్రహ్మ తెల్పినటు లల్ల చరిత్రము మీకుఁ దెల్పుదున్
మతులవధానయుక్తిఁ దగుమాడ్కిఁగ నుండు వినుండు భక్తిసం

గతి వినఁ బాపపుంజములు క్రన్నన నాశము నొందు; మున్ను లో
కతతికి మేలుఁగోరు మునికాంతుఁడు నాసనకుండు ప్రీతితోన్. 7

ఆ. సత్యలోకమునకుఁజని కమలాసనుఁ,గాంచి మ్రొక్కి- కరయుగంబుదోయి
లించి యిట్టు లడిగెఁ గాంచనగర్భ! దే,వేశ! వేదవేద్య! యింగితజ్ఞ. 8

చ. కలిగె భవత్ప్రసాదమునఁ గాంచనపంకజసూతి! జ్ఞాన మి
మ్ములభవదంఘ్రి భక్తి భరముంగల నాదగుచిత్తదర్పణం
బలరెడునిర్మలం బగుచు నందుఁ గనంబడుజ్ఞానచిత్రముల్
చెలఁగెడు వేదసారమయి శ్రీగళు జ్ఞానమనాకులంబుగన్. 9

క. జగదోఘవిభూ! నీకృప, తగిన ట్లలవడియె నద్ది ధాత్రిని శివలిం
గగణంబు దివ్యతరముగఁ, బొగడొందెడుదాని నెన్నఁబోలునెనాకున్.

క. మానుషములు సైద్ధంబులు, జానగుభౌతములు నాఁగనన్నుతిచేయం
గా నర్హములై యుండెడు, నానే వినుచుందు లోకనాథా! యందున్.

క. అమలంబై దివ్యంబై, క్రమముగ నరివర్గహరణ గాఢవిభూతిన్
తమఁ బరఁగి తైజసంబై, కమలాసన! వెలయుదానిఁ గ్రన్ననఁ జెపుమా.

తే. అది స్వయంభువు నాఁగ సద్యశముఁ గాంచ
వలయు నేరెఁడుదీవి నిస్తులవిభూతి
నెసఁగు నద్దాని వినఁగ నా హృదయ మెంతొ
కోరుచున్నది తెలుపుమా సారసభవ. 13

క. నామస్మరణంబుననే, తామయి పాపంబులెల్ల దగ్ధంబు లగున్
శ్రీమానితకంధరుకథ, నోమాన్యా! తెల్పవయ్య యురుతరకరుణన్.

క. శైవం బగుతేజం బది, భావింప ననాది యగుచుఁ బరమం బయి లో
కావళి కాధారం బయి, యేవేళం జ్యోతియె లేక యెసఁగుంగాదే. 15

క. దేనిం గాంచి కృతార్థుం, డౌనరుఁ డాతేజమును మహాత్మా! నాకున్
గానంబడ నుపదేశం, బీనెలవునఁ జేయవయ్య యెలమి ననుటయున్.

చ. అనుపమభక్తికౌతుకము లాత్మఁ బెనంగొనఁ బ్రశ్న మొనర్చి
తిని బొనరించు నాసనకు ధీరవరేణ్యుని గాంచి మోదముం
దనుకఁగ నుత్తరంబు నిడఁ దాఁదలపోయుచు సృష్టికర్త నె
మ్మనమున శంకరున్ నిలిపి మానసని పూన్కిఁ దదీయతేజమున్. 17

ఆ. ధ్యానయోగమూని యంతరంగసుఖాబ్ధి,మగ్నచిత్తుఁడయి సమస్తలోక
పతి విరించి యప్డు పరమమహాదేవ, తేజమును సమస్తదేవనుతము.

చ. కనుఁగొనుచున్ బురాతనసుఖంబును గాంచుచు సర్వలోకపా
వనతమమై యగమ్యమయి భాసిలుచుండఁగఁ గాంచి బోధముం
గనుఁగొనఁజాలకుండె; శితికంఠునియానతి నంత వేచి యో
గనియతినుండి యాత్మదమకంబును గాంచక యుండురీతిగన్. 19

క. మరలించి మానసాత్ముఁ, బరికించి శివుం గనంగఁ బర్వినహర్షం
బరుపులకాంచితుఁ జేయఁగఁ, జిరంతనానందబాష్పసిద్ధనయనముల్. 20

క. కని చెన్నమీఱుచుండఁగ, ననువొందఁగ మాటరాక యతిగద్గదరీ
తిని గాంచఁజేయనాదృతి, ననియెఁ దనూజా! మనస్సునందున్ నన్నున్.

క. తలఁచితివిగాదె మును పే, తలఁపున్ దానిన్ స్మరించెదన్ సంతతమేఁ
బలికెద నొకమాటఁ దపం,బులసారము శంభుభక్తి పొడమెన్ నీకున్.

క. అదిమొదలుగాఁగన స్మద్ధృదయము మార్పొందె ననుచు నెన్నదగునో
సదయా నీచరితంబులు, విదితంబులు పావనములు విపులఫలదముల్.

సీ. జగములనెల్ల నీచరితముల్ పావనములుగఁజేయును లోకముననెవరికిఁ
బరమశంకరునందు భక్తిసార్వత్రిక మగుచు వృద్ధింబొందు నట్టివారి
తోడిసంభాషణ క్రీడానివాసముల్ పరమయోగ్యములగుఁ బలుకు లేల
హరభక్తదర్శనస్మరణముల్ పాపౌఘనాశనక్షమము లౌ నీశు తేజ
తే. మొక్కఁ డావిర్భవించె మహోజ్జ్వలముగ
నద్ది యవ్యాజకరుణచే నమరియుండు
నమలమరుణాఖ్యఁ దగియుండు నద్భుతంబు
దానిమహిమము వర్ణింపఁదరము గాదు. 24

క. నారాయణుండు నేనును, దారామలతేజమునను దయమొందితి మ
మ్మారసి విశ్వాత్ముకుఁ డేఁ, గోరుదు వ్యాపింప నంచుఁ గోర్కిం బలికెన్.

క. అంతట నిరువురుమూర్తులు, శ్రాంతింబొందక పరస్పరము మార్పొనఁగాఁ
జింతించుచు వాదించుచుఁ,బంతంబును మాన కొక్కపట్టునఁ బెనఁగన్.

తే. పూనియుండి రహంకృతి మూన కిట్టు
లొండొరుల గెల్చుకోర్కులు నిండియుండ

నంతివారలఁ గాంచి మహాహవోత్స
వంబుఁ దలపోసి యిట్లను భవుఁడు పేర్మి. 27

క. ఇతరేతరరణకౌతుక, మతిభీషణ మేమికోరి యిట్టులు వీరు
న్నతయుద్ధకాంక్షఁ బూనిరొ, నుతి నెన్న జగత్క్షయంబు మానదని యెకా.

తే. వీరిసృష్టించి పాలించి వెలయఁ జేయు, వాఁడనేనేకదా యిట్లు వాదమేల
చేయుచున్నారొ మూర్ఖులే సిద్ధమిద్ది, యిప్పుడేనాపకున్న వీరేచి కినుక.

చ. అని యొనరింతు రట్లగుట నాహవదోహలముఁ మరల్పఁ జే
యనుదగుయత్న మంచుఁ దనయాత్మఁ దలంచి రణంబు చేయుచోఁ
గనఁబడులోకసంక్షయము గానఁ ద్వరంపడువాఁడ వేదముల్
వినఁబడఁ జేయునామహిమ వేయివిధంబుల విశ్రుతంబుగన్. 30

చ. ఐనను వీరు మూఢులయి యాత్మలఁ గ్రోధము లొప్ప నాస్మృతిన్
మాని తలంచువారు బహుమానము గాంచఁగ లోకమందు నే
మానవుఁడైన నాత్మను సమస్తవిధంబుల నున్నతంబుగాఁ
బూనిక నెన్నుచుండుఁ బలుపోకల నీయది నైజమై తగున్. 31

క. ఇతరుల యాధిక్యము దుర్మతి యెవ్వం డోర్వకుండు మానవుఁ డపుడే
చ్యుతి గాంచి యధఃపతనము, జతనము మీఱంగ నొందు సత్యంబిదియా

సీ. ఏలోకమునసైన నే నెవ్వనికి నాత్మతత్త్వంబుఁ దెలియంగఁ దగినశక్తి
నిత్తునో యతఁడు తదిష్టసిద్ధిదలసద్జ్ఞానంబునం జేసి సరగున నను
నొందంగఁజాలు; నంచూహించిమనసునఁదానెవారలర శోత్సాహమూర్పఁ
దలఁచి యంతర్భాగ మలరుచుఁ జేరి హుతాశనస్తంభమై యలరుచుండె

ఆ. నెల్లలోకముల నహీనశక్తిం జక్క
నలముకొనుచు నగ్నియట్లు వెలుఁగు
చుండె నాదియంత మొప్పదో యనఁ దోఁచుఁ
చుండె నిద్ది యేమొ యొప్ప ననుచు. 33

క. జ్వలనస్తంభం బయ్యది, జ్వలియించుచు సర్వలోక సర్వస్థలముల్
గలయన్ మండం జేయుచుఁ, దుల యన లేనట్టిశక్తితోఁ వ్యాపింపన్.

తే. దానియంతము మొదలునుగాని గానఁ
జాల కవ్వార లిర్వురు చక్షువు లొగి

నార్తి మున్గఁగ నిశ్చేష్టు లగుచు నుండి
రట్లు వెల్గు తేజస్స్తంభ మప్డు గనుచు. 35

క. తమయాశయములు శైథిల్యము గాంచఁగ నంతలోనంబరవాక్యా
సమదులకున్ వినఁబడియెను, బ్రమదంబును గల్గఁజేయఁ బాటుపడునటుల్

క. బాలకులారా! యేటికి, నీలీలగ మూఢు లగుచు నిక్కడ నిట్లా
భీలరణం బొనరింపఁగఁ, జాలితిరో బలమునఁ గలశక్తి నెఱుఁగఁగన్.

క. శివుఁడే బలవైషమ్యము, భవదీయం బెఱుఁగఁగలఁడు భవు తేజస్స్తం
భవరం బేమీ నడుమన్, బ్రవిమలమై వెలసె నిదియె భవురూపమనన్.

చ. బలమున విఱ్ఱవీఁగుచుఁ బ్రభావము మించఁగ నున్నమీర లీ
జ్వలనునియాదినంతమును బొఱఁగఁ జూచినఁ దేలునప్డు మీ
బలము లటంచు వీనులను బర్వఁగఁ జిత్రముగాఁగ వార ల
భ్రలలితవాక్కులన్ విని నివారితయుద్ధకుతూహలంబులన్. 39

చ. హరుఁ బరికింపఁబోయిరి మహర్షివరా! రణమూనియున్నవా
రిరువు రనంగ నెవ్వరని యెన్నుదు వేమొకొ నేను జక్రియా
యిరువు రటంచు నీదుమది నిప్డు తలంపుము జాతవేదుభీ
కరతరకీలలన్ తనువు కల్గినయాహరునాదినంతమున్. 40

చ. కనుఁగొన నెంచిపోవఁ దమకంబును గొంటిమి వీతిహోత్రుస్తం
భనియతి గానఁగాఁబడుచు భర్గునిరూప మనాదియై తుదిం
గనఁబడకుండఁజేయుచు నికామము వెల్గఁగ మీఁదిభాగముం
గని మరలంగ నేను హరి కాన నధోగతభాగ మెంతయున్. 41

క. పరికించి రాఁగఁ బూనితి, మురుతరవారాహరూప మొంది మహోత్సా
హరతిం గని భూగర్భం, బురుశక్తిని జీల్చి దంష్ట్రినుద్యమ మలరన్.

తే. నేను హంసత నొందితిఁగాని వేగ
మతిశయంబుగఁ గనఁబడ నచటనుండి
నింగి కెగిరితి శివశీర్షముం గనంగ
వాంఛ పురికొల్పుచుండంగ వఱలు శ్రద్ధ. 43

చ. వనరుహనేత్రుఁ డెంతయును వాడిగనుండెడుదంష్ట్రిచేత భూ
మిని వడిమీఱఁ ద్రవ్వుచును మించెడుదానికిఁ గ్రిందిభాగ మెం

దని తలపోయుచుం జనియె నాహరు తేజము స్తంభమట్టు లే
కనఁబడుచుండెఁగాని పొడకట్టదు శ్రీహరికిం దదంతమున్. 44

తే. పెక్కుకోటిశరత్తులు నిక్కి ప్రాఁకి
వెదకుచుండినఁ దేజస్స్తంభ మిది యిచటను
బుట్టి పెరిఁగెనటం చని యెట్టులైనఁ
దలఁపనైనను జాలఁడా దైత్యవైరి. 45

చ. కనుఁగొనఁజాల కక్షయము గాఁ గనుపట్టుతదీయరూపముల్
మనమున నెంచి దీనిఁ గనుమార్గము తోఁపదు సుంత యేని దా
ననుపమ మంచు విహ్వలత నంది మహార్తిని గుందియంతటన్
దనదగుదంష్ట్రిశీర్ణమయి దారుణబాధల నొందఁ జేయఁగన్. 46

చ. విగళితసంధిబంధనుఁడు విహ్వలితాత్ముఁడు నౌచు మాధవుం
డగణితమౌతదుజ్జ్వలమహత్త్వములోనఁ దలంచి యింకఁ బో
వఁగఁ దలపోయు టెంతయును బాధలనే కలుగంగఁజేయుఁగా
ని గలుగ దించుకే ఫలము నిశ్చిత మంచెద నెంచి యత్తఱిన్.

చ. పరుగిడుయత్నముల్ వదలి బల్విడిఁ గ్రోల శరీరధారణా
దరమును వీడి శ్రాంతితనుఁ దద్దయు నొంపఁగ నింకఁ జేయఁగాఁ
దరమగు నెద్దియంచెద నితాంతము పూనిక నెంచి యంగధీ
స్ఫురణము లెల్లఁ గుంటుపడ భూతవిభున్ శివునిం బరాత్పరున్.

చ. మనమున నీవెది క్కనుచు మాటికి మాటికి నిశ్చయించుచున్
గనితిని మాహాత్మ్య మింత యనఁ గాఁ దగనంత నిసీ! యటంచు స్వా
త్మను బొడకట్టుగర్వమును దాఁదలపోయుచు నీయహంకృతిం
దునిమినఁగాని మంచి దెది తోఁపదు నాకని విశ్వసించుచున్. 49

క. ఏమాహాత్మ్యంబున నాకున్,స్వామిగ నున్నట్టిశంభు వదలి యతని దా
భూమానందమహత్త్వము, లేమాత్రము దలఁపనైతి నిది మేలగునే.

సీ. ఇద్ది తేజస్స్తంభ మెల్ల వేదములకు నెల్లభూతముల కేకైకమూల
భూతుండు నానుతిఁ బొందుశివుం డగునట్టి యీజ్యోతి నరయఁదరమె
మూల మియ్యది యని పుట్టక యంతయు కలుగనియీజ్యోతివలన నేను
జనియించితినిగాదె; కన నెంచుచున్నాఁడ దీనిమూలంబున నౌనెది యని.

తే. పశుశరీరము దాల్చి యిప్పగిది నార
యింతకంటె నజ్ఞాన మింకెద్ది యుండు
జనకుఁ డవ్యాజకరుణాభువననిధి యగు
శివు ననుగ్రహమున నిట్టిచిత్త మిపుడు. 51

క. మరలం గల్గెను శంభుం, గురుకరుణం గావ నెంచుచుండును భక్తో
త్కరమును గావున నాతని, కరుణన్ జ్ఞానంబు నాకుఁ గల్గెం గాదే.

క. అనహంకారం బాత్మజ, మనఁదగు నిది యింక నేను హరునకు మరలం
గొనకొని పూజను జేయం, గను నేర్తునె యట్టిపుణ్యకాండ మలరునే.

క. నాయాత్మని వేదింతును, గాయజరిపుశరణ మీవు కమ్మనిభక్తిన్ లోన్.
శ్రీయలరం బ్రార్థింతును, బాయును నాయార్తు లనుచుఁ బలుమఱు మది

చ. తలఁచుచు సన్నుతించుచు ముదంబున నాత్మను దేవదేవునం
ఘ్రుల కపుడే సమర్పణము కోరి యొనర్చుచు నుండె; నంత నీ
శలలితసత్ప్రభావశత తత్స్థలి నిల్చెను బూర్వరీతి నా
జలరుహనేత్రుఁడో సనక శాశ్వతశంకరపాదసేవకా. 55

చ. విను మిఁక నాప్రవృత్తి వినువీథిఁ జరించుచుఁ బెక్కువర్షముల్
కనులకు భ్రాంతిగల్గనటుగా శ్లథపత్ముఁడనై శ్రమంబు నొం
దినకొలఁదిన్ మనోరథము తీవ్రముగాఁ బరివృద్ధినొంద శం
భునిగురుతేజముం గనుచుఁ బోయితి దానిశిరంబు గాంచఁగన్.

ఉ. ఇంకను మీఁదికిం జనిన నీగురుతేజము హద్దుఁ గాంచనా
శంకరు దివ్యతేజ మొక స్తంభముగాఁ బెరుఁగంగఁ జాలెఁ దా
బింకముమీఱ శీర్షమును వేడుకఁ గాంచి ప్రతిజ్ఞఁదీర్చి యే
ణాంకుని మెప్పుగాంతు నని హర్షముమీఱఁగఁ బోవఁబూనితిన్. 57

తే. ఎంతదూరము చనిన నొక్కింతయైన, దాని యాకృతిమాఱెడు వారిగాన
రాకయొకరీతినుండె సురవ్రజంబు, పూజలందన్చుచుండెనో మునిశశాంక

క. శివతేజోభాగంబున, భవమందినసిద్ధవరులు పల్కిరి స్థిరమై
శివమై నిరుపమమును నై, యవిరళహరతేజమునకు నగుకోటిఁగనన్.

క. పనిపూని యున్ననన్నుం, గనుఁగొని యీతండు మూఢగణవర్యుండే
యనఁ జను నింకన్ వెదకం, జనువాఁ డహహా యి దేటిచందం బొక్కో.

క. తనుపతనకాల మది చెం,తను జేరఁగ నున్న యప్డు తగ్గదుగా యీ
తనికి నహంకారం బిఁక, ననవలసిన దేమి వీని దగు మౌగ్ధ్యంబుల్.
ఉ. పక్షియుగంబు శీర్ణమగుపాటిగ నుండఁగ శ్రాంతి నొంది వే
యక్షులజంట భ్రాంతి యనునంబుధి మున్గినపక్షిరూపుఁ డీ
యక్షయమై యపార మగు నట్టిమహేశ్వర తేజమందుఁ దా
దీక్షను బూనె వ్యర్థముగ దీనివిమోహమె యంచుఁ జెప్పనా. 62
చ. వనరుహనేత్రుఁ డీయజుని భంగిని వ్యాకులచిత్తుఁడై తనం
తన కిటిరూపధారియయి దర్పకభంజను సత్కృపన్ గనుం
గొన నెటూ చాలి వేమరలి క్షోణికిఁ బోయెను వ్యర్థయత్నమే
లనిభగవత్స్వరూపమున కాది యిదంత మనందరంబెటా. 63
సీ. ఇట్టి బ్రహ్మను లేలో యెందఱు మర్త్యులో యే తేజమునయందు నిమిడియుండు
పరమాణువులనుండి ప్రభవించిరో యట్టి శంకర తేజ మీసరణినుండు
నని పరికింపఁ బూనెను మూఢుఁ డీతఁడు; వ్యర్థమే గద యీ ప్రయత్న మెల్ల
స్వాత్మగతుండగు హరుఁడు ధ్యానంబున హృష్టుఁడై సద్బుద్ధిని తనికొసఁగ
తే. నపుడహంకారనాశమా నంతదనుకఁ దిరుగుచుండు నీతఁ డనిదివిని జెలఁగు
సిద్ధులెల్ల రుతమలోనఁ జెప్పుకొనఁగ, సదయవాక్కుల విని నాఁడ సత్యమిద్ది.
క. అప్పుడె యహంకారం బడి, వ్యపగతమాయ్యోం దనంత వాత్మను నేనే
కృపణుఁడనై తలపోసితిఁ, దప మొనరుపఁ దీర్థములను దమి సేవింపన్.
ఆ. వేదరాశి నెఱుఁగ విషమాక్షతత్త్వవి
జ్ఞాన మెఱుఁగరాదు శంభుకరుణ
గలుగ నెఱుఁగఁదగును గాని వేఱొక్కటఁ
దెలియఁదరముగామిఁ దెలిసికొంటి. 66
సీ. జీర్ణించె ఱెక్కల చేవ యచంచల
మనఁదగు నంగంబు గనియెఁ గృశతఁ
గాని యింకను దమిఁ గాంచెదుఁ జిత్తమ
హంకార మనునది యంతె మొంద
కుంట నిస్సిరో యన నొప్పు నన్నింగూర్చి
యునహంక్రియుఁడఁ గామి నాత్మబలము

నించుకే నెఱుఁగమి నిందు భాషించిన
శంకరార్పితనిజస్వాంతులైన

ఆ. సిద్ధవరుల కివియె చేమోడ్పు లెప్పుడే, నెవరిసంగతిని నహీనతపము
చేయుశక్తిగలిగి చిత్తము శోధింపఁ,బద్మనయోని శివుని బరమశుభదు. 67

క. పురతస్సంస్థితు నెఱుఁగం, బరమానే యీశుకరుణతమునొందుట ని
ర్జరులొందరమలచిత్తులు, పరిహృతరిపువర్గులొచుఁ బరమమునీంద్రా. 68

తే. ఎవని పరమార్థమును వేదబృంద మెఱుఁగఁ
జాలదో యాగమంబులు సరణి దానిఁ
దెలియఁజాలవో యట్టిఁడౌ త్రిణయనుహరు
శరణ మొందుదు విశ్వాళిసంగరహితు. 69

క. అనిపలికి ధ్యానయోగంబున శంకరుఁ గొల్చి నేను బూర్వాకృతినిం
గని చంద్రశేఖరుఁ లోకనిచయపతి భక్తి వేఁడి కమలాక్షునటన్. 70

క. పరికించితి భాషించితి, హరుమహిమము సంస్మరించి యారా! యీయ
చ్చెరు వెందుగల్గునే శౌర్యరమం జెలువారు మనము నఱమఱ గనకే.

ఆ. హరునివలనఁగల్గు నయ్యహంకారంబు
నాశ్రయించి యుద్ధ మాచరింపఁ
బూనినారముగద పురహరుఁ డాతఁడే
మనకు దానిగల్గఁగ నొసరించె. 72

క. అతఁడే స్వీయమహత్త్వ, ప్రతిపాలనమున నహంకరణము నడంచెన్
గృతకృత్యులమైతిమి సన్నతిమంతులమైతి మిపుడె మాధవ!మనమున్.

వ. సురాసురనమస్కృతుం డగు నాసదాశివుని దేజస్స్తంభమయుని బూజింపఁ బూనుదుమేని భవసాగరంబుం దరియింతు మని పల్కితి వని సనకమహర్షికిం దెల్పి పంకజాసనుండు భక్తివినమితకంధరుండై మఱియు ని ట్లనియె. 74

---

శ్రీః

# అరుణాచలఖండము

## ద్వితీయాధ్యాయము



### అరుణాచలస్థావరలింగమాహాత్మ్యము

క. సనకమునీ! వినవయ్యా, మనమునఁ జెల్వారుభక్తి మామకవక్త్రా
ళిని వేదములం జదువుచు, ఘనమానసికార్చనమున గరళగ్రీవున్. 75

చ. హరు వినుతించినాఁడ నపు డక్షయభక్తి మదాత్మ నిల్చె; శం
కరునకు లోకహేతుతతి కారణభూతునకున్ నమస్తతుల్
కరములమోడ్చి చేసెదఁ బ్రకాశముగల్గిన వాని లేనిచే
స్థిరచరరూపవిశ్వములు ధీరత నిల్చునొ వేని శక్తిచేన్. 76

చ. అతనికి దేవదేవునకు నన్వహమేను నమస్కరింతు; న
ద్భుతహరుతేజ మెల్లెడలఁ దోఁచి సమస్తము వెల్గఁజేయఁగా
గృతమతు లేరు కారొ పరికింపఁగఁజాలరు వారు దాని నా
శితిగళుసత్కృపం గనిన సిద్ధులె కాంతురు కాన నాశివున్. 77

క. వినుతింతు నెమ్మదిన్ సూర్యుని నంధులు చూడ సుంతె యోపనిచందం
బునఁ బాపులు హరుఁ జూడం, గనుజాలరు దేవసంఘకాంతుని నతనిన్.

సీ. కైమోడ్పులం గొల్తుఁ గామాంతకునిమూర్తి
విమలమా భూమిలింగముగ నలరు
నధ్యాత్మచక్షువు లమరు నెవ్వారికిఁ
గనఁజాలుదురు వారె వినుత శంభు
మూర్తి యంతస్థ్సంబో పోల బహిస్థ్సంబో
భవదీయభక్తులే పరమదృష్టి
గాంచి యానందింపఁ గల రతిభక్తి
యోగీశ్వరులు తమ యున్నతాత్మ.

తే. సరసిజాంతస్థ నిర్మలాసనములందుఁ
జూచుచుందురుగా యదె చూడఁబడెడు

నన్ని తావుల నద్దంబునందుఁబోలె
నట్టిపరమేశునకు నీకు నమలభక్తి. 79

క. నతు లొనరింతును దేవా, ప్రతిలేని త్వదీయశక్తి భాసిలుగా సూ
నృతరూపంబున నణుసం, తతిఁ దాఁబరమాణు వగుచు దైవం బగుచున్.

క. నాకంటెన్ వేత్తైన, దదేకరణి నెఱుంగరాని దీతనువునఁ దా
నేకడనో యడఁగి యున్నది, శ్రీకంఠా! యింక నేమి చెప్పుదునయ్యా.

ఆ. నీదుకృపకుఁబాత్రమేదియే నణువైనఁ
దామహత్త్వ మొంది దద్దవెలుఁగు
సత్య మిద్ది దీన శంక లే లేకుండు
నిన్ను మించు నద్ది యెన్న లేదు. 82



చ. నిను ఘను నాశ్రయించుటను నేనును ధన్యుఁడ నన్ను మించఁ నే
ర్చినయది యెద్దిలేదు; వినుచిత్తము నాయది నీకు నర్పితం
బని తలపోయవయ్య విరహంబును గోరదు సుంతయేన దే
మనఁదగు నీప్రభావము మహాత్మక! సర్వసుపర్వనాయకా. 83

ఉ. నీదగువైభవంబు స్తవనీయము దాని నుతింప వాక్కుల
మ్మోదము నొందఁజాలదు ప్రభూ! వినుతించెదుశక్తిలేమినీ
వో దివిజేశ్వరేశ్వరుఁడవో జగదీశ! మహేశ! దేవతా
భూదివిజర్షిసన్నుతసుపూజితపాద సరోరుహద్వయా. 84

క. నను నాజ్ఞాపింపు మదే, పనికై నను భక్తుఁ డన్నపదమున కర్హుం
డ ననుచుఁదోఁచిన శంకర,మనవియి దేయంచు భూమి మస్తముసోఁకన్.

చ. నతు లొనరించి నిర్జరగణప్రభుముందట నిల్చినాఁడ న
చ్యుతుఁడు నవాబ్జ నిమ్నరవ మొప్పఁగఁ బల్కెను వాక్కులన్ బవి
త్రత నొనరించు పూన్కి దగ దర్పకభంజన! నిన్ను భక్తిచే
నుతి యొనరింప వాక్కులు వినూత్నసితద్యుతు లొప్పుచుండఁగన్.

క. పావనతం గాంచును లో,కావనసంకల్ప! భక్త హార్ద దివిష
చ్ఛైవలినీధర! త్ర్యక్షా, జైవాతృకలేఖ దాల్చు సర్వేశహరా. 87

ఉ. నాపయి నీకుఁగల్గిన యనంతకృపాంబుధి వ్యాజశూన్యమే
యేపగిదిం దలంచిన నహీనము వృద్ధిని గాంచుచుండు భ

క్త్రాపదలన్ నశించుగతి నయ్యదియే యొనరించుచుండు వి
ద్యాపటలంబుఁ గాచు సుఖ ధామమదా ధనసంచయం బిభున్. 88

సీ. ప్రాచీనమగు సుపుత్త్రవ్రాతమును దండ్రివలె నెరక్షించు నీ వపువులందు
నెద్దానినైన సుంతేని గ్రొత్తగ స్తుతి నొనరింపఁదరమె గాకున్న దింక
సర్వమూర్తుల స్తుతిసల్ప శక్యంబగునెట్లు? నీవేనిన్ను నెఱుఁగఁదగుదు
వంతియకాని నిన్నన్యుఁడు కనలేఁడు త్వత్ప్రసాదైకపాత్రం బదెవ్వఁ
తే. డగునొ యాతం డెఱుంగునం చాత్మఁ దలఁతు
భ్రమర మొటకీకమును దెచ్చి భ్రమరముగనొ
నర్చుచుండుట యెప్డు కనంబడియెడు
నట్లె నీవును గావింతు వన్యుని ఘను. 89

క. దివిజులు భవదంశసుసం,భవులు భవన్మహిమ మిట్టిపాటి దనుచు నే
ర్పువఱలఁగ నెఱుంగఁజాలుదు,రవధానముమీఱ నిన్నునర్చించుటచేన్

చ. ఇనుముహులుతాశనుం గలిసి యెంత యుదాహకశక్తి గాంచుఁగా
జనపదకాలకార్యములచందముఁబట్టియె వహ్ని కెన్నొ భే
దనికరముల్ కనంబడును దర్పకసూదన! నీవు నట్లె యొ
క్కనివయి యుండియున్ విషయకాండవిభేదమునన్ మహేశ్వరా!

క. భేదముగల్గినరీతిగ, నే దోఁచుచు నుందు విద్ది హితమె యనంగా
నె దానవాంతకా! నా, పై దయ చెల్వార మూర్తి పరికింపంగన్. 92

క. ఒనరింపుము సర్వేశ్వర!, కన నిర్వారకక్షి మోదకాండంబు నొసం
గను దగియుండునుగద యం, చనుమానము లేక వేఁడు నా శ్రీపతినిన్.

తే. భక్తిభరమును శ్రద్ధయుఁ బైకొనంగ
దన్నుఁ బ్రార్థించు శ్రీహరి ధాతను గని
వారినుతులకు సంతోషవార్ధిమున్గి
స్తంభరూపతేజస్సును దాను వదలి. 94.

చ. కనఁబడెఁ జంద్రశేఖరుఁడుగాఁ బరమేశ్వరుఁ డంతఁ గంధరం
బున విషచిహ్నమొప్పె లఘుమూర్తిగ జింక కరంబునం దగన్
ఘనవినుతాభయం బనఁగఁ గ్రాలెడుముద్రయు జ్ఞానముద్రయున్
గనఁబడె ఘోరమౌ పరశుకాండము కేల భయంకరంబుగన్. 95

చ. కరములఁ జిహ్నరాజి యిటు గ్రాలఁగ దర్శన మిచ్చి పుత్రులే
యిరువురు మీరు నాకు ననియెన్ బ్రమదంబును గాంచినాఁడ మీ
యురుతరభక్తికిన్ నియమయుక్తికి నాపయినుండు రక్తికిన్
హరివిధులార! రక్షణము నట్టులె సృష్టిని జేయుచుండుఁడీ. 96

క. మీ కిష్టసిద్ధు లిడఁగా, నీకడ నావిర్భవించి యివ్విధి మీరల్
వాకొన మెచ్చితిఁ గావున, మీ కిడితిం బనుల నిద్ది మేలనునూహన్. 97

చ. వరదుఁడనౌట నింక నెది వాంఛయొ దానిని వేఁడుఁ డిచ్చెదన్
వరముగ నన్నశంకరుని వాక్కులఁ జక్కఁగ నాలకించి ని
ర్భర ముదముప్పతిల్ల మునివర్య! సరోరుహనేత్రుఁ డేనునున్
గరము ప్రమోదమంది యొడికంబున నాత్మలఁగల్గువాంఛలన్. 98

చ. తెలిపితి మొక్కరొక్కరుగ ధీవిభవంబు చెలంగ నేను వే
దలలితవాకులన్ భువనతత్త్వ మెఱింగినసృష్టివైభవం
బలవడ నీశ్వరున్ బొగడ నప్డు తలంచుచుఁ బల్కినాఁడనో
ఖలహరణా! వరప్రద! నికామకృపాకర! వందనం బిదే. 99

క. హరుఁ దేజోమయుయోగీశ్వర నికరధ్యేయు దేవవారప్రభు శం
కరుని నిరంజనుఁ గొల్చెదఁ,బరిపూర్ణునుహాత్ము లోకపాలననిరతున్. 100

మ. భవదీయం బగుతేజ మెత్తఱి వియద్భాగాంతరంబెల్ల నిం
డి వియత్సంచరణేంద్రలోకమున నిండెన్ సిద్ధగంధర్వదే
వవరుల్ మానులు భ్రాంతినొంది యెటుపోవంజాలకున్నారలీ
ధరణీమండలమంతయున్ మిగుల సంతప్తం బయ్యెడున్ శంకరా.

తే. ఇఁకఁ జరాచరభూతసంసృష్టి లేదు
కాన నుపసంహరింపు శంకర! మహాత్మ
తేజమీయది యిఁకమీఁద దివ్యమమల
మునయి యరుణాచలంబనఁ బొల్చుఁ జుమ్ము. 102

సీ. తావకస్థావరపావనలింగంబు భువనముల్ గాపాడఁ బూని యిందు
నిల్పుముజ్యోతిర్మయనిర్మలరూపమై యరుణాచలేశ్వరం బనగఁ బేరఁ
బ్రఖ్యాతిఁ గాంచుచు వసియించుభూస్థలి;భక్తిచే దీని కెవ్వరు నమస్క
లర్పింతురో వార లమరాధిపులే యాదు రెల్లలోకంబుల నుల్లసిల్లు

తే. వార లిద్దాని సేవించువారు సిద్ధ
చారణాదులు భూసురసత్తములును
మునివరుల్ ప్రమథాళులు మనుజభావ
మూని సేవింత్రుగాక యోవ్యోమకేశ. 103

క. సురవిభునారామంబున, బరఁగెడుకల్పద్రుమములు భవదంఘ్రులని
త్యరతిఁ సేవింపఁగ నీ, ధరఁబుట్టువుఁ గాంచుగాఁక తతఫలవితతిఁ. 104

తే. దేవతౌషధు లెల్ల నీ తీరమందు
మొలిచి వర్థిల్లుఁగాక నిగ్గోలుచు వేడ్క
సింహముఖసత్త్వములు శాంతచిత్తములను
దిరుగుచుండునుగాక యీ పరిసరముల. 105

క. ఘోరాఘము లిలనూరుం, బేరును గాంచక యడంగ విశ్వేశ్వర! యీ
ధారణిఁ దేజోలింగము, జేరి మహాఖ్యాతి మించి చేరినవారిఁ. 106

ఆ. సతతరక్షణమున జాగరూకంబయి
యుండుఁగాకయు యను యుగ్మభేద
గతినిగూడఁ బద్మకాంతుఁడు గిరిశృంగ
లింగములను దాఁటలేఁడు నిజము. 107

సీ. దివ్యదుందుభిశంఖ భవ్యనాదంబులఁ బుష్పవృష్టులనృత్యములను గీత
వాదిత్రముల నిన్ను భక్తిసేవించెడువా రమరత్వంబు వాంఛితార్థ
లాభంబు రససిద్ధులం గాంతు రీశ్వరా! నిర్వృతివారికి నెఱి లభించు
నినుఁజేరవచ్చిన నిర్మలాత్ములె యాదు రీశిత్వ మొప్పున శ్లేవశిత్వ

తే. మలరు సౌభాగ్య మొనఁగూడు నల్లె కాల
వంచనము చేయుశక్తియు వచ్చువారి
కరుణగిరినాథ! నిన్నొగి నాశ్రయింపఁ
గలుగరానిఫలంబులు కలుగునయ్య? 108

క. ఏయవయవ మర్పించిన, నాయవయవరోగ మడ్డె యంతము నొందుఁ
నీయిడనియభీష్టంబులు, వేమేలా! సృష్టియందు వెదకినఁగలవే. 109

చ. అనుటయు నీశ్వరుండు నటు లౌ నని పల్కెను నాటఁగోలె శం
భుని నరుణాద్రినాథునిగ భూమిని బిల్వఁగ సాగి రంత న

వ్వనరుహానేత్రుఁ డీశ్వరుని భక్తిభరంబున వేఁడి యివ్విధం
బున వచియించె; సాంబశివ భూరికృపాకర! శోణశైలపా. 110

తే. సుప్రసన్నుఁడ వగుము నీ శుభదరూప
దర్శనంబున హితఫలతతులు గలుగు.
భువనహితమును గోరియే భూతనాథ
యుదయమందుదు వెప్పుడో యుగ్ర! శర్వ! 111

మ. నిను నే నెత్తఱి నాశ్రయించితినొ నన్ నీవెప్డు లోకావనం
బునకుం జాలినవానిఁ జేసితివొ సంపూర్ణానురాగంబునన్
నను శ్రీనాథునిగా నొనర్చితివొ యెన్నంజాల నీశక్తి లో
కనికాయంబును భక్తియుక్తిని గనుంగా కప్డు సర్వేశ్వరా. 112

తే. అల్పపుణ్యంబులన్ జనులద్భుతమగు, నీదురూపంబుఁ బూజింప నేరర భవ
నేను బ్రహ్మయు నీవగు నిర్మలాంఘ్రి, శీర్షముల గానలేక నిల్చితిమిగాదె.

చ. వలగొని భక్తిపూర్వకముగ వందనముల్ పచరించి సాధుపూ
జనము లొనర్చి నృత్తములఁ జారుతరం బగు గేయపంక్తిని
న్ననయముఁ గొల్చు మానవులు హర్షము నొందుచు ధన్యులౌదు రా
త్మనుగల యాయహంకృతియు మాయము గాఁగ భవత్కృపాయుతిన్.

సీ. వ్రతముల నుపవాస వితతుల సత్రమ్ము
ల, నుపహారమ్ముల లలితవిధులఁ
పూజనంబుల నరుల్ భూతేశ నినుఁ గొల్చు
వార లౌదురు సార్వభౌములు ధర
నారామములమండపావళిఁ గూపమ్ము
లను శాస్త్రమర్యాద ననుసరించి
యరుణాచలేశ్వర! యంతికంబున నీకు
నొనరింతురో పునర్జనిగలుగక

తే. ముక్తినొందువారు భూతేశ! నీలింగ, మునకు శాస్త్రవిధుల ననుసరించి
తగఁ బ్రదక్షిణములఁ దత్పరతంజేయు, వారు గాంత్రు సకలవైభవముల.

క. విమలాశయులౌదురు పా, పములంతమునొందు నేనుఁ బద్మభవుఁడు నీ
యమలాంఘ్రిపంకరుహాయు, గ్మము వదలంజాల మిద్ది మాకు వరముగున్.

తే. నీదుసన్నిధి ధ్యానంబు నియతి నెవరు
చేయుదురొ వారు పూజ్యులై చెలఁగవలయు
నిట్లు వర మిమ్ము మాకన నీశ్వరుండు
వర మొసంగితి నట్లయా వ్యాసదేవ. 118

క. అరుణాచలరూపస్థా,వరలింగతనొందె హరుఁడు భాసురమై సుం
దరమై తైజసలింగం,బురుఫలదం బనెడుఖ్యాతి నొందె నది యిలన్. 118

తే. సకలలోకైకకారణం బకలుషమతి
పూజ్యమరుణాచలేంద్రము భూమి నొప్పె
బ్రళయ మప్పుడు చెలరేఁగఁ బంతమూను
సాగరంబులు లోకసంచయము ముంప 119

ఉ. తన్ను సముద్రనీరములు దాఁకక యుండఁగ నొప్పుఁ జవమ్ము తా
సన్నుత మహాచ శోణగిరి సామజసన్నిభశీకరంబులన్
గ్రన్నన లోకవారమును గ్రమ్మెడుపుష్కరముఖ్యమేఘముల్
విన్నఁదనంబుతోఁ దనను విస్తృతసానువులన్ వసింపఁగన్. 120

క. ప్రకృతియును భూతరాజిని, సకలంబును సంహరింప నంకల్పింపన్
బ్రకటారుణాచలస్థిత, సకలజ్ఞానైకసింధుసంజ్ఞునియందున్. 121

ఆ. బీజరాజియెల్లె విశ్వాసమున నుండు, భయము లేదటన్న భావ మూని
మహానివర్య ! నేను మరల నాహ్వానింప,లింగపూజచేయ నియతు లగుచు.

సీ. అరుణాచలస్థాన మందుండువిప్రుల
మూలంబునన్ వేదముల గ్రహింతు
నవ్వియే సకలవిద్యలకును గళలకు
శాస్త్రసంపదలకు సకలవిధము
లైనయాగమముల కారయ నునికిప
ట్టనఁగ నొప్పును; సత్య మనఁగ నిదియె
యేభూధ్రగుహాలయం దెలమివసించిన
మునివరుల్ శాస్త్రోక్తముగ నెసంగు

తే. వ్రతములను బొనర్చి బహుసూర్యకాంతుల
బోలుతేజములను బొలిచి జడలఁ

దాల్చి వెలయుచుండ్రు దర్పకహరులింగ
వరము గొల్చుచుండ్రు భక్తి వెలయ. 123

ఆ. బ్రహ్మమయములైన పంచమంత్రంబుల
మహితపంచవర్ణమంత్రపూర్వ
కముల శంకరుండు ప్రమదంబు గాంచంగ
జపము చేయుచుండ్రు సాధుమతులు. 124

సీ. ఓంకారపీఠమం దొప్పుసదాశివుం
డాపర్వతంబున యందు సతము
దిక్పాలవర్యులు తేజోమయంబులై
యష్టసంఖ్యం బొల్చు నట్టిలింగ
ములను నిల్పిరి సత్కృతులను దన్పుచు నీవె
యష్టమూర్తులుగాఁగ నమరుచుండ
సిద్ధ్యష్టకంబును జేకుఱఁజేయుచు
భక్తులఁ బాలించుఁ బరమశివుఁడు

ఆ. సిద్ధవరులు విమలబుద్ధులౌ లోకులు, సమరవరులు మందిరములవదలి
యరుణశైలవాస మభిలషించుచు స్వర్గ,గిరిని బాసి ముక్తికరుగనెంతు.

వ. వసుంధరాపుణ్యపరిపాకసముచ్చయం బరుణాచలం బనుఖ్యాతిం గాంచి భక్తభక్తి వరప్రదం బై కైలాసమేరుశిఖరాగత దేవసంచయపూజితంబై యొప్పు. అందు సర్వవరప్రదుం డగుశంకరుండు విజయంబు చేసియుండు ననుటయుఁ గమలసంభవవక్త్రపద్మజాతం బగువార్త ముదితచిత్తుండై భక్తిభావంబున సనకమునీంద్రుం డాలకించి వినయం బుట్టిపడఁ బ్రణతుండై యశేషవేదసారం బగువిషయంబు నెఱుంగం గోరి యిట్లు ప్రశ్నించె. 126

---

## తృతీయాధ్యాయము.

కాంచీనగరమునఁ బార్వతి తప మూనుట

క. సరసిజసంభవ! దేవా! యరుణాద్రీశ్వరమహత్త్వ మత్యద్భుతమై
యురుతరమోదంబొసఁగుచుఁ,బరఁగెన్ నాచిత్తమందుఁ బావనగతితోన్.

చ. శివుని మహాప్రసాదమున సృష్టికిఁ గర్తవు నయ్యు నాపయిన్
దవిలినసత్కృపన్ దెలుప దానిని వింటిని బాపనాశన
ప్రవణము చిత్రమత్యధికభక్తిదముత్తమముక్తిదంబునౌ
గవివరవర్ణనార్హమయి కావఁబడున్ భవతారకంబునౌ. 128

చ. వరదుని శోణపర్వతనివాసుని శంకరుఁ గొల్చి యెవ్వరె
వ్వరు కృతకృత్యులైరొ భగవంతుఁ డనాదియు నంతశూన్యుఁడౌ
నరుణధరాధరాకృతి మహాగురుదివ్యతపోవిభూతిశం
కరుఁడు వసించె భూమిపయిఁ గాదె వరంబుల నీయఁగోరుచున్ 129

క. అరుణాచల మని యొకపరి, పరికీర్తింపంగ ముక్తిఫల మొసఁగును శం
కరుఁ డద్దానిం జేరినఁ, బరుగిడుఁ బాపంబు లెల్లఁ బందును గోర్కుల్.

సీ. శివశబ్దపీయూషసేవాసమాదృతి కాలకంఠార్చనకథలు వినుట
సర్వకామదమనఁ జనుఁగాదె యను సనకోక్తులనాలించి యురుముదంబుఁ
గాంచి పితామహుం డంచితశోణాచలాధీశదివ్యమహత్త్వ మెల్ల
వచియింపఁగాఁబూని వామదేవునకాత్మ వందనంబొనరించి వాంఛ యలర

తే. బలికె నోవత్స! వినవయ్య పర్వతసుత
కైనపూర్వపుఁజరితంబు దానివలన
నీకు నరుణాద్రిమహిమంబు నెమ్మిఁ గూర్పఁ
జాలి స్పష్టమ్మగున్ మునిజాలవర్య. 131

చ. హిమగిరికన్యకామణి యహీనఫలం బిడు శోణనామభూ
ధ్రముఁ దమి నాశ్రయించి ప్రమదం బనుసాగరమందు సూఁగెఁ ద
త్క్రమము వచింతు భక్తి వినఁగాఁదగుఁ బర్వతజాధవుండు మో
దమున నొకానొకప్పుడు నితంబినితో సుర లెల్ల గొల్వఁగన్. 132

చ. రతనపుసింహపీఠమున రాజసమొప్ప వసించె నెంతొ య
ద్భుతమయి దివ్యరత్నమయతోరణసంయుత మౌచు రత్నపు
ష్పతతుల నొప్పుచున్ ద్రిదశపాలకపుష్పవనద్రుమౌఘసం
యుతి సుమనోజ్ఞ మౌచు మృదులోపలసంస్థితి నొప్పమీఱుచున్.

సీ. ముక్తావితానకభూషితంబయి దివ్యధూపసౌరభమయి తోరపుఁబరి
మళభారభూషితమాలతీముఖసుమహారలోలుపషట్పదారవముఖ

రితమునై దేవతూర్యతతిని నాదప్రనృత్యన్మయూరమై యెంతో వర్ణ్య
మై శైలసుతకువాహన మైనసింహము సంచరించుట సాధ్వసంబుగాం [చు
తే. దంతివర మొచు నప్సరఃకాంత లెలమిఁ
బాడఁగాఁ దన్నినాదముల్ పర్వ ముదముఁ
గూర్చునది యొచు దిక్పాలకూటసేవి
తోత్తమపురస్థలంబయి యొప్పుచుండి. 134
క. శ్రుతిసంతతిమంత్రంబుల, స్తుతిసల్పుమహర్షివరులతో నిండి సుర
ప్రతతియుసిద్ధౌఘముభూ, పతిమానులు ప్రమథవరులపటలము లెపుడున్
చ. తనువులు భస్మచర్చలనతంబు విచిత్రరుచుల్ చెలంగ శం
భుని నుతిసల్పుకోర్కులు ప్రమోదము పెంపున సాగుచుండ వీ
ణను మృదువేణువుల్ గొని నినాదములన్ సురసంఘమెల్ల మూ
ర్ఛను గనఁజేయుచున్ రుచిరశంఖమృదంగముఖారవంబులన్. 136
తే. దిక్కులన్ నిండఁజేయుచు మక్కువమెయి
వేదనాదమ్ములన్ శివవివిధకార్య
గతులఁ దెల్పుచు రుద్రాక్షకమ్రహార
ములు గళంబులఁ బావనములుగఁజేయు. 137
క. హరఁభవ్యమహత్త్వంబి, క్కరణిం జెలువారుననుచుఁగడఁగివినుతులన్
సురముఖ్యులకుం దెల్పుచుఁ,జరియించుచునుండ నెంతొసంతసమిడుచున్.
తే. అలరుసింహాసనంబున నధివసించి
యమ్మహాదేవుఁ డెల్లర నమరవరుల
సమ్మదంబునఁ గావఁగా స్వాంతమందుఁ
దలఁచుచుండెను భక్తతత్పరుఁడుగాన. 139
క. సురుచిర తేజోరూపముఁ, బరమాద్భుతిమై గ్రహించి పరమప్రమదం
బారులకునొసఁగుచుధన్యులు,గరహింబొనరించుచున్ వికారరహితుఁడై.
క. గీతంబుల సాధుకథా,వ్రాతంబుల వివిధచిత్రరమ్యక్రీడా
ద్యూతాదికములఁ గాలం, బాతఁడుఁ బుచ్చెన్ సురేసులందఱు పొగడన్.
క. ప్రమథులవికారనృత్తము,లుమచిత్తము సంతసమ్ము నొందింపఁగఁ దా
ను మదిని దేసింగోరక,శమ మొప్పఁగనుండె శివుఁడు శంకరుఁ డనఁగన్,

చ. అమరుల కాజ్ఞయిచ్చి మునులాదృతిఁగొల్వ సభాసదుల్ మనో
జ్ఞము లగుసాధుగాథల నెసంగెడుభక్తి వినంగఁగోర ని
ష్టములను వారివారికిఁ గడంగి యొసంగుచు భక్తలోకకా
ర్యము లొనఁగూర్చు వేడ్కఁ జెలువారఁగ శంకరుఁ డొప్పె నత్తఱిన్.

చ. వనములు చిత్రరీతిఁ జెలువంబును గూర్పఁగఁ జాలియుండ నం
దనవరతంబు పల్లవసుమాదులు కన్పడుచుండ శైలజా
తను దమిఁగూడి రత్నమయధామములన్ విహరించె నంతఁ దృ
ప్తిని గిరిజాతకున్ గలుగధీమహిమంబు చెలంగుచుండఁగన్. 144

సీ. మంజులవాపికామండలంబులయందు రత్నసోపానముల్ రాజిలంగ
సంతృప్తివిహరించి శైలముల్ క్రీడార్థనిర్మితంబులుగాఁగ నెఱిఁగనఁబడ
నవ్వానిశృంగంబులందును హేమరంభావనాంతరమందుఁబరమముదము
పార్వతికిం గల్గుభంగిని విహరించి గంగాతరంగశీకరసమాప్లు

తే. తిని గడుంజల్లనై ఫుల్లవనరుహములు
పరిమళం బీయఁ గైకొని పరమపూజ్య
మందగతు లొప్ప వీచెడుమారుతంబు
తమవిహారశ్రమంబును దలఁగఁజేయ. 145

చ. తరుణిపయింగలట్టి ప్రమదంబున నాటలబాటలన్ మనో
హరతమకేళులన్ మిగుల నాదృతిఁ బెంచెడుభాషణంబులన్
హరుఁ డుమ కాత్మతృప్తిపొలయంగఁ జరించె రతిస్వరూపతన్
గిరివలనన్ జనించెనను కేవలభావము గల్గియుండుటన్. 146

తే. సర్వసౌభాగ్యసుందరిక్ష్మాధరసుత
మంగళాలయ యని యెంచి మాననీయ
యనుతలంపున నామెకు హర్ష మొదవ
హరుఁడు విహరించె నెక్కుడునాదరమున. 147

మ. ఒకనాఁ డొంటిగ శంకరుం గలిసి యాయుర్వీధ్రసంజాతవే
డుకమైనుండి నిజాజ్ఞనాథుతలనుండన్ భీతిపాత్రంబుగా
నిఁక భేదం బనునద్ది లేదనుచు నెంతే నాత్మ యోజించి యెం
చకరాఁబోయెడుకాల మెట్టి దనుచున్ స్వాంతంబునన్ గౌరియున్.

తే. ముగ్ధయై వెన్కనుండి సమ్మోదపూర్ణ
హృదయయౌటను వేవచ్చి యాశునయన
ములను మూఁడింటఁ జేతుల మూసె లోక
జాలగురువని యెంచక సత్వరముగ. 149

చ. అది యొకకౌతుకంబె యగు నంచుఁ దలంచుచు లీలచేత న
మ్మదవతి మూసె దోర్ద్వితయమంజులతామరసంబులన్ రవీం
దుదహనరూపముల్ వెలయఁ దోఁచెడునేత్రము లవ్వి మూయఁగాఁ
బొదలె మహాంధకారమట భూతభయంకరమై చిరంబుగన్. 150

క. నిముసములు రెండుగడువఁ జ
గములన్ సంవత్సరములు గడచెను గోటుల్
ప్రమదమునఁ గనులు మూయఁగ
నుమలోకములకు లయంబె యొగిఁ బ్రాపించెన్. 151

ఆ. లీల యద్ది యుమకుఁ జాలె లోకములకా
తమము లయ మొసంగ దాని మాన్పఁ
దరముగాకయుండె ధాతృముఖులకైనఁ
దమము నిండె నెల్లతావులందు. 152

చ. వెలుతురు లేమిఁ జీఁకటులు విశ్వము నిండ వినాశ మప్పుడే
కలిగెను లోకసంతతికిఁ గ్రాలరు దేవతలెల్ల వేదముల్
విలసిల వెందుజీవులకు వృద్ధియె కన్పడ దెల్ల శూన్యమై
తలఁప వినాశనంబు తమదాపున నున్నటు లుండె నత్తఱిన్. 153

చ. జగముల కిట్లకాలమున సంక్షయ మత్తఱి దాపరింపనె
వ్వగలఁ దపోబలంబుఁ గలవారలు పొంది యిదేమి చీఁకటుల్
జగముల నిండెఁ జూడఁబడె సంక్షయమానని తెల్పుచిహ్నముల్
తగ దిపు డీక్షయంబు వితతం బగుధర్మము తావెలుంగుటన్. 154

ఆ. సర్వగతుఁడు సర్వజగదీశ్వరుఁడు మదిఁ, దలఁపఁడిదిలయంబు కలుగఁగాల
మనుచు నిశ్చయమిది యద్రికుమారి వే,డను బురారికనులఁ గప్పెఁ గేల.

ఉ. దాననె యింతపుట్టెఁ గడుధ్వాంతము నెల్లెడలందుఁ గ్రమ్మె ని
ట్లూను నకాలసంభవమహోగ్రతమస్సున నీత్రిలోకముల్

కానఁదరంబుగాని యటు గ్రమ్మఁబడెంగద యింక దిక్కనం
గా నెది నాయకుం డెవఁడు గ్రక్కున దీనినిమాయఁజేయుఁగన్. 156

చ. ఎవరికి నే నశక్య మిది యెన్న గుణాత్మికమాయ యొక్కఁడే
శివ మిడఁజాలు లోకముల సృష్ట్యవసాంతము లొందఁజేయుశ
క్తివఱలు దేవి శంకరుని దేహమునందు సగంబుఁ గొన్నసం
స్తవసముదాయయోగ్యరుచిశాలిని శ్రీత్రిపురాంబ నాఁదగున్. 157

క. తను వగుశివశక్త్యాత్మక, మనఘా! యీశాన! శంకరా! నీ వేలీ
లను లోకజాలవిలయము,బును గానఁగ దక్షుఁడవు విభూ! సర్వేశా!

తే. కరుణ నీయది నిర్వ్యాజ మరయ లోక
వృద్ధిహేతువుగా నిప్డు వెలయుఁగాక
నిముసమున నర్ధభాగంబు నీకుఁ గనువ
దేజ ముపసంహృతం బౌట దివిని భువిని. 159

చ. గడచెను బెక్కువర్షములు కాలగళా! యది లోకజాలముం
బొడవడఁగంగ జేసెడివిభూ! కరుణానిధి! సుప్రసన్నతన్
గడఁగుము కావఁ బ్రేమను నిఁకన్ విడనాడుము లోకసంక్షయం
బుడుగ నుపాయముం దలఁపు మో జగదీశ్వర! పార్వతీశ్వరా. 160

చ. అని యిటు తత్త్వవేత్తలు మహాత్ములు పల్కఁగ నాలకించి భ
క్తనికర మిద్ది సిద్ధిఁ గని క్రాలెడు నంచుఁ దలంచి ప్రేయసీ!
కనులను మూయుకార్యము దిగన్ విడుమా యిఁకఁ జాలు నార్తిగాం
చెను జగముల్ క్షణంబుననె చిత్రముగా నని భర్తపల్కినన్. 161

మ. హరనేత్రత్రయిఁ గేలుదామరలమూయంబూను నక్కార్య మా
ధరణీభృత్తనుజాత మానుటయుఁ జంద్రబ్రధ్నవహ్న్యాకృతిం
బరిశుద్ధప్రభలన్ వెలుంగుశుభదప్రారంభనేత్రంబుల
త్తరుణం బందు యథాప్రకారముగ నే దళ్కొత్తుచుండెం గడున్. 162

ఆ. సిద్ధు లపుడు లేచి చెల్లెఁ గాలం బెంత
యనుచు నడిగి రమరులను గడంగి
నిముసమందు సగము నేత్రముల్ మూయంగఁ
గోటివత్సరములు కువలయమున. 163

క. సురలోకంబునఁ గూడన్, జరగె నటం చుత్తరం బొసంగిరి పిదపన్
హరుఁడు కృపాంబుధి గావునఁ, దరుణీమణిఁ బర్వతసుతఁ దమిమించంగన్.

చ. కనుఁగొని యర్థధర్మములఁ గావఁగ నర్హముగాఁ జెలంగురీ
తిని వచియించె వాక్య మది దివ్యతరార్థముఁ దెల్పునద్దియై
కనఁబడె సుందరీ! భువనకాండవినాశనకార్య మివ్విధం
బునఁ బొనరించినావు కద ముగ్ధవు గావున నియ్యుదారయన్. [జగముల

సీ. భువనమాతకు నీకుఁ బోలదంచెదఁ దోఁచెఁ బ్రళయంబునన్ నేను బహు
విలయ మొందింతును బ్రళయంబుఁ గల్పించితీవ కాలంబున భావమందుఁ
దలపోయకుండనే తరుణి నీవలె సద్విగర్హిత మైనట్టి కార్యమిట్టు
లొనరించుఁ గరుణనెమ్మనము గలవాఁడు నర్మకర్మమున నేశర్మమునకు

తే. బాధఁ గల్పింపఁ డని నమ్మవలయు ననిన
శంభువాక్యంబులను విని శైలజాత
ధర్మలోపభయాకులాత్మ యయి దీని
శాంతికొఱ కేమిచేయనో శంకర! యని. 166

చ. అనుటయు దేవదేవుఁడు మహాత్ముఁడు శంభుఁడు సుప్రసన్నుఁడై
యనియె దయాసముద్రుఁడను నాహ్వాయ మొంతయు సార్థకంబుగా
విను భువనైకమాతవయి విశ్రుతశక్తి యొసంగి మా
నినికరసన్నుతిం గనెదు నీకును నాకు నభేదమే కదా. 167

తే. అట్టి నీకుఁ బ్రాయశ్చిత్త మనువదింతు
నెట్టు? లక్ష్యైన నీచేత నేపథంబు
ధర్మ మనునది కల్పింపఁదగిన దాను
శ్రుతులు స్మృతులు క్రియాకల్పితతులు సురలు. 168

చ. వివిధవిధంబులం బరఁగు విద్యలు నీదగురూపమే సమ
స్తవిధములం దలంచినను ద్వన్మయుఁడన్ నిజ మిద్ది పార్వతీ
శివున కభిన్నవే యనఁగఁ జెల్లి సతంబును మాన్య వౌచు లో
కవితతిసృష్టిచేయుకుతుకంబును గాంచెదు నీకు నిత్తఱిన్. 169

క. లోకానురూపమై జను, లీకరణిం జేయ నర్హ మెప్పుడు నని శా
స్త్రాకలనమునం గోరఁగ, నాకరణిం దెల్పువాఁడ నప్పాచితమున్. 170

క. శ్రుతులఁ దదర్థముఁ దెల్పెను,స్మృతుల విచారింప ధర్మసిద్ధి యలరు నీ
క్షితి షడ్విధములుగాఁ బా,ర్వతి! వానిం దెల్ప నేల వాని నెఱుఁగవే.

క పాలింపఁబూను భూమీ,పాలుండను జీవియాజ్ఞ పాలింపక వా
చాలతఁ దిరిగిన వదలుట, యేలక్ష్యం బితరుల కది యెన్న గిరిసుతా.

చ. నిను విడనాడి యేనొకక్షణంబును నిల్వఁగఁజాల నెప్పు డే
నని మది నిశ్చయింపుము మహాఘము పాయఁగ నీనిమిత్తమే
నొనరుతు నత్తపంబు నది యొప్పును దాని నడంప భూతలం
బును సకలంబు దానఁ బరిపూత మగున్ నిజ మిద్ది పార్వతీ. 173
నీయాత్మ నేనె గావున, నీయెడ నాచేయు తప మదెంతయు సఫలం
బేయగు మఱియొక్కఁడు విను, మోయువతీ! నీవనంగ నొకయల్పమవే.

మ. భవదంఘ్రిస్ఫుటపద్మయుగ్మ మెట సంస్పర్శించు నీదాతపం
బవధానంబునఁ జూచు నెద్ది యట దుష్టాత్ముల్ మహోపద్రవం
బు వసింపన్ భయమొంది పాఱు సుజనుల్ పొల్పొందువారున్నతిన్.

తే. కర్మభూమి కాధిక్యంబుకల్గుకొఱకుఁ
బుణ్య మొనరింపు నీతపంబును గనంగ
ధర్మనిష్ఠ యొసంగుఁ జిత్తప్రశుద్ధి
గలుగుజనులకు సందియంబులు గలుగవు. 176

సీ. ధర్మపాలనముల దయనీది భూమిని ధన్యగా నొనరించు ధరవరసుత
పూర్వతమంబులై పొలుచు వేదంబులు సకలంబు నీవసి చక్కఁదెలుపు
భూతలంబుననొక్కపురముకాంచీనామమునఖ్యాతినొందునుభూరిభూతి
యొప్పారుచుండంగ నప్పురియే దేవసంపూర్ణయయి సురస్థానమైన

తే. స్వర్గనగరంబుఁ జూపు సాక్షాత్కరించి
నట్లు నప్పురి నొనరించు నల్పతప మొ
సంగు భూరిపుణ్యంబును సకలసురులు
మునులు సతతంబు వసియింపఁబూని యుంద్రు. 177

క. కల దందుఁ గంపనాఁబే,రొలయఁగ గురుపాతకముల నొగిఁ జెండుచు నా
స్థలమున వసించుమర్త్యుల,నలముకొనన్ జంకు నెట్టి యఘతతులైనన్.

చ. కల శోకచూతవృక్ష మటఁ గమ్రనిరంతరపల్లవాళిశీ
తలమగునీడ నిచ్చుచుఁ బ్రతాపము నంతయుఁ జేరనీక ని
స్తులఫలపుష్పసంతతులతోఁ దులఁదూఁగుచు వర్ణనార్హమై
ఖలజనభీతిదం బగుచు క్ష్మాధరవర్యకుమారికామణీ! 179

ఉ. అందు వసించి చేసె సుజపాదికమెల్లను హోమదానముల్
సుందరి! సత్ఫలాళి నిడుఁ జుమ్ము; గణాగ్రణు లెల్లరున్ మహా
నందతనూవిలాసముల నైజవిభూతులతో వసించువా;
రం దొనరింపుమా తపము నయ్యె దనంతఫలమ్ము లిచ్చెడున్. 180

సీ. యోగినుల్ డాకిను లొగి నీదుచుట్టును నిల్చి సేవింతురు; నీరజాక్షు
ముఖులైన దేవతాముఖ్యులు గొల్తురు; నేను నిష్కళుఁడనై నీమనఃక
మలమునని వసింతు;మాటఁదప్పనుజుమ్ము;విరహాకులవుగాక వెలయుచుండు
వని పల్కఁగ విని హిమాచలపుత్రిక కంపాంతికమునకుఁ గదలిపోయె

ఆ. సఖులతోడఁ దపము సల్పెడుకాంక్షమై, విస్మయమునఁగను లువివిధగతుల
నాకులంబు లగుచు నగపడఁగాఁ గంప, యనెడునదిని జేరి యట వసించి.

చ. మునులట నిల్చి నిష్ఠఁ దపముం బొనరించుటఁ గాంచి, సంతసం
బున మృదుపల్లవాఢ్యమయి పొల్చెడు చూతమహీరుహంబుఁ గ
న్గొనుచును దృష్టివారణము కోకిలనిస్వనసంకులంబు పు
ష్పనికరరాజితంబు ఫలసంతతిచేఁ దగుదానిచేరువన్. 182

ఆ. నిలిచి ప్రాణనాథు నెలమి స్మరించెను, నిర్మలాత్మ యగుచుఁ బేర్మిఁ గాంచి
యతనుశుచివరీత హరితసూలతయగుచుఁ దపముచేత నలసినట్లు. 183

క. కనఁబడుచున్ విజయాహ్వాయ
మునఁ దగు ప్రియసఖిని పార్శ్వమున వర్తిలుదా
నిని గాంచి రామ శోకం
బున మున్గుచు నీశువిరహమున భీతిలుచున్. 184

ఆ. అఘహరముగఁ గ్రాలు నామ్రవృక్షముకడ
కరుగుదెంచినాను హరుఁదపమునఁ
బూజచేయ నేనుఁ బూఁబోఁడిరో! యిద్ది
పల్లవప్రసూనభరిత మగుచు. 185

క. స్మరబంధు వాచు నిత్తఱి, స్మరింపఁగాఁజేసె నాథు శంకరు; నీక నె
క్కరణిన్ సైరింపందగు, హరవిరహము తోఁపకున్న దంబుజనేత్రా! 186
చ. మదనుఁడు నామనంబు నియమంబును వీడఁగ క్షోభ మొందున
ట్లదయతఁ జేసెనున్; దరుణహారిశశాంకధరాంఘ్రిపంకజం
బుఁ దలఁచుటే మహౌషధము పో; యిపు డీగతి నేఁచు బాధ నా
పఁదగిన యట్టి దంచుఁ జెలి బాగుగఁ దోఁచె నిఁకేమి చెప్పుదున్. 187

## చతుర్థాధ్యాయము.

కాంచీపురినుండి గౌరి యరుణాచలమున కరుగుట.

క. అని తెల్పి యవలికత ని
ట్లని బ్రహ్మ యెఱుంగఁ జెప్పె నాదృతిఁ గొని యో
సనకమునీంద్రా! పర్వత
తనయామణి కెఱిఁగి విజయ తగుమాటలతోన్. 188
ఆ. ఊఱడిల్లఁ జేసి యున్నతస్తుతితతి
వినుతిఁ జేసి మఱియు వివిధవిధము
లగునుపాయములను హరదర్శనముఁ గూర్పఁ
జాలువానిఁ దెలిపి శంభుఁ డిప్డు. 189
చ. నిను విడనాడి యుండునొకొ? నీరజనేత్రరో! శూలి కీవెగా
యనయము ప్రాణనాయికవు హర్షదవై తగుశక్తివీవె; శం
భునకు నిదే రహస్య మిటుఁ బోలఁదలంపవొ? యాత్మయందు మా
యను భవదీయఁ జూపఁ దగునంచుఁ దలంతువు శంకరుండనున్. 190
సీ. ప్రకటింపఁ డిటుఁ బృథగ్భావంబుఁ దదనుజ్ఞఁ
బడసి యేతపమున వాంఛఁ బూని
వచ్చితి విచటికి వామదేవునియాజ్ఞ
మీఱఁగా రానిదై మించుఁగాదె
యెల్లప్పుడును నీకు నీశప్రకల్పిత
స్థలమున నిందు నిష్ఠను దపంబు

చేయంగఁదగునీవు చిత్తంబునంగల
కామంబులన్ వీడి కామవైరి

ఆ. నాశ్రయించి తగునియమమున నుండుము, దాని మానలోకతతిని గాచు
నెట్లుపొసఁగునమ్మ! యీశునితో ధర్మ, రక్షణంబొనర్పురమ్యపథము.

క. నీవెట్టు లాశ్రయింపఁగ, లావో హృదయస్థు ఫణికలాపుని శంభున్
భావించి ధ్యానయోగ, శ్రీవిలసితశక్తిఁ జూడఁజెల్లును నీకున్ 192

ఆ. నిష్కళుని మహేశు నిత్యంబుగనుచుండు, మదివియోగ దుఃఖమంతరింప
నొనరుపంగఁజాలు నని మదిఁ దలఁపవు, తలఁతు వేని శంక గలుగునొక్కొ?

క. హరభక్తముఖ్యులకు నా, చరణంబున మంచిత్రోవ సాధ్వీ! చూపం
దరమౌను; దాని కీవే, పరికింపఁగ ముఖ్యమగుదు భావింపు మెదన్. 194

క. ఉపదేశరూపమున ధర్మపటలవత్సలవుగాన మహిలో నీక సా
ధుపథంబుం బ్రకటింపుము, కృప నాపై నునుపవమ్మ! యీశ్వరపత్నీ!

చ. అని వినయంబు న్యాయ్యమును నాత్మకుఁ బథ్యము నైనరీతిగాఁ
వినఁబడఁబల్కి యవ్విజయ వేత్రదియున్ నచియింపకున్న శం
భునిసహధర్మచారిణియుఁ బూజ్యతమస్థిరమానసాబ్జయై
తననియమంబున న్నదికిఁ దాపునఁ దీర్పఁగఁ బూనె నంతటన్? 196

చ. వివిధకలాపబృందమును వీడి సరుద్రపదాక్షహారసం
భవరుచి దేహమున్ మిగులఁ బావనదీప్తుల మించఁజేయ ది
వ్యవసనముం ద్యజించి శుచివల్కలముల్ ధరియించి ముంగురుల్
ప్రవిమలమౌకపర్దతను భాసిలఁగా నొనరించి నేర్పుమై. 197

సీ. కంచుకంబును వీడి గాత్ర మెల్లను భస్మ
చర్చలన్ భాసిల్లు చందముననె
యొనరించి, హరిణకవ్యూహంబు సంతోష
పాత్రంబుగా జేయఁ బాటుపడుచు
వృత్తిశిలోంఛైకవిషయత నొప్పార
నియమమే ముఖ్యమై నెగడియుండఁ
బరమమహేశ్వర పంచాక్షరం బగు
మంత్రవర్యము తనమదిని నిల్పఁ

తే. త్రిషవణస్నాన మొనరించు ధృతి చెలంగఁ
గంపనాఁబడు నేటినీ రింపుఁగూర్పఁ
సైకతం బగులింగంబు శాస్త్రవిహిత
పూజ కర్హంబ బటంచుఁ బూఁబోఁడి యెంచి. 198

చ. ఒనరిచి యందు నర్చనల నున్నతభక్తి నొనర్చుచున్ మహీ
జనికరరోపణంబులను సాధుతమోత్తమదానరాజిశా
స్త్రనియతిసంతతాతిథివిశాలసమర్చనలన్ బొనర్చుచున్
వనితహృదంతరాళగతభర్గుని గాంచుచుఁ బుచ్చెఁగాలమున్. 199

క. జీవములకు గలశ్రమములు,పోవన్ ధర్మంబు నిల్పుపోలిక నియతిన్
భావజరిపుఁ డలరంగా, భావిని సాగించె మానివరు లరుదందన్. 200

సీ. మఱియునుబంచాగ్నిమధ్యస్థయై గ్రీష్మసమయంబునందును స్థండిలమున
శయనించి, వృష్టిదాసమయంబునందును శీతలాంబ్వంతరస్థితిఁ మించి
హేమంతమందు నట్లే శిశిరర్తువునందుఁ దపంబు నత్యంతనిష్ఠ
నొనరిచెఁ బావనమనసులుగల్గినమునులు దర్శింపవచ్చినగిరీంద్ర

తే. తనయ విస్మయమునుగూర్చె; వినయమొప్ప
వారి నర్చించె; వని కేగి సారకుసుమ
మంజరులఁ బల్లవంబుల మనసు రంజి
లంగఁ గొనివచ్చి విమలస్థలమున నునిచి. 201

క. కంపాతరంగిణీతట, మింపై కనుపట్టనందు నిసుకను సేర్పల్
ఫొంపిరిపోవఁగ నొనరిచి, సంపూజింపంగఁ బూనుఁ జానయు శ్రద్ధన్.

సీ. న్యాసమావాహనం బాదిమా క్రమమునఁ
దొలుత భాస్కరమూర్తిఁ గొలిచి, సార
చందనసుమములఁ జక్క నారాధించి
పంచావరణయుక్తపరమశంభు
లింగంబు వరుస నుపాంగుభక్తిం జక్కఁ
బూజించి వరధూపములును దీప
నైవేద్యము లొసంగి నాథు నీశాసుని
ముందె చూడంజాలె నందివాహ

తే. నుండు ప్రత్యక్షముగఁ దాను గొండలెక్కి
మీనికూఁతుఁ బరీక్షింపఁ బూని యందుఁ
గల్గుకంపాప్రవాహంబు కడుజవమునఁ
బొంగి నలుఁగడలందుఁ గ్రమ్మంగఁజేసె. 203

చ. వరుసగ వృద్ధిగాంచెడు ప వాహముచెంతకు వచ్చుచుండ నా
పరిసరమందునుండి తగుభంగిఁ గనుంగొను నెచ్చెలుల్ గిరీ
శ్వరతనయామణిం గదిసి వైళను లెమ్ము ప్రవాహ మిప్డు స
త్వరముగఁ బొంగి చెంతకును వచ్చెడు దిక్కుల నాక్రమించుచున్.

క. నిను వేగ ముంపఁగలదో, జననీ వేగంబ లెమ్ము చాలుఁ; దప మటం
చనుబల్కు సఖులవాక్కుల, వినిమీలితనయనయగుచు విశ్వేశ్వరునిన్.

చ. తలఁచుచుఁ గన్నులం దెఱచి తత్తటినీజలపూరమంతలో
పల నిసుమంత చెంతఁ గనుపట్టఁగఁ గాంచుచుఁ బూజచేయఁగాఁ
దలఁచిన నాకు విఘ్న మిది తప్పక యిట్లొనరింపఁ బూనెఁ దాఁ
దలఁగునొ యిద్ది యె ట్లనుచుఁ దన్విసమాకులమానసాబ్జయై. 206

తే. ఇంత యోజించి చేయనో నేమి దీని
కిపుడు పూజను జాలింప నెట్టులౌను
శ్రేయ మెన్న నవిఘ్నముచేతఁ గల్గు
బుణ్యపూరుషులకు నంద్రు బుధులు జగతి. 207

క. కృతపుణ్యులకే చేపడు, నతిశయవాంఛాఫలప్రదామలభాగ్యం;
బితరుల కది లభియింపదు, స్థితి యిది లోకంబులందుఁ జెల్లుసతంబున్.

సీ. అతులసైకతలింగ మంబుపూరంబున విలయంబు గాంచు వేవేగ మద్ది
నాశ మొందఁగఁ బరమేశభక్తులు ప్రాణసంతతిపీడంగఁ జను క్షణమున
నీ ప్రవాహము జగదీశమాయాకృత పటాట నన్నున్ స్వకీయాంఘ్రిభక్తి
యుక్తనో కాదో యంచొగిఁ బరీక్షించెడునై నది కానిమ్ము; మాన కింక

తే. నీమహేశ్వరలింగంబు దృఢతమమగు
భక్తిభావంబునను దృఢబాహువులను
కౌఁగిటం జేర్చుకొని యుందుఁ గలఁతమాని
మెట్టు లున్నదో మద్భాగ్య మట్టు లగును. 209

క. చెలులారా! మీ రేగుఁడు
తలఁగి ప్రవాహంబునకును ద్వరపడి యనుచున్
జ్వలనార్కశశివిలోచన
విలసితుఁడై వెలయునట్టి విశ్వేశ్వరునే. 210

చ. మనమున నిల్పి సైకతము మంజులలింగముఁ గౌఁగిలించుకొం
చనుపమగాఢభక్తి యలరారఁగ నట్టులె యుండె భూమిభృ
త్తనయయు నా ప్రవాహమునఁ దాను మునింగియు దూరమేగుసూ
హాను గనకుండె శంభుఁడు దయామయుఁడై తగునన్నిష్ఠచేన్. 211

సీ. స్తనచూచుకంబునమునిఁగి ముద్రాదర్శితమగులాంఛనమునఁ దగినశంభు
సైకతలింగము స్వాంతమ్మునం బొంగుభక్తిభరంబున వందనతతి
నలరించెఁ; బార్వతి యంత నిమీలితేక్షణయయి ధ్యాననిష్ఠ నెచెలంగు
హృదయయైయుండె నట్లే యించుకేనియుఁ గదలక పులకనికరకలితస
తే. మస్తతనువల్లియై హరుమహితలింగ
వరము ధ్యానించుచున్ సుంత భయము గనక
స్వేదకంపపరిత్రాణవిపులలజ్జ
లట్లై ప్రణయంబుఁ గేలియు నమరుపఁదగి. 212

క. అనుపమతేజంబున నొప్పినలింగమునుండి భక్తిపేర్మిని దృష్టిన్
వనితామణి మరలింపం,గ నిముసమే నెంచ కట్లై కదలకయుండెన్.
తే. అంత నశరీరిణి యగువాక్యంబ చెవులఁ
జొచ్చె బాలిక! విడువుము శూలిలింగ
వరము నీటిప్రవాహంబు జరగె వెనుక
కీమహేశ్వరలింగము నిసుకనుండి. 214

క. విరచింపంబడియెను సు, స్థిరవైభవయుక్త మగుచు దేవీ! యింకన్
ధర నుండఁగలదు వరదము, సురపూజితమునయి వెలయుస్తుతిపాత్రంబై.
క. నీ వొనరించుతపంబును, దైవము తిలకించి భూమిధర్మము గ్లానిం
జేవ చెడకుండఁ గావఁగ, భావంబున నెంచెఁ దపము ఫలమిడె నీకున్.
క. దీనికి నమస్కరించెదు, మానవులు కృతార్థు లగుచు మహితవిభూతిం
గానంజాలి చెలంగుదు, రోలలనా! లెమ్ము చాలు నుద్యమ మింకన్. 217

సీ. పడఁతి! తైజస మనఁబడుశరీరముఁ దాల్చి యిం దెవసింతునీ డెందమలరఁ
నరుణాచలాహ్వయ మమరసిద్ధులనీయు నరుణాచలంబను; దాని కర్థ
మేమనఁ దెల్పెద నేణాక్షి! లోకమువలన జనించినకలుషచయము
పరుషమై సిద్ధులవరుసగా నడ్డగించెఽరుణ మనునది చేరకుండ
తే. నెద్ది చూచిన నద్దాన నిద్ది ఖ్యాతి
నందె నరుణాచలంబన నవనియందు
మునులు సిద్ధగంధర్వయోగినికరములు
పరమకైలాసశిఖరంబుఁ బాసి నియతి. 218

క. మేరుక్ష్మాధరవర్యము, సారవిహీనం బటంచు సత్వరముగ వే
సారక వదలుచు వాసం, బారసి యరుణాద్రినుందు రార్యా! వినుమా.
క. నాయంశంబునఁ బుట్టిన, యాయజవిష్ణువులు మును మహాహవదీక్షం
బాయక పూనినమోహం, బాయెడఁ బాపంగఁ గోరి యద్రీంద్రసుతా!
క. తనువది తేజోమయముగ, గనఁబడఁగాఁ జేసి నిల్వఁగాఁ బంకరుహా
సనుఁ డప్డు హంసరూపం,బున విష్ణువు క్రోడరూపమునఁ దలఁబడముల్.
చ. కనుఁగొనఁగోరి శక్య మది గామిని! భక్తిభరంబునన్ నమో
వినుతులచేఁ బ్రసన్నతను వేగమ పొందఁగఁజేయ నేను నా
తనువు గనంగఁజేసి వరదానమునం బ్రమదంబుఁ గూర్చితిన్
వనరుహనేత్రు నిల్పితిని భద్రదపాలనకృత్యమందటుల్. 222
ఆ. పద్మభవుని సృష్టిఁ బరమకౌశలయుతుఁ, గా నొనర్చి నాఁడు గరము ప్రీతు
లగుచు వారు నన్ను నరుణాచలాఖ్యను, నిలువ వేఁడ నట్లె నిలువఁ గోరి.
క. స్థావరలింగతఁ దైజస, మావరరూపంబు నొందున ట్లొనరచితిన్
బావనమతి గౌతమముని, శైవాగ్రేసరునిఁ జేరఁ జని యాతనినిన్. 224
క. అరుణాచలమాహాత్మ్యం
బరుదుగ విని యందు తపము నార్యా! చేయన్
బరికింపక తైజసమా
వరరూపముఁ జూపువాఁడఁ బాపము లడఁపన్. 225
క. ఎల్లజగమ్ముల హితమే, నుల్లమునం గోరి యట్టు లొనరించిన నం
చల్లన వినఁబడవాక్కది, కల్లయొగా దద్ది శంభు కథితమె యనుచున్.

చ. తనమది నెంచి యట్టులె నితాంతతపోధనరాశిగాతముం
గనఁ జనుదాన నంచుఁ జనఁగాఁ బనిపూని స్వసేవఁజేయువాం
ఛను జనుదెంచు దేవమునిసత్తములం గని స్నేహపూర్ణవా
క్కున నిటుపల్కెఁ జూపుఁదమిఁ గొంకక తెల్పుచు నుండ నత్తఱిన్!
క. నిలువుఁడు మీరిందే యీ, స్థల మతిపూతంబు దేవసత్తములారా!
యిల దేవతలను ఖ్యాతిం, గలమానివరేణ్యులార! కంపాతటమున్.
చ. పరమపవిత్రమై తనరుఁ బాయక దీనినె యాశ్రయించి మీ
యురునియమావళిన్ జరపుచుండుఁడు పాపహారంబు భాగ్యదం
బరయ సుఖాస్పదంబునయి హర్షదమై కుచకంకణాంకభా
సురమయి సైకతంబునయి శోభిలు లింగము దీనిఁ గొల్చుచున్. 229
ఆ. నిలువుఁ డిందె మీరు నేనిష్కళం బగు
రూపమొంది రేయి రేపు మాపు
వరము లిచ్చు శోణవల్లభమంత్రంబు
జప మొనర్చుదాన సాధునియతి. 230
సీ. మత్తపశ్చరణంబు మద్ధర్మపాలన మస్మదభీష్టశివార్చనంబు
దగినసైకతలింగదర్శనం బనునవి యిష్టవిభూతుల నీయఁజాలుఁ
గాక; యిందువసించి, కామప్రదానమునను వీక్షణములసొంపునను జేరఁ
గామాక్షియని పిల్వఁగాఁబడునామూర్తి వందనమ్ములఁ గొల్చు భక్తులెల్ల
ఆ. వాంఛితములనెల్లఁ బడసి వరంబుగా
నెలమిఁ గాంత్రుగాక యేను శివుని
యాజ్ఞఁ దలను దాల్చి యారీతివర్తింతు
నరుణశైలమందు నధివసింతు. 231
చ. అరుణమహీధరంబునకు నభ్రగతిం జని సాధునిష్ఠశం
కరుఁ గరుణన్ ననుం గనఁగ గాఢతపం బొనరించి శంభుఁడున్
వరము లొసంగ మించుననుభక్తిరతిం గనుచుంద్రుగాక! యం
చు రమణి పల్కె వారలను జూచుచు వేచన నెంచె నంతటన్. 232
ఆ. చరణసేవకులము సతతంబు మము దయఁ
జూడవలయు ననుచు సురలు మునులు

వేఁడి సాగనంప వేగమ యరుణాద్రి
కరిగి శంకరాజ్ఞ గాఢతపము. 233

చ. ఒనరుపఁ బూనె నెచ్చెలియు లోక్కవిధంబున నామెఁ గొల్చుచుక్
మనమున కుత్సవంబుఁ దగుమాడ్కి నెసంగఁగఁ జేయుచుండి రా
వనరుహనేత్ర శోణగిరివల్లభు దుందుభిదివ్యవాద్యని
స్వనకరిసేవితుక్ గొలిచె భక్తిభరంబున నిష్టసిద్ధికై. 234

క. అంత స్తేజోమయమై, శాంతంబయి యొప్పునరుణశైలేశ్వరు ది
క్కాంతార్చితునిక్ దివిష, త్కాంతాకృతనృత్తగీతకవితామోదున్.

క. కనుఁగొని స్థావరలింగం,బును దేజోమయము గాఢమోదాన్వితయై
యనిశము సేవించెను సిద్ధనికరయోగీంద్ర మానితల్లజసమితిన్. 236

క. దరిసించి వారితోడం, బరమేశ్వరుఁ గొల్చుచుండె భక్తులలోనం
బరము లననొప్పునత్రిమునియుం, గిరసుండును గశ్యపుండు కెరలెడునిష్టన్

సీ. కుత్సగౌతములు భృగువు భరద్వాజుఁడు సిద్ధవిద్యాధరశ్రేష్ఠు లమరు
లందుఁ దపోనిష్ఠ లందియుండఁగఁగాంచె గంగాదినదులు తత్సంగతిగురు
ఫలదంబెయగుననుభావంబులం గొల్వనటఁగాంచిదివ్యలింగమిదిపూజ్య
మరుణాద్రివిభుఁడన నాహ్వాయనుందె నంచమరులు కీర్తింప నమలభక్తి

ఆ. వందనములు సల్పి బ్రహ్మవాదులు ప్రీతి
నొసఁగు నాతిథేయ మొప్పు ననుచుఁ
గొనుచు శంకరాజ్ఞ మునిపతి గౌతముఁ
గనఁగవలయు ననుచుఁ గాంక్ష తెలుప. 238

ఉ. వారును మంచి దంచు మునివర్యుని చెంతకుఁ గొంచుఁ బోవ నా
ధారిణి దేవసేనాపతి దర్పకసూదనభక్తవర్యుఁడై
చేరువనున్నదివ్యవనసీమకుఁ బుష్పసమిత్కుశార్థమై
కోరికఁబోవుచుండి తనుఁ గోరి కనం జనుదెంచువారికిక్. 239

క. ఆతిథ్య మీయ ఛాత్ర,వ్రాతము నియమించె నంత వారిం గనియా
శీతగిరీంద్రాత్మజయుక్, గౌతమమునివార్త నడుగఁగాఁ దచ్ఛిష్యుల్.

చ. "వనమున కేగి రీక్షణమ వత్తురు కైకొనుఁ డాతిథేయమం"
చనునయ మొప్ప మంజులఫలాదిక మిచ్చి భజించి రిట్టులా

సననుఖపాద్యసూనృతవచస్తతిముఖ్యములన్ ఫలాదికం
బున బహుమానపూర్వకముఁ బూజలఁ జక్కనియాతిథేయమున్. 241
క. తనకొనఁగియిప్పుడిప్పుడె,చనుదెంచుమహర్షి యంచు శాంతవచనముల్
వినిపింపఁ బార్వతియు నెమ్మనమున సంతుష్టయయ్యె మానివసతియున్.
క. పరమేశ్వరీప్రవేశం,బరుదుగ నైనంత నుటజ మయ్యాది దివిష
త్తరువరబహుళము రత్నో,త్కరయుక్త్రాపాదనికరకాంతమునగుచున్.
క. విలసిల్లె గౌతమర్షియు, ఫలముఖములఁ గొంచు విపినభాగము విడి ని
ర్మలవాయు సేవితుండయి,యలరుచు నేతెంచె స్వీయమగు నుటజంబున్.
చ. కనుగొను వేడ్క నయ్యదియుఁ గానఁబడెం గడు నూరనందె య
త్యనుపమరీతి భౌమశతహర్మ్యదమై, ముని యిద్ది యేమి నూ
తనముగఁ జూడనయ్యెడివిధం? బిది యచ్చెరువొందఁ జేయు నం
చనుకొని యప్డె జ్ఞానమయమైన తగుదృష్టిని జూచి యంతటన్. 245
సీ. సర్వలోకేశ్వరి చనుదెంచె నాశ్రమమున కని తోఁచుట వనమునుండి
లోకమాతను జూచు కేకద జని ఫలమనునూహ జవనము నరుగుదెంచి
శిష్యసమూహంబుచేత వృత్తాంతము సర్వమెఱింగి సంజాతకౌతు
కుండయియట గౌతముండు స్వీయతపఃఫలమె తదీయాగమనమని తలఁచి
తే. శివునికరుణావిశేషంబు చింతచేసి
యాశ్రమంబును జేరె; మహర్షి యాశ్రి
తులను వాత్సల్యమునఁ బ్రోచు లలితభిషణుఁ
జౌట నంబాసమాగమహర్ష మొలయ. 246

## పంచమాధ్యాయము



### బ్రహ్మ శివునిం బూజించి పాపరహితుఁ డగుట

చ. అని వచియించి బ్రహ్మ సనకాహ్వయమానసపుత్త్రుఁ గాంచి యి
ట్లనుఁ దరువాతివార్త వినవయ్య! యరణ్యమునుండి యాశ్రమం
బున కరుదెంచు శాంతు మునిముఖ్యుని గౌతము ద్వారసీమలోఁ
గనుఁగొని శంభుభక్తిని జగన్మయి శైలజ వే యెదుర్కొనన్. 247
క. త్వరవడిచనియెను మానీశ్వరు శిష్యసమూహపూజ్యచరణాంబుజునిన్

ధరఁ దాఁకుచుండుజడలను, గరమరుదుగ నుండువానిఁ గృశశరీరున్.

తే. శ్మశ్రుసంపూర్ణ మగుముఖమండలమునఁ
గానఁబడువాని జడలు రక్తచ్ఛవులను
దగుచుఁ దీర్థోదకంబులఁ దడిసి జలము
వదలుచుండంగ వచ్చెడువాని ఘనుని. 249

తే. న్యస్తరుద్రాక్షమణులచే నగ్నికీల
ములవలెం గ్రాలువాని విభూతిచర్చ
లొాగిఁ ద్రిపుండ్రములుగ నొకటిఁ గనఁబడుచుఁ
దేజమును వెదఁజల్లఁగ దేవతయన. 250

చ. తనరుచు జన్నిదంబులు సితద్యుతి మించఁగ వల్కలద్వయం
బు నరుణకాంతియుక్తిఁ దగభూరితపఃకృశితాంగ మొప్ప వే
దసికరమంత్రపాఠమున దర్పకసూదను బ్రీతుఁ జేయుచున్
ముని యరుదేరఁ గాంచె శుచిమూర్తిని గాంతినిధిన్ సుశాంతునిన్.

క. కరుణాపూర్ణుని సాక్షాత్కరించు భాస్కరునిగాఁగఁ దలఁపందగు మా
నిరమణు గౌతముఁ గని యా, ధరణీధరపుత్రి కేలుతామరసములన్.

ఆ. దోయిలించి మ్రొక్కె దోషబాహ్యస్థితు, వృద్ధు శంభుపాదబద్ధచిత్తుఁ
దలఁచుచుండ నాత్మ లలితకళానిధి, సకలజగములకును జనని గౌరి. 253

క. ఇదియేమి తల్లి! తగునే, యిదియని వారించి తాను నంబాంఘ్రియుగం
బు దలకుఁదగులన్ మ్రొక్కుచు, సదయామతి వోచు నన్ను సంరక్షింపన్.

ఆ. ఆశ్రమమున కిచటి కరుదెంచితివి నీకు, స్వాగతంబు లోకజనని నీకు
స్వాగతంబు వ్యాజమాత్మనూని యొభక్త, జనులఁగావవచ్చితని తలంతు.

క. ఔరా! నీదాకరుణా, పారావారంబు గాంచుపద్ధతి యున్నే
చారిత్రము భవదీయం, బారయఁగాఁ గోరి పూర్వ మరుదేరంగన్.

క. తలఁచితిమి శిష్యబృందం, బులుతోడనె వచ్చెఁ జిత్తములయందుఁ బృథ
గ్విలసితభావము లొప్పెను, గలుగక యేయున్న నద్ది గౌరీ! తలఁపన్.

ఆ. సర్వలోకసిద్ధి జనని! యెట్లు లభించు, నద్ది యుండుఁగాక యట్లె నీదు
మహితరీతి వెలయునూయావిలసితమి, ట్లనుచుఁ జెప్పఁగలనె యుంబనేను.

క. అది మాబోంట్లకు శక్యమె, విదితమె మీచిత్తమునకు వేఱుగఁ జెప్పం

గఁదలంచుట యజ్ఞానమె, కద యది యట్లుండుఁగాక గౌరీ! కరుణన్.

ఆ. పరమపావనమయి పరఁగు నీయాసన
మందుఁ గూరుచుండ వమ్మ! యిద్ది
కుశవినిర్మితమయి కోమలతమ మయి
యుండుఁ బాద్యమర్ఘ్య మొప్పు విధిని. 260

క. ఒసఁగితి గ్రహింపుమా! యో,బిసరుహలోచన! యటంచు వేశిష్యానీ
తసమగ్రపూజనంబుల, నసదృశభక్త్యన్వితముల నలరించె సతిన్.

చ. హిమగిరిపుత్రి యాజ్ఞయిడ వృద్ధమహర్షి యుఁ గూరుచుండి దం
తముకుళకాంతి ధౌతపరితప్తమలంకృతదిగ్వితానఁడై
యుమఁ గని నిర్భర ప్రముద మొప్పఁగ మైపులకాంకురాళి నూ
త్నముగఁ గనంబడం బలికె నైజముదుత్థసగద్గదోక్తులన్. 262

సీ. ఔర! విచిత్రమే యనవచ్చు శంకరు
మహిమ మెంతయు భక్తమండలంబుఁ
గావంగఁ బూని నిష్కామవాత్సల్యము
గలవాఁడుగాన నిక్కడకు నిన్నుఁ
బనిపెనో జగదంబ పనియెద్ది తననుం
డి ఫలియింప దద్ది యన్యులవలననె
ఫలియింపఁజేయనోఁ గలదె యట్టిది నీ క
సాధ్యమానది యెందుఁ జర్చసేయ

తే. భక్తిమాహాత్మ్య మెల్లను బయలుపఱుప
నీశ్వరుఁడు పూనె నని తోఁచు నీశుతోడ
వెండికొండను జరగిన వృత్తమెల్లఁ
దెలిసికొంటిని నీదగులలితకరుణ. 263

క. తరువాతం గంపాహ్వయ, తరంగిణీతీరమందుఁ దప మూనుట యు
ట్లరుణాచలమును జూడం,బరమేశ్వరు పనుచుటయును బరికించితిఁజూ.

క. చనుదెంచితివో తల్లీ!, తనయునియాశ్రమముఁ జూచుతలఁపున నిట కే
నొనరింపఁదగిన దియ్యదె,యనియానతి యిమ్ము నాకు నని వేఁడుటయున్,

చ. విని సకలజ్ఞుఁడౌ మునియు విశ్రుతభక్తిని జెప్పినట్టి యు
క్తినికరమంతఁ గౌతుకము కేవల మాత్మఁ జెలంగ మెచ్చుచున్
మునిపతిఁ గాంచి పల్కె గురుమూర్తిధరుం డగుశంకరుండె నీ
ఘనతమవైభవంబునను గన్గొనఁజేయఁగఁ గోరి యాదృతిన్. 266

క. మునిపతులు పెక్కు రుండఁగ
నినుమాత్రమె చూడఁ బంపె నెమ్మిని నిన్నున్
విను మింక శివోక్తాగమ
మనేకమార్గముల నుండు నామ్నాయములున్. 267

క. నీ వెఱుఁగనివే లే వీ, భూవలయంబందు నెందుఁ బూతతపమునన్
బావన శంకరభక్తిని, నావిశ్వేశునకు మానులం దొకనీవే. 268

తే. అగ్రగణ్యుఁడ వని తోఁచె నాత్మసమ్మ
తుఁడవు నీవను నమ్మికతోడ నన్నుఁ
బనిపె నరుణాచలమున నివాసముండు
నని వచించె సదాశివుఁ డనఘ! కరుణ. 269

చ. అరుణగిరీంద్రముం గుఱిచి యంతయు నే విన గోరుదాన స
చ్చరితమహాత్మ్యముల్ దెలియ స్వాంతము గోరెడుఁ ద్వన్ముఖస్ఫుటాం
బురుహామునుండి యేవినఁగఁబోలు నటం చెద నమ్మి వచ్చితిన్
హరునరుణాచలాహ్వయుని నవ్వహముల్ భజియించు పూనికన్మై.

క. మీసందర్శనముననే, యీసర్వజ్ఞుండు సదయుఁడై ననుఁ బావం
గా సమధికశ్రద్ధఁగనున్, బ్రాసన్నుండిచ్చునఖిలపాలుఁడువరమున్. 271

క. శివభక్తభాషణంబును, శివసంకీర్తనము వినుట శివలింగమ్ముం
దవిలినభక్తి భజించుట,యు వపుర్ధారణఫలంబు లో మునినాథా. 272

ఉ. కావున శోణశైలపతి కమ్రచరిత్రమహాత్మ్యముల్ భవ
త్పావనవక్త్రనిర్గళితభద్రదసూక్తినుండి శ్రోత్రముల్
వేవిధులం దమిం గనఁగ వృద్ధమునీంద్ర! వినంగఁగోరితిం
నీవ నజ్ఞాతదాత వయి నెమ్మిని గూర్చెదుతండ్రి వైతిగా. 273

క. ఉపదేశంబున నీయది, సుపరిస్ఫుటమంచుఁ దోఁచుఁ జుమ్మని పలుకన్
దపమె విభూతిగఁ దగుమానిపతియు నెమ్మదిఁ దలంచి నీలగ్రీవున్.

క. అరుణాచలవైభవమును, బరికీర్తింపంగఁబూనెఁ బార్వతి కపుడా
దరమున నిట్లనియెన్ మునివరుఁ డోజనయిత్రి! లోకవార్తల నెల్లన్.
క. తెలియనిదానవుగా నీ, పలుకులు తెల్పెడిని లోకపటలం బెల్లన్
నిలుచున్ నీయందే ని, న్నలవియె పొగడంగ బ్రహ్మకైనం దల్లీ! 276
ఆ. సర్వవిద్యలకును శైవిమాయవు నీవె
యం చెఱింగినాఁడ నైన భక్త
వక్త్రసీమనుండి భవవైభవంబును
వెలువరింపఁదలఁచి పలికి తిట్లు. 277
క. ఇది శాంభవశిక్షణమహాఁగద వారికి నీదుతుష్టి కారణము నగున్
జది వెడువారికి పీనులకుఁ దమిం గల్పింపఁ వినఁగఁ గోరుజనులకున్.
సీ. వేదముల్ చదివిన విప్రులకున్ బునఃపఠనఫలంబు తప్పక యొసంగు
శైవసంకీర్తనం బావిష్కరించిన సకలతపంబులు సత్ఫలంబు
లిడఁజాలుఁ జరితమ్ము లెల్ల ఫలించును శంకరుండే నన్నుఁ జరిత మిద్ది
వర్ణింపఁ బంచె మున్ భర్గునివలననే వినియుంటి నిద్దాని విశ్వవిభుఁడు
తే. విశ్వనాయిక లిత్తటి వేడ్కఁగనఁగ
నుత్తమం బగునరుణాచలోరుగాథ
దురితవిద్రావణంబును దొలుతఁజేయుఁ
గాన వినవమ్మ! పూర్వవిఖ్యాతగాథ. 279
క. అరుణాద్రిమయము లింగం
బు రహిం బ్రభవించె నెట్లు? పూర్వము దానిన్
జరగినయట్లుగఁ దెల్పం
దర మెట్లగు భోగిపతికి ధాతకు నైనన్. 280
చ. తెలిసినయంతనే నిపుడు తెల్పెద బ్రహ్మయు నచ్యుతుండు మున్
జలరుహమిత్రసోమశుచిశక్రముఖాఖిలదిక్పతుల్ మహా
ఫలముల నష్టసిద్ధులను భద్రపదంబును బొందఁగోరి శం
భులలితలింగముం గొలువఁబూనిరి భక్తివిశేషసంపదన్. 281
తే. సిద్ధచారణగంధర్వసిద్ధశౌర్య
లైనవిద్యాధరఫణులు యక్షగరుడు

లమరమానులు యోగులు నఘనివృత్తి
కొఱకుఁ బూజించి రెంతయుఁ గోర్కి మిగుల. 282

క. ఆరాధితుఁడై శంకరుఁ, డారూఢారుణగిరీంద్రుఁ డభిమతముల న
వ్వారల కొసఁగుం దగినటు, లేరీతిం బొంద నర్హులే యగుదు రటుల్.

చ. కనుఁగొనినంతనే యఘనికాయములన్ నశియింపఁజేయున
ర్చనము లొనర్చ వాంఛలను జక్కఫలింపఁగఁ జేయు భక్తిఁ గీ
ర్తనములశోణశైలమని తన్ను స్మరించిన ముక్తిదుం డగుn
వినుము వచింపనేర హరు వృత్తదయాపరిభాషణంబులన్. 284

సీ. అరుణాద్రి యనఁగనో యగజాత! తెలియు తే
జస్తంభమయరూపశాలి యనుచు
మనముల యోగీంద్రు లనయము ధ్యానించి
శంభుసాయుజ్యము శంక లేక
పొంది రిచ్చోట భక్తిం దగి యిచ్చిన
హోమ మొనర్చిన నొక్క యించు
కైన జపించినధ్యాన మొనర్చిన
నక్షయ్యమగు నని యాత్మ నమ్మ

తే. వలయు; మును బ్రహ్మసరసిజాక్షులు శివాంశ
సంభవులు నయ్యుఁ బొగరున సంగరంబు
జేయఁబూనిరి విజయైకసిద్ధిఁగోరి
వారిగర్వంబు తగ్గింపఁగోరి శివుఁడు. 285

క. ధ్యానైకగమ్యుఁ డొటన్, భానుశశాంకాగ్నిదీప్తి భాసురుఁ డగుచుం
గానంగరానితుద మొద, లొనట్టివి వెలయ వారియంతరమందున్. 286

క. దెసల వెలుఁగంగఁ జేయుచు, వెసనిలిచెన్ స్తంభమె యనవిలుసిలు తేజం
బసదృశమై కన్పడది, గ్వసరము తెలియంగరానివిధమున నంతన్.

క. ఆ తేజస్తంభమునం, దేతీరునఁ దుదయు మొదలు నెవ్వ డుఁడునొకో
చూత మనుకోర్కి నిర్వగు, వేతరలిరి హంసకిటితవిలసిలి పూన్కిన్.

చ. శతధృతి యూర్ధ్వ మేగెఁ దర్వఁ జక్రి రసాతలమందుఁ జొచ్చెనె
వ్వితమున నెంతదూర మతి వేగమునం జనఁ జూడఁజాల కా

ర్తితముఁ గుదింప నెంతయును దీనత నుండ దయాసముద్రుఁ డా
శ్రితగణుఁ డట్టి వారికడఁ జేరి కనంబడి వాంఛపండఁగన్. 289

క. వర మొసఁగెన్ వారల కీశ్వరుఁడున్ వారంత లింగరూపంబున స్థా
వరమని చెప్పందగునటు, లీరమ్యగిరీంద్రమందె యీశ్వర! నిలువన్.

తే. ఒప్పుకోవయ్య మాకోర్కు లొప్పునట్టు
లనుచుఁ బ్రార్థింప స్థావరంబైన లింగ
తను ధరించుచు నరుణాద్రి యనఁగ వెలసె
శాంతరూపంబునం బరశంకరుండు. 291

క. సురదుందుభివాద్యము ల, చ్చరపింశులనర్తనములు సౌరకుసుమసం
భరితములగువర్షము లా, హరలింగముఁ గొల్చుచుండు ననవరతంబున్.

తే. తొంబదార్గురు బ్రహ్మలు తొలుతనుండి
చనిన నవ్వలఁ బ్రభవించె సరసిజాక్షు
నాభికమలంబునుండియె నలువ యిప్పు
డతఁడె సృష్టి నొనర్చు లోకాళిఁ దల్లి!. 293

చ. శతమఖుఁ డొక్కకాలమున సంయమినిష్ఠకు విఘ్న మాచరిం
చుతలఁపు గల్గి వేఁడుటయు సొంపులఁగుల్కెడునాతిమిన్ననొ
క్కతుకను సృష్టిచేసె విని కామిని యయ్యది కంజనేత్రయు
న్నతగుణరూపశాలిని యనం జని యింపులఁ గూర్చుచుండఁగన్. 294

చ. అనుపమపుష్పసాయకమహాశరవిద్ధనిజాంతరంగుఁడై
వనజభవుండు ముగ్ధుఁడయి వారిజనేత్ర స్పృశింపఁబూన నా
తనియభిలాష మెన్నుచుఁ బ్రదక్షిణపూర్వకవందనంబులం
దనిపి పలాయనంబునకుఁ దాఁ బవిపూనె మనంబునం దటన్. 295

తే. వారిజాక్షి తనున్ భక్తి వలగొనుతఱి
నాల్గుదిక్కులమోములు నాతిఁ జూచు
తమిని బ్రభవిల్లె నవ్విధ మమర వనిత
యెఱిఁగి పక్షిరూపంబున నెగిరె దివిని. 296

చ. త్వరపడి పోవుచుండ ఖగవర్ష్మముఁ దాల్చి బ్రహ్మయుం జనం
గ రహిం గ్రహించి వేఱుగతిఁగానక యీయరుణాచలంబు నే

శరణము వేఁడె బ్రహ్మయును సారసనేత్రుఁడు నీశిరంబు ప
త్సరసిజయుగ్మముం దెలియఁజాలక యార్తిని గాంచలేదొకో? 297

క. అరుణాచలనాథా! నీ
శరణంబే వేఁడుదాన సంరక్షింపన్
హర! పూనుమన భయార్తను
దరుణిం గని యేమ్చుచుంటఁ దానెద నెఱిఁగెన్. 298

ఆ. అరుణధరమునుండి యావిర్భవించి లిం
గాంతరమును వదలి వింతధనువుఁ
దాల్చి శరముఁగూర్చి తతమేఘయుతగగ
నాభుఁ డగుచు నిల్చె నతనిఁ గనఁగ. 299

చ. సరసిజసూతిమోహమది చయ్యన నాశము నొందె నంతలో
హరుఁ గని నమ్రదేహుఁడయి యాత్మఁ బ్రసన్నతనొంద వందనో
త్కరములఁ దృప్తుఁజేసి విని కామహరున్ వరదున్ శరణ్యు నా
యరుణగిరీంద్రు వేఁడె సకలాఘనివృత్తికి నై ముదంబునన్. 300

సీ. వందనం బొనరింతు బృందారకారాధ్య పాదపద్మా! నీకుఁ బరమభక్తి
ధనువు పినాకమై తనరఁగా నరుణాచలాకృతిభక్తుల నరసి కావ
వారివశంబున వఱలు శంకరునకు నజ్ఞానులౌ స్వకీయాంఘ్రిభక్త
లకు మేలుగూర్పఁదల్లయు మొనర్చు భగవంతునకున్ నీకువందనములు

తే. నీవుతప్ప మఱెవ్వండు నిరతి నిట్లు,శక్యకృత్యంబులను జేయఁజాలు దేవ
పాపనిశ్చయమైన యపఘున మిద్ది, సంహరింపఁగఁ దగునీకు సర్వనాథ!

క. జగముల నిర్మింపఁగ శక్తిగలుగు వేఱొక్క బ్రహ్మఁ దీవరమే లో
కగణేశా! నిర్మింపుము, తగ దీ దేహంబు విశ్వతతిని సృజింపన్. 302

చ. అనుటయు నాలకించి పరమాత్ముయు నాతనిదైన్య మొన్ని యా
తనిపయి సత్కృపారసముఁ దాఁ బొలయింపఁగఁ జేయఁ బూని యి
ట్లనియె శశాంకశేఖరుఁడు హరివచస్తతు లొప్పునట్లుగా
మును పె భవన్నిమిత్తముగఁ బూన్చినకార్యము నిర్వహింపఁగన్. 303

ఆ. సమయ మొనఁగినాఁడఁ జనదు దానిని మార్పఁ
బ్రభువుగా నెసంగువాని నెవని

రట్టుచేయకుండు రాగాదిదోషంబు
లట్టు లోట నింక నబ్జజాత! 304

క. అరుణాచలసంజ్ఞితమై, పరమంబయి తైజసమయి భాసిలు లింగం
బురుపాపనివృత్త్యర్థము, నిరతిఁ భజియింపు మింక నిర్మలమతివై.

సీ. వాచికమానసాహ్వాయపాపములు కాయి
కం బైనయట్టి యఘంబు క్షణము
నందె వినాశమౌ నరుణాచలేశ్వర
దర్శనంబున నె ప్రదక్షిణనతు
లనువానిచే స్మరణార్చనంబులచేత
స్తవసంతతులచేత జనుల సకల
కల్మషములఁ జెండఁగల్గు నీశైలంబు
కైలాసమేరుశృంగములయందు

ఆ. మఱియుఁ గల్గినట్టి క్ష్మాధరంబులయందుఁ
గానఁబడుదు నేను గాని యిందు
నాఖ్యఁ గాంచినాఁడ నరుణాచలంబన
వివిధభాషణముల వేల! విబుధవర్య. 306

క. గిరిశృంగదర్శనంబునఁ, దరుఁగెసుదృగ్లాభ మదియె పాపౌఘము ని
ర్భరవేగంబునఁ జెండును, బరమజ్ఞానాక్షిలాభపరిణతిసుఖముల్. 307

తే. బ్రహ్మ నాయంశమునఁ బుట్టె బ్రహ్మనామ
తీర్థమున నిందు మున్నుము దీనియందు
మున్ను మున్గినజనపతి కున్నమోహ
మాక్షణంబున నశియించె నట్టు లోట. 308

చ. మునుఁగుము బ్రహ్మతీర్థమున ముందు ననుఁ దృఢభక్తి నవ్వలన్
వనరుహసంభవా! విధిని బాయక పూజలఁ దన్ను మానివై
యొనరుపుమా ప్రదక్షిణము లోపికగల్గినయంతవట్టు నీ
మనమగు విజ్వరంబు మఱుమాటయె పల్కక యిట్లొనర్పుమా. 309

సీ. అని వాక్కు వెడలించి యావిశ్వనాయకుఁ
డూరకుండఁగ నీశు నుగ్రతేజు

నరుణాచలాకృతి నమరినవానిని
భజియింపఁగా నెంచి బ్రహ్మతీర్థ
మున స్నాన మొనరించి ఘనపాపవమును బాసి
పూజించి భక్తి నా పురహరుహరు
యమనియమాదు లైనట్టియోగంబుల
నాచరించి మనస్సు నచలతఁ గన
తే. నరుణలింగంబు భజియించి యతినియమము
నాశ్రయించుచు నాత్మదోషాభినిహతిఁ
బావనుం డయి స్వీయాధిపత్య మొంది
సత్యలోకంబునందు నాశతధృతి తమి. 310

## షష్ఠాధ్యాయము

### అరుణాచలస్థతీర్థమహత్త్వము

మ. మును నారాయణుఁ డంబురాశిశయనంబుం బూన్కి సాగింప శే
షునిపైఁ జక్కఁబరుండి మేల్కొనఁగఁ దేజం జూపి పూర్వంబు రీ
తినిలోకావనముం బొనర్పఁగను దృష్టిన్ మించ భక్తావళిం
గని తద్వాంఛ లొసంగ నెంచక యటన్ గాఢప్రమోదంబునన్. 311
తే. తన్నుఁ దాఁజూచుచుండెను; దమసు విశ్వ
మెల్లెడల నావరించి జ్ఞానేచ్ఛ లేని
యట్టుగాఁ జేయుచుండె; నయ్యాదనునందె
నిత్యసూరులు యోజించి నియతిమించి. 312
సీ. కల్పాంతమయ్యె మేల్కనఁగఁ బూనఁడు జగ
న్నాథుండు కష్ట మీనళినవేత్రు
వలనఁ బొసంగెడుధ్వాంతము విశ్వమో
హనము వ్యాపించెను నన్నిచోట్ల
నింతకు మేల్కనఁ డీవిష్ణు వేలొకో
తేజస్స్వరూపంబు దేవతలకుఁ

గానరాకున్న దీగాఢతమోవ్యాప్తి
పరిభవించెడులోకపటలములను
తే. దీనిశాంతింపఁజేయ నెద్ది యగు నుపమ
యనుచుఁ జింతించి దేవదేవుని మహాత్ము
శంకరుని సాధుపూజల సాంద్రభక్తిఁ
గొలిచి రాత్మస్థుఁ దేజఃప్రబలుని హరుని. 313

ఉ. అంతఁ బ్రసన్నుఁడై దివిషదావళి ముప్పదిమూఁడుకోట్లులన్
సంతస మొప్పఁజేయఁ దనస్వాంతమునందుఁ దలంచి తేజమున్
వింతగఁ గానరాఁగ నిలిపె న్గమలాక్షిపుఁ డాత్మశక్తి న
త్యంతము దేవతావళులు తన్నొగి మేల్కొలుపంగఁ బూనఁగన్.

తే. ఎల్లయెడలఁ బ్రభాతంబు వెల్లివిరియఁ
గాంచి మది నెంచె నిల్లు చీఁకటులు గ్రమ్మఁ
గా నకాలంబునన్ శయ్యపైని మేనుఁ
జేర్చినాఁడ నుద్రేకంబుచేత నేను. 315

క. నను బోధింపఁగ శంకరుఁ
డనూనతేజస్సముద్రుఁ డావిర్భావం
బును గాంచి దర్శనం బి
చ్చెను లోకోత్పత్తి ముఖ్యసిద్ధులు గలుగన్. 316

ఉ. తానె కడంగె నేనును విధాతయుఁ జేయఁగ నెద్దియున్న ది
స్సీ! నను నాత్మనే తెలియఁజెందిన ప్రీతియె లేనివాని నెం
తే నిదురింపఁ దెల్పి హరియింపఁగ దానికి లొంగువాని నిం
కేనెటు లొప్పఁజేయఁదగు నెప్పని దైవము సంతసింపఁగన్. 317

ఆ. సర్వకర్తయైన శంకరు శరణంబు, వేఁడువాఁడ దోషవితతిజాన
నడఁగు నిష్టసిద్ధు లలవడు; దుర్లభ, మల్పపుణ్యులకు మహాత్ముఁగనుట.

చ. అని తగునట్టు లెంచి హృదయంబునఁ గల్గినలింగమూర్తి స
త్యనుపము జ్యోతిరంగుని నిరంజను నెంచుచు భక్తిచేత వం
దనము లొనర్చి నాగమవిధానము తప్పనిచొప్పునన్ మహే
శుని వినుతించెఁ బాపగణశోధనదక్షములౌ స్తవంబులన్. 319

తే. అంతఁ దేజోమయుం డగుహరుఁడు శరణ
ముండు శంకరుఁ డాయచ్యుతునికటాక్ష
ములనె గ్రహియించి యెమ్మటం జలరి పల్కె
నంతఁ గరుణాసముద్రు నాయభవుఁ గాంచి. 320

సీ. త్రిభువనేశ్వరునకుఁ ద్రిగుణధారునకును
ద్రినయనునకును ద్రిదేవమూర్తి
కిని ద్రిపురారికి ఘనునకు మ్రొక్కెద;
జగదీశుఁడవు నీవె స్వవిమలాంశ
ములె దేవతామయంబులు వానిచేఁ గార్య
కారణరూపము గాఁగ స్వేచ్ఛఁ
గ్రియల నెల్ల నొనర్తు కించిజ్జ్ఞు నను లోక
సంరక్షణము చేయఁ జను నటంచు

ఆ. నాజ్ఞచేసి మాయ నలముకొనం జేసి, దేషవితతిగాని దుష్టమైన
తలఁపుగాని నీవు తొలఁగఁజేయ వదేల, విశ్వనాథ! లోకవితతిరూప!

క. నే నేమిచేయవలయునొ?, యే నెల్లభరంబు నీపయిన్ నిల్పితిఁగా
నే నీయకాలనిద్రను, బూనుట యొకతప్పుగాఁగఁబోలదు తలఁపన్.

క. హరశంభూ! హరిమూర్తిని, హరింపుమా యంచు వేఁడ నను తాపమ్మా
హరికింగల్గుట యెఱిఁగియొ, హరుఁ డీగతిఁ బాచితంబు హరికెఱిఁగించెన్.

చ. అవనితలంబునందు నరుణాచలరూపమునన్ వసింతుభూ
ధ్రవరము దానిఁ జూచిననె తామరసాక్ష! తమస్సు నాశమా
శివదముగా వరంబు మును శ్రీపతి కిచ్చితి త్రైజసంబుగా
నవు నరుణాచలాఖ్యఁ దగునట్టిమనోహరలింగ మచ్చటన్. 324

క. నిలిపితిని జగద్రక్షణ, మలఘుతరాత్మీయశక్తి నది యొనరుచుఁ జూ
జ్వలనాకృతిఁ బొల్చుచు నిస్తులగుణవైభవముమీఱఁజూడఁబడుహరీ.

చ. నదులకు నిర్ఝరాళికి ఘనప్రవిముక్తమనోజ్ఞవారికిన్
హృదయగతోరుతేజమున నెన్నఁగరానిమహత్త్వభోగసం
పదల వెలుంగులింగమునఁ బర్వెడునైక్యము దృష్టిలాభముం
గదియును గ్రుడ్డివారలకుఁ గల్గును సంచరణంబు కుంటికిన్. 326

చ. తనయులు లేనివారికి సుతప్రదమై బొనఁగూడు వాక్ప్రవృ
త్తిని గనఁజాలుమూకతతి దీర్ఘవ్యాధులు మాయవాను సి
ద్ధినికరముల్ ఫలించు మతితీవ్రమహాఘము లప్డె పాయు నా
ఘనశివలింగదర్శనము గల్గినయంతనె మానవాళికిన్. 327

ఆ. అని వచించి శంభుఁ డంతర్హితుండయ్యె
హరియు నప్పు డేగె నరుణశైల
మునకు లింగవరముఁ బూజించు వేడుక
నద్రి నెల్లఁ గాంచి యందు వనులు. 328

క. సతతంబు శరణ్యములుగ, స్థితిఁగాంచిన దేవతలను సిద్ధులమౌని
క్షితిపతులఁ బుణ్యపూరుష,తతిఁగాంచెను జక్రిసమ్మదము దళుకొత్తన్.

సీ. అంగమ్ములంగూడునామ్నాయముల నుప
నిషదోఘమును మూర్తిని ధరియించి
నిలుచునట్లుగఁజేసె నెలమి నచ్చరలను
శతకులంబుల వారిస్థానమందు
నందుండ నిర్మించె నమలగీతంబుల
నర్తనవాదిత్రనాదములను
సేవింపఁ దగుసదాశివు నంచు నానతి
యిచ్చె వారికి నెల్ల నెలమి మిగుల

ఆ. బ్రహ్మసరసునందుఁ బరమభక్తిని మున్గి, పూజ లొప్పఁ జేసి భూధ్రపతికి
సుప్రదక్షిణంబు సొంపుగఁ గావించి, పాపపంక మెడలఁ బావనుఁడయి.

క. అమరినలోకాధిపతి,త్వము నొందెను శంభుకరుణ భార్గవితోడన్
గమలాత్ముఁడన్వహములిం,గముఁబూజలఁదన్పుచుండెఁగడుభక్తిరతిన్.

క. అసురాభిపీడితుండయి, బిసరుహమిత్రుండు కాంతివితతికి నిధియ
య్యు సరసిజసూతిపంపున,రస నరుణాద్రిశుభ క్తిరతిఁ బూజించెన్.332

చ. వనరుహసూతినిర్మితము బ్రహ్మసరస్సున నొప్పుదానినిన్
గని విమలోదకంబుల నికామముదం బలరార మజ్జనం
బొనరచి యాలయంబునకు నుద్యమ మొప్పఁ బ్రదక్షిణం బొన
ర్చి నియత తేజముల్ పొదలఁజెందెనుఁ దా గ్రహనాయకత్వమున్.

క. అమరాారులగెల్చెను యుద్ధమునఁ మేరుక్షితీంద్రతల్లజమును ని
త్యము వలగొను కార్యంబున, నమలిన తేజంబు రిపుల నడఁపం బొందెన్

చ. కువలయబాంధవుండు తనకుంగలదక్షునిశాప మొప్పు చి
త్తవసతిఁ గాంచి యేఁచుటయు దర్పకసూదనవాక్య మెన్ని యే
యవనిఁగలట్టిశోణగిరి నర్చనరాజిని దృప్తిఁ జేసి పూ
ర్వవిధమునఁ సురూపమున రంజిలఁజేయఁగఁ గల్గె నెల్లరన్. 335

చ. హుతవహుఁ డొక్కవిప్రముని యుగ్రరుషం గొని శాప మీాయ సం
గత మగుయక్ష్మరోగము వికారత నొందఁగఁజేసి యేఁచఁగా
క్షితి నరుణాచలేశ్వరుని సేవలఁ దన్పిఁ పవిత్రుఁ డయ్యె న
చ్యుత మగుయక్ష్మరోగ మది చూడ నలంకృతిగాఁ గనంబడన్. 336

చ. సురపతి వృత్రపాకబలశూర్యులనుద్ధతుజృంభదాన వే
శ్వరు నముచిఁ వధించెను శివప్రతిలబ్ధవరంబునఁ దిగీ
శ్వరత నెసంగెఁ బాపసమవాయము వాయఁగ నంత మూన కా
మారుని దపంబునం దనిపి యాతనిసత్కృపఁ గాంచి మించుచున్. 337

ఉ. భూరితరాఘమంతమును బొందఁగఁ బావనుఁ డయ్యె నంత దు
ర్వారపరాక్రమం బలర వాజి ముఖం బొనరించి శంకరున్
గారవ మొప్పఁ దన్నుఁ గనఁగా నొనరింపఁగఁజాలె నప్సరో
నారులు నూఱువంశము లనందగువారలు తన్నుఁ గొల్వఁగన్. 338

సీ. ఇంద్రపదంబున నెసఁగు వేడుకనుండి శతకులాప్సరసల శంభుఁ గొల్వ
నియమించె దుందుభినిస్వనంబుల సుర లరుణాచలేశ్వరు ననుదినంబు
సేవింపఁ దగునంచుఁ జేసె కట్టడి మఱి పుష్పమేఘంబులు పూలవాన
గురియించికొల్వఁదగుఁ శంభు నవ్యయునని యాజ్ఞచేసె; శేషాఖ్యనాగ
తే. పతియు శోణగిరీంద్రుని భక్తిఁ గొలిచి
పరమశివునాజ్ఞఁ గామరూపత్వ మొందె
భూమి ధరియించు సామర్థ్యమును వెలయఁగ
నహిపతిత్వము గాంచె నవ్యయబలంబు. 339

క. ఇతరాహులు గంధర్వప్రతతియు సిద్ధాఖ్యు లప్సరఃకాంతలు ది
క్పతులు నరుణాద్రిసేవఁ, చ్యుతిలేనియభీష్టరాజి నొప్పిరి తల్లీ! 340

చ. అమరులు క్రూరరాక్షసుల నాహవమందు జయింపఁగోరి యి
ష్టములఁ నొసంగుదైవ మని శంకరు శోణగిరీంద్రుఁ గొల్చి కా
మములనుబొంది రోగిరిజ! మాన్యుఁడు త్వష్ట సురారిశిల్పి యను
ర్యము భ్రమినాఁజెలంగు నొకయంత్రమునన్ బిగియించి నేర్పునన్.

ఆ. త్రచ్చె దాన నతనితనుకాంతి హెచ్చమ్యె
దాన మఱియు వెలిఁగెఁ దపనుఁ డంత
గర్వమూని దాఁటఁగాఁ బూనె నరుణాద్రి
నపుడు వాహనమ్ము లార్తిఁ గనుచు. 342

క. గతశక్తిని శ్రమముంగనె, ద్యుతిరాశియు శ్రీవిహీనుఁడొగిఖిన్నుఁడునై
క్షితిధరవరతేజస్సం,హృతతేజుండు నగుచు దివికి నేఁగఁగలేమిన్. 343

ఉ. అత్తఱిఁ బద్మసూతిహృదయంబున నెంచి విపద్దశన్ శివా
యత్తముగాఁ దలంచి కరుణాన్వితుఁడై యుపదేశ మీయ నా
యుత్తమశైలముం గొలిచి యుగ్రుని సత్కృప నొందఁజాలి రే
కెత్తినశక్తి వ్యోమమున కేగఁగఁజాలె రథంబుతో సతీ! 344

క. అదిమొద లాయరుణాచల,పదముం గనినంత భీతిపాయమి దాఁటం
గఁ దలంప నెంచఁ డాత్మన్, సదమలభక్తిం దలంచు శైలవరంబున్. 345

చ. వలగొనిపోవుచుండుఁ దనవైభవమెల్ల నడంగ వాహనం
బులు భయమొందియే కనఁగఁబూనును శైలము; దక్షయాగమం
దలఘుపరాక్రమంబు చెడ నంగము లెంతయు నార్తిఁ గుంద దో
ర్బలము లయింప దేవతలు పర్వినదీనతఁ గందికుందుచున్. 346

క. అరుణాచలపతిసేవా,పరతంత్రతఁ గాంచి స్వాంగపటలము ము న్నే
కరణి చెలువొందు నట్టులె, శరీరములఁ భాసిలంగ శర ణనిరి శివున్.

సీ. అర్కుఁడు దశనంబు నగ్నిహస్తంబును భృగుఁడునేత్రంబును వాణినాస
నరుణాచలేశ్వరు నారాధనంబునఁ బడసిరి దక్షునధ్వరమునందు
వీరభద్రాహతి విఱిగినవానిని భార్గవుండును మును వామనకర
కలితకుశాగ్రసంఘట్టన క్షీణనేత్రంబును బలి దత్తధరణి దాన

తే. సలిలధారానిరోధంబు సలిపినపుడు
స్వీయదోషైకఫలముగఁ జేకుఱంగ

మరల నరుణాచలేంద్రునికరుణ నొందె
దుష్కరతపఃఫలంబుగఁ దోయజాక్షి.! 348

క. సరసిజమిత్రుని సారథి, యరుణాచలనాథుసేవ నలరించెను భా
స్కరగిరి వసించి దానం, బరిపూతమనస్కుఁడయ్యెఁ బర్వతతనయా!

క. మును పల్లవప్రతర్దనుఁడను, జనపతి యరుణాచలేంద్రుఁ జక్కనిగానం
బున వినుతించెడు సురకన్యనుగని మోహించి వానరాననుఁడయ్యెన్.

క. పురికొల్పిరి మంత్రులు భూవరు నాతఁడు మరల దానివరకన్యలనుం
దరులను గొందఱు ముదమున, నరుణాచలశంకరునకు నర్పించి తగన్.

చ. హరుకరుణావిశేషమున హారిముఖుండయి శంభులోకసుం
దరపదమొందె; జ్ఞానరహితస్ఫుటచిత్తుఁడు పుష్పకాఖ్యుఁ డో
క్కరుఁడు మహేశభక్తిఁ గనఁగా నిసుమంతయుఁ గోరకే నిరం
తరము చరింప వ్యాఘ్రవదనంబు లభించెఁ దనంత నంతటన్. 352

ఆ. అంత నతనిసేవకావళి గంధర్వ
పతిని గాంచి మోమువితముఁ జూచి
యేమి యిట్టులయ్యె నేలయం చనోన్య
మెన్ని యడిగి రాతఁ డెఱుఁగ ననియె. 353

ఉ. నారదహాని యానృపతినాథుని యజ్ఞతఁ దెల్ప వేగ పూ
జ్యారుణశైలముం గొలిచి యానన మెప్పటియట్ల యొప్పఁగా
నోరమణీమణీ! చనియె నొప్పదు స్వేచ్ఛఁ జరింప నింక నం
చారసి భక్తిగల్గి త్రిపురారిని గొల్వఁగఁ గోరుపూనికన్. 354

చ. ఇది శివభూమి యంచును గిరీంద్రముచుట్టును యోజనద్వయం
బు దగినమేర యంచు నెటుఁపోలఁగఁ గాంచినఁ బావనంబె యం
చుఁ దరుణి లోకకీర్తిఁ గని శోభిలు నిందు మృతిం గనంగనే
పొదలును ముక్తి యంచెఱుఁగఁబోలు నిదక్షయతం జెలంగెడున్. 355

మ. మును సప్తర్షులు శాపదోషముననే భూలోకముం జేరి శో
ణనగేంద్రంబును బావనం బనుచు నెన్నంజాలి తద్భూమిపు శం
భుని సేవించిరి నిశ్చయాత్ములయి శంభుం డంత మోక్షంబు గాం
చనుజేసెన్ గరుణావిశేషమున నాసప్తర్షులన్ శైలజా! 356

ఆ. మౌనిసప్తకంబు మహితమై పాపౌఘ
హారణదక్షము నయి యమరునట్లు
తీర్థ మొక్కఁడానిఁ దివిరి పర్వతసన్ని
ధానమం దమర్చి రూనుశ్రద్ధ. 357

చ. కనఁబడు నెల్లకాల మది కమ్రతమాంబువులం జెలంగుచున్
ముని యొకఁ డుండెఁ బంగువయి పూనికఁ బాదము లర్థిఁ గోరివ
చ్చె నరుణశైలముం గనఁగఁ జిత్తమునందె తలంపు నిల్వ నిం
ధనమయహస్తయుగ్మమును దావహించుచు భక్తియుక్తుఁడై. 358

తే. జానుచంక్రమణవ్యగ్రమానసుఁడయి
యరుణ నది చెంత నాదారుహస్తయుగము
దప్పి పాపుకొనం గోరి తజ్జలముల
నునిచి జానుచంక్రమణమున నుదకముల. 359

తే. త్రాగుచుండంగ దారుహస్తద్వయుండు
వచ్చె నేగతి నీశైలవరముచెంత
కనుచు నడుగుచుఁ బాపంబు నతిభయమునఁ
బాఱె నంతన చేకుఱెఁ బదయుగంబు. 360

చ. చరణయుగంబు దోఁచుటయుఁ జయ్యన నింటికిఁబోయె నందు నే
పురుషుని గానఁడయ్యెఁ దనముందుగ దారుకరద్వయంబు దా
ల్చి రయముమీఱఁబోవు నొకచిత్రతమాంగుని గాంచి మ్రొక్కె న
య్యరుణమహీధరంబతఁడె యంచు మనంబునఁ దోఁచుటందమిన్. 361

చ. పదములు రూపముల్ మిగుల భాసురరీతిఁ జెలంగ విస్మయం
బెదఁ గనుపట్ట లోచనము లెంతయు సంతస మొప్పఁ దెల్పఁ న
య్యెదనున శంభుభక్తులు మహాత్ములు తన్ను భజింప నింటికిన్
గదిరినప్రీతిఁ బోయె గిరికాంతుమహత్త్వము లోఁదలంచుచున్. 362

చ. శతమఖసూనుఁ డుద్ధతుఁడు సత్త్వయుతాంగుఁడు నైనవాలి ము
న్నతులితవేగమొప్ప నుదయాచలవర్యమునుండి యస్తప
ర్వతశిఖరంబుఁ జేర మది వాంఛ యొసంగఁగఁ బోవుచుండి దే
వతలు నమస్కరింపఁ జెలువంబును గుల్కెడుశోణభూధ్రముల్. 363

చ. కనుఁగొని యూర్ధ్వభాగమునఁ గమ్రగతుల్ తగఁబోవఁ బూని క్షీ
ణనిజమహోగ్రవీర్యుఁడయి నాకపథంబుననుండి భూతలం
బునఁ బడె; నంతఁ దండ్రి సురముఖ్యుఁడునౌ మఘవుండు ప్రోత్సహిం
ప నియతిశోణభూధ్రగతభాసురతైజసలింగవర్యమున్. 364

తే. నిరతిఁ బూజించి సంలబ్ధనిజబలుఁడయి
మరల వినువీథి కెగసి భూధరముఁ జేరఁ
జనియె; నలభూమిపతి లింగమును విధి తగఁ
బూజనంబులఁ గొల్చి సద్బుద్ధిఁగలిగి
ధర్మమును నీతి తోడ్పడ ధరణి మనిచె. 365

చ. ఇలుఁ డనుభూమిపాలకుఁ డహీనబలాఢ్యుఁడు పార్వతీవనం
బలవి యెఱుంగలేక తనయంతన చొచ్చి మనోజ్ఞరూపమున్
గలవనితామతల్లియయి క్రన్నన స్వీయపురోధసఃస్మృతుల్
తెలిసినయవ్వసిష్ఠముని ధీరునిఁ బ్రశ్న మొనర్చె భక్తితోన్. 366

చ. మునిపతి కారణం బరసి భూపతికిం దెలుపంగ గాఢభ
క్తి నరుణభూధ్రనాయకుని గీర్తనముం బొనరించి పూజలం
దనిపి తపంబుచేతఁ బ్రమదంబును గాంచఁగఁ జేసి పుంస్త్వముం
గనియె యథాప్రకారముగ గౌరి! మహీధరకన్యకామణీ! 367

తే. చంద్రుఁ డుపదేశము నొనర్ప శైలరాజ
మరుణనామమ్ము గాంచినయఖిలఫలద
మంచు స్మరియించి శంకరు నమలకరుణ
శాపమోక్షంబు గనియె నీశానపత్ని. 368

ఉ. అంతియగాక శంభుకృప నందుట నిర్జరసంఘమేని దు
ర్దాంతమహాశ్రమంబులను దా నొగిఁ బొందియు నందలేనివి
శ్రాంతిపదంబు మోక్ష మనుసంజ్ఞ నెసంగెడుదాని నొందె భూ
కాంతుఁ డిలుండు తద్గిరి యఖండమహత్త్వము నెన్న శక్యమే? 369

చ. భరతుఁడు జింకపిల్లపయిఁ బర్వినప్రేమమునన్ దలంచె న
మ్మరణము నప్డు ముక్తి యనుమాన్యపదంబును బొందలేక యా

హారిణకులంబునందె జని నందె; రమాపతి దారఁబాసి య
వ్విరహభవార్తి నెంతయును విహ్వలచిత్తత నుండెఁ బార్వతీ! 370

చ. మరల భృగూపదేశమున మర్త్యజగంబున శోణనామ భూ
ధరమును దీని నర్చనలఁ దన్పి సురారులఁ గూల్చుపూనికన్
ధర నవతారసంతతులు దారవియోగము లేక సౌఖ్యమున్
హరి గనియెన్; సరస్వతియు నంబుజవాసిని యైనలక్ష్మియున్. 371

తే. భూమిసావిత్రులును నదుల్ భూమిధరము
నరుణనామకమును బూజ నలరఁజేసి
యాపదలఁ బాసి సౌఖ్యంబు నంది రర్కుఁ
డద్రికిం బూర్వభాగంబునందు నుండి. 372

సీ. మఱియు విశ్వామిత్రమౌని దక్షిణమున వరుణుండు పశ్చిమభాగమందు
నత్రి త్రిశూలాహ్వయమ్ముత్తరంబున యోజనద్వయసీమ నొప్పు నిలిచి
యీనాల్గుదేవత లీపర్వతంబును సేవించుచుందురు సిద్ధులొండ
సకలమౌనులు దేవనికరంబు లీ దీనిపై నిష్ఠమై సేవింప నిలిచి భక్తి

తే. వందనమ్ముల నలరించువారు శిఖరి,రూపమున వెల్గు త్రిపురవిరోధిశివుని
దీనియందుత్తరాశ నుదీప్తమైన, శిఖరమం దొకవటమనుక్షితిరుహంబు.

చ. కనఁబడుసిద్ధవేషమునఁ గ్రాలెడు నాతరుమూలమందుఁ జ
క్కనిరుచులం జెలంగి వరకాండ మొసంగెడులింగ మొండు శం
భుని మదికొప్పురూప మదె పో యని సిద్ధులు మెచ్చి పూజలం
దనుపఁగ నమ్మహీరుహము తద్దయు ఛాయను బొల్చు నెప్పుడున్.

తే. మండలాకృతిగా ఛాయ నిండియుండు
విస్మయోపేతులై నరుల్ విబుధవరులు
జూచుచుందురు దానికిఁ జుట్టు నష్ట
దిక్పతులు లింగముల నిల్పి తృప్తి గనిరి. 375

క. ఎవ రెవ రేయేచోటుల, శివలింగము నిల్పి పూజచేయుదురో లిం
గవరము లయ్యవి చుట్టున్, నివసించి భజింప నొప్పు నీలగళుండున్.

చ. పరశివు భక్తులై తగునృపప్రకరంబునకుం దదాజ్ఞలన్
శిరమునఁ దాల్చి వర్తిలెడుసిద్ధతపస్వులకున్ ముదంబు నీ

యరుణగిరీంద్రమే యొసఁగునట్లు పరాత్పరుఁ డానతిచ్చెఁ భూ
ధరతనయా! మనోరథవితానము జక్క ఫలింపఁ జేయుచున్. 377

క. మనమునకుఁ మోదంబును, ననవరతము గల్గఁ జేయునట్టి వకుళపా
వనతరువు చూడఁబడుదా,నిని గొల్చుచు నుంద్రు మానినిర్జరవరులున్.

ఆ. ఆగమార్థవేత్త యగువామదేవుండు
దానిఁ గొల్చుచుండు మాన కెపుడు
మఱి యగస్త్యనామమహానివసిష్ఠుండు
నరుణభూధరంబునందు నిలిచి. 379

క. శివలింగము స్థాపించి రు,చివృద్ధి వాంఛించి తపముచేసి ప్రమోదం
బవితథముగఁ గల్పించుచు, నివసింతురు సుమ్ము దేవి నీలగళాజ్ఞన్.

ఆ. మును హిరణ్యగర్భతనయుండు శోణన
దాహ్వయుండు శైలమందు నిందుఁ
దీవ్రతపము సలిపి దివ్యగంగానది
కభిముఖుండె యగుచు నరిగె దేవి. 381

క. అమలోదకమై శోణనదము ప్రవహించె నగరీంద్రతనయా! యీ శై
లముఁ జుట్టి వేణయనునది, కమలసుగంధానిలములఁ గ్రాతఁ గూర్చున్.

చ. నిరతిశయప్రమోదమున నిత్యము సేవలఁ దన్పుచుండు భూ
ధరమును దీని; వాయుదిశదాపున వాయుసమాఖ్యతీర్థ మో
ధరవరపుత్రి! యొప్పునటఁ దానముచేసి సమీరణుండు శం
కరుకృప నెల్లజీవులకుఁ గాంచెను బ్రాణత నొందునట్లు తాన్. 383

సీ. అరుణాచలేశ్వరోత్తరభాగమందు సువర్ణపద్మంబులభాసిలుచును
దివ్యసౌగంధికభవ్యమై మఱిహంసషట్పదాకీర్ణమై సంతతజల
పూర్ణమై తీర్థంబు పొలుచుఁ గాబేరాఖ్యనై శాన్యతీర్థమ ట్లమరు శంభు
దిక్కున నయ్యేడ దేవదేవుం డగుహరి తపం బొనరించె వరుణదిశను

తే. దీర్థమున దానియందు సంతృప్తి మున్ని
తత్ఫలంబుగఁ జారుపద్మ మటు లలిత
గాత్రముం బొందె; మును నవగ్రహము లందె
స్నాన మొనరించి గ్రహపద మూని రెలమి. 384

క. ఆతీర్థోదకముల సం, ప్రీతిఁ స్నానంబుచేసి పృథుభక్తిగ్రహ
వ్రాతమును గొల్వఁ దత్కృప, చేతం బ్రాపించు భోగసిద్ధులు గౌరీ! 385
సీ. దుర్గయు నేకదంతుఁడు కుమారక్షేత్రపాలసరస్వతుల్ పరమతీర్థ [ను
ములఁ గాచుచుందు;రవ్వలవిను పార్వతీ గంగాయమునలును గౌతమియు
నర్మదయును సింధునదము సరస్వతీ కావేరులును శోణకాఖ్యనదము
శోర్ణనదియు మఱి శోభిల్లునదు లెల్లఁ బ్రాగాదిదిక్కులఁ బాదుకొనుచు
తే. సకలపాపంబులం జెండఁజాలియుండు
మఱియు భూలోకనదులు విమలజలముల
నలరుచుండును శోణేశ్వరానుకంప
నర్థులకుఁ గోర్కు లిచ్చుచు నన్వహంబు. 386
క. మునిపతి యగస్త్యవేరం, గనఁబడునాగస్త్య మనఁగఁ గాలుదెస నటం
దనరుఁ విమలోదకములు, మునిఁగినచోనందునతనిఁ బొందును భాపల్.
క. ఆమౌనిపతియుఁ బూర్వము, త్సోమర్త్యముని ప్రకాండకలితుం డై శై
లామరనాథుని గొల్చును, నీమమ్మున భాద్రమందు నిరతిఁ శ్రద్ధన్.
క. ఉత్తరదిశ జీవనసం, పత్తిని వాసిష్ఠ మనఁగఁ బ్రఖ్యాతంబై
యుత్తమఫలములనిచ్చుచుఁ, గ్రొత్తదియనఁదోఁచుచుండుఁగోర్కులగనియై.
తే. సర్వవేదార్థసంసిద్ధి స్నానమాత్ర
గలుగఁజేయును బార్వతీ! కనకగిరిని
దపము చేయువసిష్ఠుండు తరలివచ్చి
యాశ్వయుజమాసమున నఘహరునిఁ గొలుచు. 390
సీ. ఈశాన్యభాగమం దెల్లతీర్థములందుమహితరీతిని బొల్చి విహితములగు
వాంఛల నొసఁగుచు భాసిల్లు గంగాఖ్యతీర్థరాజం బొండు తేజరిల్లు
నందు స్నానము సల్ప నఘరాసు లడఁగును గార్తికికం బనఁగాఁ దగునెల
గంగాదినదు లెల్లఁ గలిసి యయ్యరుణాద్రి శంకరుభజియించు శ్రద్ధనూని
తే. బ్రాహ్మ్య మనుతీర్థరాజంబు పరమశివుని
సన్నిధిం బొల్చు నందును స్నాన మాచ
రింపఁగా బ్రహ్మహత్యాదురిత మింకఁ
గల్గునవి లయమొందును గడురయమున. 391

క. సరసిజభవుండు భక్తిని, హరుఁ గొల్వఁగ మార్గశీర్ష మనుమాసమునం
దరుదెంచి స్నానమొనరిచి, యరుణాచలనాథుఁ గొల్చి ననుదినము సతీ!

సీ. పౌషమాసంబునఁ బాకశాసనుఁ డెల్ల యమరులతోడనే యరుగుదెంచి
శంకరుఁ బూజించి చనుచుండు; శైవమన్ తీర్థము గిరిసన్నిధిం జెలంగు
బ్రహ్మకపాలంబుఁ బట్టుకొనియెరుద్రుఁడందు స్నానముచేసె; నతనిగణము
మాఘమాసంబున మజ్జనకృత్యంబు సలుపును శంకరుసారకరుణ

ఆ. నపుడుకల్గున నెడునాశయంబునఁ; బాచి, తములునం దొనర్చఁదగినఫలము
ల నిడువేగ; తీర్థమ నలునిదిక్కునఁ, గానఁబడును భాగ్యగరిమ లేమ!

క. అది యాగ్నేయంబనఁగా, విదితంబగుభూస్థలమున వెలఁదియుఁ జెంతం
బొదలంగ నగ్నియొనరిచె, మదిఁ గలవాంఛలు ఫలింప మజ్జన మచటన్.

చ. స్మరుఁ డట ఫాల్గునంబునను స్నాన మొనర్చి మహేశుశంభు న
య్యరుణగిరీంద్రుఁబూజలను హర్షముగాంచఁగఁ జేసి త
త్కరుణసుఖాంబురాశి మునుఁగం గలిగెన్; యమశక్రదిగ్గతాం
తరమున వైష్ణవం బనఁగ నైజవిభూతిని దీర్థ మొప్పెడున్. 395

ఆ. బ్రహ్మ మానులందుఁ బరమసంతుష్టులై
వాస మూనియుండువారు చైత్ర
మందు విష్ణుమూర్తి యరుదెంచి రమతోడ
స్నాన మాచరించి శంభుఁ గొలిచి. 396

క. లోకేశత్వము నొందెను, శ్రీకలితము సౌరమనఁ బ్రసిద్ధము తీర్థం
బోకాంతారత్నమ! కల, దే కరణిన్ సాటిలేక యెల్లవిధములన్.

ఆ. అద్ది యుత్తరమున నగపడుఁ గిరి కని
యెఱుఁగవలయు రోగులెల్ల నందు
మునిఁగి రోగశాంతితనుకాంతియుం దగ
నలరుచుందు రెపుడు హర్షయుతిని. 398

క. దిననాథుఁడు వైశాఖంబున నిందున్ మున్గి శంభుఁ బూజించి ముదం
బున వాలఖిల్యమునిగణ,మును వేదములెల్లఁ గొల్వఁ బొదలును గౌరీ!

ఆ. ఆశ్వినం బనంగ నతిపావనం బగు, తీర్థ మొండు మిగులఁ దేజరిల్లు
బ్రహ్మ శంభుతీర్థవరముల కుత్తర,భాగమందు సతము భద్రదమయి.

వ. దేవవైద్యులగు దస్రనామకు లిరువు రాతీర్థంబున మునింగి పావనులైరి. శంకరు నారాధించి విఖ్యాతిం గాంచిరి. గిరిదక్షిణభాగంబునం గామదంబు మోక్షదంబు నగు పాండవతీర్థంబు గలదు. పూర్వము పాండవులు తీర్థస్నానంబున క్షితినాయకులైరి. భూదేవి సర్వౌషధిఫలాన్వితయై జ్యేష్ఠమాసంబున దేవతలంగూడి యిందు స్నానంబుచేసి శంకరుం బూజించు. విశ్వేదేవతలు స్నానం బాచరించి యరుణాచలేశ్వరు నారాధించి మఖాంశంబు నొందంగల్గిరి. సోమసూర్యతీర్థంబులకు నుత్తరంబున వైశ్వదేవతీర్థంబు గనుపట్టు. అందు మునింగిన విశ్వపాలకత్వంబు సిద్ధించు. పూర్వదిక్కునందు మహాతీర్థం బొండు పొడసూపు. లక్ష్మి యిందుం బూర్వము స్నాన మాచరించి పురుషోత్తముని బతిగాం బడయంగల్గె. ఉత్తరదిక్కునందు స్కందనది ప్రవహించు. అందు స్నానముచేసి స్కందుండు విపులబలాధికుం డయ్యె. పశ్చిమదిక్కునందుం గుంభనది కనుపట్టు. కుంభకుంభకాగస్త్యు లిందు సతతం బుందురు. మూలభాగంబున గంగయు గగనంబున యమునయు శిరోభాగంబున సోమోద్భవయు నుండి యరుణాచలంబును సేవింతురు. ఇంక ననేకనదు లిందుం గలవు. వాని నెఱుంగం గోరి మార్కండేయుండు సిద్ధి నొందంజాలకుండె. బహుకాల మిందుం దపం బొనరించి శోణాచలేశ్వరుని దృష్టుంజేసి కృతార్థుం డయ్యె. మఱియు శంకరుండు సాక్షాత్కరింప మార్కండేయుం డిట్లు ప్రార్థించె.

చ. పురహర! శోణపర్వతవిభూ గలకాలము నాశ్రయించి యీ
ధరణితలంబునన్ యశము తద్దయు వర్ధిలుచుండం దీర్థముల్
పరిగణనార్హతం గనక భాసిలు వేలకువేలుగాంగ నె
వ్వరున నెఱుంగరాక తగువానిని మానవు లెట్లు లొక్కచోన్. 402

క. కనంజాలుదు రావిధమును, వినిపింపుము వీనినెల్ల వేర్వేఱుగం గా
ల్వానుజాల దాయు వేరికి, గనుకం దెల్పంగం దగును గాథను దానిన్.

క. అంతర్నిగూఢతేజుం డ, వంతకభయదుండవీశ! యమరులతోడన్
సంతత మర్చింపంబడు, దింతయు సత్యంబు లోకులెల్లన్ నిన్నున్.

సీ. అరుణాచలేశ్వరు నంతికంబును జేర
భయపడువార లెబ్భంగి నిన్నుఁ
గొలువంగఁజాలుదు రెలమి నావిధమును
దెలుపుమా నేనును దీవ్రతపము
నొనరించి జనులకు నుపకార మొప్పఁగా
సూక్ష్మలింగార్చన సుఖ మొనర్తు
విశ్వకర్మ యొనర్ప వివిధోత్సవంబుల
నలరువిమానంబు వెలయుశోణ
తే. పర్వతముననంచ నిభక్తిఁ బలికి శాస్త్ర
విహితమానట్లు సంకల్పవిధిని జరపి
సకలభోగంబులం గాంచఁ జాలునట్టి
పద్ధతుల నేర్పఱించె నాపరమమాని. 405

వ. వివిధధర్మశాస్త్రంబుల నేర్పఱచి శివకార్యంబుల నిర్వహింప మునుల నియమించె. వార లట్లు లొనర్చుచుండిరి. పార్వతీ! నేనును శంభు లింగముం బూజించి హోమజనిత లగుసప్తకన్యల శివపూజార్థము నియమించితి. శత్రుహృతరాజ్యులైనరాజులు శోణపర్వతేశ్వరు ననేకప్రకారంబుల నారాధించి రాజ్యంబు నొందిరి. ఈయుపాఖ్యానంబు సకలపాపహారం బగు. అరుణాచలలింగంబు దుర్గమం బసదృశతేజోవిరాజితం బప్రతర్క్యంబు నగుఁగాన దానిం బూజింపుము. అవనతజనరక్షణోచితంబు స్మరణమాత్రనిరాకృతవిశ్వకల్మషంబు తేజోరాశి పరాత్పరంబు నగు. కావున నాశివునిం బూజించిన పరమపురుషార్థంబు లభించు నన విని పార్వతి యిట్లనియె. 406

---

సప్తమాధ్యాయము.



సకలతీర్థమాహాత్మ్యము

చ. అనలమయంబు శాంకరము నైతగులింగము చేరఁజాలిన
ట్లనఘ! యెటయ్యెనో మనుజు లందఱు సేవలఁ దన్పునంత శాం

తిని గనె నెట్లు? శోణగిరితీర్థసముద్భవగాథ యెట్టిదా
వినవలతుఁ గిరీంద్ర మిది వింతగ నివ్విధి నుండు టెట్టులో? 407

క. ఉపసంహృతసర్వాంగుఁ, డపరిచ్ఛిన్నాత్మభూతి హరుఁ డివ్విధి భూ
ధరమున వెలయునొ లింగతఁ, గరుణం దెల్పుమనఁ నంగ గౌతముఁ డనియెన్.

సీ. అగ్నిమయంబుగా నాద్యయుగంబునఁ
బర్వత మలరారుఁ బర్వతసుత!
మణిపర్వతంబుగా గణియింపఁబడుఁ త్రేత
హాటకాద్రిగ ద్వాపరాఖ్యయుగము
నందుండుఁ గలియుగమందు భాస్కరశైల
మనఁబడుఁ; గృతయుగమందు నగ్ని
మయమయి యీశైలమహిమఁ బహుయోజ
నములదాఁకఁ జెలంగినన్ మహర్షు
ఆ. లందుఁ జేరరామి నరసి బాహ్యస్థల
మందె వలగొనంగ నదియు శాంత
మయ్యె నప్డు సురలు హర్షించి పూజించి
వేఁడ గమ్యుఁడయ్యె విశ్వవిభుఁడు. 409

చ. అని తెలుపంగ గౌరి యను నయ్యరుణాచల మెట్లు శాంతమై
కనఁబడసాగె? దేవమునికాంతులు ప్రార్థనచేసి రెట్లు? నే
వినఁగఁ దలంతు సాంతముగ విశ్వవిభూత్తము గాథఁ దెల్పుమా
యనుటయు గౌతముం డనియె నామెకుఁ గల్గినభక్తి నెన్నుచున్. 410

చ. మును పనలాకృతిం జెలఁగుభూధ్రము చేరఁగ నోడి దేవతల్
మునులును యజ్ఞరూపమునఁ బూజలఁ దన్పి నుతించి శంకరా!
యనుపమశైలరాజ! పరమాత్మ! జగద్ధితముం దలంచి యీ
యనలతనుత్వ మొందియు మహామతి శాంతము నూని భూస్థలిన్.

క. వెలయుము పర్వత మియ్యది
కలయం జూడంగఁ దామ్రకల్పమొ యరుణం
బొ లలిన్ బభ్రుచ్ఛాయయుఁ
గలదియొ యని వేదములు నిశామము పొగడన్. 412

సీ. చెలఁగుమో యీశ్వరా! శివదాయకా! తామ్ర
వర్ణారుణచ్ఛాయఁ వఱలుదీవు
పరమాత్మవై సదా భాసిల్లుచుందువు
వేదవేద్యుఁడవయి విశ్వరూపుఁ
డ వగుచు సుఖరూపుఁడవయి సోముం డన
నలరుచుందువు నిర్జరాళి కధిప
తివి నీవె కాదె యోదేవ! నమస్కార
ముల నొనర్తుము గ్రహింపుము పురారి!
తే. జగము లివి నీస్వరూపంబులుగ గణింపఁ
బడును; దేవనిధానరూపంబు నీది;
వృష్టి నిగుడించుజలధరవితతి కెల్ల
నిర్ఝరాళికి జలమీయ నిలుపు నీవె. 413
క. కారణభూతుండవు నీ, వారయఁగా నగ్నినుండి యంబువులను బెం
పారఁగఁ బుట్ట నొనర్చితి, భీరువులను మమ్ముఁ గావఁ బ్రీతిం గనుమా.
ఉ. ఆనతినొంది బ్రహ్మముఖు లౌనమరేశులు విశ్వసృష్టి న
ద్దానిని గాచుకార్యము తుదం బొలియించుట యన్న వీని సుం
తైనను దప్పకుండఁ బరమాత్మ! యొనర్తురు నీవుతప్పఁగాఁ
గానఁగ రాఁడు రక్షణముఖంబున సత్కృపఁ జూపువాఁ డిలన్. 415
క. అరుణాచల! కరుణాలయ!, హర! కమ్మా! శితలుండ వఖిలప్రాణ్యు
త్కరమున కభిగమ్యుండవు, త్వరగాఁ గావలయు దేవవారముగావన్.
చ. అని వినుతింప దేవతలయాస్తుతులన్ విని వారిమ్రొక్కులం
గొని ముదమంది వత్సలతఁ గుందఁగఁజేసి మహోగ్రరూపమున్
గనియెను శీతలత్వమును గ్రక్కున నెల్లరకున్ సుగమ్యుఁడే
యనఁబడియెన్ నదుల్ గిరివరాంగభవంబులుఁ బూర్వరీతిగన్. 417
క. ప్రవహింపసాగె నీరద,నివహంబులు వృష్టినెల్ల నిగుడంజేయన్
జవమారఁ బీల్చకుండెను, బవనాశనభూషణుండు పరమకరుణచేన్.
క. ఐనను దరుణారుణవై,శ్వానరశతకోటితుల్యభాసమదీప్తిన్
గానంబడుచున్ గమ్యుం,డై నరులకు నుండెఁ బర్వతాకృతి హరుఁడున్.

క. వదలెను సలిలంబును వే, నదులను జలపూర్ణముల నొనర్చెను సఫల
ప్రదములుగఁ దీర్థసంతతి, త్రిదశులకున్ మునులకెల్ల దేవవరులకున్.
ఆ. సులభగమ్యములయి శోభిల్లె; నని బ్రహ్మ
పలికి మఱియు నిట్లు తెలిపె నంత
గౌరి యాలకించి గౌతముఁ గన్గొని
కుతుకసంయుతయయి కోర్కెఁబలికె. 421
చ. తనమదితీర్థసంభవకథాశ్రవణంబున కుద్యమింపఁగా
మునివర! శోణశైలమున భూసురభోగిజగంబులకున్ ముదం
బును గనఁజేయఁ దీర్థగణముల్ ప్రభవిల్లెనొ యెవ్వి వానినే
వినవలతున్ దయామతిని వే వినిపింపుము నామహర్షియున్. 422
చ. హరు ననుకంపఁ దా వినిన యట్టిది తీర్థసముద్భవంబు భూ
ధరవరపుత్రికిం దెలుపఁ దాఁదలపోసి వచించె నంబ! ని
ర్జరవరతీర్థ మైంద్ర మనఁజాలినదత్తఱిఁ దూర్పునందు నా
నరుణమహీధరోత్తమము నంతికమందుఁ గనంబడెం దగన్. 423
ఆ. స్నానమందుఁజేసి శక్రుండు బ్రహ్మహ
త్యను ద్యజింపఁజాలె దహనకోణ
మందు బ్రహ్మతీర్థ మలరారెఁ బరదార
సంగమాఘ మడఁచు స్నానమాత్ర. 424
సీ. యామ్యంబునాఁ దగునట్టితీర్థం బొండు
దక్షిణంబునఁ జూడఁదగియె నందు
మునిఁగి యముండు నా సెను; విరించాస్త్రసం
భవసాధ్వసముఁ దీర్థవర్య మొకఁడు
నైరృతం బనఁగఁ దానైరృతిదిగ్భాగ
మం దుద్భవిల్లె భూతావళియును
బేతాళగణము విభీతినొందగఁ జేయ
కుండఁ గాపాడు నాకుండమందు
తే. స్నాన మొనరించినంత నాశైలపశ్చి
మాశ వారుణతీర్థంబు హర్షదంబు

గలదు వరుణుండు స్నాతుఁడై కాంచఁగలిగె
శల్యకోశంబు నైజంబు శైలపుత్రి! 425

ఆ. వాయవీయతీర్థవర్యము శ్వసనుది
గ్భాగమందుఁ గానఁబడును మునిఁగి
కాంచె స్పర్శనుండు జగత్ప్రాణతావైభ
వమును భక్తిమీఱ భవునిపత్ని! 426

సీ. ఉత్తరంబున మించుచుండును సోమతీ
ర్థంబు స్నానముచేసి రాజరాజు
యక్ష్మరోగముఁ బాసె; హరునిదిగ్భాగమం
దలరును విష్ణుతీర్థాహ్వయంబు
మునిఁగి యందును జక్రి మునుపు శ్రీకాంతను
భార్యగాఁబడసెఁ; బూర్వము మృకండు
తనయుండు శంకరుఁ గొనియాడి యో దేవ!
సర్వతీర్థములకు సంగతి యిటుఁ,

ఆ. గల్గఁజేయవయ్య కాలగళా! యెట్టి
యుపమ నద్దిగల్గునో యెఱుంగ
ననిన నాలకించి యయ్యుపాయముఁ జూపె
హర్ష మలర మునికి నార్య! వినుము. 427

క. అనిశ ముపహారసమయం,బున గూఢాకారములను మునివర! క్షేత్రం
బున నన్ను సర్వతీర్థము, లనూనహర్షంబుమీఱునటు సేవింపన్. 428

వ. మహామునీ! ఇందుఁ దీర్థాంతరంబు నన్వేషింపఁ దగదు. తీర్థసంచయం బెల్ల నాయుపహారవేళయందు గానంబడు. కావున భక్తియుక్తులయి తీర్థసన్నిధి నిత్యంబు సేవింపవలయు. మునులు దేవతలు నై వేద్యాంతంబున వానిం గాంచవలయు. దాన సర్వతీర్థసందర్శనస్నానఫలంబు లభియించు నని మున్ను శంకరుం డుపదేశించె. మఱియుఁ దీర్థసందర్శన క్రమంబుఁగూడఁ దెలిపె. 439

ఉ. పావనతీర్థరాజములు పార్వతి! శంకరుసన్నిధానమం
దావిర్భవంబు గాంచఁదగు నంచుఁ దలంచి శరీరసంగతిన్

శైవమహంబు గాంచఁగఁ బ్రసాదము నొందఁగవచ్చుచుండు సం
భావన వానిఁ గాంచఁదగు భద్రము గోరెడుమర్త్యు లత్తఱిన్. 430

క. వ్రతములు తీర్థతపస్సంతతి వేదము లధ్వరములు తగునియమము లు
న్నతయోగము లరుణాచల,శితిగళసందర్శనమునఁ జెందుసఫలతన్.

చ. అనుటయు గౌతమోక్తులకు నద్రికుమారిక సుప్రసన్నయై
యనియె మహాత్మ నీనుడికి నచ్చెరువయ్యెడుఁ దీర్థజాల మొ
క్కనెలవునందుఁ జేరుటయెగాదె విచిత్ర మదృష్టపూర్వ మో
ముని! కృతకృత్యనైతి నినుఁ బూజ్యుఁ గనుంగొన నీకు మ్రొక్కెదన్.

ఆ. తపము కలిమి నీదుదర్శనం బబ్బెంగఁ, జేసె శంకరుండు చిత్రమె యిది
యుగ్రుఁడేవచించె నుపదేశమీయంగఁ,దగినమునిగ నిన్నుఁ దడవితడవి.

చ. స్ఫురదనలాత్ముఁడౌ హరుఁడు క్షోణి నిటం గడుశాంతరూపుఁడై
నిరతిశయానురాగమున నిల్చెను మర్త్యులు పూజచేయ నె
క్కరణిని సాధ్యమౌనొ యటు కాంక్షలు వారి కొసంగఁ సంపదు
త్కరఫలమైనజ్ఞానమును గాంచఁగఁ జేయఁగ మౌనిపుంగవా! 434

## అష్టమాధ్యాయము



### అరుణాచలేశ్వరారాధనక్రమము

చ. అన విని గౌతముం డనియె నంబ! పురాతనవృత్త మొండు చె
ప్పను గుతుకంబు గల్గెడిని పావనమౌ రజతాద్రియందు న
గ్గనుఁగొని మేరుచాపుఁడు మనంబున నెంచుచుఁ దీర్థయాత్రకుం
జనుమని యానతిచ్చెనట శంకరులింగములన్ భజింపఁగన్. 435

సీ. బదరికాశ్రమమందు వారాణసిని శ్రీగిరీంద్రమ్మునందు నహీనఫలద
మైనకేదారంబునందు రుద్రక్షేత్రమందు నింకనుగల్గు నతిపవిత్ర
ము లగుకాంచీముఖ్యపుణ్యస్థలంబులఁ జూడంగ నరిగితి నాఁడె నేను
బహుసంఖ్యలగుమునిప్రవరులుగణములు స్థాపించినట్టి యాశంభులింగ

తే. ములను గాంచి స్వయంభూతము లగులింగ
వరములం గంటిఁ దీర్థపావనజలముల

స్నాన మొనరించితిని శిష్యసమితిఁగూడి
తిరిగితిని భూస్థలంబును దీవ్రభక్తి. 436

చ. వ్రతనియమంబుపూని దృఢభక్తిని దీర్థములందు మున్గుచున్
గ్రతువిశతిం దపంబులను గాలరిపున్ ముదమొందఁజేయు నా
ధృతి నొనరించుచున్ హరుని నెంచుచు నాత్మను లింగపూజలే
గతి నొనరింపఁగా ఫలముగల్గునొ యట్టులె చేయుచున్ సతీ! 437

చ. తిరుగుచు నీపవిత్రతమదేశముఁజేరితి నిందు నుండుశం
కరు ఘను వ్యోమకేశుని నఘవ్రజసంహరణైకదీక్షు భూ
ధరతనుధారిఁ గాంచితిని దాపసవర్యులు సిద్ధులున్ సురో
త్కరములు కందమూలఫలకల్పితభోజనులై భజించుచున్. 438

క. కొలుచుచునుండఁగఁగాంచితి,దొలిలింగముసూర్యకోటితోనుపమింపం
గలతేజము గలదానిని, జలజాసనపూజితంబు సకలార్థదమున్. 439

తే. యోగదృష్టి నెఱింగితినుజ్జ్వలంబు,గాఁగఁబరమార్థఫలదంబుగాఁగ దేవి
తామ్రమోయరుణంబొకొదర్పకారి,బభ్రువర్ణంబొయని వేదపటల మెప్పుడు.

క. వినుతించు నిన్ను దేవా! యనిశం బని సంస్తుతించి యంబా! మఱి యి
ట్లని మ్రొక్కితిఁ దామ్రారుణ, ఘనఁబభ్రువర్ణంబు గల్గునద్రీశవిభూ! 441

సీ. శివుఁడవు పరమాత్మవవుదువు వేదస్వరూపుఁడ వీవు స్థిరుండ వెన్న
నమృతమూర్తివి కరుణార్ద్రుండ వగుదువు కాలస్వరూపతఁ గ్రాలుదీవు
దృష్టిపేయామృతాబ్ధివిభక్తవాత్సల్యపూర్ణుండవరయంగఁబుణ్యరూపుఁ
డవు త్రిపురవిభేదివవుదువు పరమేశ! వందనమ్ములు నీకు వరుసఁగూర్తు

తే. సర్వధర్మఫలం బీయఁజాలు నీదు
దర్శనం బద్ది చేకూరఁ దపము మఱియుఁ
జేయుపనియుండ దెవరికేఁ జెప్పనేల
కర్మభూమి యిదౌనుగా నిర్మలాత్మ! 442

క. నీతేజ మడ్డగింపఁగ, నాతతపాపంబులెల్ల నంతము నొందన్
భూతలమిది పావనమై, ఖ్యాతిం బయియుంట దేవగణ మిట నుండన్.

ఆ. కాంతి నొందుచుండఁ గాలసంగ్రహజాత
ఫలము నొందినాఁడ భవ! యిపుడిట

మున్నొనర్చుసుతపమునకు ఫలంబు నీ
దర్శనంబె యనుచుఁ దలఁచువాఁడ. 444

క. వితతాద్భుతోదయంబుగ, శితిగళ! నీదర్శనంబు చేకూరె విభూ!
క్షితిధరమయ మగులింగము,హృతపాపము మున్ను గాననిలనిం దేనిన్.

క. అరుణశశాంకానలయుత,వరకోణత్రయము బ్రహ్మవైకుంఠోమే
శ్వరమయము నీదురూపము, పరికింపఁగ భాసురంబు పరమంబు నగున్.

సీ. శక్తిత్రయాకృతి సమఁదుత్రయవిధాన
కంబయి వేదత్రయంబుగలిగి
మఱిత్రికోణాంగమై మహితమై లింగమ
త్యద్భుతంబుగఁ జూడ నయ్యె నిందుఁ
ద్రిజగముల్ రక్షింపఁ దివిరి యత్నించెడు
కరణి విస్తారమై క్రాలుచుండు
వసుధయం దిట్టి భాస్వద్రూప మెచ్చోటఁ
గనరాదుశోణశిఖరివరేశ

తే. తత్త్వ మెఱుఁగనిమర్త్యసంతతికి దర్శ
నముననే సర్వభోగమ్ము లమరునట్లు
లొసఁగు నవ్యాజకరుణామహోదధి వన
నీవ కావే మహాదేవ! నిర్మలాంగ! 447

ఉ. పూజలు లేనిలింగ మది పోల వెలుంగక యుండు నెందు నే
యీజగమందు శూన్య మనులే తగియుండును నిర్జరేజ్యసం
పూజితమై సమస్తవిధభోగదమై చెలువారులింగ మిం
దోజగదీశ! నాపయిఁ గృపోర్మ్ములఁ జల్లుము శోణశైలపా! 448

క. భవభీతుఁ బ్రపన్నుని నన్, భవ! సంరక్షింపవయ్య భవదాజ్ఞను జూ
డవలసినవానిఁ జూచితి,భవదాకృతియద్భుతప్రభలవెలుఁగొందున్.

క. కృతకృత్యుగా నొనర్పుము,హితకార్యంబదియె కాదె యెన్న గృపాపూ
ర్ణత నొప్పువాఁడవుకదా,మతిశరణాగతుని వీని మన్నింపు హరా! 450

చ. అని వినుతించినాఁడ నపు డాపరమేశ్వరుఁ డద్రిరూపుఁడై
తనరు సదాశివుండు పరతత్త్వము నాకు స్వరూపదర్శనం

బున వర మిచ్చెఁ బిల్చె దయ పొంగఁగ రమ్మని యోమునీ! భవ
ద్వినుతికి మెచ్చినాఁడ భవభీతి తొలంగెడు నీదుభక్తికిన్. 451

ఉ. ఇందె వసింపు మీవు సతతేష్టములం గనుచుండవచ్చు నా
చందము గాంచవచ్చు మునిసత్తమ! పూజలఁ దన్పవయ్య! నీ
విం దగుపద్ధతుల్ వెలయ దివ్యసనాతనభోగసంతతిన్
డెందము తృప్తిచేయఁగఁ గడింది ప్రయత్నము చేయుమా త్వరన్.452

క. అనవరతము తపమున నీ,వనఘా! చెందినమహత్త్వ మందఱకుఁ దోఁ
చునటుల్ చూపుము పూర్వము, నినుఁగైలాసంబునందునిశ్చలనిష్ఠన్.

ఆ. తపము చేయుచుండ ధరణి శోణాచల,పతిని నన్ను సతము వితతపూజ
నలరఁజేయు మనుచు నాజ్ఞచేఁ బంపితిఁ,గాదె సప్తమౌనికాంతులందు.

చ. నను నిరతిన్ విధీరితమనం జను పూజను సత్కరించువా
రని తలపోయవయ్య! మనుజాళికి నిత్యము పూజచేయఁగా
ననువుపడంగఁ జేయు మది యౌను సమర్థము సర్వజంతురా
జిని దనియింపఁజేయ నటఁజేయుతపం బఖిలార్థదం బగున్. 455

చ. అరుణగిరీంద్రు నన్ను సకలాగమసిద్ధవిధాన మొప్ప న
క్కరణిగఁ బూజలం దనుపఁగాఁ బనిపూనుము; దానిఁ గాంచి ని
ర్జరు లరుదందువారలుగ సంతతముం గనఁగోరువారుగా
ధరణి సురర్షిసత్తమ! నితాంతము భక్తి నొనర్ప నెంచుమా. 456

చ. అవనితలంబునం దది జనావళి కెంతయుఁ దేటతెల్లమై
సువిహితమై యొనర్పఁదగుచొప్పును జూపఁగ నర్హమై ఫలం
బవితథలభ్యమై తనరునట్లుగ నుండనగున్; దదద్రివై
భవము మహత్త్వముం దెలియఁబల్కితిగా మును గౌతమాహ్వయా!

చ. నిలువుము తద్గిరీంద్రమున నిర్మలవాస్థలమందు; నామనం
బలరుచునుండు నిన్నుఁ గని యాదృతిఁ బుణ్యమతుల్ మహానుభా
వులు నగువారు నన్గొలువ బుద్ధిబలంబునఁ బూనినారొ వా
రలకుఁ బ్రధానగణ్యుఁడవు రాజకళాధరుఁ జక్కఁగొల్వుమా. 458

క. శివపూజాపద్ధతి నీ, భువి వర్ధిల్లంగఁ జేయఁబూనుము నాఁగన్
శివు నాజ్ఞం దలఁదాలిచి, భవభక్తి చెలంగ నిట్లు పల్కితి గౌరీ! 459

క. తలవ్రాల్చి పాదమూలం,బులఁ గాంచుచు నీదురూపమునుగాంచఁగ నా
కలవియె యగ్నిప్రభలన్, వెలిఁగెడు నిద్దానిఁ జేరవెర వెయ్యదియో.
చ. అలరఁగఁ జేయువాఁడ వివిధార్చనరీతుల నిన్ను దేవ! మ
ర్త్యులు వసియించుభూమిఁ దగియుండునటుల్ పరమేశ! నీవచ
స్సుల సెటుసార్థకంబులుగ శోభిలఁజేయఁగ నెట్టులానొకో
తెలుపుమ యాయుపాయమును దేవవరేణ్యసమర్చితా! విభూ! 461
క. ఏయుపమనూని కొల్చిన, నీయమలాకార మెల్లు నిఖిలనరులకున్
గాయజహార! దర్శింపం,గా యోగ్యం బగునో తెల్పు కామితఫలదా!
చ. అని తనువేఁడు గౌతమునియాశయ మెల్ల నెఱింగి శంకరుం
డనియె దయాపయోధి యనున్నాహ్వయ మొందినవాఁడు గాన నో
ముని! విను సూక్ష్మలింగగణమున్ వెలయించెద ధాత్రియందు నీ
వనుదిన మాగమోక్తవిధి నర్చన మొప్పెదున ట్లొనర్పుమా. 463
సీ. అద్భుతంబయి సూక్ష్మ మగుచుఁ బంచావర
ణాన్వితంబయి మదీయంబు లింగ
మరుణాచలాహ్వయం బమరు; నద్దానిని
బూజింపుమా తపోభూతి మెఱయ;
ననుచు నాదేశించి యమ్మహాదేవుండు
స్వీయరూపంబు నా కాయదనునఁ
గనఁబడఁగాఁ జేసెఁ; గమ్రాకృతిం బొల్చి
సూక్ష్మలింగం బది సొంపుగులుకు
తే. చుండె నద్దానిఁ గనినంత నొక్కయూహ
గలిగె; నిద్ది స్వయంభువు లలితతమము
లైనయావరణంబుల నలరియున్న
దీకఁ గృతార్థుఁడనే దీని నేభజింతు. 464
చ. అని తలపోసి పార్వతి! మహాత్ముని శంకరుఁ గాంచి ప్రార్థనన్
విని తనియంగఁజేయ మది వేడుక గల్గఁగ విన్నవించితిన్
మునినుతరూప! నీదయినమూర్తి మహాగమరీతులం గనుం
గొనఁదరమౌనె నామములకున్ మితియుండునె యేమిచేయుదున్. 465

తే. వానిఁ దెలియంగఁ జాలుత్రోవను గృపాబ్ధి!
తెలియఁజెప్పుము నీవె పూజల నొనర్పఁ
దగినవా రెవ్వరో నీకు స్థాన మెట్టు
లమరియుండంగ నౌనొ? మహానుభావ! 466

సీ. స్తుతు లెవ్విధంబున శోభిల్లఁగాఁ దగుఁ?
బూజ యెవ్విధమునఁ బొసఁగియుండు?
దగుఁబరిచారకతతి యెట్టి దర్హ్వంబో?
స్థానరక్షణ మెట్టిచందమునఁ
దగియుండులింగసంస్థానరక్షకు లెట్టి
వారుగాఁ దగుదురు? పూరుపార్హ
పూజ సుస్థిరముగఁ బొల్చు నెట్టు లొనర్ప
దేవతల్ నినుఁ గొల్చుభావములను

తే. వచ్చుచుందురు? మనుజు లెవ్వరున నప్డు
పూజ సాగింపఁదగియుండుఁ? బురహర! కృప
యలర నానతియిమ్ము; నాయాత్మ తృప్తి
నందు నద్దాన; నని వేఁడ నపుడు హరుఁడు. 467

చ. తనుఁ గనవచ్చియున్నవిబుధవ్రజశిల్పిని విశ్వకర్మఁ గ
న్గొని యరుణాఖ్యపత్తనముఁ గోరికమీఱఁగ సృష్టిచేయుమా
జనులకు వాసయోగ్యమయి చారుతరం బయి యొప్పియుండనౌ
వినుతపురం బదే యనఁగ విశ్వమునందు యశంబు గాంచనౌ. 468

ఉ. ఆలయమందు నాకు రుచిరామలరత్నగణోజ్జ్వలంబుగా
భూలలనావతంసముగఁ బూజ్యముగా మఱి దర్శనీయమై
చాలమనోహరంబుగ నెసంగ నొనర్పుము దేవశిల్పి! యె
వ్వేళను నృత్తగీతములు వీనులవిం దొనరించువాద్యముల్. 469

ఆ. వెలయుచుండవలయుఁ గలిగియుండఁగ రాదు
లోప మేవిషయము చూపఁరాదు
పార్వతీ! శివుండు పాలించి యిటు లాజ్ఞ
నామభేదపూజనవిధు లపుడు. 470

చ. తెలిపెను నాకు నింపుగను దెల్లముగాఁ గనుపట్టురీతి నో
జలజవిలోచనా! వ్రతము శ్రద్ధనై తగుదానిఁ బూజ కి
మ్ములఁ దగియుండి సాధుగుణముల్ రుచిరంబులుగా నెసంగ ని
ర్మలమతు లుప్పతిల్లఁ దగుమాన్యులసేవకులన్ సుశాంతులన్. 471

క. ఆదేశించెను; దేవీ!, శ్రీదుం డగుశంకరుండు చెప్పెను నాకున్
భూదేవమౌని గౌతమ!, యీదేవళమందుఁ బూజ లెటుసాగ నగున్

చ. మనుజుల కెవ్వి ధర్మములొ? మామకతుష్టికిఁ బాత్రతాగుణం
బును గనఁజాలునో? తెలుపఁబూనెద వానిని శ్రద్ధమీఱఁగా
వినఁదగు నెవ్వఁ డాత్మఁగను విశ్వహితం బొనరించువాంఛ యీ
తని కిటఁ దేజమే తనువుదాల్చినరీతి నెసంగు లింగమున్. 473

క. కనఁజాలుభాగ్యమబ్బును, మునివర! యాలింగమిదియెపో యరుణాద్రీ
శనియతనామముగను దీ,నిని భక్తిని బూజచేయు నిత్యము విధిగన్.

సీ. శక్తి నాకుత్తరాశనుబూజ్యయై యొప్పు
నిత్యోదయ యనంగ నెగడుకీర్తిఁ
దనరారఁ గల దపీతకుచనామికయయి
మాయిర్వురకు భేదమే యదియును
గలుగ; దుత్సవసంఘములకుగా భోగను
తావృతుం డగుహరుఁ డగును బూజ్యుఁ
డాతఁడు భక్తసంఘాతబోధదుఁ డగు
దత్తాభయకరుండు దర్పకహరుఁ

ఆ. డనఁగఁ బరఁగుఁ బరశుహరిణముల్ కరములఁ
దాల్చి సుప్రసన్నతను వదనము
తెలియఁజేయుచుండ లలితవామస్కంద
గత గిరీంద్రతనయ గ్రాలుచుండ. 475

వ. ఉమాస్కందేశ్వరుం డనంబరఁగుచు దివ్యరత్నవిభూషణంబులం దాల్చి స్వతేజంబునే నఖిలలోకంబులం బ్రకాశింపఁజేయుచు నచంచల శ్రీయుతుండై వెలుంగు. సుందరేశ్వరి యనునామం బామెకుఁ గాల క్రమంబునం బ్రథితంబగు. ఆమె పరమపూజ్య యని తెలియందగు.

సర్వభూషణవిరాజమానయయి శృంగారరసవర్ధని యయియుండు నాపరాంబ పూజ్యయగు. బాలగణపతియుఁ బూజ్యుండె యగు. బహువిధభక్ష్యంబుల నాతనిం దృప్తిచేయందగు. 476

క. నాపార్శ్వము విడనాడక, యేపారుచు శోణరేఖ లీక్షణములలోఁ
జూపట్టి నింపుగాఁదగి, యాపర్వతరాజపుత్రి యలరు మునీంద్రా! 477

ఆ. ఆమె పూజనీయ యగు మఱి ముఖరాంఘ్రి
పతియుఁ దాండవమునఁ బండితుండు
నేత్రసముఁడు నాకు నీ వట్టియమ్మ తేశ్వ
రుని భజింపవయ్య మునివరేణ్య. 478

చ. కలదు మఱొండుశక్తి రిపుకాండముఁ జెండుచు భూవినాయకా
విలసదభంగకీర్తిఁ గనువిం దొనరించుచు నన్నుఁ గొల్చు ని
ర్మలతరభక్తి నామె బహుమానము మీఱఁగఁ బూజచేయుమా
కులగిరిపుత్రిఁబోలెఁ గనుఁగొందువుగా కలశక్తి నెమ్మదిన్. 479

ఆ. ద్వారమందు నంది వఱలు మహాకాలుఁ
డెదుటఁ దోఁచుచుండు నినసమాన
తేజ మలర నతనిధీమహిమంబునఁ
గొలువవయ్య! సిరులఁ గొలుపు నతఁడు. 480

చ. హరపదభక్తులౌ జనుల కందఱకున్ దగుభంగిఁ బూజ లె
క్కరణి నొనర్పవీలగునొ కల్పనచేయుము తద్విధంబు భూ
ధరవర యామ్యభాగమునఁ దాపసవర్య! గజాననాఖ్యుఁడె
త్తరుణమునందుఁ గొల్వఁ బ్రమదంబున మించెడుమాతృవర్గమున్.

క. అలరింపుము పూజల నుజ్జ్వలతేజం బమర నొప్పుదైవమాతురు న
ట్టులె గణవిభులన్ గొణపుఁ, డెలమిన్ వసియించు దెసమునీశ్వరభక్తిన్.

క. గిరిజానందనుశక్తిం,గరమున ధరియించి ప్రోవఁగా నెంచెడుభీ
కరమూర్తిని నరవాహన,హరిహాయదిగ్వివరమందునర్చించు మొగిన్.

క. తరువాతన్ లింగంబుల, వరుసన్ బూజింపవలయు భవసాగరదు
ర్భరవీచికలన్ మున్గెడు, నరులం గాపాడుదక్షిణామూర్తి మునీ. 484

సీ. ఆమూర్తి నెలకొనునట్టిమందిరమును
బూజింపవయ్య! యోపుణ్యపురుష!
పశ్చిమదిక్కునఁ బావకశ్రీవిష్ణు
రూపాన్వితుండయి తాపసేంద్ర
గణయుక్తుఁడై యుండుఁగాదె యామహనీయుఁ
డాదక్షిణామూర్తి నన్వహంబు
భజియింపఁ బాపముల్ వాయు; నుత్తరమున
బ్రహ్మరూపాంకమై ప్రాగ్దిశనటు
తే. గాంచ సారంగభూయుక్తిఁ గలిగి సర్వ
దేవగణయుక్తమై మహాపావనమయి
సర్వశక్త్యన్వితంబయి సర్వదిక్పు
తిసతు లరుదుగ వసియింప నెసఁగఁజాలి. 485

వ. అపీతకుచనాయికామందిరంబు చెల్వారు. ఆయరుణాచలేశ్వరిపూజింపం దగియుండు. కాళియుఁ దక్కినశక్తులును దేవాలయపాలకదేవతలును విశేషించి పూజింపందగినవారు. క్షేత్రపాలకుండు సర్వావరణదేవతాన్వితుండై యుండు. వానిం బూజింపుము. మనోహరరూపముల నలరుకన్యకల శివదేవార్పణనిరత లగువారి నిర్మింపుము. వారు నృత్తగీతకళాభిజ్ఞలై రూపసౌభాగ్యసంయుతలై చారువిభ్రమవిరాజితలై కామదలు నిత్యపావనలునై యుండవలయు. సదాచారనిరతు లగుశిష్యుల నాజ్ఞాపింపుము. వారు దివ్యోపచారసంసిద్ధికొఱకుఁ బరిశుద్ధచేతస్కులై మెలంగవలయు మఱియు. 486

క. విమలస్వాంతుల శైవాగమవేత్తల దీక్షితులను గమ్రాచారం
బమరంగ నుంచఁజాలిన, క్రమపద్ధతి గల్గువారిఁ గడుఁబూన్కిమెయిన్.

క. నియమింపు మర్చకులను స,మయ మింతయుఁ దప్పకుండ మత్పూజల న
య్యయిరీతుల నొనరింపవ,లయుఁ గావున వారు శాస్త్రలక్షణవిదులై.

ఆ. ఉండవలయుఁగాదె సురుతరవాద్యనా,దములనన్నుఁ గొలువఁదగినయట్టి
వేణువాదకాదివిద్వాంసులను సిద్ధ,పఱుపవయ్య నీతిపరులుగాఁగ. 489

చ. నరపతి వైశ్యశూద్రకులనాథులశంకరపూజచేయునా
దరము గలట్టివారిఁ బరతల్లజమందు వసింపఁగూర్పు మ
క్కరణిని నాల్గుదిక్కులను గల్గినతీర్థములన్ భజింప స
త్పురుషుల నుంపఁగాఁ దగును బూజ్యమఠంబులు నాల్గువారికై. 490

ఆ. కట్టవలసియుండుఁ గమ్రరూపంబుల
నవ్వియుండవలయు నన్వహంబు
తీర్థయాత్రకొఱకుఁ దిరుగుమానులకును
వాసయోగ్యములుగ వఱలవలయు. 491

క. ఆమఠముల నివసించుచు
శ్రీమచ్ఛివపూజనంబు సిద్ధింపంగా
నామానులు చేయందగు
భూమిన్ భిక్షాశనులుగఁ బొలుతురు శైవుల్. 492

క. శివభక్తులు పాశుపతులు, శివమందిరమందుఁ బూజ సిద్ధింపఁగ నె
ట్టివిధంబునఁ జేయందగు, వివిధవిధాచారములను విలసిల్లునరుల్. 493

తే. మఱియుఁ గాపాలకులుగూడ మంచియాచ
రణములం బొల్చువారలే రమ్యశైల
నాథుకృపనంద నర్హులే బాధలేక
వార లర్చింపఁగాఁ దగుభంగి నిండ్ల. 494

ఆ. ఏర్పఱింపు మిప్పు డిలఁబుట్టియున్నట్టి,వారు పుట్టుచున్నవారు మఱియుఁ
బుట్టఁబోవువారు పూతులు కాఁదగు,పద్ధతులను బూజపరమవిధిని. 495

క. సాగంగావలయుఁ జుమీ, యేగతి నేఁగొదువలేక యేయది సాగం
గా గల్పింపుము పథముల. భోగిధరుం గొల్చువారు పూజ్యులు కారే.

చ. క్షితిపతు లీమహీధరము క్షేత్రవరం బని నిశ్చయించి యే
వితమున బాధలొంద నటు వేయికనుల్ తగునట్లుగా మహో
దృతిమెయి గావఁగాఁదగు; మహీరుహవర్య మొకండు సుందరా
కృతి వకుళాఖ్యఁగల్గునది యాస్థలిఁ గన్పడుఁగాతమర్షిపా! 497

ఆ. దానిక్రింద నెట్లు దర్పకారిమఖంబు,చేయనౌనొ యంచుఁ జింతచేయ
సిద్ధినొందు నద్ది చేయుదానమ్ముల,క్షయఫలంబు లిడఁగఁగలవు మౌని!

చ. తరువరమూలసంస్థితిని దాఁగని యెవ్వఁడు నక్తదలంచి యీ
వరుస మదాత్మ కాంక్ష దగువారక దానిఫలింపఁజేయు మా
యరుణగిరీశ! యంచుః దనయంతఁ దలంచిన నాలకించి త
త్వరతఁ గృతార్థుఁజేయుదు నభంగురమా కరుణావిశేషతన్. 499

క. అపరాధ సహస్రంబుల, నపుడే క్షమియింతు నన్నునర్చించెడు పు
ణ్యపురుషు లెప్పుడుపూజ్యులె, కృపకర్హులె నాకునంచుఁ గీర్తింపు మునీ?

ఆ. ఆగమోక్తపూజ యగుమానుషీసంజ్ఞఁ
దనరు దానికేను గనుదుఁ దృప్తి
సాధుమతులు గొల్వ సంకల్పమును జేయఁ
బ్రీతినొందువాఁడ గౌతమ! కడు. 501

సీ. ఆగమార్థంబుల నాలోచన మొనర్చి
సమయోచితములుగ సంస్కరించి
వివిధపూజావిధి భేదంబులం దెల్పి
జనులను గాపాడుసరణి వాని
నిశ్చయింపుము మహానియతిఁబూజింపనౌఁ
బున్నమయం దదె పొల్చుచుండు
మహి మహాపూజనావిహితమా; బహువిధ
సత్రంబులిచ్చోట సంఖ్య మిగులఁ

ఆ. గలిగియుండునట్లు కల్పింపు వివిధదా
నముల శక్తికొలఁది నరులొనర్ప
వలసియుండు నందు వసియింపఁగల్గుదు
రట్టులౌట నవ్వి యమరుపఁ దగు. 502

వ. ఎవ్వ రఖండదీపదానంబు నాసన్నిధిం జేయుదు రట్టిదాతలు తేజో
మయం బగునాయీరూపంబు నొందుదురు మఱియు. 503

సీ. జలజంబు తరుజంబు లలితలతోద్భవం
బట్టి దూర్వాజనితాంగకంబు
నగుపుష్పమును భక్తి తగ నెవ్వఁ డిడు నాకు
నతఁడు భూజానిమై యవనిఁబుట్టు;

వానిముందట నేను వర్తించుచుండుదుఁ
బరుల జయించు నాపార్థివుండు
రాజు తపశ్శక్తి రాజిల నేదేశమందునఁ
దలఁచు నయ్యనఘుకోర్కి
ఆ. నరసి తీర్చుచుండు నతిదురాత్మకుఁడైన, నన్నుఁ జూడవచ్చి విన్నవింప
నతఁడు నిర్మలాత్ముఁ డగుపార్థివుండె యౌ, సంశయంబు లేదు సత్యమిద్ది.
వ. అని శంకరుం డాజ్ఞాపించిన నే నవ్వాని నాలకించి విగతకల్మషుండనై
భగవంతు ననుజ్ఞవడసి యరుణాచలేశ్వరు నాజ్ఞానుసారంబు తత్ర
ద్దేవాలయాదుల నిర్మింపఁ బూనితి నని పల్కి మఱియుం గాతముం
డిట్లనియె. 505



## నవమాధ్యాయము

### శివప్రదక్షిణమహాత్త్వము

క. అరుణాచలాధినాథా, సురుచిరనామావళులను శుభదంబుల నీ
ధరణిం బేర్కొనఁ దగువా,నిరమణ వినఁగోరువాఁడ నెమ్మిఁ దెలుపుమా.
క. అమరోత్తమ! పూజ్యా,క్షేత్రముగా దే యిద్ది యిందు దర్పకహర! నా!
మములు భవదమలకీర్తి, క్షమఁ బ్రకటింపంగ శక్తిగలయువియగుటన్.
క. వానిని వినఁగోరెద నా, సూనాస్త్రవిరోధి పల్కె క్షోణీదివిష
న్మౌనీ! వినవయ్యా! శ్ర,ద్ధానియతులుగల్గ నామతతిముఖ్యంబున్.
ఆ. అకృతపుణ్యుల కవి యలవడనేరవు, కామదములు సర్వకాల మమల
కీర్తిదములుగానఁ గీర్తింతు నవ్వాని, జనుల కుపకరింపఁజాలుఁ గాన.
అరుణాచలశంకర నామావళి:—
వ. శోణాద్రి, శారుణాద్రీశ, ధీర, శివసేవకవర్ధ, కాత్షి వేయామృతేశాన,
స్త్రీపుంభావప్రదాయక భక్తివిజ్ఞాన సంధాత్రు నామంబులును,దీనవంది
విమోచక,ముఖరాంఘ్రిపతి,మృగమహేశ్వర, భక్తప్రేక్షణకృత్సాక్షి,
భక్తదోషనివర్తక, జ్ఞానసంబంధనాథ శ్రీహాలాహలసుందర, నామం
బులును, ఆహవైశ్వర్యదాతృ, స్మర్తృసర్వాఘనాశన, వ్యత్యస్త
నృత్యధ్వజధృక్సకాంతి, నటనేశ్వర, సామప్రియ, కలిధ్వంసి, వేద

మూర్తి, నిరంజన, జగన్నాథ, మహాదేవ, త్రినేత్ర, త్రిపురాంతక, భక్తాపరాధసోఢృ, యోగీశ, భోగనాయక, బాలమూర్తి, క్షమారూపి, ధర్మరక్ష, వృషధ్వజ, హర, గిరీశ్వర, భర్గ, చంద్రరేఖావతంసక, స్మరాంతకాంధకరిపు, సిద్ధరాజ, దిగంబరాగమప్రియే,శాన, భస్మరుద్రాక్షలాంఛన, శ్రీపతి, శంకర, స్రష్ట్ర, సర్వవిద్యేశ్వరా, ఘన, గంగాధర, క్రతుధ్వంసి, విమల, నాగభూష, కారుణ, బహురూప, విరూపా,క్షాక్షరాకృతి, నామంబులు, ననాది, నామంబు, నంతరహిత, శివకామ, స్వయంప్రభు, సచ్చిదానందరూప, సర్వాత్మ, జీవధారక, స్త్రీసంగవామభాగసుభగ, విధి, విహితసుందర, జ్ఞానప్రద, ముక్తిద, భక్తవాంఛితదాయ, కాశ్చర్యవైభవ, కామి, నిరవద్య, నిధిప్రద, శూలి, పశుపతి, శంభు, స్వయంభు, గిరీశ, మృడ, నామంబులు ముఖ్యంబు లని యెఱుంగవలయును. మఱియుఁ బురాణోక్త దివ్యనామంబులను స్మరింపుము. మఱియు. 510

చ. అనఘ! ప్రదక్షిణంబున నిరంతరమున్ ననుఁ గొల్వుమా, ముదం
బొనరఁ బ్రదక్షిణంబున మహోత్తమకృత్యరతా! యటంచు నా
కనుమతి నిచ్చె శంకరుఁ డహార్యకుమారిక! శోణశైలరూ
పుని మదిఁజేర్చి యీస్థలము ముఖ్యమటంచు మదిన్ దలంచుచున్. 511

క. నివసించి యున్నవాఁడను, బ్రవిమలభక్త్యుత్కటమునఁ బరమానందం
బు వఱలఁగా ననవిని భూ, ధ్రవల్లభాత్మజ వచించె ధర్మజ్ఞవరా. 512

క. అరుణాద్రీశుప్రదక్షిణ, మురుకృప నాకెఱుఁగఁజెప్పు ముత్తమఫలదం
బురుతరమహత్త్వయుక్తము, హరసమ్మతమునగుఁగా దెయదియట్లగుటన్.

చ. అది యెపు డెట్లుచేయఁ దగునవ్విధిగా నొనరించి యెవ్వరే
యదనున నిష్టసిద్ధిఁ గని రాతెఱంగున్ వచియింపవయ్య యం
చుఁ దనను బ్రశ్నచేయుటయు శోణగిరీంద్రుని సంస్మరించి స
మ్మద మలరార నిట్లనియె మానివతంసుఁడు శంకరప్రియా. 514

మ. వినవమ్మా! పరమేశుఁ డెక్కరణిఁ దద్వృత్తాంతముం దెల్పెనో
యనుకంపంగొని నాకు నట్లె యటు నే నర్థింపఁగా శంకరుం

డనియెన్ గౌతమ! శోణభూధరమయం బౌ నాకృతిన్ దాల్చుచున్
గననౌదుం గత మర్త్యలోకమున లేఖవ్రాతముల్ మానులున్. 515

చ. నలుదెసలందు నిల్చి తమనాథునిగా నను నెన్ని కొల్చువా
రలు మునివర్యు లట్టులె మహాక్రతురాజిని మత్ప్రియార్థమై
సలుపుచు నన్ భజింత్రు మునిసంఘపతీ! వినవయ్య! యెట్టి వే
నలఘుతరాఘముల్ పొలియ నవ్విప్రదక్షిణ మొప్పఁ జేసినన్. 516

క. జననాంతరార్జితములై, నను మరలన్ మరల వలగొనం బాయుఁ జుమీ
విను వాజిమేధకోటుల, నొనరించినఫలము గల్గు నొగి నాచుట్టున్.

క. తిరిగిన నని నమ్ము వసుంధర నొనరుప వాజపేయతతులందున నే
గురుఫలముగల్గు నయ్యది, దొరకుఁ బ్రదక్షిణముచేయఁ దోడనె మానీ!

ఆ. సర్వతీర్థములును జక్కఁగా సేవింప, నేఫలం బొసంగు నీప్రదక్షి
ణముననద్దిగలుగునరుఁడెవండుసమస్తలక్షణములుతన్నులలివిడువఁగ.

ఆ. నీచజన్ముఁ డగుచు నేచమత్కృతిలేక
క్రియకు దేని కుపకరింపకుండు
నతఁడు శోణభూధరతనుధారికిఁ బ్రద
క్షిణముచేయ నతఁడు శ్రేష్ఠుఁ డగును. 520

చ. ఒనరిచి తీర్థయాత్రల మహోత్తమదక్షిణ లిచ్చి శాస్త్రరీ
తిని విడనాడకుండఁ గ్రతుదీక్షలు సల్పి సమస్తధర్మముల్
పొనరిచి యేఫలంబులను బొందుదురో యరుణాచలాకృతిం
దనరు మహాత్ము నీశ్వరుఁ బ్రదక్షిణముం బొనరించి భక్తితోన్. 521

ఆ. తృప్తినొందఁజేయఁ దీవరమే యట్టి,ఫలము నొందవచ్చు స్ఖలన మనఁగ
లేనియట్టి దిద్ది మానవు లీవిధి, నెఱిఁగి చేయ ముక్తియే చెలంగు.

చ. ధరణి జయించుఁ జుమ్ముకప్రదక్షిణముం బొనరించినంతఁ బు
ష్కరము ద్వితీయవారమున స్వర్గము మూఁడవసారిచేయ నా
హరునికృపావిశేషమున నట్టిదె సుమ్ము ప్రదక్షిణమ్ము శ్రీ
కరము విమోక్షదంబు నగు గౌతమమౌనివరేణ్య! నమ్ముమా. 523

ఆ. ఒకటి మానసాఘ మొక్కటి వాచికం
బట్టి మూఁడవదగు నాప్రదక్షి

ణమునఁ గాయికంబు నాశమా నరుణాచ
లేశుఁ దలఁచఁగాని దేదియుండు ? 524

క. ఏనస్సంహాతి యొకపరి, మానవుఁడు ప్రదక్షిణంబు మాధవునకుఁ దా
నూనినభక్తి నొనర్చినఁ, గానంబడకుండ నేగుఁ గడువడి భీతిన్. 525

తే. తపముచేసినఫలము ప్రదక్షిణమ్ము
మరలఁజేసినఁ గలుగు నిమ్మాడ్కి దాని
మహిమ మెఱుఁగంగఁ దగియుండు మానిచంద్ర
సిద్ధమునులకు నుటజముల్ చెల్వుగాంచు. 526

క. సురలకు నావాసంబులు, ధరణీధరమందు నిందుఁ దగియుండును; నే
నిరతిన్ స్థిరవాసంబున, సురపూజలనందుచుందు శుభము లొసఁగుచున్.

ఆ. దివ్యగుహాయుఁ జెంతఁ దేజరిల్లెడుభోగ
సంయుత యది యనుచు స్వాంతమందుఁ
దలఁచి దాని నీవు ధ్యాన మొనర్పుమా
సకలవాంఛితములు సరిగఁ బండు. 528

క. అనలస్తంభమయంబుగ, గనఁబడురూపంబు నాకుఁ గల్గుటకతనన్
దనరె నరుణాద్రినామ మ,వనిఁ దల్లింగంబు గానఁబడుఁ బృథులంబై.

క. మెలమెల్లఁ బ్రదక్షిణమో,యిలాసురమునీంద్ర! చేయహితమగుఁ దేజో
విలసితలింగం బదియు, జ్వలమై తైజస మనఁగ సాధువినుతమా. 530

క. ఎనిమిదిమూర్తులు తనలోన నిమిడియుండగ రక్షణంబున మోదం
బనయముస్థిరతంగాంచఁగ, మునివర! శివలింగమొప్పు ముక్తిదమగుచున్.

ఉ. ధ్యానమునూని నిష్ఠను బ్రదక్షిణముం బొనరింపఁ బాతకం
బౌనెలవుం ద్యజించి తనయంతన పాఱును; భూమిఁ బుట్టు నా
మానవుఁ డొందఁబోఁడు మునిమండన! యిద్ది ప్రదక్షిణంబునం
గానఁగ నోమహత్త్వము సుఖప్రద మీయది యార్తకోటికిన్. 532

ఆ. ఇది నిరంతరంబు గదిరినభక్తి నీ
యరుణగిరిమహేశుఁ దలఁచఁజేయ
నిత్యసుఖము నొందుసత్య మీయది స్థిర
పదమునందు వాస మొదవుఁ జుమ్ము. 533

ఉ. ఆతనిపాదరేణుతతియం దొకయించుక సోఁకినంతనే
పూతమగున్ ధరాస్థలము పూరుషుఁ డిందుఁ బ్రదక్షిణార్థమై
యేతఱి నొక్కపాద మిడి యాశునకున్ నతు లొప్పఁ జేసి ది
గ్వ్రాతముఁ గాంచుచున్ హరుని గాలరిపున్ మదియందుఁ గాంచుచున్.

చ. స్తుతులను దన్పి భక్తిమెయి దోసిలి యొగ్గి భజింప ముక్తుఁడౌఁ
గృతమతి రెండుచేతుల న దెవ్విధినైనను దాఁకకుండఁ గా
జతనమునం బ్రదక్షిణము సల్పఁదగున్ ద్వరమాని మందమా
గతిఁ దిరుగంగనౌ నదియకాదె విధానము మౌనిపుంగవా! 535

క. *ప్రసవము దాపుననుండెడు, బిసరుహాలోచన యదెట్లు వెసమాని గతిం
బ్రసరింపఁ జేయు నవ్విధి, నెసఁగుగతిన్ వలగొనంగ నెంచఁగవలయున్.

ఆ. తను వనాకులముగఁ దగియుండఁ దగుఁ బ్రద
క్షిణమునందు నొరులచెవికిఁ బదము
లిడఁగ నిస్వనంబ దించుకే వినఁబడ
రాదు గమననియమ మౌఁ దగి యిటు. 537

సీ. స్నాతుఁడై శుద్ధవేషంబు గనంబడ
మందగతిన్ భూమియందుఁ బదము
పెట్టఁగాఁ దగియుండుఁ బ్రియముగ భస్మ
రుద్రాక్షభూషితుఁడయి హరు స్మరించు
చును బ్రదక్షిణము విశుద్ధమనం బొప్ప
నొనరింపఁగాఁ దగియుండు ననుచుఁ
దెలియంగఁ దగుమౌనితిలకమా! ముందుగాఁ
జనుచుంద్రు త్రిదశులు మనువులు మఱి

తే. సిద్ధు లన్యులు కనరాక శివుని నెలమి
వలగొనుచు నుంద్రు వారికి వాయురూప

---

* ఆసన్నప్రసవా నారీ యథా గచ్ఛేదనాకులం, తథా ప్రదక్షిణం కుర్యాదశృణ్వంశ్చ పదధ్వనిం. ౩౭. స్నాతో విశుద్ధవేషస్సన్ భస్మరుద్రాక్షభూషితః, శివస్మరణసంస్పృష్టో మందం దద్యాత్పదం బుధః. ౩౮. అని మూలము.

ములు కలిగియుండుఁ గావునఁ గలుగరాదు
వారి కెవ్వానివలన నేబాధయు ముని! 538

చ. కనుకనె మార్గరోధ మెటు కల్గదొ యవ్విధిగాఁ జరింపనో
జనులకు నేరికేని దనసంగతి పీడయె లేకయుండ మె
ల్లనఁ బదయుగ్మముంచఁగ నిలాస్థలిపైఁ దగునంచుఁ బెద్దలే
యనిరి; శశాంకశేఖరు సహస్రములౌ వరనామధేయముల్. 539

తే. ఉచ్చరించుచు వలగొన నొప్పుఁజుమ్ము
రమ్యగీతంబులన్ నామరాజిపాడ
నిర్వహాఁ దాండవంబు శశాంకమౌళి
కిష్టమైయుంట నదిచేయ నెసఁగు శుభము. 540

చ. పరశివభక్తకోటి తనభంగి నటింపఁగనోఁ బ్రదక్షిణం
బురుమతిఁ జేయ; స్వాంతమున నొప్పదు వేఱొకగాథ; దేని నా
తరుణమునందు సంస్మరణతం దగియుండఁగఁ జేయ నిద్దియే
హారవిధులన్ వచించు వివిధాగమసమ్మతమో మునీశ్వరా! 541

తే. ఇతరచింతలుమాని నన్నే తలంచు
చును బ్రదక్షిణ మొనరుప ననువుపడును
మోద మత్తఱి మనమును ముంచుచుండ
వలయుఁ జింతలు సుంతయేఁ గలుగరాదు. 542

సీ. వివిధదానంబుల విపులపుణ్యంబులఁ
బరులకు నుపకార మరసి యొనరు
పంగఁ బొసంగు లాభంబులు మఱియును
గల్గుపుణ్యంబులు గలుగునా ప్ర
దక్షిణం బొనరింపఁ; దాపసవర్య! స
త్యయుగంబు నన్వహ్నిమయముగాఁగ
త్రేతాయుగంబున ఖ్యాతమా మణిపర్వ
తముగాఁగ మఱియునుద్వాపరమున

ఆ. హైమమయముగాఁగ నట్టులె కలియుగ
మునను మరకతాద్రిగను భజింప

నగును స్ఫాటికంబు నరుణంబును స్వయంప్ర
భంబు నై నలింగవరము వరము. 543

క. ఈవిధి యుగభేదంబుల,చే వఱలెడులింగరూపు శివుని భజింపం
గా వసుధఁ బాపము_క్తిని,బావనతం గాంచు శివునిపదమ్ముం బొందున్.

క. మనసునకుఁ గాయవాక్కు_ల,కు నగమ్యం బనుపమంబుం గోత్రాభిదమ
ట్లనలమయము నై వెలయుట, మునివర్య! సమీపమునకుఁ బోవఁగఁ
[జూడన్.

ఆ. సాధ్య మెట్టు లగును? జనుఁడు ధ్యానప్రద
క్షిణములను బొనర్ప క్షీణపాపుఁ
డగును బిదప లింగ మగునభిగమ్యంబు
వాఁడె సుకృతి యిటు లెవం డొనర్చు. 546

క. అతనిపదధూళిసోఁకిన,మృతి జరయును లేకయుండు మృదురూపంబే
యతనికిఁ గల్గును త్రిదశ,ప్రతతిని వహియించునవి పరస్పర మెపుడున్.

ఆ. కోరుచుండు శోణకుధరాగ్రమునఁ బాద
మిడఁగ సంతతంబు వృక్షరాజ
ము లగుకల్పభూజములు నీడ నొసఁగుచు
క్షితిధరంబునకును సేవచేయు. 548

చ. నరులు ప్రదక్షిణంబున ఘనప్రతిరోధకతుంగశృంగసుం
దరమగు శోణశై లమును దప్పక గొల్వ నమర్త్యసంఘ మీ
శ్వరగణముల్ తముం గొలువ భవ్యవిమానము లెక్కి స్వేచ్ఛగాఁ
దిరుగుదు రభ్రమార్గమున దివ్యసుఖంబుల నెప్డు గాంచుచున్. 549

వ. అంగప్రదక్షిణంబున స్వర్గలోకవాసార్హ శరీరంబు గలుగు వజ్ర
సమానశరీరంబున నెప్పుడును ఖేదంబు నొందక తిరుగుచుండు. దేవత
లెల్ల రదృశ్యరూపంబుల నీపర్వతంబునం దిరుగుచుందురు. ప్రదక్షిణం
బొనర్చుతఱి వినయభక్తు లెసంగందగు. వానిం గాంచి దేవతలు
వరంబు లిత్తురు. దేవతలు ముప్పదిమూఁడుకోట్లు ప్రదక్షిణం బొన
రించి వేఱువేఱుమార్గంబుల నిర్మించి లోకపూజ్యులై రి. సూర్యా
దులు ప్రదక్షిణం బొనరించి గ్రహత్వముం గాంచిరి. రవివారము
నేనరుండు ప్రదక్షిణం బొనరించు నతండు సూర్యమండలము భేదించి

శివపురమున కరుగు. సోమవారంబున గిరిప్రదక్షిణం బొనరించి యజ రామరత్వంబును, భౌమవారంబున నాన్యణ్యసార్వభౌమత్వంబును, బుధవారమున సర్వజ్ఞత్వమును, గురువారమున లోకగురుత్వంబును, భృగువాసరంబున మహాలక్ష్మీత్వవైష్ణవపదలాభంబులను, మందవారంబున గ్రహపీడావిముక్తివిజయంబులను బడయు నని పలికి మఱియు నిట్లనియె. 550

క. తారకాద్దైవతమ్ముల, తో రమ్యగిరీంద్రమునకుం దొడరినభక్తిం
జేరి ప్రదక్షిణ మొనరచి, సారపదంబున వసింపంజాలెఁ మానీ! 551

క. ఏతారయందు శోణ, ఖ్యాతగిరీశునకు భక్తి యమర వలగొనుఁ
శ్రీతరుణీకృపగల్గంగ, నాతని నొనరించుఁ దార యది మునినాథా! 552

క. కరణంబులు తిథియోగో,త్కరమును నాభక్తులకు ముదం బిడుచుండుఁ
గిరికిం బ్రదక్షిణంబును, గరమర్థి నొనర్చువారెకద నాకుం బ్రియుల్.

క. మూరుతములు వివిధములగు
హోరలు నాభక్తులకు మహోదయ మొలయం
గా రహి నొనర్చుచుండును
గారవమును గూర్చుచుండు గాఢకరుణచేన్. 554

సీ. అఘముఁ బ్రకారంబు హతి యొనరించు ద
కారము వాంఛలం గడంగి యొసంగు
క్షీ యనువర్ణం బొగి క్షీణింపంగాం జేయుం
గర్మజాలంబు, ణకార మొసంగు
నపవర్గపదము ని ట్లర్థమాను బ్ర
దక్షిణమను నీశబ్దమునకుం దలంప
దుర్బలుల్ కార్యయుక్తులు నాధిబాధితుల్
వ్యాధిపీడితులు నీయచలమునకు

తే. భక్తి వలగొని మ్రొక్కినం బాయు నవ్వి
యెల్ల నొక్కక్షణంబున నెవఁడు నన్ను
నట్టిపుణ్యాకరమ్మంబున నలరఁ జేయు
నతనికిం బ్రదక్షిణం బెవ్వఁ డాచరించు. 555

క. వలగొనినఁ మూఁడుజగముల,ఫల మూతం బొందు లోకపాలకులు దిగీ
శులు మఱియుఁ గల్గు దేవత, లెలమిఁ బ్రదక్షిణ మొనర్చి యేస్థిరలక్ష్మిన్.

తే. పడయఁగల్గిరి నేనును బ్రమథవరుల
నిర్జరుల మౌనివర్యుల నియతిఁ గూడి
యుత్తరాయణ మే తేర నుద్యమమున
వలగొనుదు నన్ను నేనె పావనత వెలయ. 557

క. అరుణాద్రి యనెడు పేరున
బరఁగున్ మద్రూప మగుచు భూమయ మగుచున్
బరమం బగులింగము ముని
వర! నేను బ్రదక్షిణంబు భద్రద మనుచున్. 558

క. లోకములకెల్ల హితమని, యేకావింతును మునీంద్ర! యిటఁ దపమునకై
నాకాంత యేగుదెంచును, శ్రీకర మగు పర్వతేంద్రుఁ జేరి భజించున్.

క. వలగొని పావనతం గని, లలి నన్నుం బొందును మరలం బూర్వమటుల్
ఖలజనుల కగమ్యం బిది, ఫల మిడుఁ బుణ్యాత్మకులకు వలసినరీతిన్.

క. వినుకార్తికికాహ్వయమునఁ, గనఁబడు నేతిథిని కృత్తిక యనెడు ఋక్షం
బనఘా! యత్తఱి నాకుం, బొనరించు ప్రదక్షిణంబు పూర్ణఫలదమౌ.

తే. గౌరి యట్టిప్రదోషంబుఁ గానరాఁగ
నందు భక్తిఁ బ్రదక్షిణ మాచరించి
తైజసం బగులింగంబుఁ దాను జూచి
నన్నుఁ గూడంగఁగలిగె సంపన్నయతిని. 562

తే. ఇట నవీతకుచాహ్వయ మెసఁగ నుండు
మనుజులకు దుర్లభం బగు మహితలింగ
దర్శనం బట్టి పావనతరుణమందు;
నుత్తరాయణకాల మత్యుత్తమంబు. 563

క. సురగంధర్వులయక్షో,త్కరమును సిద్ధాసురులను గౌరి ముదమునం
గరుణాపాత్రులఁ జేయుచుఁ, గరమాశ్వాసించు వారికాంక్షలొసఁగుచున్.

ఉ. ఆసమయంబునందుఁ ద్రిదశావళియంతయు భక్తిఁ గూడుటం
జేసి పవిత్రమై సుగుణసిద్ధికుదాహరణంబు నౌచు నో

భూసురవర్యానిపుంగవ! విభూతిదమై తగియుండుఁ గాన న
న్నాసమయంబునం గనిన నర్చనలన్ బరితృప్తుఁజేసినన్. 565

క. మును పెన్నిజన్మములఁ జేసినపాపములెల్లఁ బాయుఁ జెప్పెద నదియే
ఘన మహాప్రాయశ్చిత్తం,బనఁజనుదుర్లభమె నన్ను నపుడు గనుటయున్.

చ. శ్రమముల నొందినైన నను శైలమయాంగుని ద్విజసంబు నా
క్షమఁ బ్రథ గాంచులింగతనుశాలిని బూజలఁ దృప్తుఁజేయుపు
ణ్యాము గనఁజాలుమానవులు హర్షమునొంది విముక్తు లౌదు ర
త్యమలఫలప్రదంబు నగునట్టిప్రదక్షిణ మప్డు చేసినన్. 567

చ. ధరణివిభుండు పూజ్యుఁడగుఁ దత్సమరంబుల ముందునుండి నే
నరుల జయించి యిత్తు విజయంబును వారికి; నేక్షితీశుఁడే
ధర మనుచుం దపస్వి యయి తత్తిపుండు ప్రదక్షిణంబు భూ
సురతతులే యొనర్చునటు చొక్కపుభక్తిని జేయఁగాఁ దగున్. 568

తే. మండలమొ మండలార్థంబొ మహితనియతి
విధిని సంకల్ప మొనరించి వేడ్కఁజేయఁ
బంచినన్ రాజ్యభూతి చలించ దెపుడు
శత్రుసాధ్యసమే లేదు సత్య మిద్ది. 569

చ. అతఁడు రణంబుచేయఁగఁ బ్రయత్నము సల్పిన ముందుఁబోవుచున్
హిత మొనఁగూర్చుచున్ రిపుల నెల్లరఁ జెండి జయం బొసంగుదున్;
గృతమగునేఁ బ్రదక్షిణమ దెత్తఱి నైనను వాహనోత్తమ
స్థితిఁ గని యద్ది నంత ఫలసిద్ధిని గాంచదు గౌతమాహ్వయా! 570

సీ. ధర్మలోభంబున దాను శివాచార
 ముల స్మరింపక స్వేచ్ఛ వెలయనట్లు
వాహనస్థితుఁడయి బాహుజగర్వంబు
 దన్ను ముంపంగఁ బ్రదక్షిణంబు
చేయుకాంక్షను రాజసింహుఁ డొక్కఁడు ధర్మ
 కేతునాముండు పరేతరాజ
పురినుండి యరుదెంచి తురగాధిరూఢుఁడై
 యొనరించె దానివాహనము దాన

ఆ. నపుడె ప్రమథగణమునం దొక్కఁడై పుట్టి
శైవపదము నొందఁజాలె రాజు
నావిధంబుఁ గాంచి యంఘ్రులచేఁ బ్రద
క్షిణ మొనర్ప నొందె గణపతితను. 571

చ. అదిమొద లింద్రముఖ్యు లగునయ్యమరుల్ వనజాక్షుఁగూడి యే
పదములచేఁ బ్రదక్షిణ మభంగురభక్తి నొనర్పఁబూని; రం
తఁ దపము క్షీణతం గనఁగఁ దక్షణ మాసురపత్తసమ్పత్తిన్
గదిరినభీతిచే మును పొకంశు ధరంబడె సిద్ధుఁ డోమునీ! 572

చ. అరుణగిరిం బ్రదక్షిణ మహాసుకృతక్రియఁజేసి పూర్వ మె
క్కరణి సురేంద్రుపత్తనముఁ గాంచెనొ యట్టులె కాంచె; గౌతమా!
పురహరునిం బ్రదక్షిణపుఁ బూజను దృప్తుని జేయుచో నెటో
ధరఁబడు పాదరక్తమును దద్గిరివర్యదృషత్ప్రహారతన్. 573

సీ. స్వారాట్శిరస్థసమందార కేసరములఁ దుడువంగఁ బడువడి వడిగ నద్ది;
విను ప్రదక్షిణమహావీథిశిలాశక లాఘట్టితం బగునంఘ్రితములఁ
దానె భార్గవిపయోధరకుంకుమములచేధరియించు;మణిపర్వతవరశృంగ
ములను గల్పద్రుమముల వనాంతరమందుసంచరింతురు పంచజనులుగిరికి

తే. వలగొనన్ సత్యమీయాదం చలరఁ బలికెఁ
బరమశివుఁడన్న విని శైలభవమునీంద్రుఁ
గాంచి ప్రశ్నించె నుపచారకర్మఫలముఁ
దెలుపవయ్యా! మునీశ్వర! తేటపడఁగ. 574

చ. ఎవరెవ రాచరించిరొ విధీరతమా నుపచారసంతతిం
దవిలినభక్తి వారలకుఁ దద్భవు సత్కృపఁగల్గెనొక్కొ? యె
ట్టి విమలవాంఛితంబులు గడించితపంబునఁ బొందఁజాలు న
య్యవి లభియించెనొక్కొ కరుణాకర! వానిని దెల్పు తేటఁగన్. 575

మ. అని ప్రశ్నింపఁగ మౌనివర్యుఁడను నార్యా! భవత్ప్రశ్నమున్
వినఁగాఁ జక్కనియుత్తరం బిడఁ గడున్ వేడ్కల్ జనించెన్ మదిన్
మును నే నీవలెఁ వేఁడ శంకరుఁడు సమ్మోదంబునం దెల్పె; వా
నినె నీకున్ వివరింతు నానుడులుగా నీ వెంచరా దెత్తఱిన్. 576

ఆ. సాలెపురుగు తంతుజాలంబులన్ నన్నుఁ
బూజచేసె నొకటఁ బూతమయ్యె
శైలమందు నిందు జాతిస్మరుం డొక్కఁ
డంశుకములఁ గప్పె నధికభక్తి. 577

చ. ద్విరద మొకండు దప్పిగొని తృప్తినిఁ గూర్చు మధుస్రవంతి స
త్వరముగ వీడి కానఁదగు భాసురపల్లవరాజిఁ గప్పి దు
స్తరభవవార్ధి దాఁటి ప్రమథవ్రజనాయకుఁ డయ్యె నల్లె నా
పరిసరమందుఁ బొర్లుచును బాపము వాయఁ గృమివ్రజం బటన్. 578

ఆ. సిద్ధవేషములను జెలఁగుచు మల్లోకమునకు నేగుదెంచె; వినుక్షణంబు
దీపమాలికార్చి వ్యాపించియుండంగఁ జేయఁ దేజరిల్లు శివపదమున. 579

వ. హారీతం బొకండు శాఖానీడుండై నాయంతికమున వసించె. ఖద్యోత మొక్కండు రాత్రియంతయు దీపంబువలె సంచరించి యాపుణ్యంబునఁ దజ్జన్మవిముక్తినొందె. గోవులు వత్ససంస్మరణసంభవప్రస్రవణంబుల నన్నుం దడిపి మత్పార్శ్వమం దుండఁజాలె. కాకం బొండు పక్షజనిత వాతంబున బలిగ్రహణలోలుపం బయ్యు మత్పురోభాగంబును సమార్జనము చేయుటం జేసి విముక్తిం గాంచె. మూషకం బొక్కండు మదాలయభాగంబును మణిసంఘనికర్షణంబులఁ బ్రకాశింపఁ జేయుటం జేసి తిమిరాపనోదనోపకారంబున మద్రూపంబు నొందఁజాలె. నాపార్శ్వంబున ఛాయావృక్షత్వముం గాంచుటకు మునులు దేవతలును గోర్దురు. దానఁ బునర్జన్మము కలుగ దని వారివిశ్వాస మని యెఱుంగం దగు. మఱియు, 580

క. గోపురశాలాశిఖరము, లోపికమై మండపంబు నుద్యాన మమరన్
వాపిక నిల్పును ముందటఁ, జూపట్టును వాంఛితములు క్షోణీదివిజా!

చ. అనలమయంబు లింగ మిది యప్రతిగమ్యము దేరి కేగి రీ
శుని దగురూపమూని యిటఁ జూడఁబడం దగియుండుఁ గౌతమా!
కనుక ధరాతలంబున నికామము పూజ్య మిదాను జూడ స్ప
ర్శన మొనరింప ధ్యానమునఁ జక్కఁగఁ గాంచఁగ నర్హమై తగున్.

క. తను సేవించినభక్తుల, ననుపమపావనతఁ గాంచున ట్లొనరించున్

జనులంబోషించుపరాం,బను బూజలఁ దన్పవలయు భక్తులు పూన్కిన్

ఆ. ఖ్యాతినొందు నిం దవీతకుచాఖ్యసం
స్తవము గాంచి జనని జవ్వనంబు
స్థిరతఁ గాంచియుండఁ జెలువారుచుండు యౌ
వనము గోరువార లనవరతము. 584

క. ఈయంబను సేవింపఁగ,బ్రాయము దిగజాఱకుండ వరమొసఁగు; మఱే
దేయెడఁగోరినఁ గల్గును, శ్రీయును సద్బుద్ధి మఱియుఁ జెప్పఁగ నేలా?

క. పరలోకమందు నిందును, దర మీయది గాదు పొంద దానికి నింకే
వరుసం గర్మముచేయఁగ, సరిపడు నాకోర్కి యనఁగఁజాలని యట్లే.

ఆ. వరము లిచ్చుచుండు వారివారికిఁ దగి,నట్లు లోకజనని యరుణశైల
మప్రమేయగుణసదాధార ముత్తమ,కాంతిఁ తార్ధదంబుగాఁ జెలంగు.

సీ. సకలభోగైకసంస్థానంబు నగుఁగాన నర్చింపుమా దాని నన్వహంబు
ననిపల్కెఁ బార్వతీ! యఖిలకామంబులఁ బడసియు శంకరుభవుని సతత
మాశ్రయించినవాఁడనాత్మతృప్త్యర్థంబు గావుననీ వెందుఁగడునియతిని
దపమొనర్పుము జగత్తతిహితంబునుగోరినీకె కాదిది యెల్లలోకములకు

ఆ. మునుల కమరులకును గనఁజేయుక్షేమంబుఁ
గారణాంతరమును గల్గఁజేసి
తపముచేయుచుంద్రు దగు నని దేవత
లిది రహస్య మనుచు నెఱుఁగఁదగును. 588

క. ఫలములచే శంకింపఁగ, వలసిన దది యంచుఁ నెంచవలయు గిరిసుతా!
కలిసియె దేవతలను నే, నెలమిన్ నివసింతు నిట మునీశులతోడన్.

ఉ. నీతపముం గనుంగొనఁగ నిన్ను గనం గృతకృత్యతం గనన్
జేతములందుఁ గోరి నివసింతుము తావకమా తపంబె మ
మ్మాతతిఁ ధన్యులై మన గిరీశసుతా! తగియుండఁ జేయ నా
గౌతమువాక్కులన్ వితతగౌరవగర్భములన్ మహాదృతిన్. 590

చ. విని మదిఁ గౌతుకం బొలయ వేదవిదుత్తము గౌతమున్ మహా
మునిని బ్రశంసచేసి తపముం బొనరింపఁగ నేల? దర్శనం

బున నది చేసినట్లి గద పూతతమారుణశైలరాజి నా
కనులకు విందొనర్చె వినఁగల్గెఁ దదీయమహత్త్వ మేర్పడన్. 591

ఉ. భూమిమహత్త్వమీయది ప్రభూతవిచిత్రత నొందియుండు సు
త్రాముని పత్తనంబు తలదన్నినయట్లు చెలంగ నిద్ది యా
రా! మహనీయులై జనమహత్తరలింగము దేవతాళికు
ద్దామవరంబు లీయఁదగి తా వెలుఁగొందెడు సుందరాకృతిన్. 592

క. హరసుప్రసాదసిద్ధం, బరయఁగ నీస్థానమంచు నాత్మకుఁ దోఁచెన్
బురహరునిం దెభజించుచు,గురునిల్ లోఁ బఱచుకొందుఁగోర్కి-ఫలముగన్.

క. అవినాభూతం బైక్యము, భవునకు నాకుండుఁగాక! ప్రాక్కాలమున
ట్లవనీసురవర్యానీశ్వర!, భవత్కృపం గాంచుదాన భవనాయకతన్.

చ. అని మునివర్యసన్నిధి నహార్యశివార్చననిష్ఠ నొంది జ్ఞా
ననిరుతి మించి యాదరమునన్ వెలుఁగొందుచుఁ బర్ణశాల న
మ్మునివరు నానతిం గొని విభుం బరమేశ్వరు లోఁదలంచి చొ
చ్చెను మునివర్య నాశయము సిద్ధిని గాంచఁగఁజేయు కోరికన్. 595

ఉ. కోమలగాత్ర మొప్ప స్ఫుటకోకనదప్రియసన్నిభాస్య ము
ద్దామరుచిప్రతానము సతంబు తమఃప్రవిఘట్టనక్షమం
బై మహనీయరీతి వెలయన్ నయనంబులు ఫుల్లపంకరు
డ్ధామముఁ గొల్లవెట్ట ఘనతం దగి చన్గవ నిక్కుచూపఁగన్. 596

తే. దానిపై నుత్తరీయంబు గానరాక
యలరుచుండంగఁజేయ జటాళి చక్క-
నింపుచూపఁగ నిండ నీలాశ్మకాంతి
గాత్రము ధరింపఁ బార్వతి కడు వెలింగె. 597

చ. తనువు గ్రహించి యాతపమె ధాత్రిఁ గనంబడురీతిఁ బొల్చుచున్
ఘననియమంబులన్ దనరఁగాఁ దగి ప్రాప్తవిచిత్రయోగబం
ధనికరముల్ గనంబడఁగఁ దత్త్వవిదుత్తమ లౌరా! యంచుఁదన్
వినుతి యొనర్పఁగా వివిధవేదగణాగమధర్మమార్గమున్. 598

తే. ఆశ్రయించి కృతార్థతనందు నట్టు
లాచరించుచుఁ దపమున నంగవల్లి

మ్లానతం గాంచఁగా నొక్కమాఱు ఖేద
మావహిల్ల సహించుచు నధికకాంతి. 599

క. చెలువారుచు హరినీలమ,ణులరాశి యనంగ దివ్యనూత్నజ్యోతి
ర్లలితలత నాఁ దనర్చుచు,జలజాక్షి కనంగనయ్యె సాధువు లలరన్.

---

## దశమాధ్యాయము.

పార్వతి తపమొనరించుట-మహిషాసురునితో ననిచేయఁ బూనుట

చ. ఇది యిటులుండ నిర్జరు లహీనబలాఢ్యుఁడు దుష్టచిత్తుఁడే
యదనున నైన మార్కొనఁగ నాయతశక్తినిఁ జూపి నొంప శ్రీ
సదనునకైన నంతయును సాధ్యముకాని పరాక్రమంబునం
బొదలు సురారినాయకుఁడు పొల్చెఁ గదుర్ మహిషాహ్వయుండటఁ.

చ. అతఁడు పరాక్రమించి త్రిదశావళి నేచఁగ భూమిఁ బాసి పా
ర్వతి తపమాచరింపఁ గని వందనముల్ పొనరించి దీనతన్
మతివిభవంబు దూల ననుమానము మాని త్వదంఘ్రిపంకజ
ద్వితయము తప్ప దిక్కొకఁడు వేమఱు గాంచిన లేఁడు మాతరో! 602

చ. శరణము చొచ్చినారము ప్రసాదముగోరితి మంచుఁ బల్క ని
ర్జరులను జూచి సాధ్వసము చయ్యనఁబో నభయం బొసంగుమా
గిరివరపుత్రి! యంచుఁ దనుగీర్తనచేయు టెఱింగి యేటి కి
క్కరణిని వేఁడువారో త్వరగాఁ దెలుపందగునంచుఁ బల్కినన్. 603

చ. శతమఖుఁ డాదిగాఁగఁ ద్రిదశప్రకరంబులు దోసి లొగ్గి యా
దితిజవరేణ్యు వంకఁ జనుదెంచినయాపద విన్నవించునా
దృతిఁ గొని యిట్లు పల్కెను సతీ! వినవమ్మ భయకంరాకృతిన్
జతనమునన్ ధరించి మహిషప్రబలాసురనాథుఁ డుగ్రుఁడై. 604

తే. మమ్ము బాధించుచున్నాఁడు సమ్మదంబు
దానఁ గల్గుచు నుండుచందమ్ము గానఁ
బడఁగఁ జేయుచు నున్నాఁడు ప్రబలుఁ డగుట
నచ్చరలఁగూడి సల్పువిహార మంబ! 605

ఉ. నందనమందు నచ్చరల నైజవిభూతి నెసంగువారి నా
నందము నొంద బల్మి గొనినన్ భయమొందుచుఁ జేయుకార్య మా
త్రం దలపోసి కానక వితాకున వానినె కూడియున్నవా
రిందుల కేప్రతిక్రియయు నెవ్విధిఁ జూచినఁ దోఁప దించుకేన్. 606

క. ఐరావత మాదిగ నా, శౌరమణుల నాగముల నెసంగెడుపూన్కిన్
సారబలంబున గేహ, ద్వారంబునఁ గట్టివైచెఁ దల్లీ! కనుమా. 607

సీ. భార్యలంగూడి యావాసముల్ వీడి విహరింపవచ్చిన విమలభూష
ణము లొప్పనున్నట్టి నాకహయంబుల నుచ్చైశ్శ్రవాదుల నుగ్రమతిని
గట్టివైవఁగఁబంచికార్యముతఱివానిననుభవించుచుస్వేచ్ఛయలరనున్న
వాఁడు తల్లీ! దుస్స్వభావునిహయశాలలతఁలు కోటులు వీక్షణముల

ఆ. కింపుగూర్చుహాయము లిపు డున్న వేమందు
మగ్నివాహన మగునమలమేష
మాత్మజులను మోయు నకార్యమునకుగాఁ
బనుచు చున్నవాఁడు పలుకు లేల. 608

మమని వహించు నమ్మహిష మాత్మబలంబున నీడ్చి తెచ్చి స్వీ
యమగుశతాంగ మీడ్చుపని కాతఁడు పూన్చినవాఁడు పార్వతీ!
విమలతమాణిమాదులను విశ్వజనీనము లైనసిద్ధులన్
గ్రమమున స్వీయమందిరపుఁ గర్మమునం దునిచెన్ దలోదరీ! 609

ఉ. ముప్పదికోటు లచ్చరలు మూర్ఖునియింటఁ దదీయసేవలం
దప్పక చేయఁబంచుటయుఁ దమ్ము పరాభవ మొందకుండ నా
ముప్పుతొలంగఁ జేయఁదగుపూరుషు లెవ్వరు గానరామిఁ దా
మొప్పినయట్లు చేయుచు మహోగ్రవిపత్తులఁ గుందువారొగిన్. 610

క. జగములమూఁడిఁట నుత్తమ, ముగ గణ్యంబైనరత్నపుంజము స్వీయం
బుగనుండవలయుననుచుం, బొగరునఁ దెప్పించె శౌర్యమునమించుటచేన్

ఆ. ఎవనియింట నవ్వి యింక నుండునో వానిఁ
జంపఁబూనినాఁడు శంక లేక
యతని కోపమునకు నాగంగఁజాలిన
వాఁడు గలఁడె యేభువనమునఁ గన. 612

ఉ. మేమును సేవకాళి నియమింపఁగ నుండెడువారమే భయం
బేమెయిఁబాయ శాంతిఁ దపియింపఁగఁ జేయఁగ వానియానతిం
గోమలమానసంబులను గుందుచు నైన బహూకరించుచు
న్నాము మఱొండురీతి శరణంబు గనంబడమిన్ గృపాలయా! 613

క. శరణాగతసంత్రాణము, ధరణీధ్రసుతా! తలంపఁ దపము ఫలముగా
బరికీర్తింతురు పెద్దలు,సురవైరి యితండు చూడ శూరుఁ డరయఁగన్.

తే. దుర్జయుఁ డగుమహిషుండు దోర్బలమున
నధికుఁ డెల్లరలో నౌట హరకృపవర
లాభ మొందుట దానప్రలన్ త్రిదశుల
సమరమున నోర్వఁగాఁ దగుశక్తి తగుట. 615

క. ఆతనిశృంగాగ్రహతిన్, భీతిల్లి సముద్రుఁ డేగి విజయ మొసఁగితిన్
దైతేయా! నేనోడితి, శాతభవచ్ఛృంగహతికి క్షమియింపు మిఁకన్.

చ. అని బతిమాలి రత్ననివహంబులు కానుక లిచ్చి తత్ప్రియం
బును గనఁగోరెఁ గొమ్ముకొన భూధ్రములం బయికెత్తి యుద్ధతిం
గొని వరధాతుధూళి తనకుం దగుచందన చర్చగాఁగ న
ద్దనుజవరుండు భూరిబలదర్పములన్ జెలరేఁగుచుండఁగన్. 617

తే. వాని నోర్చుట శక్య మెట్లైనఁ గాదు
యుష్మదోజస్సుచే వాని నుక్కడంచి
మమ్మురక్షింపుమా తల్లి యమ్మదాంధు
శక్తి యెట్టిదొ యెఱుఁగంగఁ జాలుదీవె. 618

చ. హరు పరశక్తి స్త్రీతనువు నంది యిటం గననౌచు వెల్గు నో
ధరణిధరాత్మజా! త్రిదశదస్యుని నీవ వధింప నర్హవౌ
దరయఁగ శంభుదత్త వివిధార్హవరంబులు గల్గువాఁడుగా
సురరిపు వుంట నెవ్వరును శూరతఁ గాంచరు వారి నోర్వఁగన్. 619

క. జననీ! శంకరుచేష్టిత,మును మేమెఱుఁగంగఁజాలము గదా నీవే
కని మమ్ముం బాలింపుము,కనికరమునఁ బుత్త్రికులము గావున నిపుడే.

చ. అని కడుదీనభావముల నయ్యమరుల్ మొఱపెట్టుకొంచు వం
దనములఁ గేలుమోడ్పులఁ బదస్ఫుటపద్మరజఃకలాపరా

జనియతధారణంబులను జేడ్పడుశక్తి నిజాశయంబులం
దనకడఁ దెల్పఁ బార్వతి నితాంతదయామతి వారి నెంచుచున్. 621

ఆ. అభయ మొసఁగివారికలఁతినవ్వునఁ దెల్పె,స్వాశయంబునిట్టులమరులార!
శరణుచొచ్చువారి సంరక్షణమ్ము త,పఃఫలంబుగాఁగఁ బలుకఁదగును.

ఉ. ఏనటు లాచరింపఁ దగు నిప్పని నేఫలియింపఁజేసెదన్
దానవుఁ డంత మొందునటు దానొగిఁజేయును గాల మద్దియే
రానగుఁగాదె తాళుఁ; డది రాఁగలదం చెదలం దలంపుఁడే
నూనిన వేడ్క నమ్మహిషు నొక్కయుపాయమునన్ వెలార్చుచున్.

తే. చంపివై చెద నపరాధసహితుఁ గాని
వానిఁ జంపంగ న్యాయ మెట్లొను జెపుఁడ,
ధర్మరతునందు ధర్మభేత్తలు మిడుతల
గతి నడంగుదు రని నమ్మఁ గాఁ దగుఁగద. 624

చ. అని యభయప్రదానమున నాదృతిఁ బల్కిన నంబవాక్యముల్
విని నతు లొప్పఁజేసి పదివేలవిధంబుల సన్నుతించి దే
విని దనివారఁ గాంచుచు నివృత్తభయాధికు లౌచుఁ బోయి రా
ర్తిని విడనాడుకాల మది దేవియనుగ్రహ మంచు నెంచుచున్. 625

ఉ. వారు భయంబు వాసి చన వారిజలోచన గౌరి యద్భుతా
కారము దాల్చె మోహినికిఁ గ్రాలుతనుద్యుతి యొప్ప నంతలో
భూరిగిరీంద్రరక్షణము పోలును జేయఁగ నన్నయూహ హృ
త్సారసమందుఁ దోఁప బలశాలుర భైరవనామధారులన్. 626

తే. వటుకనాముఁడు లోనగువారి నాల్గు
దెసల స్థాపించె నత్తఱి నసమనేత్రుఁ
బాసి కైలాసముననుండి వచ్చెఁ దాను
నపుడు వటుకాదు లరుదెంచి రంబఁ గొలువ. 627

ఆ. వారితోడ మాతృవర్గంబు వచ్చెఁ ద
న్నెపుడు గొలువ వార లెన్న దుంద
భి యని సత్యవతి యనియు నానవమి యని
సుందరి యని పిలువఁగం దగుదురు. 628

క. నలువురు వీరలు క్షితిమాతలుగా నెన్నంగఁదగుచుఁ దల్లిని గిరిజం
గొలువంగ నేగుదెంచిరి,బలశౌర్యము లొప్ప నుండువారు గిరిజతోఁ.
ఆ. శ్రాంతుఁడైన యతిఖిన్నత్తము మాత్రము
విడువుఁ డరుణగిరిని వేడ్కఁగనఁగఁ
గోరుచున్న నొరులఁ గ్రొవ్వడఁగింపుఁడీ
చేరరాఁగఁ దలఁప భూరిశక్తి. 630
చ. అని యిటు భైరవాఖ్యులకు నానతి యిచ్చి చతుర్దిశల్ గనుం
గొనుచు వసింపుఁడీ యనుచుఁ గోమలి వారల హెచ్చరించుచున్
మునిపతి యైనగౌతముని పూజ్యతమాశ్రమమందు నిల్చి నె
మ్మనము భవాంఘ్రిపద్మముల మాననిపూన్కి స్మరించుచుండఁగన్.
చ. తప మొనరించుచుండె నిటు తన్వి భయంకరమైనరీతిగాఁ
దప మొనరింప నంతయును దాపము నామెను జేరఁజాల కె
ట్లో పరుగిడెన్; సకాలమున నొప్పెను వృష్టి మహీరుహవ్రజం
బపరిమితప్రసూనఫలహారితరాకృతి నప్డు గన్పడెన్. 632
మ. జననం బాదివిరోధముం గనెడునాసత్త్వంబు లక్కాలమం
దున మాత్సర్యము వాసె; నాశ్రమము తోడ్తోడన్ శరణ్యంబు స
త్త్వనికాయంబున కయ్యె సాధ్వసమునే తన్మాత్రమే నిల్వకుం
డను దాఁబాపుట నద్భుతంబుగను గన్పట్టెన్ మునీంద్రాళికిన్. 633
తే. యోజనద్వయపర్యంత మాజగజ్జ
నని యిడినయాజ్ఞ చేకొని ఘనబలముల
వటుకముఖ్యులు నల్వురు వరుస సీమ
లయినకొండల నివసించి యరుణశిఖరి. 634
క. కాపాడుచుండి రత్తఱిఁ, జూపట్టదు త్రాస మెదియుఁ జూపులకేఁ దా
నోపదు భయహేతువదే,నాపగిదిన్ రోగభీతి యగపడదందున్. 635
మ. అరిషడ్వర్గవిజృంభణంబు గనరా దచ్చోట మౌనీంద్రు లీ
శ్వరి యచ్చో నివసింప ధన్యులయి యా శాతోదరిన్ గొల్చుచున్
బరమామోదసుఖంబు గాంచుచు నదాభగ్నాస్పదం బంచు నెం
చిరి శంభుప్రియ, ఘోరమా తపముతాఁ జేసెన్ జగద్ధాత్రికై. 636

క. రేయను పగలను భేదం, బాయెడఁ గనరాక యుండ నంబ తపంబే
యాయాసము లేకుండఁగఁ, జేయుచు సంతృప్తిఁ దానఁ జెందక యుండెన్.

చ. పురహరుఁ డాత్మఁ దృప్తి గనుపోలికఁ జేయఁగఁ బూనియుండె న
త్తరుణమునందె యమ్మహిషదానవవీరుఁడు వేఁటలాడు నా
దరమున శోణభూధరము దాపుననుండినకాననంబునన్
దిరుగుచునుండె సైన్యములు తీవ్రపరాక్రమ మట్టిచూపఁగన్. 638

మ. తనవెంటం జరియింపఁ గ్రూరమృగసంతానంబులం జెందుచున్
దినుచుం గోరినవానిమాంసమును సందీప్తక్షుధాహవ్యవా
హను శాంతిం గనఁజేయుచున్ మఱియు బాహాస్ఫారదర్పంబుఁ జూ
పను గాలం బిదె యంచుఁ దలఁపుల్ పర్వంగ వాఁడుండఁగన్. 639

ఉ. చాపము లూని యామృగయు సంతతి వెంటఁబడంగ భీతిచే
శ్వాపదసంఘముల్ దెసలఁ జయ్యనఁ బాఱఁగ వెంటనంటి బా
హాపటిమంబు గానఁబడ నమ్ములగ్రుచ్చఁగ నార్తినొంది యిం
కేపగిదిన్ మనంగ నగు నెయ్యది దిక్కని తోఁపమిం ద్వరన్. 640

చ. పరుగిడుచుం దదాశ్రమము భావుకదాయకమైనయట్లు తోఁప స
త్వరగతి నందుఁజొచ్చె శివుదార తపం బొనరించు నెందు న
య్యరుణగిరీంద్రుసన్నిధి మహాముదమొందఁగఁజేయు నాశ్రమం
బరుదుగ నొప్పఁగాన నదె యత్తఱి దిక్కని యెంచినట్లుగన్. 641

ఉ. వానిని వెంటనంటి పొడువం దమకించుచు నుండుదుష్టహృ
ద్దానవు లామృగావళులదర్పమునం బొలియించు వేడ్కరాఁ
గా నటనుండి శైలమును గాచు మహావటుకాళికూడ ది
చ్చోనిటు లూహచేయ నిది చోటగు శాంతరసంబునూనఁగన్. 642

మ. వల దిచ్చో భయకృత్ప్రియత్న మనుచున్ వారించి యిచ్చోఁ బదం
బులు మోపందగ దంచు హెచ్చరికలన్ మోమోటమిన్ మాని ని
స్తులశౌర్యం బలరంగఁజేయ వటుకస్తోమోక్తి యాలించి దు
ష్టులుగానన్ దనుసూను లేమిగల దిచ్చోఁ జిత్రముం జెప్పఁడీ. 643

క. అని ప్రశ్నింపఁగ వటుకుల్, దనుజులకుం దెల్పి రిట్లు తప మొనరించున్
వని నిందు శైలకన్యక, మునిజను లిందుండు వారు పొండిఁక మీరల్.

ఆ. ఇందుఁ జొరఁగరా దదెవ్వరికైన మహర్షి సేవితమయి యమరుచుంట
దేవితపముచేయఁ బావనస్థానమా? శరణుచొరఁగఁగాచు స్థలమిదెన్న.

చ. అని వటుకవ్రజంబు తెలియన్ వినిపించినదోర్బలంబునన్
దనుజులు విఱ్ఱవీఁగుట మదంబునఁ గన్నులు గానకుంటఁ జ
య్యన జొరఁబూనువారయిన నత్తఱి శాంతము నూని యల్లిచే
యను దగునంచు వేమరలి యచ్చటువాసి చనంగ నెంచుచున్. 646

ఆ. ఒక్కచోటఁజేరి యూహించి కర్తవ్యమంత మాయ నూని వింతపక్షి
రూపములను దాల్చి యాపర్ణశాలను,జొచ్చి రాదరంబు పెచ్చుపెరుఁగ.

క. ఆరామవృక్షశాఖలఁ, జేరిరి దివినుండివచ్చి చిత్రమ్మట నిం
పారఁగఁ జూడంగోరుచు, గౌరియు నక్కాలమందుఁ గమ్రాటవిలోన్.

క. ఋతుషట్కకుసుమపల్లవ,వితతియు ఫలమూలములును విరివిగనుండన్
మతికిం బ్రమోదమొసఁగెడు,వితమునఁగన్పడెడుచోటవిధిగఁ దపమ్మున్

చ. ఒనరుచుచుండ మాయఁ గొనియుండిన దైత్యులు చూచి; రంత ద
త్తనురుచిరత్వమున్ మృదులతారుచిరాగ్రకతారుణత్వముం
గని మొలనవ్వనందె గడఁగాఁ దగునంగము కాంతియుం దగన్
వనిత తపంబు చేయుచు నభంగురభక్తిని గ్రాలుచుండఁగన్. 650

చ. సురరిపులాతలోదరిని జూచుచు విస్మయమబ్బె పైకొనం
ద్వరపడిపోయి యమ్మహిషదానవనేతకు విన్నవించి ర
త్తరుణిని గాంచినార మని తత్తనువల్లివిధంబు నెల్ల నా
శరపతి మన్మథార్తుఁడయి చయ్యన వృద్ధునిరీతి నొప్పుచున్. 651

తే. ఆశ్రమంబుఁ బ్రవేశించె నతని నతిథి,పూజనంబులఁ దన్పె సఖీజనయుతి
శ్రాంతి చననున్నయట్టులాశరవిభుండు,కూరుచుండినసఖితతిఁగూర్చిపలికె.

క. వనితామతల్లి యిటు తప,మొనరుపఁ గారణ మదేమొయుచితమయేనే
వినఁగోరితి నన నెచ్చెలు, లనిరి మహాత్మా! పురంధ్రి యతిశయభక్తిన్.

ఉ. కాంతు ననుగ్రహంబు గను కౌతుక మొప్పఁ దపంబుచేయఁగా
నెంతయుఁ బూన్కిఁ బూనె నిట నెంతయొ కాలము చెల్లెఁగాని య
క్కాంతుఁడు తా బలాఢ్యుఁడయి కానఁగరాఁడు దమూరసంబు నా
క్కింతయుఁ జూపఁ డింతవఱ కెంతకృపారహితుండొ చూడఁగన్. 654

వ. వివాహసమయంబున యథోచితమనోరథంబు పడయంగోరి యున్న యది. అపూర్వప్రభుం డగు నతనిచే నవోపకరణంబు కల్పింపందగు. సద్యోజాతకులాలుం డగునతనిచే సద్యస్సృష్టంబులు విపాచితంబులు, పక్వంబులు సద్యస్కంబు లగుభాజనంబులు నిర్మింపంబడుచుండు. అట్టి సాధనంబుల నట్టి ద్రవ్యసంచయంబుల నపూర్వాదృష్టవిభవంబుల నుపకరణంబు కాఁదగియుండు. అట్టి యుపకరణంబు సిద్ధింప నప్పు డీమెకు స్వయంవరంబు సాగుననుటయు. 655

చ. పకపక నవ్వి యద్దనుజపాలకుఁ డిట్లనియెం దపఃఫలం
బిఁకఁ ద్వర సిద్ధి నొందఁగల దీయెడ కేఁ జనుదెంచినాడ నా
సకలవిభూతి నోసుదతి! సాధుతపస్విని! రాక్షసేంద్రుఁడన్
బ్రకటబలాఢ్యుఁడన్ ద్రిదశపాలకవందితపాదపద్ముఁడన్. 656

సీ. మహిషనాముఁడ జగన్మండలత్రితయంబు
సంగ్రహించితి బాహుశౌర్యముననె
మఱియొకవీరుండు మానినీ కనరాఁడు
మద్భుజాటోపంబు మహిత మరయఁ
గామరూపుఁడ సుభోగప్రదాయకుఁడను
గావుననే నన్నుఁ గాంతుగాఁగ
పరిణయింపు మిదియె నీవరతపఃఫల మని
విశ్వసింపుము సర్వవిధములైన

ఆ. వస్తుజాలములను వదలక కూర్చెదఁ, గల్పవృక్షతతులఁగడఁగి సద్మ
మునకుఁ దేరబంచెదనుదపోబలమున,సృష్టిచేయువాఁడఁ జెలఁగియిపుడె.

క. తొలి విశ్వకర్మ నింకను, గలవారిని గామధేనుకాండము గూర్పం
గలవాఁడఁ; దపమె నాకున్, బల మని నెఱనమ్ము మీవు పంకజనేత్రా!

క. విను మానవనిధులను బ్రక్కనె నిల్పును గోరినప్డు కావలసినవా
నినిగూర్పఁ దపమె వేగమ, యని పల్కఁగ నాలకించి యంబికయపుడే.

క. స్మరియించి దేవతలశం
కరు మానము మాని మెల్లఁగా స్మితయుక్తిం

గరమరుదై మోము తగన్
దరుణీమణి పల్కె మహిషదనుజేంద్రునితోన్. 660

క. బలవంతునిభార్యనుగాఁ, గలుగుదు నని తపముచేయఁగాఁ బూనితి నీ
యిల నీవు బలాఢ్యుఁడవై,యలరుదువే నైజబలమునఁగపటపు మిటన్.

చ. అనుటయు స్త్రీస్వభావమున గర్వముగాఁ దగినట్లుపల్కు న
వ్వనితను జూచి క్రోధమున వహ్నికణంబులు గ్రక్కు కన్నులన్
గనుచు దురాత్మురాల! ననుఁ గానుకకుం గొఱగానియట్లు నీ
వనితివి చూడుమంచు మహిషాసురుఁ డార్చెను ఘూర్ణిలన్ దిశల్.

క. చంపం దలంచివచ్చు ని,లింపాధీశ్వరుని మహిషలీలాకృతిచేఁ
బెంపొందఁదలఁచువానిం, దెంపునదహియింపఁబూని తెఱవయునచటన్.

చ. హరు నలరింపఁగాఁ దగినయట్లు తపంబున గర్వమైనయ
క్కరణి శరీర మొప్పెసఁగఁ గాననమందుఁ జెలంగు భూమిభృ
ద్వరతనుజాత యత్తఱిని వహ్నిసమాకృతిఁ దాల్చి దుర్గనాఁ
బరఁగి దురాసదం బయినపౌరుష మూని కనంబడెం గడున్. 664

క. తనమ్రోలన్ మండుచు ని,ల్చినదుర్గను భూరిశక్తిచేఁ జూడంగా
ననువుపడకయుండుమహో,తనుధారిణిఁగాంచి మహిషదానవపతియున్.

తే. ఇది మహామాయయే యని యెంచి తనదు
మహిషగాత్రంబు మేరువన్ క్ష్మాధరంబు
మాడ్కిఁ బెంచెను మఱి కులక్ష్మాధరవర
శృంగములఁ జిమ్ముచును దనశృంగములను. 666

క. ఆపూరితదిగ్వివరం, బై పరమదురాసదంబు నగుతనసేనా
కూపారముఁ బిల్చెను వడి, నీపజ్జకు రమ్మటంచు నెంతయు నలుకన్.

ఉ. అత్తఱిఁ బద్మసూతి మొదలైనసుపర్వులు పెక్కుభంగులన్
జిత్తము పొంగ సంస్తుతులఁజేసి ప్రణామములన్ బొనర్చి యా
యుత్తమరూపధారిణిగ నుజ్జ్వలతేజము శత్రుమారణో
పాత్తదురాగ్రహంబుఁ దగునట్లుగ నున్నపరాత్పరన్ శివన్. 668

శా. దుర్గానామము సార్థకం బగునటుల్ తోఁపంగ నున్నట్టియా
భర్గార్ధాంగిని గాలహవ్యవహరూపం బూని సక్రోధయై

స్వర్గద్వారము వైరికై తెఱచు నాశం బూను నాదేవతన్
సర్గాదివ్యవసాయదక్షఁ బటుదీక్షుం బూని పూజించుచున్. 669

చ. దనుజు వధింపుమా సురలతాపము వాపుమ యంచు వేఁడి ర
వ్వనజదళాక్షుఁ డంబకు నివారితశత్రుకదంబ కిచ్చె న
య్యనికయి హేతిపంచకము నట్లె దశాయతహేతు లిచ్చెఁ బ్రీ
తిని ద్రిపురారి బ్రహ్మ యతితీక్ష్ణ చతుర్మృథసాధనంబులన్. 670

ఆ. అవ్వి యెల్ల మాయ నగపడక యెయుండఁ
జాలు; దిక్పతులును సకలసురలు
జలధు లద్రులు నిజశస్త్రభూషణరాజి
నంబఁ దనిపి; రంత నాక్షణమున. 671

సీ. మాయయు బహుహస్తమండలమున నుజ్జ్వ
లాయుధవరసంచయమునఁ దనరి
కవచంబుఁ దొడిగి మృగస్వామివాహన
మొప్పంగ దుర్గనా నొప్పుచుండె;
నట్టహాసంబున నఖిలదిక్కులఁ బ్రతి
ధ్వను లీయఁజేయుచు ననుపమాన
తేజోబలంబునఁ దేరిచూడఁగ రాక
యుండఁగా దుర్గదా నుద్యమంబు

తే. గాంచి మహిషాసురుండు నిక్కముగ నాకు
మృత్యుదేవత యన నీమెయే. యటంచుఁ
దలఁచి పరుగెత్తె; ఘోరమై జ్వాలను మించు
నాత్మతేజము సైరింప నలవిగామి. 672

చ. పరుగిడుచుండు నాదనుజపాలుని గాంచి తలంచె నాత్మ ని
క్కరణి; నుపాయ మూని సురకాండవిరోధిని దుష్టు నీతనిన్
బొరిగొను; టొప్పుగాదె మదపూర్వముగా మృగజాతిలుబ్ధకో
త్కరములచే మరల్పఁబడుఁగాదె వనంబున నవ్విధంబునన్. 673

క. దూతోక్తులచే మరలిచి, చేతమునకు మృదువు లగుచు సిద్ధవితతికే
నీతటి నిట్లుండునటం, చేతీరునఁ దలఁపరాక యెంతో హితములై. 674

ఆ. ఊహాలకునుగూడ నొక్కప్పుడే దెలి,యంగరాక యుండునట్టిమర్మ
వర్తనముల దనుజవరునకుఁ గోపంబు, మిగులఁ గలుగఁజేసి తగినయట్లు.
క. కనుమూసి తెఱచులోపల, ననుఁగానఁగవచ్చుగతి మనఃస్థిరభూతిం
గాని చేయుదాన నిద్దియె, దనుజాధముఁజంపు సత్పథమ్మగు నిచటన్.
చ. పురుషుఁ డధర్మమార్గమునఁ బోవుచునుండి యధర్మవాక్యమె
త్తరుణమునన్ వినంబడునొ తత్క్షణమే పొడసూపుఁ గోప మె
వ్వరుసఁదలంప స్వాసుసమవాయవినాశనకారణం బై యె
పరఁగెడునట్టిదా నది కృపన్ విడి దానిని గల్గఁ జేసెదన్. 677
ఆ. ధర్మబుద్ధియగుచుఁదగుశాంతి గనునేని, హితముఁదెలుపనగునదెన్న ధర్మ
లోపమునకు హేతు వేపగిదిం గాదు, తపముచేయుచుండుదానఁ గాన.
క. * కోపత్యాగ మొనర్చుట, యేపద్ధతి; దాన ఫలము లెల్లం గల్గున్
జూపట్టునేని ధర్మం, బాపదనొందుట తపస్వియైనం ద్వరగన్. 679
తే. దాని నడపంగఁ గోపంబుఁ దాల్చఁదగును
బరమఫల మద్దియౌను దపంబునకును
సత్య మిద్దియె యనుచును స్వాంతమందుఁ
దలఁచి సురగురు వనుపేరఁ దనరు మునిని. 680
క. వానరముఖమున రాజిలు, వానిన్ మదిలోఁ దలంచి వచ్చితి దేవీ!
యేనిపు డొనర్పఁదగుపని,మానక సెలవి మ్మనియెడుమానిని ద్వరఁగన్.
చ. †దనుజవరేణ్యు చెంతకు హితంబును దెల్పఁగఁ బంపఁబూని యి
ట్లనియెను మాయఁగూడి చనవయ్య జవంబున మర్కటాననా!
మునివర! బోధచేయు మల మూర్ఖునిగా నరరూప మూను న
ద్దనుజుని మంచిమాటలను దప్పక మార్పును బొందునట్లుగన్. 682
తే. తెలుపు మీవచనంబులఁ దేటపడఁగ
నరుణగిరినాథుఁ బీడింప కరుగు మిపుడె

* అధర్మవృత్తియుక్తానాం ధర్మవాక్యపరిశ్రవాత్, కోపస్సముద్భవేత్సద్యః స్వజీవక్షయకారణమ్. ౭౦ అని మూలము.

† తపస్యద్భిస్సదా కార్యః కోపత్యాగః ఫలాన్వితః, ధర్మహానిర్నసోఢవ్యా తతో౽పోహి తపఃపరమ్. ౭౨ అని మూలము.

దుర్మతిని వీడి కుమతులదోర్బలంబు
శౌర్య మిందు నదృశ్యమౌ సత్వరముగ. 683

క. కలియుపతాపం బరుణా,చలనాథుని మ్రోల నుంత సాగ దసురపం
క్తులపీడనంబు చెల్లదు, పలుమాట లిఁకేల దనుజపాలక! తెల్పన్.

ఆ. సాహసం బదెద్ది శ్వశ్రేయసంబిడఁ, జాల దిందు శంభుచరణభక్తి
యుక్తులకునుగూడ నోసురారివరేణ్యా!, పూర్వజన్మలబ్ధపుణ్యములను.

చ. కలిగెను శౌర్యసంపద నికామము నీకు సహాయ మద్దిరై
చెలఁగెఁగదా యటంచు గిరిశేఖరు నీయరుణాద్రి నొంపఁగాఁ
దలఁపకు మీగిరీంద్రుఁ డనుదావహుతాశనుఁ డందు నీవిఁకన్
శలభత నొందఁబోకు మది సత్పథ మింతయుఁగాదు దానవా! 686

క. హరుఁడు భవత్పూర్వతప,స్స్ఫురణంబున కాత్మ మెచ్చి భూరిశుభసము
త్కరము నొసంగెనుగాదే, ధరణి నిటుల్ బీడచేయఁ దలఁతువ యేనిన్.

సీ. దావపావకునందుఁ దరువులవలె నట్టిశ్వశ్రేయసంబులు నమయుఁజుమ్ము
ధర్మాత్ములయి శైవధర్మభక్తులనెల్ల నెఱిఁగినవారికే యిందువాస
మర్హము; పరపీడనాసక్తులకుఁ గాదు; భోగశతంబులు పొలిచియున్న
నైశ్వర్యమతులమై యమరయున్న నశించు నెంతదురాసదంబేయనఁదగు

తే. బలముకూడ నశించు నీస్థలమునందు
నేల యల్పమతిం బూని యిందు స్వీయ
దోషముల నాశమొందుదు మేషమద్రిఁ
దాఁకి బ్రదుకంగఁగలదె యోదానవేంద్ర! 688

చ. కనుఁగొనఁజాలితే మరలఁ గన్నియ నీయెడ నామె చూడఁగాఁ
గనఁబడుచుండుగా యబలఁగాఁ గడు నామెహృదంతరంబునన్
దనుజవరా! వసించు నలదర్పకహంత సదాశివుండు శో
ణనగవరేశుఁ డందునని నారి మహోన్నతి నొప్పుమీఱెడున్. 689

ఆ. యుక్తిభేదముల మహోత్తమ శివసమ్మతాగమముల నాత్మ నతిపవిత్ర
వృత్తినూని నీదు విపులసైన్యంబును,జగములను జయింపఁజాలు దాని.

క. దేనిబలంబున గర్వం, బూనితివో దాని నిచటి కొక్కక్షణమునన్
రానియమింపుము భస్మం,బౌ నిట నాతేజమున మహాసుర! కనుమా.

చ. వివిధమహాయుధంబులను భీతికరంబుల నొప్పుదానినై
న్యవితతి నాదుమ్రోలను క్షణార్ధము నిల్పుము; స్వాత్మశక్తిఁ బు
ట్టువు గనఁజేసి సైన్యముఁ గడుంగడుఁ బౌరుష మొప్పు దానిచే
బవరమునందుఁ ద్రుంగునటు బల్విడిఁజేయుదు తెప్పపాటునన్. 692

ఆ. నాదు నాయుధముల నాశమా నీసేన
నంత నీకు నాయు వంత మగును
స్థలమునందు నిందె శివునకు నహిత మె
వ్వాఁడు తలఁచు బ్రదుకువాఁడె యైన. 993

క. మును వారింపంబడియుం, దనప్రాక్కర్మంబుఁ బలిమిదానవశుండై
జనుఁ డొనరించుంగర్మం,బును దానికిఁదగినఫలముఁబొందుఁ దప్పదెఁగన్.

ఆ. అనుచుఁ దెలుపవయ్య యనుకంపతోడివా
క్యమ్ము పలుకుటొప్పు నార్యధర్మ
మదియెకా యకార్య మాతఁ డొనర్పఁ ద
ద్వారణంబు నిత్యధర్మమెన్న. 695

క. అని గౌరి తెలుపఁ గీశా, ననుఁజో మునిదూత యగుచు నై జవిభూతిం
గొనిపోయిమహిషుమ్రోలను, వినిన ట్లె తెలి పెసర్వవిషయముఁగడఁకన్.

చ. దితిజవరుండు దాని విని తీవ్రరుడాకులచిత్తుఁ డౌచు న
ప్రతిమబలంబునం దినఁగఁ బర్విడె నమ్ముని పైకి మాయచే
నతఁ డరిగెం గనంబడనియట్టిపథంబున నంతలో దురా
శతనరస్వీయసైన్యమును జయ్యన రాఁగ ననుజ్ఞ యిచ్చెనన్. 697

క. జతనం బొప్పఁగ శస్త్ర, ప్రతతియుతం బౌచు లోకభయదం బయియు
న్నతపౌరుషమున నిక్కెడు, దితిజానీకంబు రాఁగఁ దేఁకువమీఱన్.

క. ఆయోధన మొనరింపఁగ, నాయద్రిం జుట్టుముట్టి నప్పుడు పనుపన్
గా యోధు లశిక్షితులై, పాయనిపూనికల శోణపర్వతవరమున్. 699

క. పరివేష్టించిరి; వారల, పరివేష్టన మట్టిచూచి పార్వతి దైత్యే
శ్వరునిమహాద్భుతసైన్యముఁ, బరికించియడంపఁ దగినపథ మేదనుచున్.

ఉ. ఎంచి సృజించె శూరులయి యెన్న భయంకరరూపులౌచు నొ
క్కించుకయేఁ గనంగ నెటు లేఁ దర మేరికిఁ గాని తేజముం

గాంచిన భూతనాయకులఁ గర్బురయోధలయాంతకాకృతిన్
మించెడువారి నత్తఱి నమేయనిజామలశక్తిసంపదన్. 701

సీ. పాదముల్ కన్నులు పరికింప నొకఁడొకం
 డుగ నుండి యట్టెచూడఁగ భయంబు
గలిగించువారలు; కర్ణపయోధర
 ములు చాల వ్రేలాడఁ జెలఁగువారు;
పాణిమస్తకకుక్షిపాదముల్ వక్రంబు
 లయి కనంబడఁ దిరుగాడువారు;
భక్షింతు నీసైన్యపంక్తి నేనొక్కఁడఁ
 జాల దియ్యది యంచుఁ బ్రేలువారు;
తే. దైత్యసేనలనేన ప్రందంగఁజేయు
వాఁడ యుద్ధంబునను బంపవలయు ననుచు
నంబఁ బ్రార్థించువారునై రందుఁగల్గు
భూతనాథులు పెక్కండ్రు పొలుచు శక్తి. 702

ఉ. ఏల మహాప్రయత్న మిఁక నీఖిలులం దెగటార్ప నే ననిం
జాలుదుఁ జూచుచుండు మిదె సంగరముం బొనరింపఁబోయెదన్
గ్రాలెడుపౌరుషంబున నఖండతరాయుధశక్తిఁ జూపెదన్
గాలుఁడు వీఁడె యంచు ననుఁగాంచఁగ నెల్లరు సంచరించెదర్. 703

క. అని యొండొరులర్ జీరుచు,నని చేయుకుతూహలంబు నగపడఁజేయం
గని యోగినీయుతంబుగ,ననుపమశంఖంబునొత్తె నద్రిసుతయుఁ దాన్.

చ. దనుజులఁ జెండ నెంచె మది దానవయోధులు నూత్నయోధులం
గనుఁగొని పైఁబడంగఁ దమకంబును గాంచిరి వీరలం చొగిర్
మననముచేసి స్వామికడ మానిని సేనలరూపుమాపఁ బూ
నినతమవిక్రమంబు కడునేర్పునఁ జూపఁగ నెంచి యంతటర్. 705

చ. ధృతవివిధాయుధద్యుతులఁ దేజరిలంగను జాలి భీకరా
స్త్రతతులవర్ష మట్లు భయదస్ఫుటనాదపురస్సరంబుగా
నతివ వితాకుచెందుగతి నయ్యనిలోఁ గురియించి రంత ది
క్తతి మెలుఁగెత్తి యార్చినవిధంబు గనంబడె నెల్లవారికిర్. 706

ఆ. శైలపుత్త్రియంతఁ జాప నిర్ముక్తశ,స్త్రముల దనుజబాణసముదయంబుఁ
జేరకుండఁ ద్రుంచి చెండాడె నంతలో, లక్షకోటిదంతులన్ హయములన్.

క. అరదములన్ సృజించినపరాంబ నుతించుచు వాని నెక్కి భీ
కరగతులొప్ప భూతగణకాంతులు దుర్జయు లౌచుఁ బోరి ర
క్తరుణమునందు మాతృసముదాయము యోగిను లట్టె డాకినుల్
నిరుపమపౌరుషంబునను నిర్భరశౌర్యమునం జెలంగుచున్. 708

సీ. రక్షఃపిశాచమ్ము లక్షయబలములు
గలప్రేతసముదాయములును బోరి
రంత దైత్త్యులఁ గొంద ఱార్చుచు భక్షించి
చూర్ణించి తనువుల సోరిదిఁ ద్రుంచి
విదళించి మఱిపెక్కువిధములఁ జెండాడి
రంత దుర్గయు నాయుధాళిఁ దాల్చి
ప్రజ్వలించుచుఁ దనబలములు రక్కసు
లను జంపి యాడుచు లలిఁ బలలము

తే. మెక్కి రక్తంబుఁ ద్రావి మేల్మేలటంచుఁ
దృప్తిఁ గనుచుంట కెంతయుఁ దృప్తినొందె
నామె కైలాసగిరినుండి యవనికిఁ దప
మాచరింపఁగ వచ్చెడు నపుడు వేడ్క. 709

చ. జననిని గాచుకాంక్షల నెసంగుచు మాతృగణంబు వచ్చె దా
న నలువు రెంతొ లెక్కడ జనంబులు గొల్వఁగ ఖ్యాతిఁ గాంచి రీ
శునిసతి వారినల్వురను శూరతఁబొల్చెడువారిఁ బ్రీతితోఁ
గనుఁగొనుచుండువారిబలగంబు గణింప నశక్య మేరికిన్. 710

వ. దుందుభియు, సత్యవతియు, నంతవతియు, సుందరియు ననునామంబు లానల్వురకుం గల వని యెఱుంగందగు. దంష్ట్రావలయభీషణ యగుచాముండాదేవి సృజింపఁబడియె. ఆమహాదేవి దైత్యకృత్తి వసయు మాంసరక్తత్రుప్తయు నై విహరించె. మఱియు నాదను జపాలకు నాక్రమించి నర్తించుచుండె నట్టిసమయంబునందు. 711

చ. తరుణి చెలంగ దుర్మదుఁడు దానవనాథుఁడు కాసరాఖ్యుఁ డ
క్కరణిని నాట్యమాడు కలకంఠిని గాంచి రుడగ్నికీలముల్
పరఁగఁగఁ జేయునేత్రములు పాకవిరోధికినేని భీతి నా
తురమును గల్గఁజేయునటు తోఁపఁగ మండిపడెన్ దనంత తాన్. 712
చ. కనులను సాధ్వసంబు నిడఁగాఁ దగునట్లుగఁ ద్రిప్పుచున్ వెసన్
ఘనగతిఁ దద్భవాగ్నిఘనకాండమునెల్ల విభిన్నతం ద్వరం
గనునటుచేయ మందుశుచిగాఢశిఖా ప్రతిమానదీర్ఘజి
హ్వా నిఖిలభూతరాజికి భయంకరమై కనసై యెసంగఁగన్. 713
తే. అట్టి నాలుకచే భూధరాళి శృంగ
భాగముల నాఁకుచున్ ఖురపటలఘాత
ములను భూమిని వ్రక్కలై పొడవడంగఁ
జేసి తత్పాంసుజాలంబుచేత దెసల. 714
క. కనరాక యుండఁ జేయుచు, విన దుస్సహమై మఱింతభీతిని గల్గం
గను జేయుఘుర్ఘరధ్వని, వినఁజేయుచు దేవత లది విని మోహితులై.
క. ధరణింబడఁగా నవ్వుచు, ఖరవాలధిదీర్ఘభయదకాండనిహతిని
స్ఫురబాణవృష్టిఁ జదుపుచు,నరిగెన్ దుర్గను జయించునాశయ మొప్పన్.
క. త్రివళులు సౌభాగ్యంబున, కవధి యివే యంచుఁ దెల్ప నతిభీకరసిం
హవరాసనసంస్థిత యై, యనథానమునం జెలంగు నంబను గెల్వన్.
ఆ. అరిగెఁ జావుగోరి యద్దానవేశ్వరుఁ
డాదిశక్తి యనుచు నఖిలలోక
జనని యంచు సకలమునకుఁ గారణ మంచు
నాత్మ నెఱుఁగఁజాల కజ్ఞుఁ డగుచు. 718

---

## ఏకాదశాధ్యాయము.

### మహిషాసురవధ

క. అని సనకమునీంద్రునకున్, వనజాసనుఁ డాశరేంద్రునర్తన మెల్లన్
వినిపించిమఱియునివ్విధ,మునఁ దెల్పెమునీంద్ర! యిట్లు పూనికమీఱన్.

చ. వివిధమహాయుధద్యుతుల వెల్గుచుఁ గేసరి నెక్కి యుద్ధమం
దవితథశక్తిఁ జూపుటకు నాతురతం గనుదుర్గఁ జూచి కో
పవశతఁ గాంచి పౌరుషము భాసిల భూధరవృష్టి ముంచె నం
బ వివిధబాణముల్ పఱపి పర్వతవృష్టి నడంచి నేర్పునన్. 720
చ. శితశరముల్ నిగుడ్చి రుషచే దనుజేంద్రుశరీరమెల్ల నే
వితమునఁ జూడ నిల్వ దిఁక వేగము పాతము నొందు నంచు దే
వతలకుఁ దోఁపఁ జీల్చె; సురవైరియు శైలసమానసారుఁడై
చ్యుతిగననట్టివిక్రమము శోభిల నుండుట బాణవృష్టికిన్. 721
తే. సుంతయైనను దలఁకక సోల కాత్మ,నింక నేనేమిచేయుదు నీమొముందు
నిలువఁజాలుదునేయనియలమటపడ,కనినిదుర్దుఁడయివృద్ధినందెనతఁడు.
క. అసిఖడ్గచక్రశూలా,దిసమరపరికరము లూని దేవి మహిషదై
త్యసమితినాయకునొంచిన, వెసనాతఁడదృశ్యుఁడగుచుభీమబలమునన్.
సీ. సింహాకృతిం దాల్చి చెలఁగినాదంబున,భయము గల్గించుచుఁ బ్రబలతీక్ష్ణ
దంష్ట్రిలు వెలయ శితనఖరములుతగ, సంచరించెను మహాసంగరాంగ
ణమునందు దుర్గసింహముచపేటముతగు,పాణిచేనడఁచినిబ్బరముమీఱ
నఖరాగ్రములనుదానవసింహునకుము, చీల్చెనంతటభీతిఁజెందియతఁడు
ఆ. వ్యాఘ్రరూపుఁ డగుచు వ్యాత్తాననుండయి,పైకినడర దేవిపౌరుషమున
వానిఁ జంపఁ బైకివచ్చె వేగ యతండు,నీలరేఖలొడల జాలఁగ్రాల.
క. పరిపూర్ణపింగళాకృతి, కరమరుదుగఁ గానఁబడగఁ గరిముఖయానో
త్కరము తనచుట్టునుండఁగ,సురాలయం బైనకొండచొప్పునఁ గన్నై.
చ. తనయెదుటం జరింప బలదర్పములం గనఁజేయ మందునా
ల్కను బటుహేతిచందమునఁ గన్పడుదానిని జూచి పైఁబడం
గను దమకించు నాదనుజకాంతుని జంద్రసమాకృతిం గడుం
గన నగుభూరిభల్లమున గాత్రము నొవ్వఁగసేసె దుర్గయున్. 726
చ. పురములు మూఁడు దుర్భరతఁ బొల్చుట వానిని గాల్పఁబోయి యీ
శ్వరుఁడు పరాక్రమించునటు బాణమువైవఁగ నాటి మోమునన్
దొరఁగెడురక్తపూరమునఁ దోఁగుచుఁ దృష్టిని గాంచకే కళే
బరమును జీల్చుకొంచు వడిఁబాఱె వియత్పథమందు నంతటన్. 727

చ. తను వది నిష్ఫలం బయినదైత్యుఁడు వారణరూప మొప్ప దే
వుని గరతాడనంబున నివృత్తరణాదృతిగా నొనర్చఁ బో
యెను వడివచ్చు నమ్మదగజేంద్రము దానజలైకసిక్తభూ
మిని గని యంబ యెక్కెఁ గనమేయబలంబును గన్న సింహమున్. 728

క. దిక్కులు పిక్కటిలంగా, నక్కున శబ్దించె దాని దొక్కెమొగిని దా
నిక్కుచుఁ జఱచె నఖంబులు, నిక్కంగాఁ గ్రాలుచేత నిర్జరు లార్వన్.

క. ఆరూపము మానుచు వే, పౌరుషమున ఖడ్గమూని పటుచర్మము చె
ల్వారఁగఁ దాలిచి యడరెను, భీరువుగద దీని గెల్వ భీతియె నాకున్.

తే. అనుకొనుచు దంష్ట్రిలొప్ప భయంకరముగ
బొమలు ముడివడ వక్త్రంబు భూరిభీతి
దముగఁ గనఁబడ గతి యతిదారుణముగఁ
గానఁబడఁ జెంతకుంబోవఁ గాంచి దుర్గ. 731

చ. కరముల ఖడ్గసంతతియుఁ గ్రాలఁగ నమ్మహిషాఖ్యదైత్యుతో
దుర మొనరించె శీర్షమటఁ దోఁపకయుండఁగ ఛిన్నమస్తనాఁ
బరఁగెఁ దదాహవంబున సుపర్వవిరోధియుఁ గాసరాకృతి
స్ఫురణముమీఱ మాయఁగొని పోరె ననాకులుఁ జూచు ముక్కబలెన్.

చ. అది గని దేవతల్ మునులు, నత్తఱినిం బురికొల్పు గౌతముం
డుదితమహానురాగమున నుద్యమ మొప్పఁగ విశ్వమాత న
భ్యుదయము లోకజాలముల కుగ్రతరాసురుఁ జంపి కల్గఁజే
యుదలఁపు గల్గఁజేయు మనసొప్పు స్తుతించె నిటుల్ మహేశ్వరీ! 733

సీ. జగములకుం బ్రాణశక్తి నీయందెగా యున్నది బలశక్తి యున్నదట్లె
కలుగునోజశ్శక్తి కమ్రతరజ్ఞానశక్తియు నీయందె చక్కనరయ
నట్టి నీవే యుద్ధ మాచరింపఁగ నేల ముగ్ధవలెఁ మోహ మూనినట్లు
లుపసంహరింపుమీ యుగ్రదానవుఁ ద్రిభువనరక్షణార్థ;మీదనుజభిన్న

తే. తనువులను దూలఁబుచ్చుట కనువగునటు
విక్రమించితి వదియె వరక్రమంబు
లను బ్రబోధించు నో యంబ! దనుజుఁ డీతఁ
డనఁగఁ దృణకల్పుఁడేగద యైన నితని. 734

చ. పొడవడఁగించుకార్యమునఁ బూనితి వింత ప్రయత్నమేలొకో
యెడుగనియోజనల్ సలుప నొక్కటియుం దెలియంగరాదు దు
ష్టుఁడు సకలాఘరాశి మధుసూదనవైరి కదా? యితండు చొ
ప్పడుఁగద వీనిప్రాణములఁ బాపినలోకసుఖంబు శాంతియున్. 735

తే. సుజనవిద్వేషి యగువీనిఁ బ్రజలకొఱకుఁ
బొడవడంపు త్రిశూలంబుఁ బూని తల్లి!
ప్రాణశక్తిఁ ద్రిశూలంబు బలిగఁ గొనును
గాక యని సంస్తుతింప నాగౌతమోక్తి. 736



చ. విని పరదేవి యాదనుజవీరుని బైకొనుచుం ద్రిశూలముం
గొని చెలరేఁగెఁ; బెద్ద వగుకొండలపిండును మించు నంబికా
తనుగురుభారమోర్వఁగ నతం డిసుమంతయుఁ జాలకుండెఁ; నా
తనిఁ బరశక్తి పైకొనుచు దారుణపౌరుష మొప్పునట్లుగన్. 737

ఆ. పిండిగా నొనర్ప భీతిల్లి పొరలుచు, నేడ్చుచుం ద్రిశూలమెత్తి పొడువ
శిరము నెత్తిచూచి పరుగిడఁజాలక, బ్రదుకు నాసమాని వనటఁగుంది.

క. పరదేవి త్రిశూలంబున, శరీరమున్ వ్రక్కలింప జలధారలు నా
గురురక్తధార లతిభీ,కరగతిఁ దొరఁగంగ సాంధ్యఖరకరుఁడువలెన్.

చ. కనఁబడుచుండె రక్తజలకంధివిధంబునఁ దోఁచుచుండెఁ; నం
తనిశితఖడ్గధార కలదానవు శీర్షముఁ ద్రుంచివేయఁగా
నను వగునట్టిపూర్ణబలి కై తగనిచ్చెను; దుర్గ యంత నిం
తని వచియింపరానిప్రమదంబున నాశిర మెక్కి మక్కువన్. 740

తే. నృత్త మొనరించె దేవతలెల్లఁ గనఁగ, సిద్ధగంధర్వసాధ్యులు చేరి దుర్గ
నభినుతించిరి దేవతలమలకల్ప,కుసుమములవృష్టి నంబపైఁ గురిసిరప్పుడు.

క. హరిహయుఁ డత్తఱి దేవీ,చరణములకు మ్రొక్కి కేలు సంధించి మహా
దరభక్తులు పిరిగొన ని, క్కరణిన్ వినుతించె దేవగణపాలనివై. 742

సీ. భూతాళికిన్ బీజభూతవై భజియించు
వారికి శ్రద్ధయు భక్తి యతుల
శక్తియు నై కీర్తిశాంతియు దాంతియుఁ
గారణంబుఁ గలయు క్షమయు నోచుఁ

దగునొక్క నీవె లోకగణస్వరూపవై
బహునామములఁ బిల్వఁబడుదు వంబ!
యవ్వానియందు మమ్కారసితపమున
కనుగుణం బగుసిద్ధి నందునట్లు
ఆ. చేయుచుందువీవు శివ యను పేరున, శత్రురాజిఁ జెండి స్వప్రకాశ
మున నె లోకములను గనఁబడఁ జేయుదు, వట్టినీకు వందనాళిఁ గూర్తు.
క. దనుజుం డీతఁడుమహిషుఁడు, వినిహతుఁడయ్యెన్ ద్వదీయవిక్రమముననీ
తనిశిరము దెగియు జీవం,బును గనిన ట్లగపడియెనుఁ బూతచరిత్రా!
సీ. అరుణనేత్రము తీక్ష్ణశరశృంగమనల కీలాభజిహ్వామునయి యగశిరంబు
కదలుచు నీవు నెక్కంగఁ బావనమయ్యె నిట్టి నీరూపమే యెల్లకాల
మగుఁగాక మాకు ధ్యేయంబు తల్లి! చక్రశరధనుశ్శృంగముల్ చర్మఖడ్గ
ములువరాభయశూలములు ఘంటయంకుశకశకపాలకులిశకాదులైన
ఆ. యాయుధములుభూషణాకృతిఁ గరములఁ, గ్రాలుచుండ దేవతాళికున్న
యాయుధంబులెల్లనమరంగ దేవతా,మూర్తివగుచునీవెపొలుతు వెపుడు
క. ఎల్లెడల నీవయై సుర, లుల్లసిలన్ శత్రురాజినుక్కడఁచి యశం
బెల్లకడల నిండఁగ రా, జిల్లుదువో తల్లి! నీకు జేజే లివిగో. 746
తే. వేనవేలాయుధంబులు వెలయునీకుఁ, దన్మయము లెవిభూతులుతనరుఁజుమ్ము
వివిధవాహనశస్త్రసంవృతులువై రు,లాహవంబునప్రందిరియ్యాదనునందె.
చ. అరదములున్ ద్విపేంద్రములు సశ్వము లల్లె విభూతులున్ మహా
సురవరుతోడ స్రుందె నిఁక క్షోణిభవత్కరుణావివర్జితుల్
త్వరఁబరిదగ్ధవీర్యులయి వర్ధిలకుందురుగాక దేవి! త్వ
చ్చరణసరోజసేవకులు శౌర్యవిహీనులు నయ్యు వేగమే. 784
ఆ. అనధికారులయ్యునన్నిలోకములకు, నాథులగుదురమలినయశమొలయ
నతిభయంకరముగ నగపడుత్వద్రూప, మిదిభజింపఁదలఁపనిదుశుభముల.
ఉ. వారికి శత్రుభీతి యనువాక్యమె శ్రోత్రయుగంబుఁ దూఱఁగాఁ
జేరదు; చెంతకే విజయసిద్ధి లభించును; రూప మిద్ది గం
భీరము దేవవందితము భీతిహారంబు నగుంగదా తప
స్సారము గల్గుమానులును సర్వసుపర్వులు దీని భక్తిమై. 750

తే. ఇష్టసిద్ధులు లభియింపనెల్లతఱులఁ, బూజనలరింత్రుగాక సంపూజితమయి
మాతృగణ మిద్ధినీచేతమహిసృజింపఁ, బడినదౌటభక్తులకునువరములిడుత.
చ. తమతమసేవకాళియుతిస్థానములం దిటనుండుఁగాక స్థా
నములను గాచుపొం బెఁ బ్రథనంబున నిమహిషుండు చచ్చె నీ
విమలపదాబ్జలాంఛనుఁడు వీతకళంకుఁడె యయ్యెఁగాన ని
త్యము భవదగ్రభాగమున నర్చనలం బడయంగనోపుతన్. 752
చ. అని సురనాయకుం డడుగ నట్లె మునీంద్రులు కోర నట్లె యా
నని వరమిచ్చి వారలసురాలయముం గనఁబోవ నాజ్ఞ ని
చ్చెను మఱి యాస్థలంబున విచిత్రతరాయుధధారణంబునన్
వినుతికిఁ బాత్రమౌ తనదుభీకరరూపము నిల్పెఁ గొల్వఁగన్. 753
తే. మాతృగణముల నిల్పె నమానుషమగు
శక్తి నాస్థానమును గావ సంతతంబు
విమలరూపంబు నైజంబు వేడ్కనొంది
సఖులతోఁగూడి మహిషుమస్తకము దాని. 754
క. వికృతమయి ఖడ్గధారా, నికరంబునఁ గొట్టఁబడుట నిర్జరులు వినన్
సకియలకుఁ జూపి తెల్పుచు, సకలజ్ఞునిలింగ మున్నసరణిం గనియెన్.
క. హరులింగముఁ బూజింపఁగ, నిరంతరము కంఠసీమ నెమ్మి తనరఁగా
ధరియించియుండె దానిని, ద్వరపడి గ్రహియించి రక్తధారాప్లుతమై.
తే. చక్కరంజిల్లకున్న యాశైవలింగ, వరముఁ బాణినిధరియింపవలచి కంఠ
సీమనుండియె వెడలింపఁ జేతగామిఁ, జిత్ర మిదియేమియనిమదిఁజింతనొంది.
క. స్వాంతంబు విషాదంబున, నెంతయుఁ గుందంగ త్ర్యౌసురేంద్రమునీశుల్
వింతపడిచూడ నకటా! చింతింపక హరునిభక్తుఁ జెండితినిగదా. 758
చ. అని తలపోసి శోకరసమాత్మను గ్రమ్మఁగ నాత్మమాహాత్మ్యమున్
వనితలదుస్స్వభావజము వారక పల్మఱు నిందచేసికొం
చనుగతమౌ విచారమున నాహారభక్తనిబర్హణంబు పా
పనిచయమందు మేటి యుపపాతకరాశిగతంబు నౌఁగదా. 759
తే. అనుచుఁ జింతించి యుపపాతకావృతాంగి
నైతి నని యెంచుచుఁ గౌతమాఖ్యమౌని

సత్తమునిఁ గాంచి చేరంగఁ జని స్వకీయ
సాహసముఁ దెల్పె నిట్లను సంభ్రమమున. 760

క. భగవంతా! ధర్మజ్ఞా, సుగుణాఢ్యా! ధర్మతతులచొప్పు తెలిసియుం
దిగవిడిచియధర్మంబిది,యగుననుచుం దెలిసియుఁ మహాధైర్యమునన్.

క. ఒనరించితి దివిజులఁగా, వను బూనుచు నభయమిచ్చి భర్గునిభక్తున్
దనుజేంద్రుమహిషుఁ జంపితి,మునివర! యజ్ఞానమున సుబుద్ధియడఁగుటన్.

చ. సుమతిరజోగుణాప్తిమెయి శోభిలకుండుట ధర్మసంగ్రహం
బమరదుగా గురూత్తముదయాసులభం బది యంతరాయసం
ఘము లొగిఁ గాచియుండు వడిఁ గార్యము సాగకయుండఁ జేయ నే
ర్పమరఁగ వానిదాఁటినమహార్థము సిద్ధిని గాంచుగా మునీ! 763

క. ఎదిరింపరాక దుష్టఫలదములయిన యాచరణములఁ మర్దమముల్
గఁదలంపఁబడుచుఁదగుఁద్రిపు, రదమనుసంశ్రయము లెన్నరానివిసుమ్మీ.

క. హరుఁడు విశేషాదరమునఁ, బరికించును లింగధరులఁ బ్రాకాలమునం
బురముల మూఁడింటందగు,సురవైరులు లింగములను శోభిలుచుండన్.

ఉ. వారలఁ జంపమాని శివభక్తి వివర్జితులైనయట్టి యిం
ద్రారులఁ జంపెఁ బుష్పశరవైరి; మహాముని! దైత్యకంఠశ్రుం
గారపురారిలింగ మిది కై విడనాడదు సంస్పృశింప నీ
భూరితరాఘ మెవ్విధిని బోవునొ తోఁప దదెంతచూచినన్. 766

క. శివభక్తవధాశ్రితపా,పవితతిఁ బాపంగఁజాలు ప్రాయశ్చిత్తం
బవధానంబున వెదకిన, నెవరికినేఁగానఁబడ దదెవ్విధినైనన్. 767

చ. దనుజగళస్థితంబయిన దర్పకభంజనులింగముఁ గళం
బున ధరియించి ఘోరతపముం బొనరించుచుఁ దీర్థయాత్రచే
యనుబనిపూనుదానను; మహాత్ముఁడు శంకరుఁ డెప్డనుగ్రహం
బును గనఁజేయు నాసమయముం బరికించుచు నుండెదఁ మునీ! 768

సీ. కైలాసముఖ్యశంకరునివాసంబులఁ దీర్థంబులం గని తివిరి స్నాన
మొనరించి పిదపనత్యుగ్రమౌ నీపాపమును జక్కఁ శోధించెదనుమునీంద్ర!
యనిపాపశంకచేవనటఁగుందుచుఁ బల్కు పార్వతీవాక్యముల్ పరమమౌని
యాలించిశివధర్మజాలమెఱుంగుటనామెభయంబుఁ బాయంగఁ జేయఁ

తే. దలఁచి యిట్లనిపల్కెనో తల్లి!భీతి,నొందకుము జ్ఞానహీనత నుగ్రభక్తుఁ
జంపితినటంచుధర్మసూక్ష్మములయర్థ,మెఱుఁగువారలుదుర్లభులేభవాని!

వ. సదాశివునివదనంబులు సద్యోజాతాదిసంశ్రయంబు లైదు గలవు. వానినుండి యష్టావింశతికోటు లాగమంబులు పుట్టె. అందు శివభక్త నిర్ణయంబులు చేయంబడియుండు. వానినెల్ల మునీంద్రులుంగూడ నెఱుంగరు. కాలము, ముఖంబు, కంకాలంబు, పాశుపతంబు, మహా వ్రతంబునను నీయైదుశివధర్మమార్గప్రవృత్తులని యెఱుంగవలయు. వీనియం దనేకభేదములు గలవు. అందు బలవత్తరం బొక్కండు సాధింపందగు. దాన శంకరుండు ప్రసన్నుండగు. స్వధర్మపరినిష్ఠి తులు నిర్మత్సరులు శివాజ్ఞాపరిపాలకులు నగునెల్లరుం బూజ్యులే యగుదురు. వేదంబులచేత యజ్ఞంబులచేత భక్తిచేఁ బరమశివుండు పూజింపంబడుచుండు. సర్వదాయకుం డీశ్వరుం డని తెలియవలయు.
మఱియు. 770

ఆ. జీవహింస నెవరు చేయరాదు తపస్వి, లద్ది చేయఁగమదినైన నెంచఁ
దగదు శంభుధర్మతతిభేత్తలను వేగ, చంపవలయు నైపఁజనదు వారి.

సీ. వేషధారులయందు వీక్షింపఁగారాదు లింగధారణమును లింగమూర్తి
ధర్మంబు భేదించుదారుణచిత్తుని హతమొనర్పందగు మతిఁ దలఁపక
బహువిధంబులఁ బరిపక్వమా బుద్ధిని దనరారు ధర్మవేత్త లిది యిట్టు
లనిపల్కె;రామహేశునిధర్మములయింపజనియించుశక్తివెంట నెధరణిని

తే. మహిషదనుజుని దైనకర్మమ్ము భాగ్య,చర్చితం బగుఁగావున సంగరముల
నతనినోడింప దేవతాతతికిఁగూడ,శక్యమేగాకయుండెనో జనని! యతని.

చ. అని మొనఁజంపినట్టి హరు నర్థము నీయదిగాన నీతఁడున్
మునులను శంభుభక్తులను బూజ్యులనెల్లఁ దిరస్కరించె వా
రనుగతకోపు లౌచు దనుజాధిపు నోర్వఁగఁజాల కాగ్రహం
బున నవమానముంగలుగ బుద్ధిఁ దలంచి యొనర్చె నంచొగిన్. 773

క. మనసులఁ దలంచి శాపం,బు నొసంగిరి కాసరంబుపోలిక దాష్ట్యం
బున వర్తించెదు మాహిష,తనువూనుము సంచరింపు తద్వపువుననే.

చ. అనుచు శపించినంతనె సురారివరుండును గాసరాకృతిన్
గని ప్రణమిల్లి శాపమును గ్రన్ననఁ బాయఁగ మార్గ మెద్ది నా
కనుమతి నిండు నావిని మహర్షులు కోపము బాసి నీకు ని
చ్చనుగలరూప మేర్పడును శంక తొలంగుము కాపరూపతన్. 775

క. చరియింపు మంచుఁ గరుణాపరులై భాషింప నతఁడు పల్కుల వానిం
బరమాదరమునఁ గైకొని, చరియించెన్ మహిషరూపశాలియయితమిన్.

క. సురవైరి మహిషరూపము, ధరియించియు నీశ్వరాజ్ఞఁ దల్లీ! నీచే
మరణము గాంచెను బుణ్యా, స్ఫురణమునన్ దీని కింత పొక్కఁగ నేలా.

ఆ. అంగదర్శనమున నడలంగ నేటికి, శంభురూపతఁగను సకలసిద్ధ
వరుల కేయవజ్ఞ బాధింపదని నమ్మ, వలయు లోకజనని! పలుకు లేల.

చ. తనదగుదోషయోగమున దారుణసైరిభరూప మొప్ప న
ద్దనుజుఁడు పూర్వజన్మసుకృతంబున శాపవిముక్తి రూపసి
ద్ధిని భవదీయభూరికృప దేవి! కనందగియెం కృతార్థుఁడే
యనఁదగియెంగదా తొలఁగె నన్నిజగంబులకున్ శ్రమావళుల్. 779

క. భువనావనకార్యమువీ,నివధమున ఫలించె దేవి నీకును, గురుశా
పవశంబునఁ గల్గినమహా, షవపువు పాయంగ ముక్తి సత్వర మమరెన్.

చ. హరుపయిఁ గల్గుప్రీతిని మహాతప మివ్విధిఁ జేయు నీవు గో
త్రరమణపుత్త్రికా! యిచట రాజిలు తైజసలింగసత్తమం
బరుణగిరీంద్రసంజ్ఞితము నద్భుతదర్శన మిప్డు చూడు మా
దరమున నద్దిచాలు నమృతం బని సందియ మందఁబోకుమా. 781

చ. దనుజుఁ డితండు ప్రాగ్జని నితాంతము తైజసలింగభక్తుఁడై
తనరియుఁ గాసరత్వమునఁ దా మదయుక్తిని నిన్నెదిర్చి చ
చ్చెను మహనీయలింగమునఁ జెందెను సంగతిఁ జింతయేల? భ
క్తిని శివలింగధారణము కృత్రిమరీతిని జేయు నాతనిన్. 782

చ. త్రిజగములందు నెవ్వఁడు వధింపఁగఁగల్గును? పార్వతీ! మహా
సుజనుఁ డతండు సంతతము జోద్యము నొందఁగఁబోకు; మున్ను పు
ణ్యజనులఁ జంపుకోర్కి హరుఁ డల్లపురంబుల కేగి యందు యో
గిజనుల లింగధారకులఁ గేవలభక్తులఁ గాంచి పూజలన్. 783

క. అలరించె మువ్వురకు శం,భులింగముం దాల్చి రన్నబుద్ధిని దల్లీ !
బలమునఁ గన్నుంగానక, చెలఁగెడు నీమహిషుఁ డతినిశితఖడ్గమునన్.
తే. నీవు మ స్తకమును ద్రుంపఁగా వడిఁబడెఁ;
గనుక దీక్షాదిరహితలింగము ధరింపఁ
జంపఁబడు నని తెల్పెడుశాస్త్రమార్గ
మితఁడు శివలింగమును ధరియించె భ క్తి. 785
క. మునుతక్షపణకువాక్యములకు, వినిమహిషుఁడువానియందువిశ్వాసంబుం
గనియెఁగాని తపశ్శ, క్తిని యోగబలంబునకు మదిని లింగంబున్. 786
క. స్మరియింపఁజాలి భ క్తిని, ధరియింపంజాలెఁ ద్వత్పదస్ఫుటపద్మ
స్మరణానిరీక్షణములచేఁ,బరమం బగుము క్తి నొందెఁ బార్వతి! వింటే.
ఉ. సుంతయు లేదు సందియము సుందరి! నేను వచించు నిష్కృతుల్
వింతగఁ బాపజాలముల వే నశియింపఁగఁజేయు నీకుఖ్మృ
త్యాంతనిదర్శనం బఘునికాయవినాశనదక్ష మంచు నీ
స్వాంతమునందు నమ్మఁదగు శంకరధర్మవిదు త్తమావళిన్. 788
సీ. స్థాపించి సర్వతీర్థంబుల నావాహనముచేసి సకలదోషములుపోవు
నుద్దేశమున నిందు నొక్కసరస్సున భవదాహ్వయాంకమై పరఁగఁజేసి
యందుస్నానమొనర్పుమఘమర్షణాన్వితమగునట్లులింగయు క్తిగఁద్రిసంధ్య
లందు మాసం బిట్టు లంబిక! యొనరింపు మవ్వేల శంకరయాగమహము
ఆ. నందు సర్వవిధము లగునుపచారంబు, లనుమహేశులింగమును విధిగను
బూజసేయవమ్మ! పోవు పాపము లన్న,మునివరో క్తిఁ జక్క వినిగిరిజయు.
మ. శివభ క్తిం బొలుపొందఁజేయఁదగు నీసిద్ధాంతమం చెంచి యా
దివిజానీకనమస్క్రియామణిలసద్దివ్యాంఘ్రిపంకేజయా
శివు నర్ధాంగి తదు క్తధర్మమును దాఁజెల్లింప నూహించి భూ
ధ్రవరేశానుని ముందు నొక్కసరసుకు స్థాపించి యానీటిలోన్. 790
ఆ. మునిఁగి పాపజాలమును బాయఁగా నెంచె
సకలశైవధర్మశాస్త్రవిదుల
నందు నుండఁజేసి యమ్ముని భాషితం
బును మనంబునందు నునుచుకొనుచు. 791

# ద్వా ద శా ధ్యా య ము

## శి వ పా ర్వ తు ల స మా గ మ ము

చ. అని వచియించి బ్రహ్మయు మహామునిసంఘపతిన్ మహాత్ము నా
సనకుని గాంచి యవ్వలిప్రసంగముఁ దెల్పఁదలంచి యిట్లనున్
మునిపతి గౌతముండు తగుపోల్కి వచించిన పాచితంబులన్
విని గిరిజాత సందియము వీడెను శైవవధప్రభూతమున్. 792

ఉ. అదట "నంతరిక్షగతమానినదం బొకఁ డద్రిజాతకున్
శ్రీదము శ్రోత్రమంజుళము సిద్ధివిధానము నై వినంబడెన్
బోఁదగ దీవ దెచ్చటికి భూర్యఘవారణసిద్ధిఁ గోరుచున్
గోదయు గంగయున్ బొదలుకోర్కుల నిచ్చెడుసూర్యజాతయున్.

తే. *సింధునర్మదలున్ మహాసిద్ధి నొసఁగు
నాసరస్వతి కావేరి యట్లె శోణ
శోణనదు లివి తొమ్మిది క్షోణి నిందె
కలుగుఁగావున మీశిలాతలమునందు. 794

క. కరవాలనిహతిఁ ద్రవ్వము, ధర నిద్దానిన్ జనించుఁ దత్తీర్థములం
దురుభక్తి స్నానకృత్యము, జరపుము పాపంబువాయు శైలతనూజా!

సీ. ఆశ్వయుజం బనునట్టి యీమాసంబునందు జ్యేష్ఠాహ్వయం బైనతార
యరుదేరఁగా నీవు హరలింగసంయుక్తి ఖడ్గతీర్థంబునఁ గరము భక్తి
స్నాన మొనర్పు మాసంబు వసింపుము పావనమానమాసంబు జరపి
దిక్పాలవర్యయుక్తిని మీఁదఁ గరగతలింగమ్ము నొంది తత్సంగతి నఘ

తే. తూలదహనంబు గావించి తోడనె తమిఁ
దీర్థసన్నిధి దానిఁ బ్రతిష్ఠచేసి
జగములను గాచుపూనిక స్వాంతమందు
నెలకొనన్ సిద్ధి నందుమా లలితరూప! 796

---

* మూ. గంగాచ యమునా సింధుర్గోదాపిచ సరస్వతీ, నర్మదా సాచ కావేరీశోణః శోణనదీచసా. అని మూలము.

క. పౌలఁతీ యీఖడ్గసరో,జలముల స్నానంబుచేసి శంభునిలింగం
బలరారుభక్తి నర్చన,ములఁ దన్నినఁ దాపము లొగి మూఁడునశించున్.

క. లోకత్రయవాసుల కిది, శోకహరం బౌ సరస్సు క్షోణీధ్రసుతా!
యీకడ నెలకొనులింగము, ప్రాకటఫలదంబు సర్వపాపహరమునౌ.

ఆ. స్థావరం బనంగ సన్నుతిఁ గాంచు నీ, తీర్థనికటమందుఁ దేజరిల్లు
లింగ మిద్ది నీ వెసంగెడుభక్తితో, జగములకు హితంబు సంధిలంగ.

క. స్థాపింపు వైశ్వదైవ,త్యాపన్నిర్యాణనాత్తయశ! మహా తారక
దీపించు నద్ది జగమునఁ, దాపత్రయనాశనైకదక్షం బగుచున్. 800

క. చెలువారుదానిఁ బూజల, నలరింపుము పదిదినమ్ములమహోత్సవముల్
కలుగంజేయుము పిదపన్, జలజాక్షీ! యవభృథంబు జ్వలనర్క్షమునన్.

చ. ఒనరిచి సూర్యుఁ డస్తమయ మొందుతఱిన్ శివపూజ సల్పుశో
ణనగశరీర మూని తగు నన్ను భజింపుము తైజసంబునాఁ
దనరు శరీరమున్ నయనతామరసంబులఁ జూడఁజాలఁగా
నొనరుతు నద్దియే యగుమహోత్తమ మస్మదభీష్టమై తగున్. 802

చ. ఇది యిటు సేయు మో గిరిజ! యెల్లజగంబులఁ గావఁజాలు న
య్యది యని నమ్మి మంచు విననయ్యెను, దానిని గౌతమోక్తినిన్
ముదమొనఁగూడఁగా వినుచు భూరితపంబున నాద్వయంబున
య్యదునునఁ జేయ నెంచె హృదయంబు ప్రమోదమహాబ్ధిమగ్నగన్.

క. సునిశితఖడ్గంబున న, వ్వనజాక్షి! శిలాతలంబు బ్రద్దలుచేయన్
గనుపట్టెఁ దీర్థనవకం, బనుపమజలపూర్ణ మగుచు నాసమయమునన్.

ఉ. దానవుకంఠలింగమును ధ్యానముచేయుచు నద్రిజాతయున్
మౌని మహేంద్రు లాజ్ఞ నిడ మజ్జనకార్యము సాగఁజేసి పెం
పూనినతీర్థరాజములఁ బూజ్యతమస్ఫటికాభనీరముం
గానఁగరాఁగ సంతసముఁ గాంచె నపారము నెమ్మనంబునన్. 805

చ. జలముల మున్గ మేచకనిజచ్ఛవియంతరమందుఁగల్గ ని
మ్ములఁ గనువారు చిత్తరువుపోలిక నుండిరి; ముప్పదౌదినం
బులు జలవాసతం గడచె భూతగణేశ్వరుఁ బాసియుంటఁ జం
చలతను గాంచె నద్రిసుతస్వాంతము దర్శనకాంక్ష నెక్కొనన్. 806

క. తనుసంపదఁ బద్మంబుల, ననుపమనేత్రోత్పలముల నడవిని గుముదం
బును మందస్మితమున సృష్టిం,చెను నీటవసించియుండు శ్రీదేవితగన్.
చ. భువననిమగ్నయై గిరిజ పొల్పమరంగ వసించి యుండఁగా
భువనము లేయుపద్రవముఁ బొందక హాయిగ నుండెఁ; గాలసం
భవఫలయోగతన్ ధరణి బాగుగ నొప్పి కృతార్థయయ్యె; నా
భువనగణేశ్వరీతపము పూజ్యతమం బయి వర్ణ్యమై తగెన్. 808
ఉ. ఆనెల దాఁటినంత సలిలాంతరసీమను బాసి యంబ తా
నూనినభక్తిభారమున నుత్సవ మాయశరీరవాణి స
మ్మానముమీఱఁ జెప్పి నటు మానులు మెచ్చ నొనర్చి కార్తికం
బౌ నెలరాఁగఁ గృత్తికత్రియామను దా నుదయించు నత్తఱిన్. 809
క. వివిధోపచారముల నా, భవలింగముఁ దైజసంబు బహురీతులనై
లవరాత్మజపూజించెను, సవిధిఁ దపస్సిద్ధికొఱకు స్తవమొనరించెన్.
సీ. విశ్వరూపుఁడు, లోకవితతిరక్షకుఁడు శోణాచలరూపుం డఘాళినాశ
కుఁడు తైజసాకృతి గోవిందశతధృతి దుష్పరిచ్ఛేద్యవిశేషభూతి
యగ్నిరూపుండయ్యునతిశాంతమూర్తియౌజగదోఘరక్షణాసక్తుఁడగును
శక్తితో సృష్టించు సకలజగంబులఁ గాలానలాకృతిఁ గ్రాలుచుండు
తే. నద్రిసత్తమశోణాచలాధిపతియు, వేదవేద్యుఁడు సురవరవితతిపూజ్యుఁ
డెల్ల తేజంబులకుమూలవీవెయనుచుఁ, దెలుపు వేదంబులో దేవదేవభర్గ.
క. నతు లొనరింతు భవత్ప,ద్వితయమునకుఁ దేజ మిది దివ్యము పరమా
ద్భుతము నగమ్యము నగుమును,శతధృతిగోవిందు లెద్ది సాధింపంగన్.
క. పనిఁబూని కానఁజాలక,వినుతించిరొ యెవ్విధమున విశ్వేశ్వర! యా
యనుపమతేజోరూపముఁ, గనుఁగొంటిఁ బవిత్రనైతిఁ గాత్వత్కృపచేన్.
చ. నినుఁ గనఁజాలితిన్ బరము నిర్భరదోషహరంబు ముక్తిదం
బునయి చెలంగు తేజమును భూతవిభూ! కనఁజేయుమా యటం
చనుగతభక్తిభారమున నాగిరిజాతయుఁ దన్ను వేఁడ నం
త నెదుటఁదోఁచెఁ దేజమునఁ దాభువనంబుల వెల్గఁజేయుచున్. 814
చ. రవిశశికోటిబింబములు రాజిలునట్లు లయాగ్నికోటు లొ
క్కవిధి నెసంగుతీరున నికాషదురాసదతేజ మప్డు శాం

భవికిని దోఁప భక్తిమెయి వందనరాజి నొనర్చి మానిరా
ణ్ణివహముఁగూడి విస్మయము నెమ్మది నిండఁగ మోద మొందుచున్.
శా. ఆతేజోనిధినుండి తోఁచె నరుణాఖ్యాద్రీశుఁ డుత్కంఠమై
బూతంబై మృదుశాతకుంభమయమై పొల్పారురూపంబు సం
ప్రీతిస్ఫారము కాలకంధరమునై బృందారకస్తుత్యమై
నాతిం జూచి ప్రసన్నవక్త్రి మమరన్ నాథుండ నీయద్రికిన్. 416
తే. సుప్రసన్నుఁడనైతి నోసుందరాంగి!
మత్ప్రకల్పితభాగసమాజమందుఁ
దప మొనర్చితి వదియె ముదంబు నాకు
నీయఁజాలెఁ దేజోమయం బిదియె వపువు. 417
చ. కనఁదగు దీని నోగిరిజ! కారణముల్ తలపోయ నెన్నియో
తనరును గానలోకసముదాయముఁగావు జగన్మయీ! తపం
బొనరిచితీవు దేనికయి యో తెలియంగనుజాల నాదులో
చనములకాంతిచేఁ దమసు చాలఁగఁగ్రాలెను నీవు మాయఁగన్. 818
క. అదియంతయు నీరూపము,ముదితా! కనుచుంటఁ జేసిపోయెతుయంబై
మదమునమించినయీమహి,షదనుజనాథుండు లింగసత్తమ మెలమిన్.
ఆ. భక్తిభరితుఁడగుచు భావించిపూజించి,యిట్టిలింగవరము నెలమిఁబొందె
గళమునందు నదియె గ్రాలెడునాస్తికు,హితమునాలకించియెల్ల జగము.
ఉ. విక్రమసంపదం బొలిచి వీఁడు గ్రసింపఁగఁబూని నన్ను భ
క్తిక్రమ మొప్పఁ గంఠమునఁ గీర్తిని గోరి ధరించియున్ మహో
గ్రక్రియఁ జేయు నూహ గొని కంఠగతం బగులింగమందు ని
ర్వక్రవిశేషభక్తిని లవంబును బూనక స్వేచ్ఛమీఱఁగన్. 821
చ. తిరుగుచు మానివంశమున దివ్యతరాకృతిఁబుట్టె నందు న
స్థురుతరభక్తిభావమునఁ గొల్చెను దాన గణాధిపత్యము
న్నిరతిశయప్రమోదమును నిర్భరశక్తియుఁ గాంచె వీఁడు కా
సరతనుధారియయ్యె గిరిజా! హతుఁడయ్యె భవన్మహాసిచేన్. 822
క. చిరకాల లింగధారణ, వరకర్మమునన్ సురారివరుఁ డీతఁడు సు
స్థిరసిద్ధినొంద నర్హుం,డరయంగా నంచు నెన్నుఁ మద్రికుమారీ! 823

సీ. చేయరా దెప్పుడు శివునందవిశ్వాసమట్టులె శంభుభక్తావమాన
నమునను దుష్టకర్మములగు నీరెండు; నందు విశేషించి యమలపదము
నందఁగోరెడువార లన్వహమిా రెండువదలంగయత్నింపవలయుఁజుమ్ము
దీనిదాక్రమము మాని ధీరతనెవ్వాఁడుబలమున లింగంబుగళమునందుఁ
తే. దాల్చునో యద్ది ఫలమిాయఁ దలఁపకుండు
టొక్కటియెకాక యింద్రాయుధోత్తమంబు
వలె నతని ద్రుంచు నని నమ్మవలయు గౌరి!
యింక శోణాచలేశ్వరు నెలమిఁ గనుట. 824
క. ఇంచుక యేదోషము లే, దంచుం దలపోయవలయు నఖిలాఘమ్ముల్
పంచత్వము నొందుట సే,వించుట నను నేత్రయుగము వెలఁది! సఫలమే.
సీ. నీయాత్మజునకుఁ దానెమ్మి స్తన్యమునిచ్చిధారణియిదియుపకారమెంతొ
యొనరిచె నద్దాన నుర్విపై నీ వపీతకుచయన్ పేరునఁ దనరవలయు
భక్తరక్షణివయివాత్సల్యమునమించియశముగాంచుముకృత్తికాఖ్యతార
యందునీయెడభక్తియమరన్ బూజింప సకలార్థసిద్ధులుసమకూఱుమఱి
తే. పాచితంబునఁ జేరది పరఁగుత మిల
శేషపూజ నొనర్పు మశేషభక్త
హితముకొఱ కీవు నిను భజియింపు మెలమి
మిాఱఁ గరుణాస్వరూపవై మించు మిందు. 826
చ. అని శశిశేఖరుండు తుహినాంబువులన్ సరిపోలువాక్కులన్
మనసు కలంకదేఱ బహుమానము మించఁగఁబల్క గౌరియున్
విని వినయంబుదోఁపఁగ భువిం దను వెల్లను సోఁక మ్రొక్కి ప్రా
ర్థన పచియించె; దేవగణరాజ! కృపాగుణభూషణాహరా! 827
క. కనఁబఱుపంబడె నాముం, దనూనతేజోమయంబు ననఁదగురూపం
బనయంబిది కార్తికికం,బను మాసమునందుమద్భ్రాంతమహామునన్.
ఆ. కానఁబడఁగఁజేయఁగా వరమిమ్ముకృత్తిక యనంగ నొప్పు దివ్యతార
యందు నెల్లరకును నగపడుఁగాక నీ,దివ్యరూప మమలదీప్తియుతము.
క, ప్రతివత్సర మిావిధమున, నతులమహాతేజ మొప్పున ట్లీరూపం
బిళరులకుఁ గానఁబడుఁగా, కతిశయపాపౌఘనాశనార్థము శంభూ! 830

ఆ. సర్వజంతువులును జక్కఁగాఁగాంచి పా, పాళిఁబాసిసౌఖ్యమందఁజాలుఁ
గాక యనిన శంభుఁ డాకరణిఁగల్గు, నాదుదర్శనంబు నాతి మిన్న.

చ. అని వరమిచ్చి కానఁబడ కందె యదృశ్యతనొందె; గౌరియున్
దనుసఖులెల్లఁ గొల్వ గిరినాథుఁ బ్రదక్షిణపూర్వకంబుగా
మనసు ప్రమోదసాగరనిమగ్నముగాఁగ నమస్కరించి వే
ఘనమటుశ్యామలద్యుతిని గ్రాలఁగ నయ్యరుణాద్రిరూపతన్. 832

తే. లోకవిఖ్యాతిఁగాంచఁగ నాకిగణము, మేలుమేలని మెచ్చఁగ లీల నిల్చె
మరకతప్రభలన్‌లింగవరముమించ, మందగమనంబుమీఱంగ నందుఁదిరిగి.

చ. చరణసరోజకాంతులను క్ష్మాతలమెల్లను వెల్లఁజేయుచున్
సరసిజరాజినిన్ గనక సారససంతతి నుత్పలంబులన్
బరశివలింగ మాదరము భాసిలఁ బూజలఁ దన్చె లింగ మా
ధరణి ధరాకృతిం బొలిచి తద్దయు వెల్గె జగద్ధితార్థమై. 834

చ. హరిహయముఖ్యదిక్పతులు నంగనలున్ దనుఁ గొల్వఁగా సమా
తరుణియు మాతృసంఘములు తన్నొగి గంధ మొసంగి భూషణో
త్కరములు కాన్కలిచ్చి తగుఛత్రతతిన్ వరచామరంబులన్
నిరుపమతాళవృంతముల నెమ్మి నొసంగి ప్రియంబు మించఁగన్. 835

తే. మమతఁ దాంబూలసంపుటకము నొసంగి
వానినెల్లను గైఁదాల్చి మానినీవ
తంసములు రాఁగ మానికాంతలును దోడ
వచ్చుచుండంగ నరుణాద్రి వామదేవు. 83

క. మనమున నెంచిప్రదక్షిణ, మును జేయుచుశంభుపార్శ్వమునవసియింపం
గను సాయుజ్యమునొందం, గను గోరుచు భక్తిభరతకమ్రహృదయమై.

తే. వన్నె యుద్వాహవహ్నికిఁ గడఁగి తాఁ బ్ర
దక్షిణముచేయునట్లు నితాంతమోద
మలరఁజేయుచు నుండ నాహారునిపనుపుఁ
దలఁ దాలిచి దేవతాతతులు వచ్చి. 838

క. పరివేష్టించిరి హిమగిరి, వరపుత్రికనిర్జరాళివర్యులు సేవా
దరమునవచ్చిరి వాణియు, సరసిజభవుఁ గూడివచ్చె సమ్మద మలరన్

చ. వనరుహనేత్రుఁగూడి రమ వచ్చెను సర్వదిగీశకాంతలున్
గనుఁగొను వేడ్క నమ్మహముఁ గ్రన్ననవచ్చిరి దేవనాథునిన్
వనముల నడ్డగించునటు వర్షవరంబులచేత, నద్రినా
థునితనువొంది యున్నయలధూర్జటిశైత్యము నొందఁజేయఁగన్. 840

చ. తపమున దేవతాపతికిఁ దానవపాయిని యన్నయాతలం
పపుడు మనస్సునం దగిలినట్లు మహత్తరకష్టసాధ్యమా
తపము జలాధివాస మనుదానిని దెల్పఁగఁ బూనినట్లు మా
నిపటల దేవమానులకు నీతినిబోధ మొనర్చు నాక్రియన్. 841

తే. చిన్నతనమున నభ్యసించినవిలాస, కేళులకు భూరితపమున మేళగించి
నట్లువిరహంబునందున్ననాత్మ సంస్థ, శంకరునిధ్యానయోగనిష్ఠను జెలంగి

క. ఇరువురను శీతలత్వ, స్ఫురణముగలవారిఁ జేయఁబూనినయటుపు
ష్కరముల నివసించెను ద, ద్ధరణీధరపుత్రిస్వాంతధైర్యము పొంగన్.

సీ. అద్భుతసర్వతీర్థాళికి నాశిలాతలమున సంస్థితిఁ గలుగఁజేసి
తద్గతాధిక్యంబుఁ దాఁ జాటఁబూనినచందంబునను జలసంస్థితిఁగనె
వాంఛితంబులనీయబహుపాపములఁ బాయఁజేయఁబంచాగ్నిసంస్థితిసుదుష్క
రమనుదానిం దెల్పమమతఁబూనినరీతి నందుండితపముచేయంగఁబూనె

తే. నంతియేకాక మహిషాసురాధిపగళ
భవమహారక్తధారలు వపువునిండ
వానిఁ దొలఁగించి లింగంబు మానితాంబు
వులను గడుగంగఁ బూనినపోల్కి నొప్పి. 844

చ. కనఁబడుచుండె దేవగణకాంతుని శిల్పియు విశ్వకర్మనా
వినుతికి నెక్కుధీరుఁడు సువిస్తృతి గాంచినపత్తనంబు శి
ల్పనియతిమీఱ నేర్పఱచె భవ్యతమంబయి క్రాలునట్లు మే
దిని నరుణాహ్వయంబునను దిక్కుల నించెను గీర్తిసంపదన్. 845

తే. అందపీతకుచేశ్వరుఁ డనఁగ నరుణ
శైలనాయకుఁ డనఁబొల్చుశంకరునకుఁ
దృప్తిఁగలుగంగ నిర్మించె దేవశిల్పి
శృంగముల నొప్పుసౌధాళిఁ జెలఁగు వేడ్క. 846

క. వారస్త్రీరత్నంబులు, కోరి నివాసంబుఁ జేయఁగోరుదు రవియున్
ధారాధరములధక్షిస్నతి, నేరీతిఁ మీాఱఁజాల కేయుండంగన్. 847
తే. మెఱపుఁదీవలు దీపాళి మించు ప్రాన్కి
వెలుఁగఁబూనియు నపజయ మొలయఁ గ్రిందఁ
గాంచుచుండంగ నా మేఘగణము గెల్వఁ
దలఁచిన ట్లంబరంబునఁ దగుగృహములు. 848
మ. పురసౌధాగ్రములంద్ వసించి యువతీపూగంబు గేయంబు లా
దరమొప్పారఁగఁ బాడుచుండ విని గంధర్వుల్ మహాసిద్ధు ల
చ్చర లింకం గలదేవభేదములు ప్రాత్సంతోష ముప్పొంగఁ బ్ర
స్తరరూపంబుల నిల్చి విందురు చనం దారెంచ రొక్కప్పుడున్. 849
సీ. అష్టాపదస్యందనాక్రాంతమై యష్టవీథీవిశాలమై వెలసి మఱియు
నష్టాపదపథాళి నలరుచు దిక్పాలకాష్టసంసేవ్యమై యష్టసిద్ధు
లీయఁగాఁదగి పరమేశ్వరపదపంకజాశ్రయులౌ సిద్ధు లలర వెలసి
యష్టాంగభక్తియుక్తామలమానసపండితవ్యూహమై భాసిలి మఱి
తే. సతత మష్టాంగబుద్ధులౌ సజ్జనులొగి
గొలువ నెసఁగుచు నాల్గుజాతులును మోద
మునను నివసింప నుపవర్ణములును దనర
నప్పురంబొప్పు స్వర్గంబు నపహసించి. 849
క. కనకమయంబులు రజతం,బునఁ గట్టంబడిన యట్టి భూరిగృహంబుల్
కనఁబడఁ గన్నులపండువు,గను జెలువారుం బురంబు క్ష్మాస్థలమందున్.
తే. శంఖదుందుభిమురజనిస్సాణముఖ్య,వాద్యనిస్వనముల వేణువాద్యరవము
లనువిపంచీస్వనంబులననుపమాన,గానములముఖరితమయి క్రాలుఁబురము.
మ. శివరూపంబుల నొప్పు మానినరులుం జిత్తంబు లానందవా
ర్ధి వరాభంగతరంగడోలికలసందేహంబులం బాసి యా
గవిధిం బాయనివేదఘోషముల భంగం బన్న దేలేనిభ
క్తిరతిఁ నింపఁగ నెంతొ పావనముగాఁ గీర్తింపనై వెల్గుచున్. 852
సీ. దెసలందువిమలకీర్తిస్ఫారశీతాంశుకిరణముల్ పర్వఁగసరియనునది
యెందును లేకయెంతేవిరాజిల్లు;నందమరేశ్వరుండయి హరుఁడు పొల్చు

నవఖేటతుల్యవర్ణములరాజిల్లెడు నవరత్నరుచిరాత్రిదివము ననెడు
భేదంబు గనరానివిపులసంపదగల్గి సమదర్శనుం డనఁజాలుపేరు

తే. సార్థకంబయి యొప్పంగ నధివసించు
విష్ణువాశంకరునిఁ గొల్చు వేడ్కఁ వెలయ
ముందు నిలువంగఁబడి కొల్చుభూరిదివిజ
గణవిభుం డగునింద్రుండు కడఁగివచ్చి. 853

చ. సురతరుపుష్పవర్షమున శోభిలఁజేయుచు నుండుఁ దల్లస
త్పరిమళ మెల్లదిక్కులను బర్వుచు నుండు విచిత్రరీతిగా
మరుదధినాథుఁ డభ్రనదిమాన్యజలంబుల మున్గివచ్చి శం
కరుపయిపీచు నద్దియె యొకానొకసేవగఁ దాఁదలంచుటన్. 854

† తే. సౌరభామోదవాసితసకలదిఙ్ము
ఖుఁడయి వాయువు సేవించు నోడయుఁ డనుచుఁ
గనకశృంగాగ్రపరిధూతవనసమూహుఁ
డగుచు విక్రమసంభ్రమ మమర నంది. 855

చ. పలుమఱు అంకె వేయు, సురపాలునిషడృతువుల్ మనోజ్ఞముల్
లలితము లాత్మసంగతివిలాసము మించ నెసంగుచుండు పూ
వులఁ దనియంగఁజేయును; శివుఁ బ్రమథుల్ బహురూపు లౌచు ని
శ్చలనయభక్తులొప్పఁ బరిచర్యలఁ దన్పుదు రెల్లకాలమున్. 856

క. పరమర్షులు సిద్ధులు నిర్జరులును గుతుకంబు మీఱ సాంద్రప్రీతిన్
దరిసెనము చేయుచుందురు, పరమానుగ్రహమునొందు పట్టుదలలచేన్.

వ. కుంకుమక్షోదసమ్మిశ్రకస్తూరరజోపేతంబయి చర్యాముష్టి మహా
సారంబు వ్యాపించియుండు. మృదంగకమర్దళఝల్లరీపటహదుందుభి
తాళసమన్వితంబులై జలజకీచకకాహళనిస్వనంబులు సురకల్పితంబులై
భువనంబు నిండుచుండు. సురవధూజననృత్తంబులు తుంబురుప్రము
ఖులగానంబులు వినంబడుచుండు. ముని దేవగణాన్వితుండై వృషభాధి
రూఢుండై సమదర్శి యగుశంకరుం డాతరుణంబున నరుదెంచి కరుణా

---

† అతీవసౌరభామోదవాసితాఖిలదిఙ్ముఖః. అని మూలము.

నీరధి గావునఁ బార్వతికి లజ్జాభరంబువాయఁ దిగిచి యంకంబున
నిడుకొని సంతోషాంబుధి నోలలాడంజేసె నప్పుడు. 858

చ. తనప్రియకాంతయా లలిత తత్పరతం గొని చెంతనుండఁగా
మునులును దేవతల్ తనదుమ్రోల భజింపఁగ నిల్వ నప్సరో
వనితలు నాట్యరూపమున వాంఛలుపండ భజింప గాయకుల్
పనివడి పాడి తన్గొలువ భద్రుఁడై తనయంత వెల్గుచున్. 859

చ. అమరగణాధిపుం డొసఁగినట్టిపటీరము లోనుగా సుగం
ధము వెదఁజల్లువస్తువులఁ దా నెదమెచ్చుచు సంగ్రహించి యా
హిమగిరినాయకుం డనుప నెంతయు సౌరభయుక్తి మించి యు
త్తమతమ మైనయామృగమదంబును గైకొని తృప్తినొందుచున్. 860

సీ. అనులేపనంబుల హారరాజంబులఁ బార్వతియును దాను బహువిధముల
విలసిల్లుచుఁ భక్తబృందేష్టదులుగాఁ గనుండి రంతట శంకరుం డపీత
కుచయను పేరనఁ గొమరారు పార్వతిస్తనకుట్మలావరణనిభృతతనుఁ
డగుచునానందమహాబ్ధిమున్గుచునుండెఁ;బర్వతేంద్రునితనూభవయుఁదుంగ

తే. కఠినపీవరకుచకోరకస్థగితశు
భపరిమళగంధకోమలవపువుగ్రాల
వెలయ నాదేవి తనచెంతనిలువ శివుఁడు
తద్విరహతాపమును బాసి తతసుఖంబుఁ
గాంచె నవ్వేల దారను గనుచు నాత్మ. 861

చ. తనునెడఁబాసి సంతతము తద్భవతాపకృశాంగ మొప్పఁ ద
న్గనుటయె వాంఛితార్థముగ గాఢపురాకృతపుణ్యరాశిసం
జనితఫలంబుగాఁ దలఁచుతన్విని గాంచి వినోదవాక్ఛతం
బున ముదమొందఁజేయుచును బూతమతీ! వరమిత్తుఁ గోరుమా. 862

తే. సంశయింపక యెది కోర స్వాంత ముత్స
హించు దానినె తెల్పుమా యంచు నాద
రమునఁ బురికొల్ప నద్రిజ ప్రమద మొంది
వందన మొనర్చి మూఁడుభువనములకును. 863

క. పరిరక్షగల్గుపద్ధతి, నరసి మహాత్మ్యంబు వేఁడు మని నప్పుడె నే
వరమడుగుటయే లెస్సని,కర మాలోచించి తెల్పెఁ గాంక్షిత మెల్లన్.

## త్రయోదశాధ్యాయము

శివుఁడు పార్వతికి వరమిచ్చుట

చ. అని వచియించి బ్రహ్మ యనునవ్వలిదాచరితంబుఁ దెల్పెదన్
సనకమునీంద్ర! చక్కనివిన స్వాంతముఁ బంపుము పర్వతేంద్రపు
త్రి నిఖిలలోకమాత యిటు దేవవిభుండును దాను వేఱుగా
దనెడుమహాశయంబు తనయంతన తోఁచుట నాత్మ యుబ్బఁగన్. 865

చ. తనవర మెల్లలోకములఁ దద్దయుఁ గావఁగఁజాలు నట్టిదై
తనరఁ గృపాంబురాశియనఁ దా మునిసంస్తుతయై తనర్చుటన్
వనజభవాదిసన్నుత నవారితభక్తజనార్తిగాఁ దనున్
జనులు తలంచుటన్ పరమసాధ్వి యనందగి తాఁ జెలంగుటన్. 866

చ. వర మిటుగోరె శంకర! స్వభావము నీయదియౌఁ గృపాబ్ధినాఁ
గరము ముదంబునం బొదలఁగాఁ దగుచిత్తము నీది యౌఁగదా
నిరుపమదృష్టిసుందరము నీవిటఁ జూపినరూపమో విభూ!
ధర నటులే చెలంగెడువిధంబునఁ జేయుము నాకుగా నిఁకన్. 867

మ. వదలంగూడదు దాని నెట్టితఱినే వాంఛించి యేతప్పుచే
య దయన్ నన్గొనునట్లు లోకముల కింపౌ నిద్ది దేవా! శుభ
ప్రదమౌ దివ్యమనోజ్ఞగంధయుతమై భాసిల్ల నద్దానిఁ గాం
చి దమింపొందుదు రెల్లభక్తు లని నేఁజింతింతు సత్యంబుగన్. 868

చ. ఉరగవిషంబు పద్మభవు నుగ్రకపాలము భూతియున్ భయం
కరములుగాఁ గనంబడుచుఁ గ్రాలెడు నిట్టివిభూషణంబులన్
గరము వెలుంగుచున్ ముదము గాంచెడు నీస్థిరరూప మద్ది రా
ధరణిఁ జెలంగవయ్య సతతంబు నిదే గతి లోకశంకరా! 869

తే. మాల్యగంధాంబరంబుల మహితరూప
గాంచ సుకుమారుఁడవుగాఁగఁ గానఁబడుదు
వమలరత్నవిభూషణసముదయంబు
సంగ్రహించుచు విహరింపు శంకర! యిట. 870

ఆ. అరుగుదెంచువార లమరకన్యలు నిత్య, మీశ! నిన్నుఁగొల్వ నృత్తగీత
వాద్యములను దృష్టివఖిలంగఁజేయుదు, రట్టివారిసేవ లవధరింపు. 871
చ. ప్రమథులు మానవాకృతులఁ బర్వతచాప! దివానిశంబు స
మ్మదమున నిన్నుఁగొల్తురు సమస్తవిధంబుల నస్మదీయసం
గమ మిది పుష్టివర్ధనముగాఁగఁ బరీమళయుక్తిగాఁగ న
ర్థములను నాలుగింటిని; సతంబును గూర్పను దక్షమై తగుఁన్. 872
తే. సర్వమంత్రాత్మకం బగుసంహననము
దేవదేవ! గ్రహించితి వీవె యిచటఁ
ద్వచ్చరిత్రంబె కైంకర్య మిచ్చట నగుఁ
గాక నీయందు భక్తి నిక్కంబు తగుత! 873
క. జ్ఞానాజ్ఞానకృతంబుగఁ, గానంబడునాగసు లవి క్షమియింపఁబడం
గా నీశానా! తగుని, న్నే నమ్మినవారిఁగావ నెన్నుమ యాత్మన్. 874
క. ఇతరులశరణము వేఁడన్, జతనము సేయంగ నుంతసమయము రాకుం
డుత మీశ! నీదుభక్తవితతికి నదెకాలమందుఁ గానివర మిదే.
చ. అని గిరిజాత వేఁడుటయు నయ్యరుణాచలనాథుఁ డద్రిజం
గనుఁగొని సుస్మితం బలరఁగా భవదీప్సితముల్ ఫలింప నీ
మనసు ప్రమోదమొంద సురమానులు మేలని మెచ్చఁగా వరం
బు నొసఁగినాఁడ వాంఛితసమూహము పండెఁగదా తలోదరీ! 876
చ. ఇరువుర మీతటంబున నభీష్టపరంపర పండఁగా మనో
హరగతు లొప్ప సమ్మదవిహారము సల్పుద మాదృతిన్ గిరీ
శ్వరతనయామణీ! రుచిరసారతరం బని సాధునుత్యమై
పరఁగెడుదీనిఁ గస్తురిని భద్రదమంచు ధరింపుమా తగన్. 877
క. పులకాఖ్యదైత్యుఁ డొక్కం, డలఘుతపం బాచరించి యలరించితపః
ఫలముగ వర మొందెనునా, వలన న్మృగరూపియగుచువర్తిలునతఁడున్.
క. పరమాద్భుతసౌగంధ్యము, వరఫలమం చెన్నవలయు వాఁ డద్దానన్
సురవనితలమోహితలై, తిరుగందనవెంటఁజేసి దృప్తుం డయ్యెన్. 879
చ. క్రమముగ ధర్మమార్గమును గాదని స్వేచ్ఛఁ జరింపఁ జొచ్చి లో
కములకు బాధగల్గునటు కాంతరో! యాతఁడు సంచరించె న

య్యమరులు నన్ను వేఁడి రతిఁ డార్యపథంబును వీఁడెఁ గాన వీ
నిమదమడంగఁజేయు మని నేనును వానిని బిల్వఁబంచితిన్. 880

చ. జగముల మేలుగోరుచు ననాథుపథంబయి యానురం బనం
దగునటు లొప్పు దేహమును దానవనాయక! పాయుమా యటం
చగవరపుత్త్రి! యాతనికి నాజ్ఞ యొసంగితి నన్నుఁ గాంచి దై
త్యగణవరేణ్యుఁ డిట్లనియె సాంబశివా! భవదాజ్ఞ నెన్నుచున్. 881

చ. వదలెద నీకళేబరము వారక యంచు వచించి భక్తి నా
పదములశీర్ష మ్ముంచి తెగుభంగి నమస్కృతు లొప్పఁజేసి స
మ్మద మలరంగ నిట్లనియె మామకదేహజ మైనసౌరభం
బిది జగదేకమోహనమహీనసుఖం బగుచున్ దనర్చుటన్. 882

ఉ. ఆదరచేతసంబున మహాత్మ! ధరింపుము దీని; నాతను
స్వేదభవంబ యౌ ననెడువిశ్రుతిగాంచునుగాక! యిద్ది స
మ్మోదదమైజగంబులఁ బ్రభూ! భవదీయకృపాతిరేకసం
పాది యుదాత! యెప్పటికి భద్రదమై సుఖదాయకంబునై. 883

సీ. శృంగారరసవృద్ధికిం గారణంబయి మృగమదమీయది మిగుల నీకుఁ
బ్రియమయి సౌభాగ్యవిగ్రహసంపదనంతలావణ్యసత్కాంతుల నిడుఁ
గాక నీయానతిఁ గ్రక్కున వదలెదఁ దనువు దీనిని దేవతాగణపతి
వగునిన్నుఁ దలఁచుచు నగజాతకుంగూడసమ్మతమైయుండఁ జనుమదంశ

ఆ. సంభవంబు లగుచు సాధుమదీయత
పస్సులబ్ధసౌరభంబు లగుచు
మృగము లిందుమౌళి మేలగులాంఛన
మగుచు వెలయుఁగాక ననవరతము. 884

వ. ఆలేపనచ్ఛలంబున నీమూర్తియందు లీనంబులై యుండునట్లు ప్రసా
దింపవే యనుటయు నేను నంపుల కీర్కొటి నాయుత్తరక్షణమునందు.

చ. పులకసమాఖ్యదైత్యగణపుంగవుఁ డాత్మశరీర మంతలో
పల విడనాడి నన్నె తలఁపం దగుచిత్తముగల్గి నా యెదం
గలిసెఁ దదంగసంభవముగాఁ దగునమ్మద మింతొ సౌరభం
బుల వెదఁజల్లుచుండఁ గడుఁబూజ్యముగాఁ దలపోసి దాల్చితిన్. 886

క. శతశృంగారవివర్ధన, మతులం బిది యంచు నేమహాద్యుతిమీఱన్
సతి! దాల్చినాఁడఁ దపమున,నతికార్శ్యంబయ్యెనీదునంగము గానన్.
క. నాతనువు నీదువిరహమ,హాతాపమున న్గృశించె నట్లాటఁ గుభృ
జ్జాతా! యాతనుకార్శ్యం,బీతఱిఁ బోఁగొట్టుఁగాక! యిది ధరియింపన్.
చ. అని పలుభంగులం బొగడి యాపులకాంగజసారభంబు నా
వనిత నలందఁజేసె నలపర్వతపుత్రియుఁ బ్రీతిభారముం
గనుచు గ్రహించె దానిమెయిఁ గాలగళుండును గాంతదై నయా
తనురుచిరత్వ మట్టె గని తావకదేహరుచిం దలంచితే. 889
క. అని మేలమాడుచున్ మృదు,తనువునుహస్తాంబుజమునఁ దాఁకంగని య
వ్వనజాక్షి పలికె మోమునఁ,గనఁబడుసంతోష ముబుకఁగాఁ బతితోడన్.
ఆ. తాను మునుపు పూజఁదన్పిన కల్హార, మపుడు శివునికరమునందు నుంట
కచ్చెరువును గాంచి యనియెఁ గైలాసశిఖరినిబాసి తావక మగునాజ్ఞ.
చ. తప మొనరింపఁ గాంచి యని ధాత్రిఁ బ్రసిద్ధిని గన్న పత్తనం
బపరిమితప్రమోద మిడునంచు యశంబును గాంచెఁ గాన నె
ల్లపుడు మునీంద్రు లుంటయు మదాత్మ నెఱింగియె చేరితిన్ లస
త్తపనశశాంకపావకకృతప్రియనేత్రవిభూషణాహరా! 892
ఉ. మానసమన్ సరస్సున సమస్తవిధంబులచే మనోజ్ఞమై
మానసతృప్తిఁ జేయఁదగుమాడ్కి నెసంగెడురక్తసంధ్యకం
బూనిన వేడ్కఁ దీసికొని యుత్తమపద్ధతిఁ బూజసేసితిన్
గానదు మ్లాన మాట నది గాఢపరీమళసంభృతంబునై. 893
తే. అక్షయంబై యవిశ్రాంతమైయదితగు,దానఁ బూజించితిన్ నినుదానిపత్ర
ముల వివిచ్యుతిఁగాంచకయలరుచుండు,గాంతిసంపదశ్రీమహాకాళభూష!
క. సురధేనుఘృతంబున నా, వరసుమమును ముంచు నీకు భాసురభూషో
త్కరవర మగునని యుంచితి, నరవరు లద్దానిఁ గాంత్రు నైజప్రీతిన్.
క. కావున దీనిం దాల్చుము, పావనభూషణముగాఁగఁ బరఁగుతమిది నీ
వేవిధి దీనిన్ వదలక, యేవఱలుచునుండు మిద్ది హితమగు నాకున్. 896
సీ. ధర్మలక్షణముల ధాత్రీతలంబున సంరక్షణార్థమై శర్వ! నిల్పఁ
దలఁచితినశ్వేష్టములనవ్వియొసఁగ నోనాకుఁ బ్రీతియు దాననేకలుగును

ముప్పదిరెండుగా నొప్పునాధర్మముల్ రక్షింపఁదగువాని రక్షుణ! నీదు
పాదసందర్శనస్వపరమోత్సుకంబున నరుదెంచి వారవ్వియాదరమునఁ

ఆ. గైకొనంగఁదగును గమ్రకల్పాభూషితము సర్వభోగసిద్ధికరము
నైననీదురూపమోనాథ! యుత్సవములనుజూడఁదగుదురలఘుమతులు.

క. వినుకన్యాసంక్రమణంబున నాకుం బ్రీతిగాఁగఁ బొలిచి భవహృతిన్
ఘనయశము నొందురూపంబును దీనింజూచువారు పూజ్యులుధరణిన్.

క. దానన నాకుం బ్రీతియు, నోనాథా! యనిన గౌరి యాదృతిమీఱం
గా నడిగినవరముల నవ్వానిం దమి నిచ్చె నంచు బ్రహ్మవచించెన్. 899

ఆ. మఱియుఁ బలికె నిట్లు మానివరా! యరుణాచలేశ్వరుండ హీనగణవి
భూషణుండులోకపూజితుండయిపొల్చు,గౌరికిట్ల వరంబుఁగరుణనొసఁగి.

సీ. సర్వభోగంబుల సర్వదా పొందుచు భక్తాళిఁ గాచు నాశక్తిఁ బూని
కావున శాంభవంబై వర్ణనీయమై యరుణాద్రితంగాంచి యన్వహంబు
ధన్యులౌ మనుజులు దర్శింత్రు వలగొని వందనములభక్తిభావనలను
ధ్యానింత్రుశోణాద్రిదగఁనీమహత్త్వంబువినువారలకునెల్లవిధములసిరు

ఆ. లలరుచుండు రూపమతులబలంబును
గలుగు వాక్పతిత్వ మొలయు మఱియు
జెలఁగువారి కెపుడు శ్రీమత్వ మలరారుఁ
జరిత మిద్ది పాపసమితి నడఁచు. 901

చ. చరితము దీనివిన్న సిరిసంపదయుట్ లభియించు; ప్రోదినీ
సరసులఁ దీర్థరాజముల సంతతముట్ విధిస్నాన మాచరిం
ప రహిఁ జెలంగుపుణ్యమది పాయక వారివరించు; నింక న
ధ్వరశతముల్ పొనర్చుసుకృతంబు లభించును దత్క్షణంబునన్. 902

చ. అరుణగిరీంద్రుదర్శనము హర్షదమౌ గిరిశప్రసాదమన్
వరము నొసంగునిక్కరణి వచ్చి మహేశ్వరు నాజ్ఞ శాపమున్
బరమతపఃప్రభావమునఁ బాసి హిమాద్రిజశోణభూధరే
శ్వరుమహిమంబుఁ జూచె మునిసత్తమ! శంకరుస్థానముల్ క్షితిన్.

క. కలవు పరార్థము లంబరతలమున స్వర్గంబునందుఁ దగునైనగిరి
సలమున నివసించుట కే,త్రిలోచనుం డెంతో యాదృతిం జూపు మునీ!

ఉ. కావున నుత్తమోత్తమముగాఁ దలపోయఁగవచ్చు దీనిన
ద్భావమునం దలంపఁ గనుపట్టు నిదే పరమార్థ మంచు నిం
దేవిధిఁ జూడ నిస్సమత నెంతయుఁ గ్రాలును శంభుతేజమో
దేవమునీంద్ర! సర్గము స్థితిం బ్రళయంబును జేయ సర్వమా. 905

క. ఇది తైజస మగులింగము, త్రిదశాళినమస్కృతంబు దివ్యము నగుము
క్తిదమునగున్ క్షితియీయది, విదితమగున్ గర్మభూమి విపులఖ్యాతిన్.

చ. కనుకనె ధర్మ మిందు నధికం బగుశోణగిరీశు తేజమే
జనులను వీతకల్మషులఁ జయ్యనఁ జేయును భక్తిమంతులౌ
మనుజులు లోకమందు సుఖమందనులౌదురు పెక్కులేల యో
మునివర! యీగిరీంద్రమునుబోలిన దెద్దియు నుండ దీయిలన్. 907

చ. నతులఁ బ్రదక్షిణంబుల ననంతతపోనియమంబులన్ యథా
మతి నరుణాచలేశ్వరుని మానవిపూన్కిని బూజచేసినన్
శితిగళుఁ డట్టివారికడఁ జేరియె యుండు వశంగతుండనన్
మతులకుఁ దోఁపఁ జేయుచు సమస్తసుఖంబుల వారిఁ బెంచుచున్. 908

తే. తపములను యాగముల మహాదానములను
శంభుఁ డవ్విధి సంతోషశాలి కాఁడు
శోణగిరిశుని నొకసారి చూడఁ దుష్టి
మంతుఁ డైనట్టులని నమ్ము మింత నిజము. 909

క. తమయంత వెలయు నావేదము లితిహాసంబు లభ్రతలమున స్థితిఁగాం
చి మహాదేవుని శోణాద్రిమయునిసతతంబు సన్నుతించు మునీంద్రా!

క. దీనిమహత్త్వం బంతయు, నేనుం జక్రియును వర్ణనికరం బెంతో
పూనికయత్నించిన నిది, యానని చెప్పంగనేర మని చెప్పఁజనున్. 911

వ. హరిముఖ్యు లగు దేవవర్యులు కల్పవృక్షంబులు ప్రచ్ఛన్నరూపంబుల
నీశంకరు సేవించుచుండు. ఇందుండువారికిం గలిదోషంబు లుండవు.
ఆధివ్యాధిభయంబులు గలుగవు. అరుణాచలలింగం బెందుఁ బూజింపం
బడునో యది భూతలస్వర్గ మని నమ్మంజను. శంకరుపదాశ్రయంబున
నింతమాత్రంబు వచియించితి. కల్పశతంబులు పుణ్యంబు లొనరించిన
నీయరుణాచలవాసంబు లభింపదు. అని బ్రహ్మ సనకమహర్షికిం జెప్పె

నని సూతుండు శౌనకాదులకుం దెల్పి యీక్షేత్రమహాత్త్వంబు విధిముఖనిన్నుతంబు. సుధోపమంబు నగు దీని వినిన సకలదురితంబులు. తొలంగు నని మఱియు నిట్లనియె. 912

చ. శ్రుతిపుటమందు నీకథను జొన్పినమాత్రనె యమ్మునీశ్వరుం
డతులతపఃఫలంబుల మహావిభవంబుల నప్పు పొందె; నా
గతి వినువారలెల్ల గతకల్మషులై తరియంత్రు శోణప
ర్వతపతి సత్కృపంగలుగరానిఫలంబులు గల్గునే ధరన్. 913

అరుణాచలఖండమున( బూర్వార్థము సంపూర్ణము

శ్రీకామాక్షీసమేతమల్లికార్జునేశ్వర పాదార్పణమస్తు.

శ్రీ ర స్తు

# అరుణాచలఖండము

## ఉత్తరభాగము

## ప్రథమాధ్యాయము

మార్కండేయుఁడు నందీశ్వరుఁ బ్రశ్నించుట

క. శ్రీనాథ శతధృతిప్రము,ఖానేకత్రిదశనాయకార్చితవినుత
శ్రీనిలయదివ్యపదప, ద్మానిర్మిత విశ్వసంచయా! శశిమౌళీ!

వ. మల్లికార్జుననామవిరాజమానపరమశివా! తరువాతికథాసారము నవధరింపుము. సకలపురాణనిర్మాత యగువ్యాసమహాముని యిట్లీయరుణాచలవృత్తాంతంబు తెలుపంబూని.

క. నైమిష మనుకాననమున, భూమీసురమౌను లుండి పూతమనస్కుల్
శ్రీమహితుసూతునిం గని,యీమాడ్కిం బ్రశ్నచేసి రెసఁగెడుశ్రద్ధన్.

చ. హరనిలయంబులందు నెది యారయ నుత్తమ మంచు నెంతయో
కరుణవచింపు దాని వినఁ గౌతుక మయ్యెడి మౌనిచంద్రమా!
పురుషతతిన్ నితంబినులపూగము శర్మము నందఁజేయు నా
నిరుపమశంభువాసము మనీషలు కోరెడు నాలకింపఁగన్. 2

చ. అనుటయు సూతుఁ డిట్లనియె హర్షముపొంగఁగ నందికేశుమో
మున నెది చెప్పఁగాఁబడియెఁ బూర్వము; నే నది తెల్పువాఁడ; స
న్మునిపతియా మృకండమునిపుత్త్రుఁడు నా కెఱిఁగించె దానినే;
వినుఁ డిఁక మౌనులార! మునిబృందవరేణ్యుఁ డనంగ భూమిపై. 3

తే. యశముగన్నమార్కండేయుఁ డాదరమున
నందికేశ్వరుఁ గని భక్తి నాకు నీవు
తెలిపితివి మున్ను మాధ్యమేశు లలితచరి 4
తమును దానిమనంబునఁ దాల్చినాఁడ.

క. వినను గాలాంతరమున, మానస మద్దాని సుంత మఱచెను నందీ!
కానన్ మరలం దెల్పుము,నే నది ధరియింతు నెంతొ నియమంబలరన్.

ఉ. నే నెదికోరువాఁడనొ మనీషివరా! హృదయంగమంబుగా
నౌనని దానిఁదెల్పుము సమంచితబుద్ధివి గాన నీకు నే
దే నడుగన్ వచింపఁదగునెల్లవిధమ్ముల నీవెఱుంగఁగా
లేనిది నెద్దియే నెచట లేదని నేఁదలపోయుదుం జుమీ! 6

సీ. సర్వాగమపురాణజాలమ్మునందు బా
హ్యాభ్యంతరములందు నరయ స్వర్గ
పరమపదంబులఁ బురుషుల కొసఁగంగ
భూమి యొక్కఁడె శ్రేష్ఠముగ గణింపఁ
బడుచుండుఁగద మఱి పరమకర్మంబులు
తదుచితఫలలాభపరులచేతఁ
జేయంగఁబడుచుండు సిద్ధఫలం బది
త్రివిధం బటంచు నీవె వచియించి
తే. నాఁడవుగదా మహాత్మక! నందికేశ!
సుఖము మఱినాకభోగము శుభదమైన
యల్లకైవల్య మన బడునట్టిభేద
ములను దొలుతటి రెంటను బుణ్య మడఁగ. 7

క. త్వరగా నశియించును గ,ర్మరతిం గవనట్టి దగుచు రాజిల్లుచు సు
స్థిర మగుమూఁడవ దె,త్తరుణంబున నాశమొందఁడగకయె యలరున్.

క. అది సిద్ధించుప్రకారము, సదయతఁ జెప్పితివి మున్నె శంకరభక్తా
సదమలవిజ్ఞానదమై, పొదలుఁగదా యద్ది భక్తపూగంబునకున్, 9

చ. తనువుధరించువారి కది తద్దయు దుర్లభమే యనంగనౌఁ
దనుధరులందుఁ గొందఱికె తత్పరిశుద్ధవిమోక్షదంబు నాఁ
దనరెడుజ్ఞాన మయ్యదియు స్థానమునం దెట నుండినన్ లభిం
చును నిగమాదిపాఠ మది చొప్పడకుండినను వచింపవే. 10

మ. శివునకుఁ బూజ సేయుతమి సిద్ధఫలప్రదమైనజ్ఞానమో
శివపదపూజకా! కలుగుఁ జెప్పుము తద్విధ మెల్లవారికిన్
యనని లభింపనౌనదె మహాత్మను గల్గినవాంఛితంబు త
చ్ఛివపదమున్ వచింపు మెటఁ జేరిన నయ్యదియున్ లభించునో, 11

సీ. జ్ఞానయోగక్రియాచర్య లెల్లరకును,గలుగదు శంకరాగమములందుఁ
గనఁబడువిషయంబులను గాఁచఁదగునూహ, యెల్లరకుంగల్గదిదినిజంబు
కావున నే స్థానకంబునఁ జేరి య,త్యల్పనియమముల నాచరింప
నావిశుద్ధజ్ఞాన మలవడునో యెల్ల, జనులకు నట్టిసుస్థానమహిమ
తే. మాదరంబునఁ జెప్పుమా యార్య! భస్మ
చర్చరుద్రాక్షధారణశంభుసంస్మృ
తిని సకృత్తుగ నొనరింపఁగనె లభింప
వలయు విజ్ఞాన మయ్యది యలఘుతేజ! 12
క. మనుజులు ముగ్ధులె యైనన్, గనఁదగువిజ్ఞాన మద్ది కాళగళుని స
ద్వనరుహసంస్పర్శనపా,వనతంగనుస్థానమున నివాసము గన్నన్. 13
ఆ. బుద్ధిపూర్వకముగఁ బుణ్యము చేయక
యున్నస్థానమహిమ మొప్పవలయు
నట్టిజ్ఞాన మోమహాత్మ! విఘ్నము లేక
యెందు నుండ నద్ది యొసఁగుఁ జెపుమ. 14
సీ. వర్ణసాంకర్యసంభవులకుఁ దైర్యక్ష్వియోనిబుట్టినవారి కుపలములకు
నవనిఁగల్గినస్థావరవితతికిన్ శ్రేయమేక్షేత్రమునఁగల్గు నెన్నిదానిఁ
బలుకుమాయని వేఁడఁబలుకులనవ్వానినట్లుమార్కండేయుఁడనువదింప
మునులందఱునువిన ముదమునుగని యెద్దిపలికినవినువారమలరుమామ
తే. నన్ను లనిన మృకండునందనుఁడు లేచి
నందికేశ్వరుపాదారవిందములకు
మ్రొక్కి నిలుచుండి చేతులుమోడ్చి యుండె
జగములకు మేలుగల్గించుసత్కథ విన. 15

## ద్వితీయాధ్యాయము.

### భూమండలమునఁగల శివక్షేత్రవర్ణనము

క. మునిపతి మృకండుతనయునిఁ,గని నందీశ్వరుఁడు కాలగళభక్తవరా!
వినుమా నీవడిగినశం,భునిస్థానము భూతలమునఁ బొలుచుం జుమ్మీ.

క. స్థావరజంగమములుగా, నావిధిచే నిల్పఁబడిన యఖిలమహాభూ
తావళికిన్ శర్మమిడం, గా వసుధం దగినయట్లుగా శంకరుచేన్. 17
క. స్థానము కల్పింపంబడెఁ, గానం గర్మానుగుణ్యకమ్రసుఖంబుల్
జానుగఁ గల్గెడు నాయా, యోనులయం దుద్భవంబునొందియటఁ జొరన్.
ఆ. అట్టి జీవకోటి కఖిలహితంబులు, గలుగఁగోరి మానికాంత శంభు
సేవచేసి తీవు క్షితి నట్లుగా దేని, భవభయంబువాయుభంగిగలదె.
క. అది కల్పకోటిశతములఁ, గుదురదు స్వల్పంబు లనఁగఁ గూడి విధియుతిం
బొందలెడుకర్మంబుల న, ట్టిదె యగుజ్ఞానంబునం గడింది భవాబ్ధిన్. 20
తే. దాఁట శక్యంబు గాకుండుఁ దనువు మరలఁ
గలుగుచుండు ఘటీయంత్రకంబురీతి
జననమరణంబు లమరుచుండును శమింప
వట్టిజ్ఞానకర్మంబులఁబట్టి మాని. 21
క. తనుధారి గర్భగోళం, బుననుండి జనించుపాపమును బాయు టెటా
వినుపరిశుద్ధజ్ఞానం, బనునది కల్పింపఁబడియె నద్దానికినై. 22
చ. అది విడనాడ గర్భజననాదికసంసృతిబంధనాళి వా
యఁదగినమార్గ మొండుకలదా పరికించిన నెప్పుడైన నే
నిదివఱకే ప్రసంగముల నీశునిక్షేత్రములన్ వచించితిం
గద మునిభేదముఖ్యములఁ గాలగళుండును దత్స్థలంబులన్. 23
క. నివసించుచుండు ననియును, దివిజులు సేవింతు రనియుఁ దెలిపితిఁగా దే
దివిజనదీతీరంబుల, నవి కొన్ని చెలంగు సేవ కర్హతమములై. 24
సీ. దివ్యసరస్వతీతీరంబులం గొన్ని కాళిందితటములఁ గ్రాలుఁ గొన్ని
శోణనదోత్తమ శుభదతీరంబుల నర్మదానదియొడ్డునన్ మఱియును
గోదావరీనదీకూలంబునం గొన్ని గోమతీనదిచెంతఁ గొన్ని కొన్ని
హైమవతీతీరమందును సాగరపార్శ్వంబులం గొన్ని పరమపూజ్య
తే. ములగు సంద్రపుద్వీపసముదయమందుఁ
గొన్ని సింధుముఖంబులఁ గొన్ని నదులు
సంద్రముం గూడుచోఁ గొన్ని సారకృష్ణ
వేణియొడ్డుల మఱికొన్ని వెలయుచుండు 25

వ. తుంగభద్రాతటంబులందును, సుపవేణీతీరంబులందును, శక్త్యాపగా పార్శ్వంబులందును, గావేరియొడ్డులందును, వేగవతియొడ్డులందును, దామ్రపర్ణీ, ముర, ళైరావతీ, యాతుకాంతిక, కన్యాకుమారీ, తమసావరుణామందాకినీ, శిప్రా, విపాశా, శతద్రుతి, చర్మణ్వతీ, భీమరథీ, బిందుసారతీర్థ పంపాసరోవర, భైరవీ, కౌశికీ, మాలినీ, గంధవతీ, మానససరోవ, రావచ్ఛోదతీ, ఇంద్రద్యుమ్నసరో, మణికర్ణికా, వరదా, పాతాళగంగా, శరావతీ, లోహితీ, కాలమాతరంగిణీ, వితస్తా, చంద్రభాగా, సురళా, పయోష్ణీ, మధుమతీ, పినాకినీతీరములందును జెలువారుచుండు క్రోశపంచకపావనం బగువారాణసీక్షేత్రంబు పరమపావనంబు. అందుఁ బరమశివుం డవిముక్తాహ్వాయంబున విశాలాక్షీదేవిం గూడి పూజింపఁబడుచుండు. 26

ఉ. ఎందుఁ గపాలమోచనమహీనతరం బగుకీర్తిఁ గాంచునో
యెందును గాలభైరవుఁ డభీష్టదుఁడై చెలువారుచుండునో
యెందు మృతిం గనంగనె మహేశత తానయి వారినొందునో
యందె చెలంగుఁ గాశి యనునాఖ్యగలట్టిపురంబు మౌనిపా! 27

తే. గయయు నల్లె ప్రయాగయు గాఢసిద్ధి
దములుగాఁ గీర్తితంబులౌ నఖిలపితరు
లెందుఁ బిండంబుఁ బెట్టినఁ దృప్తినొందు
చుందురో యవ్వియే యశం బొప్ప వెలయు 28

క. మును వినియుందువు బ్రాహ్మణ
మునివర! కేదార మనఁగఁ బొలుచుస్థలమునం
దు నుమాపతిభక్తుం డగు
దనుజుఁడు మహిషాకృతిని నితాంతబలుండై. 29

క. లోకంబుల బాధింపఁగ, వీఁకం బరదేవి లోకవితతికి క్షేమం
జేకోరి వానిఁజంపెను, లోకైకశరణ్యమది కలుషగణహరమౌ. 30

ఆ. బదరికాశ్రమంబుబహుసిద్ధులనొసంగు, నందుఁద్ర్యంబకుండుహర్షమలర
నంబతో వసించు నానరనారాయ, ణార్చితాంఘ్రి యగుచునన్వహంబు.

సీ. నైమిషక్షేత్రము నానాదిగంతవిశ్రాంతవిఖ్యాతి నెసంగుచుండు
దేవదేవుం డనఁగా వామదేవుండు సారంగధారిణీసంజ్ఞ గల్గు
పరదేవితోఁగూడి నిరతివసించును; మఱియము రేశనామంబుగల్గు
స్థానమొక్కండుండుఁ జండికాంబనుగూడి యోంకారసంజ్ఞతో నొప్పు
ఆ. వఱలుచుండు నందు వసుధకలంకార [శివుఁడు
మైనపుష్కరాహ్వయంబుగల్గు
స్థాన మొక్కఁ డుండు శంకరప్రీతిద
మనుచుఁ జెప్పినాఁడ మునుపె నీకు. 32
వ. రజోగంధి యను పేరుగలశంకరుండును బురుహూత యనఁబరఁగు మహేశ్వరియుఁ గలయాషాఢనామక్షేత్రంబు గలదనియు, నది పావన క్షేత్రంబనియు మున్నె చెప్పితిఁగదా మఱియును. 33
సీ. ఆషాఢపతి యనునాహ్వయంబున శివుఁ
డద్రిజరాత్రీశ యనెడుపేర
నెందుండు, నదనుచు, నేదండిముండినాఁ
బ్రఖ్యాతిఁగన్నక్షేత్రం బటంచు
వచియించినాఁడఁ బూర్వమె దేని నచ్చోట
ముండి యనంబడుపురహరుండు
దండిక యనుశైలతనయయు నొప్పుదు
రని యెఱుంగుము; లాకులాహ్వయంబు
ఆ. గల్గు క్షేత్ర మొండుగ్రాలు సంశుద్ధమై
లాకులీశుఁ డనఁగ శ్రీ కలితగ
ళుఁడు చెలంగు గౌరి కడుయశంబున మించు
మునివరా! యనంగ యనెడుపేర. 34
క. మునుభారభూతినామం
బున మించును క్షేత్ర మందుఁ బూని వచింపన్
వినితివి; భారాహ్వయమునఁ
దనరు శివుం డంబికయునుఁ దగుభూతి యనన్. 35
వ. అరాళకేశ్వరం బనుస్థానంబు వర్ణింపఁబడియెఁగాదే. అందు సూక్ష్మ

నామంబున శివుండును సూక్ష్మ యని యంబికయు నుందురు. గయాక్షేత్రంబున మంగళాంబయుఁ బ్రపితామహనామశంకరుండును విరాజిల్లుచుందురు. కురుక్షేత్రం బనుశివస్థానంబునందు స్థాణుప్రియ యను పేర నంబికయు స్థాణనామకశంకరుండు నుందురు. కనఖలస్థానంబు జగత్ప్రసిద్ధంబు. శంకరుం డం దుగ్రనామంబున, నుగ్ర యనుపేర భవానియు వెలయుదురు. తాలకాఖ్యమహాక్షేత్రంబున స్వాయంభువి యను పార్వతియు స్వయంభు వనుశివుఁడు నివసింతురు. అట్టహాసనామకస్థలం బొక్కండు కలదు. అందు శంకరు నారాధించి యర్కుండు పూర్ణమనోరథుండయ్యె. కృత్తివాసం బనుస్థానంబు కైలాసాధికవిఖ్యాతంబుగలదు. భ్రమరాంబికయు మల్లికార్జునుండు నం దుందురు. శ్రీశైలం బనుక్షేత్రంబున బ్రహ్మసృష్టికార్యంబు సిద్ధింప శంకరుం బూజించె. అదియె కృత్తివాసం బనునామాంతరముకల దని యెఱుంగుము. సువర్ణముఖీతీరంబునందుఁ గాళహస్తి యనుస్థానంబు భాసిల్లు. అందుఁ బార్వతీపరమేశ్వరులను వ్యాసుం డారాధించి కృతార్థుండయ్యె. కాంచీనగరంబున నేకామ్రనాథుండు కామాక్షీదేవీసహితుండై యుండు. అంబిక తపం బొనరించుచుండ నామె నాదరంబున గ్రహియించె. వ్యాఘ్రపురం బనుస్థానంబు తిల్లికాననమధ్యంబున నుండు. అందు నృత్యం బొనరించుసదాశివు నారాధించి పతంజలి ధన్యుండయ్యె. శ్వేతారణ్యస్థానం బుక్తపూర్వంబకదా. అం దైరావతంబు భగ్నదంతంబై శంకరు నారాధించి వాంఛాసిద్ధింబడసె. సేతుబంధస్థానంబుం జెప్పితిఁగదా. అందు రాఘవుండు పాపనిర్వారణార్థంబు సాంబశివు నారాధించి ధన్యుండయ్యె. గతప్రత్యాహ్వాయక్షేత్రం బొక్కండు కలదు. అందు జంబూతరుమూలంబున జగద్రక్షార్థమీశ్వరుండుండు. మణిముక్తానదీతీరంబున వృద్ధాచలక్షేత్రంబుగలదు. అందు శంకరుండు విజయంచేసియుండు. మధ్యార్జునం బనుమహాక్షేత్రంబుగల దని వింటివికదా. అందు వరప్రదుండై గౌరీసహితుండై శ్రీగళుండు వెలయు. సోమతీర్థంబునందు సోమనాథుండు దర్శనం బొసంగు. అందుఁ దనువును ద్యజించిన మరల జన్మంబులేదు. సిద్ధవట

నామక్షేత్రంబు గలదు. జ్యోతిర్లింగం బుండు. దాని సిద్ధులు పూజింతురు. కమలాలయనామమహాస్థానంబున వల్మీకేశ్వరుండు వెలయు. శ్రీహరి యాదేవు నారాధించి స్థిరతర శ్రీసిద్ధిఁబడసె. కంకాద్రిస్థానంబునఁ గలసదాశివు నిప్పుడుంగూడ బ్రహ్మకేశవు లారాధించుచున్నవారు. ద్రోణపురం బనుక్షేత్రవర్యంబు పొడకట్టు. కలియుగక్షయంబున నాకాధిరూఢుండై చంద్రశేఖరుండు విహరించు. బ్రహ్మపురం బనుస్థానంబున నింద్రజిత్తు వార్యపుష్కరిణీతీరంబున ధూర్జటిని స్థాపించి పూజించె. జ్ఞానప్రధానం బగు శ్రీకోటికాఖ్య స్థానంబు వర్తిల్లు. అందుండు నిందుశేఖరుండు తన్నారాధించుమాన వుల పాపకోటులఁ బరిహరించు. గోకర్ణక్షేత్రంబు శ్రుతపూర్వంబకదా. అందు శివు నారాధించువారలకు స్వర్గంబు కరతలామలకంబు. త్రిపు రాంతకస్థానంబునఁ ద్ర్యంబకుండు దర్శించువారల నరకంబుల నిరా కరించు. కాలాంజనంబు విఖ్యాతంబుకదా. కాలకంధరుండు భక్తులకు సంసారబంధనబాధఁ దొలగింపంజూచు. ప్రియాలవణం బను పుణ్య స్థానంబున నంబికాపతిపయస్సు నర్థించువారలకు పయస్సాగరం బొసంగు. ప్రభాసక్షేత్రంబున ఖండేందుశేఖరుండు శ్రీకృష్ణబలభద్ర పూజితుండై యక్షయఫలంబుల నొసంగె. వేదారణ్యంబునఁ బ్రమథ నాయకుండు పూజితుండై దక్షునకుఁ బ్రాక్కృతాపరాధంబు క్షమించె. హేమకూటంబు శివక్షేత్రోత్తమం బని వింటివికదా. తప స్సొనరించు మానవులకుఁ బునర్జన్మభయంబు తొలఁగింప శంక రుండు బద్ధకంకణుండై యుండు. వేణువనం బనుక్షేత్రంబు పాపనాశన దక్షంబై యుండు. అందుఁ బార్వతివంశలతాగర్భసంభూతమై విల సిల్లు ముక్తామణి యనంబరఁగు. జాలంధరస్థానంబు గలదు. అందు జలంధరుండు తపం బొనరించి గణాధిపత్యంబుఁ బడసె. జ్వాలా ముఖం బనుశివస్థానంబు గల దని ముందే యనువదించితింగదా. జ్వాలాముఖీదేవి యందుఁ గాలరుద్రు నారాధించె. భద్రవటీక్షేత్రం బొండుండు. అందుఁ ద్ర్యంబకుని హేరంబుఁడు సంపదకొఱ కారాధించి

ధన్యుండయ్యె. న్యగ్రోధారణ్యం బను స్థానంబునం దుగ్రుండు కాళిం
గూడి యుచ్చండతాండవం బొనరించె. మఱియు, 36

సీ. గంధమాదన మనఁగా నొప్పు స్థానంబు
పవమానతనయుచేఁ బరమనియతిఁ
గల్పింపఁబడియె నక్కడనె మృత్యుంజయు
సేవించి ధన్యుఁడై చెలఁగె నతఁడు;
గోపర్వతంబన నేపారు స్థానంబు
గల దందుఁ బాణిని గాఢనియమ
మూని శంకరుఁ గొల్చి యొనరించె వ్యాకర
ణాఖ్యశాస్త్రంబు ధీరాళి మెచ్చ

ఆ. వీరకోష్ఠ మనఁగ విఖ్యాతిఁ గాంచిన
స్థాన మొండు గలదు సాంద్రభక్తిఁ
దప మొనర్చి యందుఁ దాఁ బ్రచేతసుఁ డొందె
సుకవిముఖ్యతను విశోకుఁ డగుచు. 37

క. మును పె మహాతీర్థంబన, జనవిశ్రుతిఁ గన్న తీర్థసత్తమ మది నే
వినిపించినయది గాదే, మునివర! ద్రుహిణాదులమరముఖ్యులుభక్తిన్.

క. హరుఁ గొలిచియమ్మహాత్ముని
కరుణన్ వేదాదులందుఁ గ్రాలురసము నే
ర్చిరి సుము; మయూరపుర మను
హరుక్షేత్రము కలదు నిష్ఠ నమరేశుఁ డటన్. 39

క. తప మొనరించి మహేశ్వరుఁ
డపజయమే యొసఁగకుండు నట్టి కులిశ మొం
ది పినాకికృపకుఁ బాత్రుఁడు
వ్యపగతఖేదుండు నగుచు ఖ్యాతిం గాంచెన్. 40

క. శ్రీసుందర మనుక్షేత్రము, వాసిం గని వేగవతిగ వసుధఁ జెలఁగుచున్
గాసిం బాపెడునదికడ, నేసరణిం జూడ నుపమయే లేనిగతిన్. 41

క. ఖ్యాతిం గాంచెను నచ్చట
భూతేశుఁడు కలియుగమున భూర్యఘరాశిన్

శ్రీతిఘటిల్లం జెందుచుఁ
జేతము సంతృప్తినొందఁ జెలఁగుచు నుఁడుర్. 42

ఆ. కుంభకోణ మనెడుశంభునిస్థానము
విన్నవాఁడవుగద విస్తరింప;
గంగ మాఘమందు సంగతిఁ గనఁజేయు
చుండు దురితములను జెండు వాంఛ. 43

క. అను గోదావరితీరం,బను క్షేత్రము త్ర్యంబక మనునాహ్వాయమున నొ
ప్పునుగాదె మున్ను తెల్పం,గను వింటివిగాదె దానిఖ్యాతి మునీంద్రా!

క. తారకనామకదైత్యుని, బౌరుషమున నొప్పువానిఁ బొడవడగింపం
గోరి గుహుం డట శక్తిని, శ్రీరమ్యగళానుకంపచేఁ దానొందెన్. 45

సీ. శ్రీపాటలాభిఖ్యఁ జెలఁగు వ్యాఘ్రపురంబుగల దని తెల్పితిఁగాదె మున్నె
జాతిశుద్ధిం గోరి భూతలనాయకుఁడౌ త్రిశంకువు త్రినేత్రాభిరామ
వదను మహాదేవు సదమలభక్తిచే సేవించి స్వాభీష్టసిద్ధిఁ గాంచె
భూతలంబునఁగీర్తిఁ బొల్చుకదంబపురంబు శంకరుని క్షేత్రంబుగలదు

ఆ. నీనిమిత్తముగనె నీలకంఠుఁడు త్రిశూ
లమున యమునిఁ బొడిచె సమయ మెఱిఁగి
వచ్చి నిన్నుఁ జంప ముచ్చటఁ గొనువాని
నార్తరక్షకుండు హరుఁడు గాన. 46

క. అవినాశం బను క్షేత్రము,భువియశముం గాంచు నందు భూతేశుండా
శివుఁడు *పడికంతుఁ బ్రోవం,గ వసించున్ దమిఁగృపాబ్ధి గావున మౌనీ!

ఆ. రక్తకాననమన నుక్త మేక్షేత్రంబు,మౌనివర్య! నీకు ముదమున మును
మేటివరము లిచ్చె మిత్రావరుణులకు, శంకరుండు భక్తి సన్నుతింప.

వ. శ్రీహాటకేశ్వర క్షేత్రంబు పాతాలస్థం బని తెల్పితి గదా. వైరో
చనియందు స్వపదప్రాప్తికొఱకు శంకరుం గుఱించి తపం బొనరించె.
కైలాసం బనుశివక్షేత్రోత్తమంబుగల దని యెఱింగించితింగదా. అందు
యక్షేశ్వరుండు హరుని గొలిచి ధన్యుండయ్యె. మఱియు శంకర
స్థానంబుల మున్ను కీర్తించితింగదా. వాని మఱువక మదినిల్పి

* "సాన్నిధ్యం పడి కంతాయ వితతార ప్రసేదివాన్." అని మూ.

యుందువనియే తలంతు. ఇంక నేమి వినవలతు వని యడుగుటయు మార్కండేయుండు. 49

తే. భక్తిభరమున నందికేశ్వరునిపాద
పద్మయుగమునకుఁ ర్మ్రొక్కి పదరజంబు
శిరమునం దుంచుకొని యిష్టసిద్ధికొఱకు
మరల నిట్లని ప్రశ్నించెఁ గరము పేర్మి. 50



## తృతీయాధ్యాయము

ఉత్తమ శివక్షేత్ర మెద్ది యని మార్కండేయుఁడు ప్రశ్నించుట

మ. హరభక్తాగ్రణి! వంచనన్ గొనుట నాయం దొప్పునే నీపదాం
బురుహద్వంద్వమె నమ్మినాఁడఁగద యీభూమీస్థలిన్ మాదృశుం
డరయన్ శిష్యుఁడు గల్గునే కరుణకే నత్యంతమర్హుండఁగా
హరుక్షేత్రంబుల వేయివేయిఫలముల్ హర్షప్రదంబుల్ తగున్. 51
క. అవియన్నియు నెచ్చోటన్, శివుఁ గొల్చినఁ గల్గుదానిక్షేత్రోత్తమమున్
వివరింపవయ్య దాఁపక, యవధానమునన్ ధరింతు నాత్మన్ దానిన్.
క. చరములన నచరములనన్, బరఁగెడుభూతములకెల్ల ఫలముగలుగనా
హరసేవక! యజ్ఞాన, స్ఫురణముగలవారికిం బ్రబోధయుతులకున్.
చ. స్మరణముచేతనే యొసఁగఁజాలునొ మోక్షము నట్టిసుస్థలం
బరసి వచింపు దేశికవరా! యిట నొక్కఁడగాను దీని నా
దరమున నాలకింప గురుతత్త్వవిదుల్ మును లేగుదెంచి ని
ర్భర మగుసంశయవ్రజము వాయగ వీనులఁ గ్రోల నిత్తఱిన్. 54
ఆ. వేచియున్నవార లాచరిత్రముఁ దెల్పు,వయ్య! నందికేశ్వరా! పులస్త్య
పులహు లవ్వసిష్ఠమునియు మరీచియు,నట్లగస్త్యహారి యాదధీచి.
వ. నత్కుణాత్రి భృగు జాబాలి జైమిని ధౌమ్య జమదగ్ని యాజోప యాజ భరతార్వరీవంతులును, పిప్పలాద కణ్వ కుమ దోపమన్యు కుముదాక్ష కుత్స వత్స వరతంతు విభాండక వ్యాస కణ్వరీష కండు మాండవ్య మతంగ కుక్షి మాండకర్ణి చండకౌశిక శాండిల్య శాక

టాయన కౌశిక శాతాతప మధుశ్ఛందసులును, గర్గసౌభరి, రోమశ
పృథుస్తం, బాపస్తంబ భార్గవోదంక పర్వత భారద్వాజ దాల్భ్య
దాంత శ్వేతకేతు కౌండిన్య పుండరీక రైభ్య తృణబిందు వాల్మీక
నారద వహ్ని దృఢమన్యు బోధాయన సుబోధ హారీత మృకండు
దుర్వాసులు, సతితీక్ష్ణ జాలపాద శక్తి కాంక్వార్య సదంత దేవదత్త
న్యంకు సుశ్రుతసులు, నగ్నివేశ్య గాలవ మరుత్వ ల్లోకాక్షి విశ్రవ
సైంధవ సుమంతు శిశుపాయన మౌద్గల్య పథ్యచావన మాతురులు,
ఋశ్యశృం గైకపా త్క్రౌంచ దృఢగోముఖ దేవ లాంగిరో వామదే
వౌర్వ కపింజల సనత్కుమార సనక సనందన సనాతన హిరణ్యనాభ
సత్యాఖ్య వాతాశన సుహోత్ర మైత్రేయ పుష్పజి, త్సత్యతపః
శాలీష్య శైశిర నిదా ఘోతథ్య సంవర్త శౌల్కాయని పరాశర
వైశంపాయన కౌశల్య శారద్వత కపిధ్వజ కుశస్వార్చిక కైవల్య
యాజ్ఞవల్క్యాశ్వలాయన కృష్ణాతపోత్తమానంతకరుణామలకప్రియ
చరక, పవిత్ర కపిల కణాశి నరనారాయణులును దివ్యాన్యమహర్షి
ప్రవరులు వేచియున్నవారు వినుము. 56

సీ. మాహేశ్వరులయందు మాన్యుఁడ వగుదువు
సర్వాగమములందు సార మెదిరియు
దాని గ్రహించిన తత్త్వవిదుండవు
సర్వలోకములందు సాధుయశము
వ్యాపింప వఱలుదు వట్లౌట నుత్తరం
బిచ్చి నాసందేహ మెల్లఁ దీర్పు
త్వన్ముఖనిర్గతవాగ్విసరంబున
మేమెల్ల సంతృప్తి మించ నుండు

ఆ. మట్టు లౌట సందియంబులు గల్గినఁ, దీర్పఁదగినబరువు త్రినయనపద
సేవకాగ్రగణ్య! చెందు నీయందె గా, వున సదుత్తరములఁ దనుపు మమ్ము.

క. ఆగమజాలం బంతయుఁ, దాఁగనఁదగువాఁడు మదనదర్పహరుండే
యా గిరిజాతయు స్కందుం, డాగతి నీవుఁగ వలంతు లగుదురు గాదే.

క. నీయందు మాకు భక్తియు,మాయందును మీకు దయ సమగ్రమ్ముగనే
యేయెడలనుండుఁగాదే,యోయనఘా! దానదీర్ఘమొగిసందియముల్.

చ. అనుచు మృకండునందనుఁ డహార్యతపోధనరాశి వేఁడగా
విని యలనందికేశ్వరుఁడు వింతగ సుస్మితమాస్యసీమపైఁ
గనఁబడశంభుభక్తుని నికామమహేశ్వరసత్కృపాత్తదే
హుని గతకాలభీతుని మహోత్తమచిత్తుని గాంచి యిట్లనున్. 60

## చ తు ర్థా ధ్యా య ము.

### అరుణాచలమాహాత్మ్యవర్ణనము.

చ. మునివర! నీమనోదృఢత ముందుగనే బరికింపఁగోరి య
ట్లనితినిగాని నీవడుగునట్టిది తెల్పకయుందునే మఱె
వ్వనికి వచింపఁజాలుదును ద్వాదృశుఁ డర్హుఁ డొకండు నెందునేఁ
గనినఁ గలాఁడటంచుఁ బలుకంగనుజాలుదునే యొకప్పుడేన్. 61

క. శివధర్మతతిపరాయణుఁ,డవు గావున నాయురల్పుఁడవె యైనను భ
క్తవరుండ వగుట శాశ్వత, మవునాయువునొందితీవు హరుననుకంపన్.

చ. మునివర! వేనికోసము విభుండగునీశుఁడు స్వాజ్ఞఁదీర్చ నె
మ్మనమున శ్రద్ధగల్గినయమప్రభుఁగ్రోధరసంబు పొంగఁగాఁ
గనుఁగొని కాలివ్రేల నడఁగం బొనరించెనె? నీపయిన్ జెలం
గినకరుణావిశేషమునఁ గృత్తిధరుం డొనరించె నప్పనిన్. 63

క. నీవే శాంకరసద్ధర్మావళితత్త్వంబెఱుంగు మతిమంతుఁడవం
చేవచియింపంజాలుదుఁ, గావున నీ వెఱుఁగనదియుఁ గలదే యొందున్.

ఆ. కాలుభంగిభ్రాంతి గలవానివలెనున్న
వాఁడ నాత్మఁబట్టి యమలుఁడవు సు
పక్వచిత్తుఁడ వని పరమమునీ! నాకుఁ
దెలియ దొక్క చాలఁ బలుకు లేల. 65

మ. నను శుశ్రూషల నింతకాల మెవఁడైనం దన్పెనే నీపయిం
గనిపింపం బొనరించుప్రీతి యెపుడేఁ గన్పించెనే నేను జూ

పినటుల్ చెప్పుమ నీవెఱింగిన నిటం బృథ్వీసురేంద్రా! మనం
బున నీకుండినవాంఛ పండునటు లీ భూమిన్ శివక్షేత్రముల్. 66

క. కలవెన్నియోమనోజ్ఞం,బులు శ్రేష్ఠం బొందుగలదు మునిగణవర్యా!
కలికల్మషహరణం బని, తలఁపంజనువానిలోన దానిన్ మదిలోన్. 67

క. శివధర్మశాసనంబుల, సువిహితగుప్తంబె యద్ది శుభదముభక్తిన్
దవిలినశ్రద్ధన్ వినుమా, యవనిం గైవల్యదంబె యగు నది కానన్. 68

తే. సతము కైవల్యకాంక్షులౌ జనులు దాని
దర్శనము చేయఁగా మదిఁ దలఁపవలయు
నాదరంబునఁ దనవెంట నరుగుదెంచు
శిష్యు నుపదేశమునఁ దుష్టుఁ జేయకున్న. 69

క. అతఁ డిల గురువనఁబడునే, జతనంబున నుత్తరంబుఁ జనుఁ జెప్పంగా
మతిసద్వర్యా! వినుమా, కృతకృత్యుఁడ వగుదు వద్ది కీర్తింపంగన్.

క. నావినుతించెడుక్షేత్రం, బావిశ్వేశునకుఁ జాల హర్షం బిడునం
చోవసుధామరమానీ!, భావింపు రహస్య మద్ది భవవసతులలోన్.

క. స్మరియింపు స్మరాంతకు నిర్జరనాయకు శంభుపత్ని శైలాత్మజ నా
దరమునధ్యానింపుముమా,నిరమణ! చిత్తంబునందునియతిమెఱయగన్.

తే. ఉచ్చరింపు మోంకారంబు నొరుల కించు
కేని వినఁబడకుండఁగ నెంతొ శ్రేయ
మద్ది యొసఁగును విను మింక నాస్థలంబుఁ
గలదు దక్షిణ మనెడు దిగ్భాగమందు. 73

క. ద్రావిడదేశంబులు గల, వావిషయంబులఁ గనంగ నొ నరుణాఖ్యం
బావనమాక్షేత్రము హరు,నావాసములంబ్రధానమై చెలువొందున్.

సీ. మూఁడుయోజనములఁ బొలుచు విస్తీర్ణత
నది శివయోగిసేవ్యమయి యొసఁగు
నది పృథ్వికిన్ హృదయస్థానమై యొప్పు
హరునకు హృద్యమైకహర్షదంబు
నగు నందు శంకరుం డద్రిరూపంబునఁ
దానుండుఁ గానన్ నాస్థలవరంబు

హారితరంబయి యరుణాచలాభిఖ్యఁ
గలిగి లోకములకుఁ గడుహితంబుఁ
ఆ. గూర్చుచుండు సిద్ధకూటనివాసమే
యనఁగ బరఁగు మౌను లమరవరులు
సతత ముందు రందు సర్వవిద్యాధరుల్
యక్షు లప్సరసలు నన్వహంబు. 75

క. సురకాంతలు గంధర్వులు, నిరతిన్ నివసింతు రందు నిచ్చలు మౌనీ
శ్వర! మేరురజతగిరి మం,దరభూధరములకు మేటి తానయి చెలఁగున్.

ఆ. మాననీయ మద్ది మౌనులకెల్లఁ దా,శంకరుండె యగుట సంతతంబు
సంచరించుచుండు జంతువులకు ముక్తి,కలుగుచుంట గాంచి కలవళించి.

క. సురలందు వసింపంగా, హరు నారాధింపఁగోరి యమరావాస
స్థిరపదముం ద్యజియింపఁగ,బరమమునీ! కోరుచుంట పరమాద్భుతమౌ.

క. ఎందుం బొడమ మహీరుహ,బృందమునకుఁ గల్పవృక్షవితతి సదృశమే
చందమునఁ గాదు యద్భవ,సుందరఫలరాజ రుచిరసుమములహరునిన్.

క. ఆరాధించుట నిత్యం, బౌరా! యాపుణ్య మెట్టు లమరదు మాకున్
గోరిన నని సురతరువులు, భూరితరార్తిం గృశించుఁ బో మునినాథా!

ఆ. హింసయందె కోర్కు లేప్రొద్దుగలక్రూర,జంతువులును శోణశైలమునకుఁ
జుట్టు తిరిగివచ్చి గట్టన శైలప్ర,దక్షిణైకఫలముఁ దాము గాంచు. 81

చ. ఘనములు శోణశైలపతి కమ్రమహోన్నతశృంగసంగతిన్
గని సురవాహినీవసతిఁ గన్నహిమాచలనాథుకంటె మిం
చనుదగు దేమటంచుఁ దమస్వాంతములందుఁ దలంచుచుండు నా
వినుతి యొనర్ప శక్యమె సువిస్తృతకీర్తికి శైలమూర్తికిన్. 82

చ. పతగగణంబు వేణుతతి భవ్యతమంబుగ నిస్వనంబు లా
దృతి వినఁజేయుచుండుఁ గడునింపుగ యక్షులు కిన్నరాదు లా
క్షితిధరసత్తముం గొలిచి చేరఁగ శక్యముగాని దాపదా
బతిశయమోదదంబు జవ మారఁగ నొందుదు రేమిచెప్పుదున్. 83

చ. మిడుఁగురుఁబుర్వు లాగిరిని మించి చరించుచుఁ గృష్ణపక్షమం
దుడుగని పూన్కి రాత్రులమహోత్తమపద్ధతి హారతిం గడుం

గడుఁ దమి నిచ్చువారలకుఁ గల్గుపదంబును జెందు టెక్కలం
బొడము ధనంజయార్చులను బొందుగ హారతు లిచ్చి తృప్తిగన్. 84

తే. అంతరాయములే లేక యాగిరితట
మందు నుండుమహీజము లనుదినంబు
నట్టె స్పృశియించి సౌభాగ్య మబ్బఁగలుగు
గర్వ మూని యపర్ణ నెగ్గాడుచుండు. 85

చ. ధరణిధరేంద్రశృంగతలధామము లౌటను దారకల్ నిరం
తర ముడురాజసంగతిని దాము నితాంతము పొందుచు ట నె
త్తరుణమునందు రాజసమతం గనఁజాలితి మంచు నుబ్బునన్
గరము ముదంబునం బొదలు క్ష్మాధరవర్య మహత్త్వ మేమనన్. 86

సీ. ఏకాంతచరియల నెసఁగు వేడ్కఁ జరించు
సర్వమృగంబులు శంకరకర
వాసగౌరవమున వఱలు నేణంబును
గణియింపకుండు నెక్కాలమందు;
బాదాంతికచరశబరులు సామాన్యము
గా నికుంభుఁడు కుంభదానవుండు
ననువారిసాదృశ్య మందియుందురు విశే
షించి చెప్పఁగనేల సిద్ధగణప

తే. తిని గుమారునిబోలిన తనయులఁబడ
యుదురు తత్రత్యులెల్లనం దొప్పుతరువు
లెల్లపశుపక్షులున్ వ్యాధు లుల్లసిల్లు
చుందురు విఘ్నేశశరజుల యొప్పుగలిగి. 87

క. కరిసింహవ్యాఘ్రాదులు, శరీరముల మాని శైవసదనంబున శం
కరతనయులతో సరిగాఁ, జరియించుచు నుండు దేవసమితి నుతింపన్.

క. అరుణాద్రికిఁ దూర్పునభాస్కరశైలము గ్రాలుచుండుశతమఖుఁడందున్
స్థిరవసతిఁ గాంచి కడునాదరమున సేవించు నరుణ ధరనాథుహరున్.

క. పడమరదెస దండాచల, ముడురాజుం దాఁకుచుండు నొగి నయ్యద్రిం
గడఁగి నివసించి వరుణుఁ డెపుడు శోణగిరీశుఁ గొల్చు బూజావిధులన్.

ఆ. దక్షిణంబునందుఁ దగునమరాచల,మందునుండి యముఁడు హరునిశోణ
పర్వతాంగుఁ గొలుచు భక్తిభరంబునఁ,బర్వతోర్ధ్వమతనిఁ బాయ డెపుడు.

క. కల దుత్తరశతమఖ ది,క్కులమధ్యమునందు సిద్ధకుధరవర ము
జ్జ్వలకాంతి మెఱయుఁ గందర,ములు నీలములై చెలంగ భూరితరంబై.

సీ. శ్రీదుఁడు పాలింపఁ జెలఁగుఁ ద్రిశూలాద్రి
యంతపర్యంతము నలరు భూధ్ర
ములకు దిక్పాలవర్యులు రక్షకులుగాఁగ
నుందురు వారెల్ల నందునుండి
కాపాడుచుందురేగాక శోణాచల
పతిఁ గొల్చుచుందురు భక్తి యలర
నందున్న వృక్షంబు లారాధనమ్మున
బహుఫలంబు లొసంగఁ బాటుపడుచు

తే. నుండుఁ దన్మూలమున దాని కుండు వైభ
వంబు వృద్ధియై యగుచుండు వసుమతీధ
రమును దేనిని దర్శింప హిమగిరీంద్ర
మట్టి మేనాఖ్య భూధ్రవర్యంబు నొకట. 93

చ. కనుఁగొననే ప్రమోదము నికామము తోఁచునో యద్ది యప్పుడే
కనఁబడు; శోణభూధర మఖండమహీరుహపల్లవాఢ్యమై
వినుత జటాకలాపమున విశ్వమునన్ వెలుఁగొందు నీశుఁడే
కనఁబడుస్థావరాకృతిని గాంచియె యంచని తోఁచు నోమునీ! 94

క. జ్యోతిష్మంతం బగుచున్, భూతలమునఁ గానఁబడెడు భూధ్రశిఖరపా
ర్శ్వాతతసంస్థితభాస్కర,శీతరుచుల్ చూచువారిచిత్తంబులకున్. 95

ఆ. నయనములను మూఁట నగధనుర్ధరుఁడై యి
ట్లున్నవాఁ డటంచు నూహ గలుగఁ
జేయుచుండు; వృష్టి చెలఁగుకాలంబున
నసితమేఘనికర మద్రిక్రింద. 96

క. చెలువారుచుండఁ జూడఁగ,గళమున హాలాహలంబు గ్రాలుచు నుండన్
విలసిల్లు శంకరుఁడునాఁ, దలమే వర్ణింప శోణధరవరమహిమన్. 97

సీ. వేయిపాదంబులు వేయిశీర్షంబులు గలయట్టియరుణాఖ్య కాలగళుఁడు
శ్రుత్యుక్తసుమహితరూపశాలియె గాక ప్రత్యక్షముననట్లె పరఁగుచుండు
మస్తకతలలీనమందాకినీప్రవాహంబుఁ డయి గాదె ముందుండె నన్న
నది యద్భుతంబుగా నద్రీశ్వరుం డిప్డు శృంగవిలీనతరంగిణీగ
తే. ణాఢ్యుఁ డయి యొప్పు శారదాభ్రాళిపిహిత
కటకగణుఁడయి నందీశ కప్రవాహ
నాథిరాథుఁడు గాఁదగు హరునిరీతి
గనఁబడఁగఁ జేయుచుండు భక్తగణమలర. 98

చ. గిరివరకూటమూర్ధమున గ్రీవలసద్గరళుండు వాసమున్
బరమముదంబునొంది జనపాలనతత్పరతం బొనర్ప స్థా
వరతనుస్థాణుతన్ గహనభావము గాఁచుట యబ్బురం బదె
క్కరణి నగున్ స్వభావమదె గాదె తలంపఁగ నెన్నిభంగులన్. 99
తే. దుర్గమతమంబుగా నెప్డు తోఁప నుగ్ర
భావముం గల్గియుండు నీశ్వరుఁడు నామ
మునను మాత్రమె యని యెన్నఁబోలు మదిని
గరుణకున్ సాగరంబు గాఁ గ్రాలుచుండు. 100

మ. ధరకటకంబులందు సతతంబు వసించెడుక్షుద్రనాగముల్
నిరతిశయప్రమోదమున నిర్భరశక్తిఁ జెలంగు పన్నగే
శ్వరముఖసర్పరాజముల వారనిపూనిక గేలిచేయు మీా
గురుతయు మాలఘుత్వమును గూడదొకో పరికింపనంచొగిన్. 101
చ. ఎనిమిదికోణముల్ సరిగ నేర్పడ నిత్యవిభూతు లొప్పఁగా
జననము నొందియుంటి గిరిసత్తమ మయ్యది యష్టమూర్తితం
గనఁబడఁజేయుచుండెడు నఖండవిభూతు లనంగ నిట్టివే
యని జనులార! యెన్నుఁ డనునట్లుగ నాయరుణాద్రి మానిపా! 102
వ. ఎయ్యది శక్తితరంగిణు లగునిడాపింగళనాడులకుఁ దాను ప్రధానమో
యది శివునకు శృంగమునుండి మధ్యస్థానమందు సుషుమ్న యను
కమలాపగ వెలయుచుండు. జ్యోతిస్తంభస్వరూపుం డగుశంకరుని
మూలాగ్రంబులం బరికింప వరాహహంసరూపంబులం దాల్చి కమలా

ఁకువిరించనులుశక్తులు గాఁజాలక వినుతించి కృతకృత్యులయిరో వారు ప్రార్థింప శంకరుం డరుణాద్రియందు నివసింప నంగీకరించె. ఆతండె యరుణాచలనాథుండనఁ బ్రఖ్యాతివహించి ప్రసన్నులం గావ బద్ధ కంకణుం డయ్యె మఱియు. 103

క. గౌతమయోగీంద్రుఁడు వి, ఖ్యాతారుణగిరీంద్రమందు సహస్రా
తీతాబ్దంబులు తపమును, భూతేశుఁడు మెచ్చఁజేయఁ బురహారుడంతన్.

చ. మునిపతి ముందుదోఁచె గిరిపుత్రియు నందుఁ దపం బొనర్చి శం
భునియలమేనుఁబొందె మఱి భూతవిభుం డెద మెచ్చి యిష్టసి
ద్ధిని నొసఁగంగ సంతతము తృప్తిని బొందుచు నందె నిల్చె భ
క్తనికరవాంఛితంబు లొసఁగన్ శివలింగము శాస్త్రరీతిగన్. 105

ఆ. లీల నిల్పె నది ప్రవాళేశ్వరాభిఖ్య
ఖ్యాతిఁ గాంచె లింగ మది యనూన
వాంఛితంబు లొసఁగు భక్తులకెల్లఁ గై
వల్య మొసఁగు జ్ఞానవర్యులకును. 106

క. గౌరిని దేశమున నట, భూరిభయప్రదముగాఁగఁ బొల్చు తనువుతో
నారసి కాపాడుచు గం, భీరమహత్త్వమున దుర్గ వెలయుచు నుండున్.

సీ. మహిషాఖ్యదానవ మర్దిని తానోట నట నిల్చి సాధుజనాళికెల్ల
మంత్రసిద్ధినొసంగుమర్దితవిఘ్నయైయెలరారుచుండునయ్యాశ్రమమున
ఖడ్గతీర్థంబనఁగా నొక్కతీర్థంబు నూత్నముగా నొప్పు నుతజలపరి
పూర్ణమైయొకసారిమున్గినమాత్రన పంచమహాఘముల్ పాయునపుడె

తే. దుర్గ యర్చించె లింగంబు దుఃఖహరము
పాపనాశన మనుపేరఁ బరఁగు నద్ది
జనులు వందన మొనరింప సమయుఁ బాప
సంతతులు ధ్వాంతములు సూర్యసన్నిధి వలె. 108

క. నరపతి వజ్రాంగదుఁడ, ద్ధరతిన్ గని ధనమపరిమితము గూర్చివెసన్
హరుఁగాంచెను దదఘంబున, సిరిపోవన్ దూలి భక్తి చేనందు శివున్.

చ. సతతము గొల్చి దానిగురుశక్తిని ద్ర్యంబకసన్నిధానమం
దతివిభవంబుతో మెలఁగెనాశివలింగమునుం బ్రదక్షిణం

బతిదృఢభక్తిఁజేసి వినయంబునఁ గొల్చిన గాంతియుం గళా
తతియుఁ బొసంగు నానిదగుతత్త్వము మానులకే యెఱుంగనా. 110

వ. కాలిశాలికళాధరులును విద్యాధరేశ్వరులును దుర్వాసునిశాపంబు నుండి విముక్తిం గాంచఁగోరి యాశివలింగము నారాధించి కృతకృత్యులైరి. కావున శోణాద్రికంటె మిన్న యగుక్షేత్రంబు లేదు. పంచాక్షరమంత్రంబుకంటె శ్రేష్ఠ మగుమంత్రంబు లేదు. మఱియు.

క. మాహేశ్వరధర్మంబుల, నేమాడ్కిం బోలఁజాలు నేధర్మంబుల్
భూమిన్ గానఁగ రావో, త్మ్మామర! దైవంబు లేఁడు శంభునకంటెన్.

క. జ్ఞానము లే దెందు శివ,జ్ఞానమ్మునఁబోలు సద్ది శంభుశ్రుతితోఁ
గానఁబడ దీడుసేయం, గానైనది యదియె రుద్రుదు కరుణాప్రదమా.

క. శివభక్తులలోపల విష్ణువుతోఁ దుల్యుండు లేఁడు శుభవిభూతిన్
దవిలినభక్తిం దాల్చిన, నవు రక్షయె దానిఁబోలు నదిలే దెందున్.

సీ. లేదు సదాచార మేదియే భక్తిని మించినయది; యొరుమేలు మదిని
గోరి కాపాడినవారికంటె గురుండు, రుద్రాక్షమించినభద్రభూష
ణము లేదు; శంకరాగమముకంటెను శాస్త్ర మెయ్యది లేదని యెంచఁదగును
బిల్వదళముమించు ప్రియపత్త్రిమే లేదుక్షితిసువర్ణకముమించితగుపుష్ప

తే. మరయ లేదు; వైరాగ్యము నతిశయించు
సౌఖ్యమే లేదు; ముక్తికి సరియగు పర
మపద మన లేదు; సత్య మీమాట మాని
వర్య! స్వాంతమ్మునన్ బహువారము లిటు. 115

క. అరుణాద్రిసమము వెదకిన, ధరణిన్ లేదరయ మేరుధరణీధ్రము మం
దరకైలాసంబులు న, య్యరుణాద్రికి సీఁటుసేయ సర్వము లెల్లా. 116

---

* నాస్తి శోణాద్రితః క్షేత్రం నాస్తి పంచాక్షరాన్మనుః. ౧౪. నాస్తి మాహేశ్వరాద్ధర్మో నాస్తి దేవో మహేశ్వరాత్, నాస్తి జ్ఞానం శివజ్ఞానాన్నాస్తి శ్రీరుద్రతశ్శ్రుతిః. ౧౫. నాస్తి శైవాగ్రణీ ర్విష్ణో ర్నాస్తి రక్షావిభూతితః, నాస్తి భక్తేస్సదాచారో నాస్తి రక్షాకరాద్గురుః. ౧౬. నాస్తి రుద్రాక్షతో భూషా నాస్తి శాస్త్రిశివాగమాత్, నాస్తి బిల్వదళాత్పత్త్రిం నాస్తి పుష్పం సువర్ణకాత్. ౧౭. నాస్తి వైరాగ్యత సౌఖ్యం నాస్తి ముక్తేః పరంపదమ్.

చ. గిరు లన నవ్వి భూమిపయిఁ గేవలవిస్తృతి నొప్పుచుండు ని
య్యరుణమహీధరంబు గిరిశాహ్వయమంది చెలంగు నంచు నా
హరపదభక్తవర్యుఁడయి యాశ్రితవత్సలుఁ డైన నందికే
శ్వరుఁడు నచింపఁగా వినుచు సన్మునియైనమృకండుసూనుఁడున్. 117

చ. పలుమఱు వందనంబుల స్వభక్తినయంబులఁ దెల్పుచున్ భయం
బొలయఁగఁ బ్రశ్నచేయు మన మొక్కటి తెఱంగున జంకుచుండఁగాఁ
బలికె మహానుభావ! ప్రభవంబున కెయ్యది కర్మ మొప్పు మ
ర్త్యుల కెది నారకంబునకుఁ ద్రోవను జూపు నెఱుంగఁ జెప్పుమా. 118

ఆ. అట్టికర్మములకు నగునే ప్రతిక్రియ, దానిఁ దెల్పవలయు దయ చెలంగ
ననుచు విన్నవింప హరుభక్తుఁ డాధృతి, నిట్టు లుత్తరంబు లియ్యఁబూనె.

## పంచమాధ్యాయము

చ. వినుము మృకండుపుత్త్ర! పృథివీస్థలియందును శుద్ధసత్త్వ మొ
ప్పు నరుఁడు దుర్లభుం డగునుబో తలపోయ రజస్తమోద్వయం
బును గలవారలే యగుచుఁ బూరుషు లెందఱొ యుందు రంచు నీ
మనమున నెన్నవయ్య! గుణమండనమాఁగద సత్త్వ మెప్పుడున్. 120

చ. అదిగలవాఁడు పుణ్యయుతుఁ డౌట మహోయశ మొందు ముక్తియన్
పదమునుబొంద నర్హుఁడగు బ్రహ్మయుఁ జిత్రతమంబు లైనయ
ప్పదముల భోగజాలములఁ బొల్పడ నర్హులుగాఁ జెలంగువా
రదునున వానిఁబొందఁ దగునట్లు విచిత్రము లైనకర్మముల్. 121

ఆ. కనఁబడంగఁ జేసెఁ గర్మములకుఁ దగు, భోగజాలములను బుట్టఁ జేసె
నరకములనుగూడఁ బరఁగఁగఁ జేసె నం, దిందుమానివర్యయెన్ని యెన్ని.

చ. మనుజుఁడు భూసురుం దునిమి ప్రందియమాలయమందు భీకరం
బనఁజను రౌరవాఖ్యము మహాపదపూర్వము నొంది వంతలన్
గని చిరకాలవాసమును గాంచి ధరాస్థలి సంభవంబుఁ గాం
చును ఖరగర్దభాకృతుల సూకరదేహముఁ బుల్కసాకృతిన్. 123

తే. కాంచు నం దెద్దియేని నిక్క మిది మౌని;
సురనుద్రావిన యమ్మనుజుండు రౌర

వమునఁ జిరకాల ముండి యవ్వలఁ బతంగ
ముగనో కృమికీటములుగనో పుట్టుఁ జుమ్ము. 124
తే. కర్మకర్తృత్వమునుగూడఁ గాంచు ద్విజుఁడె
యైన నంచు నెఱుంగు; బ్రహ్మస్వహరణ
మున నగుఁ బ్రహ్మరాక్షసతనుధరుండు
మఱియు నేదేది దొంగిలు మానవుండు 125
క. జననాంతరమున నయ్యది, తన కొదవమి దుఃఖపడును దాపసవర్యా!
విను గురుతల్పగుఁ డనఁబడు,మనుజుం డసిపత్రవనము మానక పొందున్.
ఉ. అచ్చటఁ గొంతకాలము మహత్తరకష్టము లొంది కుంది ని
ప్పచ్చరమైనపుణ్యమున భౌమమనం జనుపుట్టువొంది పా
పోచ్చయలక్ష్యమై పలువు రొప్పనిపుంస్త్వము లేమిగల్గఁదా
నిచ్చట నచ్చటం దిరుగ నెంచుచు నిర్ధనుఁడై వగం గనున్. 127
మ. పరదారం దమిఁబొందుదుర్జనుఁడు తప్తానూనదండంబులన్
గురుకాలాయసనిర్మితంబుల మహాఘోరాకృతుల్ గల్గుకిం
కరు లెంతేఁ దనునొంపగాసియె తగంగాఁ గాలసూత్రంబునా
ధరఁ బేరొందిననారకంబునఁ బడుం దానాత్మదోషంబునన్. 128
సీ. ఇండ్లు కాల్చెడువార లేనియమాలయ
మందు ఘోరాహ్వయ మగునరకము
నంను వసింత్రు; విషాన్నము నిడువార
లల్లై సుఘోరాఖ్య మగునిరయము
నందు వసింత్రు; మహాఘోరమునఁబడుఁ
బిశునుఁడు; ధర్మంబు పెంపు నింద
చేయు నాతఁడు పుంస్త్వసిద్ధినొందకయుండు;
మిత్రఘ్నుఁ డుండును మిత్రతనయ
తే. పురమునందుఁ గరాళమన్ నిరయమందు
హింసయందే పరాయణుం డెవఁ డగునతఁ
డుండు భీమాఖ్యనిరయమం దొప్పు దక్కి
సంతతము బాధలం బొందఁజాలి స్రుక్కి. 129

వ. భగ్నపాపిష్ఠుండు సంహారమందును, మృషావాదిభయానకమందును, గూపక్షేత్రనరాదిహంత యసిఘోరనరకమందును, బరద్రోహరతుండు వజ్రమందును, మాంసాశనుండు తరళమందును, మాతృపితృద్రోహి తీక్ష్ణమందును, జపదోషకుండు తాపనమందును, హయహంత నిరుచ్ఛ్వాసమందును, గోవధముచేయువాఁడు దారుణమందును, భ్రూణహత్యచేయువాఁడు చండమందును, స్త్రీహత్యచేయువాఁడు కుకూలకమందును; దేవస్వహర్తదహనమందును, పరద్రవ్యాపహర్త ఘోరఘోరమందును నివసింతురు. 130

చ. పితృపతి దూతలెల్ల నతిభీకరదుర్గతులందుఁ బాపి సం
తతిఁబడఁద్రోసి కట్టుదురు దారుణపాశపరంపరన్ మహో
ద్ధతదృఢదండఘాతములఁ దద్దయు నొంతురు మేనులన్ శితా
యతగురుశంకువుల్ జొనిపి యంగములం బగులింతు రొక్కటన్.

సీ. నిశితంబులై యయోనిర్మితంబులై యగు
నంచుఁ జెప్పందగునట్టి చంచు
వులు గల్గుకంకపక్షులు క్రూరదంష్ట్రిల
భయమునఁ గొల్పుసర్పములును గుక్క
లల్లె వ్యాఘ్రంబు లన్యము లగుక్రూర
జంతువులును వారలఁ జమరి చీల్చు
చుండును; యమదూత లుగ్రశస్త్రంబులఁ
ధనువులశకలంబులనుగఁ జీల్చి

తే. కాల్చుచుందురు మఱియును గహనమందు
శ్వభ్రములఁద్రవ్వి పడఁద్రోచి శాతకశలఁ
గొట్టుచుందురు చూడంగఁగూడఁ దరము
కాక క్రాఁగెడునూనెలోఁ గడఁగివైచి. 132

క. వెలుపలికిం దీయుచు లోఁపలికిం ద్రోయుచు నదెంతో బాధపడఁగ ని
మ్ములఁ జేయుచుండిలఘుసూచులఁగ్రుత్తురు దేహమెల్ల శోణితమొలుకన్.

క. భరియింపరానియంతటి,బరువునుమోయంగఁ బాపిపటలముఁ బూన్పన్
దరమెటుగామిని గుందుచు, బరువులమోయంగలేక పడుచుందు రిలన్.

సీ. బ్రహ్మహత్యనొనర్చుపాపియాతుయరోగివారుణింద్రా వెడువాఁడు శ్వావ
దంతుఁడౌస్వర్ణహర్తయునగుఁగునఖియాగురుదారగామియగుఁ నరుండు
దుశ్చర్ముఁడటు గురుద్రోహి యపస్మారి వేదనిందకుఁ డగు వేగశ్వపచుఁ
డగ్లె సాక్షియసత్యమాడిన నగునేత్రరోగి తానేముందుగాఁగ భోజ
ఆ. నమ్మొనర్ప క్షుద్ధ నంజయుఁ డతిమంద, గతుఁడుగా నజీర్ణక మనురోగ
మొలయఁగష్టపడుచునుండుజన్మాంతర,మందటంచుఁదలఁపనగుమునీంద్ర.
వ. విద్యాపహారిమూకతం గాంచు. పుస్తకచోరకుం డంధుండగు, పర
దారతుండు పంగువగు, పరనిందకుండు బధిరుండగు, ఆచారహీనుండు
విడ్వరాహంబగు, తస్కరుండు జిహ్వారోగవంతుండగు, అతిథ్యభ్యాగ
తులమాని భుజించువాఁడు కపోలకంటకుండగు, పర్వమ్ములందు స్త్రీర
తుండు మేహరోగవంతుండగు, అభక్ష్యభక్షకుండు పూతగంధాన్విత
ముఖుండగు, మర్యాదాభేదకుండు దాసుండగు, తటాకారామచ్ఛేద
కుండు ఖరంబగు, ప్రతిశ్రుతాప్రదాత యల్పాయుష్మంతుండగు,
వికత్థనుఁడు శునకంబగు, విష్ణుద్రోహి తొండయగు, శివద్రోహి మూష
కంబయి దుఃఖించుచుండు. 136
ఆ. పాపఫలము లిట్లు బడలించు నని యెంచి, పాచితంబుఁ దగినభంగి వాని
గొప్పఁజేసికొనుట యుత్తమపద్ధతి,యద్ది శోణశైలమందుఁ జేయ. 137
చ. అలఘు ఫలప్రదంబె యగునంచు వచించిన వందికేశు న
ప్పలుకుల నాలకించి యిలఁబొపులకొ వివిధార్తిజాలముఁ
వలఁచి తదీయదుర్వ్యథనితాంతము నాత్మ నెఱింగి వదనం
బుల నొనరించి తద్విధము భూరితరంబుగఁ దెల్పవే యనన్. 138

---

## షష్ఠాధ్యాయము

ప్రాయశ్చిత్తములు

చ. మునిపతి ప్రార్థనఁ విని సముద్రమునాఁదగు ధర్మజాలమున్
విని వినిపింప నేర్పుగలవిశ్వపతి ప్రియసేవకుండు పా
పనికర మేఁచు పాచితము బల్విధులం గనుపట్టుదానిఁ దె
ల్పను దలపోసి యిట్లనియె బ్రహ్మమునీ! వినవయ్య శ్రద్ధమై. 139

శా. ఏవస్సంహాతి దుస్సహం బగుట నెంతే దానిఁ బోకార్ప నో
మానీ! చాలినపాచితంబులను సమ్మానంబుఁ గల్పించు చి
త్తానూనాస్తికతం జెలంగి వినవయ్యా! బ్రహ్మాత్యాఖ్యమా
నేనస్సంయుతుఁ డీపవిత్రధరణీధ్రేశంబు శోణాఖ్యమున్. 140

ఆ. చేరి ఖడ్గతీర్థవారి మునింగి పం
చాక్షర మగుశంభు నమలమంత్ర
మును జపించి భస్మమును దివ్యరుద్రాక్ష
ములను దాల్చి భుక్తిఁదలఁగి నియతి. 141

చ. పరముఁ బురాణపూరుషుని భద్రదు శంకరుఁ బూజచేయుచున్
ధరణిసురాళిహాయనము దన్పుచు భుక్తిని నింద్రియంబులన్
బరవశతం జెలంగనటు పట్టఁగఁజాలుచు భిక్ష మెత్తి క్షు
ద్ధరణము చేయఁజాలుచు నితాంతము భక్తివిశేషపూజలన్. 142

తే. శివుని రంజింపఁజేయుచుఁ జెందియున్న
భూరిపాపంబు మెల్లఁగాఁ బోవఁజేయఁ
జాలు, నవ్వాల శతధృతి శరణమందు
నిలువఁజాలు మార్కండేయ నిశ్చయంబు. 143

క. సురఁ గ్రోలు మానవుం డీ, యరుణాచలసత్పదంబు నందు నియతివ
త్సర మొండునిల్చిపూర్వము, కరణిఁ శంకరునిఁగొల్వఁగాఁజనుమఱియున్.

మ. శతరుద్రీయము నుచ్చరించుచు మహాశంభున్ బయోధారలన్
జ్యోతినే కాంచనిభక్తిచేత నభిషేకోత్సాహసంపూర్ణమో
దితునిం జేయఁగఁ దద్భవంబు బలవత్తీక్ష్ణంబునౌ పాప మా
శితికంఠార్చకుఁ జూడ భీతిలి నశించున్ వాఁడు శుద్ధుండగున్. 145

చ. కనకము దొంగిలించిన యఘం బది వాయఁగ శోణశైలనా
థునికడఁ జేరి భక్తిమెయి ధూర్జటి బిల్వదళంబులన్ సమ
ర్చనము నొనర్చి బ్రాహ్మణుల షడ్రససంయుతభోజనంబునం
దనుపఁగ దుష్కరంబయిన దారుణపాప మదప్డె పోయెడున్. 146

మ. గురుదారం గవయంగఁ గల్గునఘముం గూల్పంగ శోణాచలే
శ్వరుఁ గానం జని కృత్తికాఖ్య మగునక్షత్రంబునన్ నిర్జరే

శ్వరుఁ బూర్వో క్తవిధిఁ భజించుచు సహస్రంబౌ ప్రదీపావళిన్
గర మానందనిమగ్ను జేయుచును దీక్షఁ మూఁడుమాసంబులన్. 147

**తే.** అందుఁ గడుపంగదగు మఱి యమలభూష
ణాభిరాముని గన్యక సర్వభూను
రున కొసంగఁగఁ దగుమంత్రమును షడక్ష
రమును జపియింపఁ దగుఁబాపరాశి యడఁగు. 148

క. హరులోకంబున నాతఁడు
స్థిరవాసముఁ గాంచు మౌని జిష్ణూ! మఱియుం
బరదారహర్త యోగిరి
వరమున నియతేంద్రియుఁడయి వసియించి హరున్. 149

క. నెల యొండు సద్యపుష్పం,బులఁ బూజించుచు ధనంబు భూతేశున కీఁ
గలయంత నీయనప్పుడ,తలఁగు నఘం బద్ది శుద్ధతనుఁడౌనతఁడున్. 150

చ. గరళము పెట్టునాతఁ డఘకాండము వాపుకొనంగఁ గోరునే
నరుణనగేంద్రముం గనఁగ నప్పుడెపోయి వ్రతంబు సల్పు నా
దరమునఁ బూర్వపద్ధతిని దర్పకభంజను గోపయున్సులన్
నిరతిని వేదనంబు నిడ నిర్మలుఁ డౌను మృకండునందనా! 151

చ. వ్రతియయి వేదజాలరతి వర్ధిలుచుం బిశునుండు శోణభూ
ధ్రతటమునన్ ద్విజాగ్రణులఁ దత్పరతన్ శ్రుతిపాఠనంబునన్
మతివిభవాఢ్యులై తనరుమాడ్కి నొనర్చినముక్తకల్మష
ప్రతతి యగున్ మునీంద్ర! యిది పాచితమా యఘరాశి కెంతయున్.

చ. సదనములన్ దహించు మనుసంభవుఁ డీయరుణాచలంబునం
బొదలుచు మూఁడుమాసములు పుచ్చి వ్రతస్థితి శైవుఁ జేరి భ
క్తి దనర నిర్మితాలయముఁ దృప్తిదమై తగుదాని నిచ్చున
య్యదనున నప్పుడే తొలఁగు నయ్యఘ మంచు నెఱుంగుమా మదిన్.

చ. మునివర! ధర్మనిందకుఁడు భూధ్రమునం దరుణాహ్వయంబునం
దు నిలిచి వర్ష మొండు నియతుండయి సత్రముఖంబులన్ ధనం
బున కనువైనరీతి విధి పోకడమీఱక చేయనౌను దా
ననఘము శాంతినొందు మునినాయక! శాస్త్రహితంబునా నిదే.

సీ. జనకవిద్రోహి శోణనగంబునఁ నెలనిల్చియింద్రియముల నెఱి జయించి
శంకరునకు విప్రసమితికి గోసహస్రము లిచ్చి యుపరాగసమయమందు
సంక్రాంతులందు ద్విజప్రవరులఁ బెక్కురనుభుజింపఁగఁజేసి రమ్యనీల
వృషభంబు శివునకై విడిచిన నప్పాపమంత నశించు స్త్రీహత్యవలని
తే. యఘము శిశువులఁజంపిన యఘము శోణ
ధరమునందు వ్యతీపాత మరసి ద్విజుల
కర్థి నావు లొసంగిన నది యడంగు
మఱియుఁ బ్రచ్ఛన్నపాపకృన్నానవుండు. 155
చ. అరుణగిరీంద్రమందు బహుళామలదానములన్ రహస్యమా
కరణి నొనర్పుబ్రోవు గతకల్మషుఁడై యతఁ డొప్పుమీఱు నే
నరుఁ డనృతంబు పల్కునొ మనంబున సందియ మింత లేక య
ప్పురుషుఁడు శోణశైలమున భూతపతిం గొలువంగ శుద్ధమై. 166
చ. వ్రతనియమంబుగల్గి విధిఁబాయనిపద్ధతి నాలుమాసముల్
స్తుతిపరతన్ వసింప గతదోషుఁడె యౌ; మఱికూపభేదనా
యతదురితంబుగల్గు నతఁ డద్రివరంబున నుండి తోయసం
తతి నిలువం దటాకములఁ ద్రవ్విన నాయఘ మంతరించెడున్. 157
సీ. క్షేత్రాపహారియౌ క్షేత్రంబునవసించిపరమేశ్వరునకునర్పణము క్షేత్ర
మును జేయనదిహాయఘనతరఫలమబ్బు; నారామభంజకుఁడాయఘంబు
బోవనుద్యానముఁబొందుగని ర్మింపనది యడంగును; గేహమపహరించు
నాతఁ డీశ్వరునకు నాలయవర్యంబుఁ గట్టింప నడఁగు నఘంబు వేగ;
తే. శంభు సాయుజ్యమును బొందఁజాలు భాగ్య
మబ్బు,నితరులకును ద్రోహ మాచరించు
నతఁడు వసియించి యీయరుణాద్రియందు
శంకరుం గొల్చి పరులకు సంతస మిడ. 158
క. ఆపాప మడఁగుఁ బశుపిశి,తాపేక్షం గూడియుండు నాతఁడు శైల
క్ష్మాపతిసన్నిధి నొక నెల,పై పక్షము సువ్రతమునఁ బరఁగుచు భర్గున్.
క. ఉపహారవితతిఁగూడిన, సపర్యలం గొల్వ మూఁడుసారు లరుణశై
లపతీ! యని పిల్వఁగ నఘ,మపుడే నశియించుఁ బెక్కులగునుడు లేలా.

చ. అరుణగిరీంద్రమందుమది నాదృతి యొప్ప వసించి భక్తిమై
నరుణమహేశమంత్రవర మన్వహముం జపియింప ముక్తియే
కరతలమందు నిల్చు; మఱి కల్గిన కోరికలుం బ్రదక్షిణం
బురుతరభక్తిఁ బాదముల నుర్విని నిల్పుచుఁ జేయఁ బండెడున్. 161

సీ. తుమ్మినఁ బాదగతుల్ చలియించిన నింక నేయహితమొక్కట్లె కలిగిన
వగ వెట్లొ కలిగినఁ దగినంత ప్రీతి చేకూరినబుధజనుల్ కోర్కిమీఱ
నరుణాచలేశ్వరు నాహ్వాయమతిభక్తి నుచ్చరింపందగు నుర్వి నెవ్వఁ
డాశ్రమవర్ణయోగ్యాచారవిభ్రష్టుఁ డగుశివద్రోహ మెచ్చాత్ముఁబొదలు

ఆ. నెవనికట్టివార లెల్లరు మూఁడుది,నములు శోణశైలనాథుచెంత
నిలిచికొలువఁబాపములుతూలువాతూల, హతినిదూలుతూలమట్లు వేగ.

క. ధరణిం దగుశివలోకమొ, పరికింపఁగ దేహయుక్తి భాసిల్లు త్రయీ
శిరమే యీయరుణాచల,వరమని సద్భావములను భావింపఁదగున్.

క. దక్షిణకైలాసము ప్రత్యక్షంబుగ క్షేత్ర మిద్ది యని నమ్మఁదగుం
ద్ర్యక్షునిక్షేత్రమ్ములలో, నక్షయఫలసిద్ధిగల్గు నధికతపములన్. 164

చ. అరుణనగేంద్రవర్య మిది యాదృతిమై స్మరియించినంతనే
నరులకు వాంఛితార్థము లనంతము లబ్బఁగ జేయుఁగా దనం
తరము శివాస్పదంబుల మనంబున నారయ నొ నదెద్ది యి
ద్ధరణిని శ్రేష్ఠమో యనుచు ధాత్రి సురోత్తమ! భక్తసత్తమా! 165

సీ. గంగాతటంబునఁ గాశీపురంబున నట్లె ప్రయాగంబునందుఁ బుష్క
రమున సేతువునందు విమలకర్మంబుల నొనరింప లభియించు నురుఫలమ్ము
లరుణగిరీంద్రంబు నందొనర్చెడుకర్మములఁ గల్గుసత్ఫలంబులకు నెన్న
నెంతయో తక్కువయే యగు నని నమ్మవచ్చు నగ్నిష్టోమ వాజపేయ

తే. ములును వైరాజసర్వతోముఖము లట్లె
రాజసూయాశ్వమేధాధ్వరములు శోణ
శైలమునఁ జేయ సత్ఫలజాల మబ్బు
నిందులకు లేదు సుంతయే సందియంబు. 166

చ. అరుణమహీధరేంద్రమున యందు దినం బుపవాస ముండి శం
కరు భజియింప సాంతపనకం బయుతం బగుసంఖ్యశాస్త్ర మే

కరణి వచించె నట్లు కడఁకం బొనరించిన యంతపుణ్యమా
నరునకుఁ గల్గుఁజుమ్ము మునినాథ! రవంతయు శంక లే దిటన్. 167

తే. మఱియుఁ జాంద్రాయణము నూఱుమాఱు లొనరు
పంగఁ గల్గెడుఫలము పొసంగుఁజుమ్ము
శోణగిరిని మహాదానషోడశకము
చేయ ద్విగుణితఫల మడ్డె చేకుఱుఁగద. 168

చ. అని యిటు నందికేశ్వరముఖాగతమా నిరయప్రతిక్రియన్
విని ముదమంది శోణగిరివృత్త్రహరుం దలపోసి యద్భుతం
బనుపమమా మహత్త్వమున కాస్పదమాఁగద యంచు నెంచి యి
ట్లనియెను నందికేశ్వర! మహామత వీవగుటన్ వచించెదన్. 169

క. ఋతుదినవత్సరముఖముల, శితిగళుభజియించుపూజఁ జెప్పుముదానన్
మతితృప్తినొందునుపకృతి, యితరులకుంగల్గునంచు నంది యడిగినన్.

---

## సప్తమాధ్యాయము



### కామ్యవ్రతమహత్త్వము

చ. శ్రితసురమౌని ప్రశ్నమును జెందిన వేడుక నాలకించి యా
శితిగళపాదసేవకుఁడు చెందినవేడుక నుత్తరంబు నీ
గతి వచియించె మౌనివర! కంజహితప్రియవారమందు స
మ్మతిమెయి నెట్టికల్వల నుమాపతి శోణగిరీంద్రుభక్తిమై. 171

ఆ. పూజచేయఁగల్గు భూతలంబునఁబొందఁ,దగినసుఖసమృద్ధులగణితముగఁ
గలుగుసోమవార మలరుచు నరుణాద్రి, విభునిమ్రుగమదకరవీరకముల.

క. నరుఁడెవ్వఁడు పూజించునొ, సరసిజభవులోకమందు సతమువసించున్
గురువాసరమున స్ఫుటసిత, సరసిజములఁ బూజచేసిసాంద్రనియతిమై.

క. శివుభజియింపఁగ జనలో,కవసతి చిరకార ముండఁగలయటు చిక్కున్
శివభక్తులు సిద్ధులు సర్వవిధములన్ దోడుసూప వాంఛలుపండన్.

సీ. శుక్రవాసరమున స్ఫుటమల్లికాచంపకకుసుమపంక్తిశంకరునిఁ బూజ
నలరింపఁ జిరము బ్రహ్మర్షిసంయుతిఁ దపోలోకవాసమ్ముగల్గునుద్భవంబు

శనివారమునయందు జాతీసుమంబుల నరుణాచలేశ్వరు నమలభక్తిఁ
బూజింపఁగా సూర్యపుత్త్రిలోకంబున నెప్పుడేనివసించుటే కలుగదు
తే. ప్రథమతిథియందు సోపహారముగ శంభు
నర్చనంబులఁ దనియింప నమలపాయ
సమ్ము నైవేద్య మిడ ధాన్యసంచయంబు
ధనసమృద్ధియుఁ గల్గు నాతనికి మౌని! 175
చ. మనుజుఁ డెవండు శోణగిరి మాన్యద్వితీయనుభక్తిమీఱ ద
ధ్యనుగతమైనయన్నమిడి హర్షము నొందఁగఁ జేయ భాగ్య మొ
య్యన వరియించు నాతనిని యజ్ఞములం దమినొందు దేవరా
జిని దుదిఁ జేరుపుణ్య మిది చేకుఱు సుంతయు శంక లేదిటన్. 176
చ. నరుఁడు తృతీయయందు సురనాథసమర్చితు శోణశైలపున్
స్థిరమతియై యపూపములఁ జెందఁగఁ జేసినఁ దృప్తిదేహ మీ
ధరణి వసించుదాఁక సతతంబు ముదంబును రోగహైన్యముల్
గర మలరారుచుండు సురకల్పుఁడుగాఁ దగియుండుమౌనిపా! 177
క. అరుణాద్రీశుఁ జతుర్థిని, బరిపూరితసలిలకుంభపటలం బిడి యా
దరమున నర్చింప మనో,హరవాంఛలు వేఫలించు నన్నియు మౌనీ!
చ. పులగముఁ బంచమీతిథిని భూతవిభుల్ బరమేశుసంతతం
బలరఁగఁ జేయ భక్తిరతి నర్పణ మొప్పఁగఁ జేయ వైభవం
బులకుఁ గొఱంతలేక తగుఁ బో మునిపుంగవ! షష్ఠినాఁడు ని
స్తులమగుభక్తి నైక్షవముతోఁ దగునోదన మిచ్చి శంకరున్. 179
తే. తృప్తినొందింపఁగా సంతతియుఁ జెలంగు
సప్తమీతిథి నతిభక్తిసహితుఁ డగుచు
నర్పణము సేయఁజాలుఁ దిలౌదనంబు
నాతఁ డధమర్ణతం గాంచ కలరుచుండు. 180
సీ. అష్టమి రాజశాల్యన్నము హరునకు నైవేద్యమిడినయన్నరుఁడు సేవ
చేయుకయున్న వశీకృతులై యుండు రఖిలరాజన్యులో యార్యవర్య!
వినుము గోధూమాన్నమును నవమీతిథి నరుణాద్రినాథున కర్పణంబు
చేయఁగా నతనికి నేయెడలను రాజయక్ష్మాదిరోగమ్ము లందకుండు;

తే. దశమి దధియు_క్తసక్తువు దర్పహరున, కర్థి నై_వేద్య మిడినలోకాళికెల్లఁ
ప్రీతిభాజనమగుజుఁమ్ముపృథుకములను, హరున కేకాదశీతిథినాదరమున.
క. ఎవఁడర్పించునో యాతఁడు, ప్రవిగతభయుఁడై చెలంగు బ్రహ్మామునీశం
భువునకు ద్వాదశియనుతిథి,నవిరళమోదమునసూప మన్నము నిడినన్.
క. ఆతనివాంఛలు పండుట, కేతటి విఘ్నంబు లుండ వీశునిస క్తు
వ్రాతమునఁ ద్రయోదశిసం,ప్రీతునిగాఁ జేయునరుఁడు పెంపుగనుమదిన్.
చ. వినుము చతుర్దశీతిథిని విశ్వపతిన్ భజియించి పక్వముల్
వినుతికిఁ బాత్రముల్ కనఁగ వింతగ నుండుఫలంబులన్ నివే
దన మొనరించి తృ_ప్తిగనఁ దానొనరించినచో నతండు సి
ద్ధినిగను విద్యయందుఁ గుమతిం దగియుండియు నీశుసత్కృపన్. 184
ఉ. పున్నమయందు శోణగిరిపుండమి మించఁగఁ గంటకాఖ్యచే
మన్ననఁ గాంచుపండ్ల నిడి మానసతృ_ప్తి గనంగఁ జేయుచో
నెన్నఁడు నేత్రరోగములనే కనఁజాలఁ డమాసయందు భ
_క్తి న్నటిసంగమంబునను దృ_ప్తిగఁ గందము లిచ్చి గొల్చినన్. 185
తే. మూలముల నిచ్చినను దాన మోదమందు
వారు పితృదేవతలు మఱి కోర రెద్ది
కావలయునంచు సంతృ_ప్తి గల్గియుంట
తిథిసపర్యయె యిది యంచుఁ దెలియవలయు 186
వ. ఇంక నక్షత్రసపర్య నాలకింపుము. అశ్వినియందు వస్త్రంబులను, భరణి నాభరణంబులను, కృ_త్తికయందు దీపంబులను, రోహిణి రౌప్యంబును, మృగశీర్షమున మలయజంబు, నార్ద్రయందు హరిచందనంబును, బునర్వసువునందుఁ గస్తురియుఁ, బుష్యమియందుఁ గర్పూరంబును, ఆశ్లేషమునఁ గాశ్మీరోద్భవంబును, మఘయందు మంచునీరును, బూర్వఫల్గునియందుఁ దాంబూలంబు, ను_త్తరఫల్గునియందు ధూపంబును, హ_స్తనక్షత్రంబునఁ గాలాగురువును, జిత్రయందుఁ బరిమళమ_స్తకదంబంబును .స్వాతియందు సువాసినీబృందంబును, విశాఖయందు వింజామరంబును, అనూరాధయందు ము_క్తాతపత్రంబును, జ్యేష్ఠయందు ధేనువులను, మూలంబున ము_త్తియములహారంబును,

బూర్వాషాఢంబున మకుటంబు, నుత్తరాషాఢమందు రత్నములను, శ్రవణంబున భద్రపీఠంబును, ధనిష్ఠయందు స్వర్ణంబును, శతభిష న్నక్షత్రంబున వస్త్రంబులను, బూర్వాభాద్రపదంబున భోగంబులు, నుత్తరాభాద్రపదంబునఁ దురంగమంబులను, రేవతియందు హైమరథంబును సమర్పించి శోణశైలనాథు నారాధింపందగు. ముందు మహాపూజఁ గావించి పిదప వీని సమర్పింపవలయు. మఱియు, 187

సీ. మేషాదిరాసుల మిహిరుఁడుండెడువేళవరుసమీఱఁగసిందువారములను
గురవకపుష్పకకుభపాటలంబులఁ, గుటజంబులఁ గదంబకుసుమములను
జీవంతికామల్లికావారిరుహ, దమనక, నందివర్ధన ప్రకటకుసుమ
ములనుబూజింపనొలలితపంచామృతమునగ్రహణద్వయంబుననుస్నాన

ఆ. మొనరుపంగఁ దగుమహోత్తమపంచాక్ష
రాఖ్యమంత్రమున మహానియతిని
బూజచేయఁదగును భూతేశునకుఁ బరా
త్పరున కవ్యయునకుఁ బరశివునకు. 188

చ. నిరుపమపంచగవ్యమున నిత్యము స్నాన మొనర్పనౌను శం
కరునకు భక్తిచేతఁ గటకంబున గ్రాహమునందు నెప్డు భా
స్కరుఁడు చొరం బ్రయాణమగుఁ గాలమదేయయనంబు నాధరం
బరఁగెడునప్డు స్నానమతిపావనమై తగు మౌనిపుంగవా! 189

క. స్నపనక్రియయు షడక్షర, మపరిమితఫలప్రదంబు నగుమంత్రముచే
నెపుడే నొనరుపనోఁజుము, స్నపనము క్షీరములచేత జరపఁగడఁగినన్.

తే. ప్రణవమునఁ జేయఁదగియుండు భాస్కరుండు
మేషతులలందుఁ జొచ్చెడు మంచివేళ
విషువనామంబునం దగు విమగళునకు
స్నాన మొనరింప నద్దినసమయ మనఘ. 191

వ. ప్రాహ్ణంబున రుద్రతులసియు, మధ్యాహ్నంబున రేలపత్రంబు, నపరాహ్ణంబున మల్లికాసుమంబును శోణాచలనాథునకుఁ బ్రియంబు లని యెన్నందగు. 192

సీ. అర్ధోదయం బనునట్టికాలంబునఁ గలశసహస్రోదకముల స్నాన
మాచరింపందగు; న త్తటిని శతరుద్రీయముఁ దమి నుచ్చరింపఁదగును
శివరాత్రియందు విశేషించి త్రిశిఖములగు బిల్వదళముల నంబుజములఁ
గర్ణికారంబులఁగడునియతేంద్రియుఁడయిజాగరూకుఁడై యర్చనములఁ
ఆ. దృ ప్తిసేయఁదగును దివ్యాగమవిధాన,మునను గీతవాద్యములను న ర్త
నములఁ బూజసేయ నమరినగర్వము, బాయునరుణశైల పతికరుణను.
క. హరునకు నాగ్నేయంబనఁ, బరఁగెడునుత్సవము భ క్తిఁబొసఁగంబునఁబా
మరజనసంతరణార్థము, జరపందగునూతనాన్నశాకంబులతోన్. 194
క. ఉపదంశమ్ములు లోనగు,నుపహారంబుల నొసంగి యుచ్చైస్స్వరయు
క్తపరమనియతిన్ వ్యాహృతు, లుపఠించుచునర్చణంబలోలమనసుచేన్.
క. ఒనరింపందగియుండును, వినుమా వైశాఖమందు విధిని విశాఖన్
గనిదమనకోత్సవంబును, మునివర! చేయంగవలయు బుధులలరంగన్.
సీ. ప్రాబోధికోత్సవరాజంబు మార్గశీ
ర్షమునందుఁ దొలివేళ సామమంత్ర
ములచేతఁ జేయింపవలయు మహాపూజ
భ క్తియు క్తినొనర్పఁ బరమశుభము
గలుగు నార్ద్రిలయందుఁ దులలేనిఫల మిచ్చు
నట్టి శనిప్రదోషాళియందు
నట్లె వ్యతీపాతలాది యా పర్వము
లందు నాదిత్యహిమాంశువార
తే. ములను శోణాద్రిపతిని బూజలను దన్పు, వలయునాగమపద్ధతివదలకుండ
నట్లెదీక్షోపనయనములందుఁ బెండ్లియందు సుతజన్మమందునియమముచెలగ.
చ. అరుణగిరిన్ విశేషముగు నర్చనపద్ధతిఁ గొల్చు టొప్పుఁ దా
ధరణి జనించినట్టి దగుతారకయందు సిరుల్ చెలంగున
త్తరుణమునందు నాపదలు దార్కొను వేళను భీతియందు నా
ధరవరముం జొరంగఁ బ్రమదంబు పొసంగిన వేళ నోమునీ! 198
ఆ. పర్వతంబు వదలఁ బయనంబు సాగించు,
నపుడు శోణశిఖరి నర్చనములఁ

21

దనుపవలయు; దానఁ దగుమహోన్నతి శంభు,
కరుణచేత శంక కలుగ దిందు. 199
క. ప్రతిచక్రాగమమున దుస్స్థితియందును బాధములకు క్షితిపతిభటులు
ద్ధతిశృంఖలముల వైచెడు, జతనము చేయుంగ నూత్నసంపద గలుగన్.
ఆ. శోణశైలపూజ శుభదమ్ము మానీంద్ర
రిపులపైకిఁ జనెడు నృపుఁడు భక్తి
నరుణశైలనాథు నర్చింప జయ మబ్బు
శంకలేదు దీని కింక నెపుడు. 201
ఉ. చెంతను లేక దూరమును జేరియెయున్న స్మరింపవచ్చు న
త్యంతము భక్తిఁ జెంతఁగలయట్టినరుం డరుణాచలేశుదృ
క్సంతతసంప్రమోదము లెసంగఁగఁ జూడఁగవచ్చుం సం
క్రాంతినివాసమే గలుగఁగా భజియింపఁగవచ్చు వేళలన్. 202
క. అరుణగిరివర్యసుస్థలము రహిన్ స్వర్గాపవర్గముల నిచ్చెడు నీ
ధరణిగతక్షేత్రంబుల, నరయ మహోత్తమ మటంచు నమలమనీషా!
ఆ. బాహువెత్తి నేను వచియించువాఁడని,ద్దానిమించునద్ది తలఁచిచూడఁ
గానరాదు మది నొకపరిస్మరించినఁ, గర్ణయుగముఁ దనియఁగా వినినను.
చ. మనసును గర్ణయుగ్మము సమగ్రముగాఁ గన దృగ్ద్వయంబుఁ గీ
ర్తనమున జిహ్వపావనతఁ దద్దయు భాసిలు నీమహాగిరీం
ద్రనికటసీమజన్మముపురాకృతపుణ్యముచేన్ లభించు నే
మునివర! దేహశక్తిఁ గనుఁబో సుఖముల్ తరువాతముక్తినిన్. 205
క. ఇతరక్షేత్రంబుల ము, క్తతనువులగు వారి కిందుఁ దగురీతిని శా
ద్వతతిం బొనరించిన వా, రతిపాపులెవైనను ముక్తి నందుదు రనఘా! 206
సీ. విను మయోధ్యాపురంబును మధురను మాయఁ
గాంచీపురినవంతి కాపురంబు
నను సప్తపురముల నరుణగిరీంద్రము
మించు సత్ఫలముల నెంచి యిచ్చు
విషయంబున నటంచు విషమనేత్రునకింక
రేశ్వరుం డగు నందికేశ్వరుఁ డన

నామృకండునిపుత్త్రుఁ డాదృతిశ్రద్ధమై
విని యోమహాత్మక! యనుపమాన
ఆ. శోణశైలనాథు సురుచిరమాహాత్మ్య
మింక నడుగ వాంఛ యెసఁగె మదిని
భక్తిమీఱ నడుగువాఁ డఁగృపామతిఁ
దెలుపు ముత్తరంబుఁ దృప్తిమీఱ. 207

## అష్టమాధ్యాయము



### సృష్టివర్ణనము

చ. అనుటయు నందికేశుఁడనఘా! యరుణాద్రిమహత్త్వ మింకనున్
విన నను బ్రశ్నచేయు టది విస్తృతభారము నాదుమస్తకం
బున నిడినట్టులే యగును భూసురమానివరేణ్య! సాధుబు
ద్ధిని వినఁగోరు టుత్తమమె తృప్తి నొసంగెదుఁ బ్రశ్న మిత్తఱిన్.
చ. అరుణగిరీంద్రనాథుని మహాద్భుతదివ్యచరిత్ర మెవ్వఁ డా
దరము మెయిన్ వినంగ భ్రమదంబును గాంచఁడొ యామనుష్యుఁడే
పరిగణితుం డగుం బశుపుభంగిఁ దదద్రిమహత్త్వ మెవ్వఁ డీ
ధరణి వచింపఁగాఁ గలఁడు తత్త్వ మిదంచు విరించియే మునీ! 209
చ. అనుపమ మత్తదీయమహితాద్భుతచిత్రచరిత్ర మంతయున్
విని మదిలో ధరింపఁదగు విశ్వనుతామలబుద్ధిమంతుఁడం
చనఁదగువాఁడు గల్గునొకొ యారయ నెక్కడనైన మారుఁ జం
పినపరమేశు నద్భుతసుపేయమహత్త్వసుధన్ స్మరించెదన్. 210
క. నామానస మభవుని చిత్రామానమహత్త్వసుధమహాదృతిఁ గ్రోలం
గా నె చెడు మానివరా!, సూనృతమిది యద్భుతముగ శోభిలుఁగాదే.
చ. శివచరితం బటంచు మునిశేఖర! చక్కఁదలంపవయ్యె త
ద్భవుమహనీయగాథ యెటు వర్ణనముం బొపరింపశక్యమాఁ
గవివరుమేధ యేనుడువఁగాఁగలదే యిసుమంత యైన మా
నివర! వచింతు నట్లయిన నేర్చినయంత రవంతయే నిటన్. 212

చ. పరమపవిత్ర శోణగిరిపాలమహత్త్వము శ్రోత్రపేయమౌ
కరణి నొనర్తు శ్రద్ధ వినఁగాఁదగుఁ బూర్వము కల్పమందు నీ
శ్వరుఁడును నిర్వికల్పుఁడయి భాసిలుచుండుఁ దనంతదాను ని
ర్భరతరమోదసాగరతరంగములం దొగి మున్గి తేలుచున్. 213

చ. తలఁచినయంతలో జగము తా మునుపుండినయట్లు లొప్పె; నా
జలరుహగర్భుఁ జక్రధరు సర్గము రక్షణముంబొనర్ప ని
మ్ముల జనియింపఁజేసె జగముల్ వెలుఁగొందఁగఁ జేయుకాంతుమై
దుల యెసఁగంగలేని కృపతో నరుణాచల నాథుఁ డెంతయున్. 214

సీ. పరమేష్ఠి దక్షిణభాగమునుండియు వామభాగమునుండి వాసుదేవు
సృజియింపఁగాఁ గోరిచేసెఁ ద్రినేత్రుండు బ్రహ్మరజోగుణభాసమానుఁ
డబ్జనాభుఁడు సత్త్వ మనఁబడుగుణమున నలరారువాఁడు దేవాదిదేవు
నానతిఁదలఁ దాల్చి యాత్మనియుక్తకార్యంబుల నొనరింప నాదరమునఁ

ఆ. బూని రంత నాత్మబుద్ధి మరీచ్యాది,భూమి దివిజదశకమును జని ప
జేసె విధియు దక్షు సృష్టించె దక్షిణాం,గుష్ఠమునను రక్షకుఁదగుననుచు.

ఉ. మోమున భూమిదేవతలఁ బుట్టఁగఁ జేసెను బాహుసంభవుల్
భూమిపులూరుసంభవులు పొల్చిరి వైశ్యులు శూద్రు లంఘ్రిజుల్
దామయి రావిరించనుఁడు తత్పరతం బ్రభవిల్లఁజేయ సు
శ్రీమహితాత్ములై దగి ధరిత్రిని ఖ్యాతిని గాంచిరో మునీ. 216

సీ. కశ్యపుండు మరీచికన్నసంతానమౌ నతనికిఁబుత్త్రులై రమరులసురు
లనిలులు భుజగంబు లట్టెగృధ్రంబులు గంధర్వులప్సరఃకాంత లంత
మనువుసంతానంబె మానవాఖ్యంగాంచెబహువిధవంశముల్ భాసిలంగ
బహువిధకర్మప్రవర్తకుల్ వారైరి విను మత్రినామకమునివరేణ్యు

తే. వలన నార్షబు ఖ్యాత్రంబు గలిగె ద్వివిధ
ముగను వంశంబు పులహుఁడన్ మునిపులస్త్యుఁ
డనెడుమానియు రాక్షసుల్ యక్షు లనెడు
వారిఁ బ్రభవిల్లఁజేసి రవార్యశక్తి. 217

వ. ఉతథ్యగీష్పతిప్రముఖు లంగిరసునివలన జనించిరి. భృగువున కగ్ని
తనయుండు, చ్యవనాదు లగుమహర్షు లాభృగు ప్రభవులె యని

యెఱుంగఁదగు. వసిష్ఠప్రముఖమహర్షులు ఋషులం బ్రభవిల్లఁజేసిరి. వారినుండి భూతలంబునఁ బెక్కుసద్వంశంబులు విస్తరిల్లె. ఇట్లు బ్రహ్మసంతానంబున నీజగంబెల్ల నిండె నని తెలియందగు. కాలంబున వైభవంబున మహేశ్వరుని విస్మరింతురు. అచ్యుతుండు భృగుపుత్త్రిం బెండ్లియాడె. ఆమెయే కమలాలయ యనంబరఁగు. జగంబున మత్స్యాదిరూపంబుల నాయచ్యుతుండు ప్రభవిల్లి జగద్రక్షణంబు చేయుచుండు. సృష్టిస్థితుల బ్రహ్మవిష్ణువులు భగవంతు నాజ్ఞ నెఱవేఱుతు రన నింక నితరు లాభగవంతునికడ నెంతవార లని తలంచినం దోఁచు నని పలికి నందికేశ్వరుండు మఱియు నిట్లనియె.

---

## నవమాధ్యాయము

### విధివిష్ణువివాదము

చ. వినుము మృకండుపుత్త్ర! పరివృద్ధిని బొందినగర్వయుక్తినా
వనరుహసంభవాచ్యుతు లవార్యవిమోహమునం బ్రభుండ నే
ననుచు వివాదతత్పరత నందిరి బ్రహ్మరజోవికారతన్
మనము చలింపఁగాఁ దృణము మాడ్కిని వేచి నితాంతగర్వియై 219

తే. విశ్వసృష్టికరుండనే విష్ణు వెట్లు
ప్రభువగున్ లోకముల కంచుఁ బలికె నచ్యు
తునిఁ గనుంగొని; యెట్లు నీవన నధికుఁడ
వగుదు నాకంటె సృష్టికేనుగద విభుఁడ. 220

చ. జగములకుం బితామహుఁడఁ జక్కఁగ నన్ను నెఱుంగఁజాల కీ
వగణితమోహయుక్తిఁ గని తారయఁజాలక "నీతనూజులై
తగుమధుకైటభాఖ్యులమృధంబునఁ జంపితి దైత్యవైరినై
తెఁగద" యటంచు గర్వమునఁ దేఁకువమాలితి వోయి కేశవా! 221

క. నిన్నే సృజింతుఁ బెక్కఁగ, నిన్నింటిని సృష్టిచేసి యీకరములు ఖే
దోన్నతి వీడవు చూడుము, సన్నుతిపాత్త్రంబు నాదుసర్గము వింటే.

సీ. మచ్ఛ్రమాంబూద్భూత మహితవారిధి, మున్గు
చుండు నీకయి మఱ్ఱిపఁడుసృష్టి

చేయకయుండినఁ జేయూఁత యెయ్యది
నీకిడు; మధుపజ్ఞ మా కడలిని
గలిగెఁ బన్నగ మొండు వెలసితి వద్దాని
నాశ్రయించియె యూర్ధ్వమందు నీకుఁ
బద్మముండును దానిఁ బరమాసనంబుగ
నంగీకరించితి నట్టు తొంట

ఆ. నన్ను మింతు వెట్లు నారాయణా! పల్క
వయ్య; సత్వ మనెడు నమలగుణము
మలయు నెట్లు తమసుగలిగిన నీయందు
దలఁపు మొక్కమాఱు జలజనయన! 223

చ. నిదురను జాలకాలమును నీవు వహించుట బుద్ధిజాడ్యముం
గదుర నెఱుంగు దేప్రకృతిఁ గంజవిలోచన! దైత్యభీతియే
మదిని గలంప నిద్రకయి మానక నీటను బవ్వళింతు వీ
యదియె రహస్యమ చుఁ గడు నారయఁజాలనొకో జనార్దనా!. 224

క. మదధీన మీజగత్త్రయ, మిది నీసంరక్షణమున నెటు లుండఁదగుఁ
వదనములు నాల్గు నాకుం, బొదలెడు నవ్వానినుండి పుట్టె శ్రుతితతుల్.

క. చైతన్యరూపిణిగ వి, ఖ్యాతిం గనువాణి భార్యగాఁ దగునాకుఁ
ఏతద్విశ్వము నిర్మిత, మైతగు నాచేత స్థిరచరాత్మక మెల్లన్. 226

చ. తనయులు తత్తనూజులు శతక్రతుముఖ్యులు నాకు వారిచే
తనె జగ మిద్ది రక్షితము తామరసాక్ష! మదన్యుఁ డెవ్వఁ డిం
కను గలఁడే జగత్త్రయిని గావఁగ నీశ్వరుఁ డన్ననామమం
దనుదగువాఁడు నీమదికిఁ దట్టినఁ జేరొకనవయ్య యొక్కనిన్. 227

చ. అని యిటురోషయుక్తిఁ గమలాసనుఁ డెంతయుఁ బౌరుషంబు మిం
చను వచియింప మాధవుఁ డహా! యిది యేమని నిశ్వసించి యో
ర్వను దగకుంటచే స్మితము వక్త్రమున౯ దొలుకాడ నివ్విధం
బున బదు లీఁదలంచె నలుమోముల వేల్పు! విడందగున్ రుషన్. 228

ఉ. ఏల వికత్థనంబు లిటు లీవువచించెదు స్వార్థమే సుమీ
చాలు శ్రమంబు దీన నగుసత్ఫల మెయ్యది లేదు పంకజ

శ్రీలలితంబు నాభి యిది సిద్ధము నాయదియం చెఱుంగవో
పోలఁగ నందుఁబుట్టితివిపో మది నీవిషయంబు నెంచుమా. 229

ఆ. యోగనిద్ర మానియుండినతఱి మధు,కైటభాఖ్యగల్గుకర్బురు లొగిఁ
బెలుచ విక్రమింపఁ బీఁచ మడంచితి, సోమకాదిదనుజశూరుల నొగి.

సీ. మత్స్యాదిరూపముల్ మైకొనినిచ్ఛచేఁ
బొలియించితిని వారిభూతభయదు
లని యట్టులుండ సృష్టిని జేయువాఁడ నే
నని పల్కు టబ్రమే యనఁగ వచ్చు
సృష్టికారణ మని చెప్పఁగఁదగువాని
నింక నొక్కనిఁగాన నె దునైన
భూరిరజోగుణాపూత్రబుద్ధులు నుంత
మైన సద్విషయంబు నరయఁజాల

ఆ. రట్టివారిచూపు లతిమలినంబులై, యుండుఁగా; రజోమయుండ వగుట
దేని నిశ్చయింపఁగా నీవుతగుదువు, కమలభవ! తలంపఁగవలదొక్కొ.

మ. అవినాభావినిశక్తి భార్గవి యటం చాత్మ రవంతేఁ దలం
పవు కాఁబోలుఁ గటాక్షమాత్రమున నోపద్మోద్భవా! లోకముల్
సవరింపంబడఁజేయు భార్గవి; సమస్తం బైనభూతాళి స
ర్వవిధుల్ చెల్లఁగఁజేయుకాలము శరీరం బౌనుగా నాకనక్. 232

ఆ. ఏనుగాని దిందు నేదియు లేదని, తలఁపవ క్కవిశ్వతతులయందు
నమర రుద్రవసువు లాదిగాఁగలవారు,మనుదిగీశులెల్ల వినుము నేనె.

సీ. భూర్భువస్స్వర్లోకములు మదధీనముల్
గా నెఱుంగుము నాదు నానతిమెయి
సృష్టిశక్తియుఁ బ్రవర్తిల్లునుగాన జ
గత్త్రయీనాథునిగాఁగ నన్నుఁ
దలపోయఁగా నీకుఁ దగునీవు నాకంటె
జ్యేష్ఠుండ వని చెప్పఁ జెల్లు నెట్లు
నముఁడవు కూడఁగావు మఱియు దీనిని
యోజింపవయ్య యం చుద్యమమున

తే. నిట్టు లిరువురు మోహాంధులే యయి కడుం
బట్టుదలల వివాదైకపరతనుండఁ
జాలకాలము గడచెను సాధ్వసమును
గలుగఁజేయుచు దేవతల్ గలఁగుచుండ. 234

క. ఉదయాస్తమయములను నవి
పొదలవు రవిచంద్రులకు నపుడు తారకలున్
సదమలకాంతులఁ గనఁబడ
కఁ దగకయుండెన్ నశించె గ్రహగణ మెల్లన్. 235

సీ. వాయుసంచార మవ్వాడుపునం గన్పడె
నగ్నియు మండక యంతరింప
సాగె వియద్వీథి తమమయి దిక్కులు వెలుం
గకయుండె నల్లె సాగరము లెల్ల
క్షోభించెఁ బర్వతకులము గంపించె నో
షధులు వాడెను జంతుసంతతులును
వెతలఁగాంచెను పక్ష వితతిమాసర్తు వ
ర్షాదికమా సమ మనియతి గనఁ

తే. బడకయుండె నహోరాత్రపద్ధతియును
దాఱుమాఱయ్యె దిక్పాలతతి మరీచి
ముఖ్యమౌనివరుల్ కాలము నటుమార్పు
నొందుదానిని గని యెంచి రొగి లయ మని. 236

చ. సమయ మదివ్విధంబున విశాలజగత్త్రయతాపహేతువై
యమరఁగ భూతజాలము మహార్తివిలాపముచేయ లోకజా
లముల నవిద్యయన్నసలిలంబుఁగ మున్గ నెఱింగె నాత్మదై
వము సకలేశ్వరుండనఁగ భాసిలు భూతవిభుండు చయ్యనన్. 237

క. విశ్వాత్మకుఁ డౌటను దా,విశ్వము రక్షించు దీక్ష వెలయఁగఁ దనలో
శశ్వత్తత్సమయస్థిత,విశ్వస్థితి నెంచె జ్ఞానవిలసితదృష్టిన్. 238

చ. కనుఁగొని మోహకారణము కంజవిలోచనపంకజోద్భవుల్
ఘనతరమోహపంకమునఁ గన్నులుగానక నిక్కియుంట నె

మ్మనమున నెంచె సంపదలమానుషముల్ కలుగంగఁజేయు స్వా
మిని ననుబుద్ధిమాంద్యమున మేటిగ నెంచఁగలేక వీరిటుల్. 239

ఆ. మదముపేర్మి నన్ను మఱచి ప్రభుత్వము
తమదిగానె తలఁచి తత్త్వశూన్యు
లగుచుఁ బెనఁగులాడఁగఁ గడఁగియున్నారు
మోహమహిమ మార పొగడవచ్చు. 240

చ. సరసిజనేత్రపంకరుహసంభవులన్ గడుముగ్ధులై నిరం
తరము పెనంగఁజేసె ననుఁ దారెఱుఁగంగ వలంతులయ్యు ని
క్కరణిని మోహవార్ధిఁబడి శానఁగలేక వివాద మిట్లు ని
ర్భరమదయుక్తిఁ జేయఁదగువారన నేమనవచ్చు వీరినిన్. 241

క. జనుఁ డజ్ఞానధ్వాంతము, కనులం గప్పంగఁ జూడఁగాఁజాలఁడు చెం
తనుగలదానిన్ వస్తువుఁ, గనఁజాలఁడు దీనికంటెఁ గలదే యరు దిలన్?.

ఉ. పరఁగ కృతాపరాధులు ప్రబద్ధమహోన్నతమోహసాగరాం
తరమున మున్గినారు విహితంబుల జగంబుల కేను గోర కి
క్కరణిని మాన మూనుటకుఁ గాదిదికాలము కార్య మెద్ది యె
వ్వరున నొనర్పఁగాఁదగునొ వావిరి నెంచఁగనొ జవంబునన్. 243

చ. అని మది నిశ్చయించి ద్రుహిణాంబుజనేత్రులు మాయలోనఁ జి
క్కినవిధ మెన్ని దాని నిటఁ గీడ్పడఁజేయఁదలంచె సత్కృపా
వననిధియాట నయ్యది స్వభావముగాఁ దన కబ్బియుంట నా
య్యన జగదోఘపీడఁ బరిహారము సేయఁగ నిశ్చయించెఁ దాన్. 244

---

## దశమాధ్యాయము



### తేజోలింగప్రాదుర్భావము

చ. అని యిటు నందికేశ్వరుఁ డహర్యమదంబున వాద మట్లు చే
సినకతఁ జెప్ప మౌనిపతి చిత్రముగా విని యోమహాత్మ! శం
భుని దయ యేమిచేసె నెటుపూనెను వారి ననుగ్రహింప మో
హనికరమాత్మలం గలఁప నాగతినుండిన విష్ణునిన్ విధిన్. 245

ఆ. తెలుపవయ్య మదికిఁ దృప్తిచేకూరెడు,నట్టు లనిన శంకరాంఘ్రి జలజ
భక్తుఁ డిట్టులనియె వచియింతునగ్గాధ యున్నదున్నయట్టు లోమునీంద్ర!
మ. అనుకంపానిధి యివ్విధిం దనమనోజ్ఞాత్మం దలంపంగ నా
ర్తిని బాపంగను సాటిలేనిదగు జ్యోతిస్తంభ మొక్కండు వా
గ్విని యోగంబున నాత్మశక్తి జగతిన్ విస్తారతం గాంచఁజే
యను లో నెంచెడువారిదా నడుమ నత్యాశ్చర్య మేపారఁగన్. 247
చ. పరఁగెను దిగ్విదిగ్వివరభాగములం గనరానియట్లుగా
నురుతరశక్తిఁ జేయుచు మహోన్నతి గాంచెను గంజజాండమ
క్కరణిని బ్రద్దలౌనటులుగాఁ గనఁజేయుచు నంతరిక్షమ
ర్తరుణమునందుఁ జీల్పఁబడి దారియొసంగినయట్లు తోఁపఁగన్. 248
క. దానిం గనివారిర్వురు, మ్లానముఖాంభోజు లగుచు మహితం బగుచుం
గానంబడుతత్తేజము, మానసములభీతి నింప మాట వెడలఁగన్. 249
ఆ.నిలిచియుండి రంత నిఖిలదిక్కులు వెల్గెఁ,దమము లట్టె పాఱె దారుణమగు
దానిజ్వాలలెల్లఁ దమ్ము శోషిల్లఁజే,యంగ నట్టె కడలు లలరసాగె.
క. తారౌఘముతో దివమునఁ, జారుతరప్రభలుగల్గి సకలగ్రహముల్
శ్రీరమ్యములై యొప్పెను, భూరితరం బైన తేజమునసుండి వెసన్.
చ. వెలువడి విస్ఫులింగములు బృందముగా దివమందు నిల్చి చు
క్కలుగఁ జెలంగె నంచుఁ బలుకందగియుండెను; రక్తవర్ణకాం
తు లపుడు గైరికంబులుగఁ దోఁచెను భౌమములై నవస్తువుల్
జలరుహమిత్రభూమిసుతసాంద్రమరీచియుతిం గనంబడెన్. 252
సీ. సాగరంబులు ప్రతిచ్ఛాయాశ్రయంబున రక్తజలంబుల రాజిలి యటఁ
బద్మరాగశకలపటలనిర్మితము లైనట్లు కన్పడియె వృక్షౌళినవ్య
చారుప్రవాళగుచ్ఛముల వేల్లాడెడుకరణిఁ గానంబడఁగాఁ దొడంగె
హ్రోదినుల్ ఫుల్లకహ్లారము లట్లు ప్రకాశింపసాగెను క్షమయుఁ గుంకు
ఆ. మమునఁ బూయఁబడినమాడ్కి విరాజిల్లె
దెసలు సాంద్రరక్త దీధితులను
గ్రమ్మియుండురీతిఁగానుండె; నంబర
మరుణ మట్లు తోఁచె నరసిచూడ. 253

క. పరికింపఁగ బ్రహ్మాండం, బురుతేజఃపూరితాంతరోన్నత మయిన
ట్లురవడిఁ దోఁచెను భూషోత్కరమెల్లను రక్తకాంతిఁ గ్రాలెహరునకున్.

సీ. ఇవ్విధంబున క్షణవృద్ధిని గనెడు తేజస్స్తంభమునను విశ్వంబు స్థిరచ
రాత్మక మత్తఱి నరుణరూపంబును భజియించె; నంతనప్పద్మజహరు
లట్టి తేజోలింగ మచ్చటఁ గన్గొని తొలఁగి మిథఃక్రోధములను వేఱు
వేఱుగా నెంచిరి విశ్వంభరను బ్రద్దలుగఁ జేసి శేషాదులుగఁ జెలంగు

ఆ. సర్పరాజములను సాధ్వసంబునుగను, నట్లొనర్చి తత్ఫణాళిగల్గు
రత్నభూరికాంతిరాశిగా వెలుఁగొందె, నిద్దియేమిచిత్ర మెఱుఁగరాదు.

క. ఇది కల్పాంతమొ యత్తఱిఁ
బొదలెడు భాస్కరసమూహములుగాఁ దోఁచెం
గద భూమ్యంతరమున నీ
యదనున రంధ్రంబు నుంతయైనఁగలుగమిన్. 256

తే. అద్భుతంబుగఁ దోఁచెడు నొర యిద్ది
ఘనము లొండొండు దార్కొనఁగాఁగలిగిన
వైద్యుతాగ్నియొదివి నెల్లవ్యాప్త మగుచు
నవనిఁబడియెనొ యింకేదొ యరయరాదు. 257

సీ. దీనిమహాత్వ మెంతేని విచిత్రంబు దృష్టిపాటవము నుంతేఁగలుగదు
ప్రతినిమేషము నశింపఁగఁజొచ్చెనక్కటా! భూతజాలంబులఁబూనిసృష్టి
యొనరించుపద్ధతి యొప్పు వృద్ధింబొందుచున్నది కాని యీయుగ్ర తేజ
మించుక సంతాపమిడ దేమిచిత్రమొ చెంతనుండెడుభూతసంతతులను

తే. గాల్ప దిసుమంతయే నగ్నికరణి దీని
కాంతిసంక్రాంతి నొక్కజగద్వ్రజంబె
కాక నావపునుగూడఁ గడువిశోష
తనుగనెం; గల్గె నిద్ది యెద్దానివలన. 258

క. దీనికి మూలం బెయ్యది, కానంబడ దేయుపాధికల దొక్కయుపా
దాన మది యెంత యున్నదొ, దేని మహాశక్తి నిద్ది తేజరిలునొకొ?.

తే. ఎల్ల భాగంబులందు నిదీవిధమున
వెలయు దీనికి నవధి యెట్టులు గణింప

వచ్చుఁ బాతాళమును జొచ్చి వడువుగానఁ
బడెడు నిది యెంతమాత్రమో పలుకరాదు. 260

చ. కనుక నిదెల్ల జక్క నెఱుఁగంగ మనం బతివాంఛఁ బూనె నం
చు నిటులు వార లిర్వురును జొక్కఁపునాశయ మూని రంత న
వ్వనరుహనేత్రుఁ డభ్రమును బ్రహ్మ రసాతలముం జొరంగ నె
క్కొను గడఁకం దలంచి రెదఁగూరినచింత నడంచు కోసమై. 261

క. తేజస్స్తంభవిలోకన,మేజతనంబై చెలంగ నింతనిపల్కం
గాఁ జనని గర్వమూనిన, యాజీవనజాత్మ జస్మహరి గని యంతన్.

చ. స్మితవదనాంబుజుం డగుచుఁ జెప్పె నిటుల్ పరమేష్ఠి యిప్పు డి
వ్వితమున నొప్పు తేజమె ప్రవృద్ధమనోరథబద్ధచిత్తతన్
జతనము మీఱఁగాఁ బెనఁగఁజాలిన యీమనలం బరీక్షచే
యుత మటమీఁద గౌరవ మదొప్పునొ యెవ్వనియందుఁ దేలెదున్.

క. అపకర్షం బుత్కర్షము, నెప మెయ్యదిలేక తేల్ప నేర్పుటె యిదియే
సుపరీక్షకునికషం బిది,యె పలుకులన్ ఫలము సుంతయేఁ గల్గదికన్.

సీ. ఇద్ది తేజోరాశియే యపరిచ్ఛేదసంపన్నిధానమే సరసిజభవ!
మనలోననెవరిచేతనుగాని యాద్యంతములు కనుంగొననెట్టులలవిగామి
నిశ్చయంబగునుదీనికిమూలమెదియగ్ర మెదియనికనుగొనునెవ్వఁడిప్పు
మనలోన నాతఁడే ఘనుఁ డగులోకేశుఁ డగునన నందుల కబ్జసూతి

ఆ. యొప్పుకొనియె నిట్టు లొక్కొక్కరును స్పర్ధ
దానిరూపు తెలియఁగా నిజాత్త
గౌరవంబు నెల్లకడల వెల్లడిచేయఁ
గాఁ దలంచి రెదలఁ గల్గుపూన్కి. 265

---

## ఏకాదశాధ్యాయము

### శివలింగపాదమూలమును విష్ణువు పరిశోధించుట

ఉ. అంత విరించనుండు వియదంతరమందుఁ జనంగ దక్షుమై
సుంతయినన్ శ్రమం బిడఁగఁ జొప్పడనట్టి మరాళరూపసం

క్రాంతి నెసంగి తేజపుశిరస్థలముం గనువాఁడ నంచు లో
నెంతయుఁ బొంగువేడ్కఁ జనియెన్ గృతకృత్యత నొందుకాంక్షతోన్.

చ. హరియు వరాహవిగ్రహము నప్పనికై గ్రహియించి శౌర్యవి
స్ఫురణముఁ జూపఁజాలు నదెపో యని యెంచుచు భూరిభూమి ని
ర్భరతరభేదనక్రమవిభాసురకేళియె వైభవంబుగాఁ
బరుగిడఁబూనె మూలమును బాగుగఁ గాంచియె వత్తు నంచెదన్

క. తలఁచుచుఁ దద్గాత్రం బపు, డలవడఁగా స్తబ్ధలోమమై కృత్రిమమై
చెలఁగెడుదంష్ట్రలనొప్పుచుఁ,గులగిరినాఁదగినతనువుఁగొని వేగముగన్.

క. ఖరతరదంష్ట్రాయుగళిన్, ధరణిన్ బోత్రంబుచేతఁ దగురీతిన్ ని
ర్భరశక్తిన్ భేదించెను, హరిముఖముం జక్కవంచి యద్భుతరీతిన్.

ఆ. ఘనవరాహ మప్డు కానఁగాఁబడియెఁ ద
త్తేజమునకు మ్రొక్కుతీరుతోఁపఁ
గ్రీడకొఱకుఁ గొనినక్రోడము కఠినమౌ
ఘోష మడరఁజేయ ఘూర్ణిలె నిల. 270

క. పాతాళమ్మును ఘూర్ణిలె, నాతఱి బాతాళమును మహాకిటిచోర న
త్యాతతయత్న మొనర్చె న,దేతట్టునఁ జూచు నందు నెల్లెడనవియున్.

చ. తొలుతను గానన్నై నయటు తోఁచుచునుండెను భేద మింతలే
కలసట లేనిపూన్కి నసలాకృతిఁ గన్పడు స్తంభ మెల్లెడన్
జలరుహనేత్రుఁ డొక్కగతి ఛద్మవరాహ శరీరమొప్పు ను
జ్జ్వలతర తేజమూని కనఁజాలుచుఁ దగ్గని పూన్కిమీఱఁగన్. 272

చ. ధరణిని జీల్చుచుం జని యధస్థితలోకమునందు నుగ్రమౌ
నురగవరేణ్యసంతతి మహోత్తమకాంతిని స్తంభ సంభవాం
కురములరీతిఁ గన్గొనియెఁ గొందఱు భోగులు మేరునామ భూ
ధర వరమూలకందములె తప్పక యౌనని తెల్పుచుండఁగన్. 273

ఆ. అరిగి యరిగిభూమి కాధారముగనుండు,నాదికచ్ఛపంబు నచటఁ గాంచె
భూమిభార మెల్లఁబూనియాకచ్ఛప, మందునుండెఁదాను హర్షదమయి.

క. మదమంథురబంధురములు, విదితంబులు దిగ్గజములు విష్ణువునకు న
య్యదనునఁదోఁచెన్ సంస్తుత్యదర్ప మండూక మొండు నందుండెఁదోఁచెన్.

ఆ. దేనిపృష్ఠమందు స్థిర నిల్చియుండునో, యట్టిదానినందు హరి కనుఁగొనె
నదియెకాదె తెల్పు నాధారశక్తి యిట్లలరునంచుఁ దెల్పునవ్వహంబు.
క. దేని యనుగ్రహమున నీ, తొమ్మిసిఖిలభరంబు సర్పమండలపతి శ్రీ
జాని శయనీయభూతుం, డై నెగడిన శేషుఁ డట్లె యాకూర్మంబున్.
క. బలవంతములగు దిగ్గజ,ములు దాల్పంజాలి తేజమునఁ బొల్చునో యా
యలఘుతర శక్తిమంతుల, జలజాక్షుఁడు గనియె మనసు సంతృప్తిగనన్.
ఆ. అతల వితల సుతల నితల తలాతల
ప్రతలములును బిదపఁ బరఁగు నమ్మ
హాతలంబువరుస హరిఁ గాంచెఁ బాతాళ
ముల నిఖ్యాతి మిగులఁ బొల్చువాని. 279
క. పలువిధము లైనయాకృతు, లలరంగా నందునుండు నాభూతగణం
బులఁగాంచి విస్మయంబున, జలజాక్షుఁడు పొదలి సర్పజాలముగనుచున్.
ఉ. భోగవతీసమాఖ్యగల పూర్వరముం బలి చూడఁబోయెఁ దా
భోగిశయాను నాజ్ఞ సుఖముం గనుచున్ వసియించె నెందు నం
దే గరళాగ్నికీలముల నెల్లరభీతులఁ జేయఁజాలు నా
భోగివరుల్ వసింత్రఖిలభోగములం గుడువంగ నోపుచున్. 281
చ. దితిజులసన్నివాసములఁ దీవ్రపరాక్రమశాలులైన దై
త్యతతులగహ్వరంబుల నితాంతముదం బొనఁగూర్చువాని న
చ్యుతుఁ డటఁ గాంచె నెంతయు మహోత్తమ మీయది చిత్రమిద్ది యం
చితవిభవాఢ్య మిద్ది యని చిత్తమునం దొగి నిశ్చయించుచున్. 282
చ. వెదకుచు నందు నెందుఁ దనవీనులకున్ వినరామి దానిఁ జూ
చుదమి ఫలింపరామి మధుసూదనుఁ డత్తఱిఁ జింతనొందె నే
మిది కనరాదు మూల మిట నియ్యది యాదియు నంతముం గనం
గఁ దలఁప కిట్టు లున్నదనఁగాఁ దగునైనను జూతునం చొగిన్. 283
చ. తలఁచుచు బుద్ధిమాంద్యమున దానిదెటం గననైనొ మూలమం
చలయక చూచుచుండెఁ; నట నంబుధిశాయిఁగనయ్యె నేరికే
నలవియెగాదు లోఁతు తెలియంగ దురాసద మద్ది స్తంభమా
జలనిధి యంతరాళమున సాంద్రరుచుల్ పరఁగం గనంబడెన్. 284

ఆ. మార్పు సుంత లేక మహనీయమహాస్తంభ
మందుఁ దోఁప నిట్టు లాత్మ నెంచె
భూమిఁ జెండినాఁడ భూరిపయోధులఁ
గలఁచినాఁడ శక్తి గానఁబడఁగ. 285

క. ఏతన్మూలము గనరా, దీతఱి నేఁ జేయఁదగిన దెద్ది యనుచు న
జ్ఞాతాత్ముఁడు విభ్రాంతిని, జేతముఁ గంపింపఁ దిరిగె సిద్ధిం గనఁగన్.

క. శరదాళి వేలసంఖ్యగ, జరగెన్ విభ్రాంతి తన్నుఁ జంచలచిత్తుం
గరహిం నొనర్పఁగఁగానం, దరమింతయుఁ గాకయుండఁ దత్తఱపడుచున్.

చ. ఖురము విశీర్ణమై చెడఁగఁ గ్రూరతరాయతదంష్ట్రి లట్టులే
కరము చెడంగ విగ్రహము కంది కృశింపఁగ భగ్నపోత్ర మీ
కిరి యని చెప్పగాఁ దగుచుఁ గేవలకష్టము లొందఁజాలుచున్
ద్వరఁ దెలుపంగ నిశ్వసనవాయువు లొక్కట నుబ్బి వెల్వడన్. 288

చ శ్రమమె స్వరూపమై వెలయ స్వైరవిహారము మాని స్తంభమూ
లముగను వాంఛ తగ్గఁగఁ గలంగినచిత్తముతోఁ బ్రతిజ్ఞయుం
గ్రమముగ సన్నగిల్ల నిటఁ గాలముఁ బుచ్చక స్వాలయంబు వే
గమ కనఁబోవుటే యుచితకార్యముగా యనునూహ పర్వఁగన్. 289

ఆ. మరలిపోవఁబూనె మాధవుఁ డత్తఱి
నడుగు ముందు నిడఁగ నైనఁజాలఁ
డయ్యెఁ గదలఁగూడ నర్హుఁడుకాఁడయ్యె
శ్రమము పేర్మిఁ జూడఁజాలఁడయ్యె. 290

స్రగ్ధర. పాతాళాంతస్థితుండై పథము గనఁగ నప్పట్టునం జాలకున్నన్
జేతఃకారుణ్య మొప్పన్ శివుఁడు నృహరిదా చిత్తమందా నెఱింగెన్
బాతాళంబుం ద్యజింపం బటుతరపథమున్ భావనాశక్తి నెన్నన్
ఖ్యాతిన్ లోకంబులందున్ గనఁదగుకరణిన్ గ్రన్నసం జూపనెంచెన్.

చ. తలఁపు జనించినంతనె కృతం బగుకార్యము వ్యర్థమన్న యూ
హలు పొలయంగఁ జక్రధరుఁ డల్లన నచ్చట నుండిపోవఁగాఁ
వలఁచుచు నెవ్విధంబుననొ దాఁటె సముద్రముఁ బారహీనమున్
జలనిధిమున్గినంతటనె జాఱె శ్రమంబు విచిత్రరీతిగన్. 292

క. తేజస్స్తంభప్రభల, ప్రాజలజాతాక్షుఁ జుట్టి నతిదృఢరజ్జు
వ్యాజమున నంత నెట్టులొ, యీజగదీశుండు దానినంతట వదలెన్.

చ. వనముల ఘోరమార్గముల వైళమవాసిజనార్దనుండు త
త్తనువునఁబోయె నెచ్చట విధాతయుఁ దాను బ్రతిజ్ఞసేసిరో
యనుపమమైన స్తంభమున కాదిఁ గనుంగొనుపూన్కి మీఱ నా
య్యన నటఁ జేరెఁ జిత్తము మహాత్తరశంకకు లోనుగాఁదగన్. 294

ఉ. ధాతయు హంసరూపమును దా ధరియించి శిరస్సు గాంచు న
క్కౌతుక మెంతయోవడిని గైకొనిపోవఁగఁ జేయఁబోయి యా
భూతపతిద్యుతుల్ కనఁగఁ బోలమిశక్యముగామిఁ బోనఁగాఁ
జేతమునం దలంచి యెటొ చేరెను బ్రాక్స్థల మెంతొ దీనతన్. 295

చ. తొలుతనె కాంతిపుంజ మెటఁదోఁచెనొ యాస్థలిఁ జేరి రిట్టు లా
జలరుహనేత్ర పంకరుహసంభవు లంతట వీతగర్వుఁడై
సలిలరుహాక్షుఁ డింక నలశంకరునే శరణంబు వేఁడుదున్
వలగొని మ్రొక్కుదుఁ గరుణ వర్ధిలఁ గాచు నతండె నన్నిఁకన్. 296

తే. అతఁడు విశ్వాధికుండు మోహాంధదృష్టి
గాననైతిని బూర్వము కామహరుని
మఱచిపోయితి దుష్టకర్మము నన్నుఁ
బెలుచ బాధింపఁ జిత్తంబు కళవళింప. 297

క. అని తలఁచుచుఁ దేజస్సును, గనినట్టి స్థలంబుచేరె గర్వమెడల నిం
కనుగలఁడె విశ్వసంతతి,ఘనుఁడాతనికన్న ననుచుఁ గడగిఁ తలఁచుచున్.

---

## ద్వాదశాధ్యాయము

### బ్రహ్మ శివశిరస్సును బరిశోధించుట

చ. వనరుహనేత్రుఁ డివ్విధిని భర్గునిమూలము గానలేక వ
చ్చినఁ బరమేష్ఠి స్తంభముగఁ జిత్రగతిం దగు తేజముం గను
గొనుచుఁ దదూర్ధ్వభాగమును గోరికఁ గాంచెదఁ గాక యన్నయూ
హను దెలుపిట్టమేను వెలయుం జనుచుండెను దానిచెంతనే. 299

తే. అది నిరాలంబమైయుండు నాకసంబు
గా నెఱింగియు వేగంబు గడలుకొనఁగఁ
బక్షచాలనజనితనభస్వదధిపుఁ
డెంతయును దోడ్పడంగ నభీష్ట మెసఁగ. 300

క. చనుచూడఁ బక్షచాలనమున వాయువు రెండుభాగములుగ విభాగిం
చినరీతిఁగానఁబడఁబో, యెను దూరము దృష్ట్యవిషయమే యగురీతిన్

సీ. పోవంగఁబోవంగఁ బొడవుగా రేఖగాఁగానంగఁబడుచుండుకాయమమర
స్తంభపార్శ్వంబున శతధృతి తెలిపిట్ట యాకృతిం గనఁబడె నబ్జవైరి
సంధ్యాపయోధరాసన్న చరుండయి కనఁబడురీతి మేఘములతోవ
దాఁటి విమానపథమ్ము తర్వాతఁ గన్పడ దానిమీఱి నభంబునందుఁ

తే. దోఁచు నక్షత్రగణములు గలత్రోవ మించి
యింకఁ గల్గిన తేజస్సమీహితముల
నిలయముల దాఁటి యూర్ధ్వగతులఁ జెలంగు
వారి మార్గంబులన్ మించి వరుసమీఱి. 301

క. మరుదధిపువిమానసమును, వరుసన్ మించంగలగతివై ఖరిఁబోయెన్
సరసిజజనిమానసమం,దిరరూప మ్మలవడంగఁ దీవ్రత్వరతోన్. 302

తే. ఎంతదూరముపోయిన నెంత శ్రమము
పక్షచాలనమున ననుభవమునకును
వచ్చినన్ లెక్కసేయక వాంఛసిద్ధి
నొందఁగా జేయుపూన్కితో నొగిపఱచిన. 303

క. అతఁ డెంతగఁ బరువెత్తిన
వితతజనం బొప్పఁ గాంతిబ్బంద మ్మది యు
న్నతిమీఱఁ దోఁచుచుండెను
శతధృతియును వాయుసమితి సంచారమునన్. 304

క. పరిశుద్ధమైనమార్గము, త్వరమించఁగ దాఁటి మదిని శౌటిలిన ని
ర్భరవిస్మయంబునం గనె, పరమబ్రహ్మాండమును విభాసురతమమున్.

వ. అట్టి బ్రహ్మాండకటాహంబును భేదించుకొని స్తంభాగ్రమును జూడక
హరిముందు నిలుచు టెట్లని తలంచుచు శీర్షమును జూడక ప్రతిజ్ఞ

నిర్వహింపక చాలకాలము ప్రాణముల ధరించు టెట్టు లని యోజిం
చుచు నింకఁ జేయఁదగిన దేమని చింతించుచు, నింకమీఁద గతియేదని
పర్యాలోచించుచు విష్ణుని జయించు టెట్టు లని యూహించుచుఁ
గపటమ్మునైనఁ జక్రధరునిం దిరస్కరించువాఁడ నని యెంచుచు
మహాత్ములకు మనస్సే ధనంబుగాన మనోబలంబున జక్రి నిర్జింతు నని
తలపోయుచు నితికర్తవ్యతామూఢుండై వ్యాకులాత్ముండై యప్పుడు,

క. చెంతనె కనుఁగొనె నిర్మల
మెంతయుఁ జూడంగఁ దగుచు నెద్దియు నెఱుఁగన్
జింతింపఁ దరముగా నటు
కాంతంబయితోఁచు దానిఁ గమలజుఁ డచ్చోన్. 307

క. ఇది యైందవరేఖయొ? యయ్యది యేటికివచ్చు నిచటి కరఁయు మృణాళం
బిది యనవచ్చును సింధువు,వదలి వియద్వీథినుండవచ్చునె యదియేన్.

చ. అని యతఁ డాత్మసందియము లందుచు నెంచుచు నుండునంతలో
వనజజుచెంతఁ జేరె నది బర్హము కేతకి దంచు దాని నెం
చెను బరమేష్ఠిపుష్ప మది చిత్రపరీమళముల్ వియత్తలం
బున వెదఁజల్లుచుండెఁ దలపోయగ బర్యుషితంబె యయ్యుఁ దాన్.

తే. వస్తుశక్తినిబట్టి యాపర్ణమట్టె, వాసనల నింపుచుండె నవ్వారిజాస
నుండునిర్మలమైతగియుండుదాని,నందుకొనియెఁదావన్మాత్రనద్దియతని.

చ. కనుఁగొని ప్రాణయుక్తిఁ బలుకందొడఁగెన్ మహితాత్మ! యేల న
న్గానితివి? వేగమే వదలఁగూడును నీకును బెక్కువేల టం
చనఁదగువత్సరంబులు విహాయసమందుఁ జరించునట్లు క్రిం
దను బడుచున్ శ్రమంపడెదు దాని ననుం గయిఁబట్టు నేటికిన్. 311

ఆ. వదలవయ్య శ్రమమువలన మాటాడంగఁ
జాలకున్నదాన సారసభవ
యనిన న్వాశయంబు హతమైనగతి నెంచి
తన ప్రతిజ్ఞఁ దీర్పఁదగని దనుచు. 312

క. తలపోసి నైచ్యముం గొను,దలఁ పమరఁగ వారిదనినదంబో యనఁగా
గళరవముతోడ నిట్టులు, పలికెన్ దద్వివరవితతి బ్రద్దలుగాఁగన్,

క. సుమరాజము! యీ తేజ,స్సముదయ మెందాఁక నుండజాలునని యెఱుం
గమదిందలంచివచ్చుచు,శ్రమమున బౌరుష మదెల్లసమయుటనిచటన్.

ఆ. దృష్టిపాటవంబు దిగ్గనఁ దగ్గుటఁ బక్షయుగము చాల బడలి యుంట
నవయవంబులెల్ల నట్టె శ్రమంపడి, నిలువఁజాలకుంట నేలఁబడఁగ.

క. మొదలిడఁగావచ్చితి వీ, విది నాఖేదం బటంచు నేలపలుక సం
దోదవక వెలువడు నూర్పుల,కదంబమే తెల్పుఁగాదె కష్టము నీకున్.

చ. నిలువవు మేనఁబ్రాణములు నిశ్చయమం చని తోఁచుచున్న ది
మ్ములగరువంబు నట్లె మదమున్ నశియించునుగాన చిత్తమన్
స్థలముననుండి నాకుఁ గలస్పర్ధయు విష్ణువుతోడ నిప్పుడే
విలయము నొందుఁగాక శ్రమవిహ్వలతన్ బలుకంగలేనిఁకన్. 317

సీ. ఉద్యమం బియ్యది యొప్పునాశాకుమారపరిణాహాధిక మిపుడు తలఁప
గాఢ తేజస్స్తంభ మేడఁజూచిన మును పెట్టులోయిపుడట్టులే మహోన్న
తిని గనుపట్టెడు దీనియాద్యంతము లేనుజకిరియు నుంత యెఱుఁగఁజాల
మిద్దాని కారణం బింద్రాది దేవతలగుదు రవ్వారు దవ్వుగ వసింతు

ఆ. రింకమీఁద నాకు నెగురఁజాలెడుశక్తి, నుంతయేని లేదు సుమవరంబ
మరలిపోవువాఁడమర్యాదవిడనాడి, యనుచువిస్మయముననజుఁడుపలికె.

ఉ. కేతకి నిట్లుపల్కె; నినుఁ గేవల మల్పునిగాఁ దలంపఁగాఁ
జేతము సమ్మతింప దిఁకఁ జెప్ప మొవండవు వచ్చి తేటి కు
ద్భూతమహార్తిఁ గుందెడను బోలదె నాకు వచింపనన్న సం
జాతకుతూహలం బెద నెసంగఁగఁ బల్కెను బుష్ప మివ్విధిన్. 319

ఆ. కేతకచ్ఛదంబ భూతేశు నానతిఁ, బ్రాణయుక్తి నిట్లు పలుకఁగల్గి
తిని జిరంబు నేను తేజోమయస్తంభ,ముగఁ జెలంగుశివునిమూర్ధమందు.

క. నివసించి మేదినీస్థలి, నివాసముం జేయుకోర్కె నే వచ్చెదనం
చు వడి బల్కఁగవిని యజుఁ,డువికృతిభావంబు మానియున్ సుమవరమున్.

క. కనుఁగొని లబ్ధాశ్వాసం,బునఁ బల్కె నదెంతదూరమున స్తంభాగ్రం
బునుఁజూడఁజాలుదునోయొ,య్యనఁదెల్పుమటన్న నుస్మితాస్యంబమరన్.

## త్రయోదశాధ్యాయము



బ్రహ్మ యసత్యము పల్కు మని మొగిలిపూవును వేఁడుట

చ. కుసుమవరంబు పల్కె విధికోరిక వింతగఁ దోఁప మూర్ఖుఁడా
కుసుమశరారితత్త్వమునఁ గొంతయెఱుంగవు నీ వెవండవో
యసమదృగుత్పలుండు విను మంతట నుండును లేనిచోటుఁ దె
ల్పుసరణి యుండునే సకలభూతవిభుం డతఁడా నెఱుంగుమా. 323

ఆ. ఎవనియందు నిట్టి వెన్నొ బ్రహ్మాండకో
టులు చెలంగుచుండుఁ దలఁప నతని
దింతయే ప్రమాణ మెన్నఁగా నని తెల్పఁ
దగినవాఁడు కలఁడె జగతియందు. 324

చ. అతని శిరంబునుండిపడునప్పటినుండియు నేఁటిదాఁక నా
మతి నరయం జతుర్యుగసమాజము లెన్నియొ వేనవేలుగా
గతములె యయ్యె నంచుఁ బలుకందగు నిప్పటిదాఁక జూడఁగా
జతనము సల్ప నంతరము త్మాతలమాఁగద కానరాదదే. 325

చ. అని తెలుపంగఁ బద్మభవుఁ డల్లన వందన మాచరించి నె
మ్మనమున నిండియున్న నిజమానము చయ్యన వీడి యంజలిన్
గనఁబడ నొగ్గి యిట్లనియె గర్వము పోయెను మూఢుఁడన్ నిజం
బని వచియింతుఁ బుష్పదళమామహితాత్మను గంటి పీవిధిన్. 376

మ. శతపత్త్రప్రభవుండ స్పర్ధగొనితిం జక్రాంకుతో మున్ను నే
నతఁడున్ శంకరువైభవంబు గతపుణ్యాత్మన్ స్మరింపంగలే
క తదీయాంఘ్రిసరోజయుగ్మమును జక్కం గొల్వఁగా లేక దు
ర్గతిపాలైతిమి నామదిం బొడమె సర్గప్రాభవాహంకృతుల్. 327

తే. అద్ది లజ్జాకరంబె యహా నద్దియట్టు
లుండనిమ్మింతదాఁక దామోదరుపయి

గలుగుస్పర్ధను విడువంగఁ గలమనోబ
లము రవంతైన లేక కష్టములఁ గనుచు. 328

క. కలఁతం గనుచిత్తంబున, బలుపోకల నెంచుచున్నవాఁడఁ సఖ్యం
బలరఁ సాప్తపదీనం, బిల నందురు పెద్ద లట్టు లేనే నీకున్. 329

తే. నీవు నాకును సఖుల మేయేవిధమునఁ
దలఁపఁ గాన నసంస్తుతంబు లఘువునగు
బుద్ధి విడనాడి కరుణను బూని యొక్క
సాయమును జేయవలయు నోసాధుశీల! 330

చ. శతధృతినైన నేను నలచక్రధరుండును మోహ మట్టె దృ
గ్ద్వితయముఁ గప్ప నీయమలదీక్షితి స్తంభముగాఁ గనంబడన్
జతనముమీఱ దీనిఁ గనఁజాలుదు మంచును హంసకోలరూ
పతను మిథస్సమానతను బాయఁగఁజేసెదువాంఛ లొప్పఁగన్. 331

తే. మూలముం గాంచనే శిరముం గనంగఁ
జక్రియుం బూనితిమి నాదశ యన నెట్టి
దో యెఱింగితి వీవు నాతోయజాక్షుఁ
డెట్టి దశనొందియున్నాఁడో యెఱుఁగఁజాల. 332

క. మీఁదికి నెగురుచు నరుగం,గాఁ దలఁచిన నాదుగతిని గడచెను వేలేం
డ్లీదశఁ గ్రాసిల్లితిఁ జనఁ,గాఁదలఁచెదుఁబ్రాణవితతి కడుశ్రమ మొలయన్.

తే. నాయదృష్టవశంబున నాకను గు
మిత్ర మగుటకుగా దృష్టిపాత్రముగను
జేసె భగవంతుఁ డాధారసిద్ధిగల్గె
మిత్రకార్యము సఫలమై మించునట్లు. 334

క. ఒనరింపుము నాయభ్య
ర్థన సార్థకతం జెలంగఁదగు జేయఁగ ని
న్నునుగూడి యింతదనుక
వినయంబున నుడువుటను సువృత్తపథమునన్. 335

తే. సంచరించుట నేనైతి సఖుఁడ నీకు
దాసుఁడను గూడనైతి మిత్త్రి మవుగానఁ

గారణంబున నిద్దానఁ గడఁగి వేఁడఁ
జనుఁ గృతాంజలి నయి వాంఛ వినుమ యింక. 336

క. మూలముఁ జక్రియె గాంచినఁ
గాలము నన్నోడినట్లుగాఁ జేయుఁ జుమీ
మూలం బాతఁడు చూడం
జాలండే సమతఁ గాంచు సఖ! నాతోడన్. 337

క. ఇరువురకుఁ వాదం బిదె, వరమిత్రమ! ద్వేష మిందువలనఁగలిగె నా
హరితోడ నాకు నీ వి, త్తరుణమునఁ దానిఁ బాపఁ దగుదువు సుమ్మీ!.

ఆ. నే సుహృత్తు నౌట నీవుచితం బగు
నన్నృతమాడఁదగు మదర్థముగ నె
యొక్క మాటఁ బల్కు మోమిత్రమా! హరి
యెదుట దాన విజయమే కలిగెడు. 339

క. మానసవాసాకృతినిం, బూనిన పరమేష్ఠి స్తంభముగ నుండెడు తే
జోనికరము నుచ్చతరం,బౌ నగ్రము గాంచె సాక్ష్యమం దే నుండున్.

సీ. తేజోమయ స్తంభ దివ్యాకృతిం బొల్చు చంద్రశేఖరు డెద సంతసించి
తండ్రి కుమారుని దయ మెయిఁ గనినట్టు లితనిసంభావించెనిందు మూల
మున బ్రహ్మయీతండు ఘనుఁడగు నీకం టెఁజక్రధరాయని చక్కఁబలికి
సాహాయ్య మొనరింపఁ జను దీనిమించిన దెద్దియు నాకుండదింకననుచు

ఆ. దోసి లొగ్గి వేఁడ నాసరసిజభవు, వేఁడికోలుప్రీతి విస్తరిల్లఁ
జేయ మొగలిపూవు శ్రీహరికడనట్లు,వదలకుండఁ బల్కె బ్రహ్మ యలర.

---

## చతుర్థాధ్యాయము

శంకరుఁడు విధిహరులకుఁ బ్రత్యక్ష మగుట

క. అని తెల్పి నందికేశ్వరుఁ,డనుమార్కండేయ! యవలి దగువృత్తాంతం
బును జెప్పవాఁడవినుమా, వనజాక్షుఁడు బ్రహ్మఁగాంచివాక్యముదానిన్.

క. హెచ్చుగఁ దనమదిఁ బొడమెడు
నచ్చెరువున నితఁడు చూడఁ డా స్తంభాగ్రం

బిచ్చటి దన్నృతంబే యని
చిత్తంబున నిశ్చయించెఁ జెందినశ్రద్ధన్. 343

ఆ. తావివేకవంతుఁడై వన్నెగాంచుట
ముగ్ధుఁడ నగునన్ను భూరికరుణఁ
బెంప విధిమదంబుఁ ద్రుంప భూతవిభుండె
శక్తుఁ డంచుఁ దలఁచె స్వాంతమందు 344

సీ. మూలసందర్శనంబున శక్తి లేకుండఁ
జేసి నామదము నశింపఁజేసెఁ
గాన నేచంద్రశేఖరునందు దృఢభక్తి
జనియించె గర్వనాశనమె నన్నుఁ
బురికొల్పె స్తవ మొనర్పుము శంభు నని యిప్డు
హరుని దక్షిణవామకాంగములను
మేము జనించితి మీమాట మఱచి య
వీతగర్వుండయి విపులకూట

ఆ. సాక్షి నొకనిఁ బడసి త్ర్యక్షునిశిరమును
గాంచినాఁడ నిప్పు డంచు నన్ను
మించఁదలఁచె బ్రహ్మ యెంచ నీసర్వదుః
ఖములఁ బాపుశక్తిఁ గ్రాలు హరుఁడు. 345

క. అతఁడే శరణ్యుఁ డని సన్నతిఁ గొల్వందగును నాకు మార్గం బిదియే
వితతశుభంబులనొసఁగెడు, క్షితినపరాధముల నెన్నొ చేయునరునకున్.

సీ. అల్లె కృతఘ్నుఁడో నతనికి మఱిగురుద్రోహికి జగతిని ధూర్జటి విడ
నాడ రక్షించెడువాఁ డుండునే కాన శంకరు సతతంబు సంస్తుతింతు
జయజయ విశ్వేశ జయజయ పృథ్వీమయాకారసలిల మయాకృతిధర
జయసరోరుహమిత్రసంస్తుతాకృతిధర జయజయామృతకర చారుదేహ

తే. వహ్నిరూపధరాజయ వాయురూప
జయవిజయ హోతృరూప విజయ వియన్మ
యాకృతీ! నన్ను రక్షింపు హార్ష మలరఁ
గాలవిగ్రహా! శంకరా! కావవయ్య!. 347

తే. అతులైశ్వర్య! కాపాడవయ్య నన్ను
స్రష్ట వన నీవె లోకరక్షకుఁడ వనఁగ
హర్త వన నీవె మఱియొక్కఁ డరయఁగలఁడె
యణువులందెల్లఁ బరమాణు వగుదు వీశ!. 348

క. పరికింప మహాత్ములలో, హర! నీవె మహాత్తువగుదు వట్టులె వెలి నం
తరమున వ్యాపించి సదా, చరింతు వీవొక్కఁడవె ప్రశంసార్హుఁడవై.

సీ. నీదు నిశ్వాసముల్ నిగమంబు లగును విశ్వంబు భవచ్ఛిల్పవైభవంబు
నీవు నీవాఁడవే భావింప నగుదువు జ్ఞానమేయాత్మయౌ మానివంద్య
యమరదానవదైత్యులఖ్లవిద్యాధరుల్ సిద్ధాదులుపతత్త్రిశిలలుశిఖులు
భవదంగములె యగు స్వర్గాపవర్గమ్ము లధ్వరోంకారమ్ము లరయ నీవె

ఆ. యోగ మనఁగ నీవె యోగసిద్ధియు నీవె
సంవిదాఖ్యచే నెసంగువాఁడ
వనఁగ నీవె యాదియగుదు మధ్యాంతమ్ము
లగుదు వోమహాత్మ! యవ్యయ! శివ. 350

వ. స్థిరచరవ్రాతములు నీవె. కాలస్వరూపతవహించి యఖిలజగత్తును జరపుచుందువు. పరేశుండవు. పరమశాస్త్రవు. సర్వానుగ్రాహకుఁడవు. శివుఁడవు నగుదువు. అట్టిపరశివుండే నాకుఁ గర్తవ్యము నుపదేశించుఁ గాక. ఎవని దర్శించి శరణమొందిన నిశ్శ్రేయఃప్రాప్తిగల్గునో అట్టి పరమశంకరు నారాధించెద. నాకు దర్శన మొసంగిన తేజస్స్తంభమును వినుతించెద. దాని నాలకించి నన్ననుగ్రహించు నని నిశ్చయించి వైకుంఠుం డిట్లని వినుతించె. 351

క. మనమునఁ దేజస్స్తంభం,బును ధ్యానముచేసి భక్తి మ్రొక్కుచు సర్వే
శుని శాశ్వతు నభవునిశం,భుని సంస్తుతిఁజేయఁబూనెఁ బూనికమీఱన్.

క. పరమేష్ఠితటాలున నీ, శ్వరునివ్విధిఁబొగడనేలచక్రధరా! యం
చురయంబున వారించిన, గరుడధ్వజుఁ డద్దివినక ఘనరవములరన్. 353

సీ. జయమహాదేవ! వృషభకేతనా! వామదేవా! యమాంతకా! దేవదేవ!
యధ్వరధ్వంసి! నీలాంకితగళ! చంద్రశేఖరా! శంకరా! శివ పరేశ

ధూర్జటీ! త్ర్యంబకాధూతరిపూత్కారాస్మరవైరి,త్రిపురారిస్థాణుభర్గ
జయఖండపరశుహస్తా! హర పశుపతీ శూలధరా భూతజాలనాథ

తే. నీలలోహిత! సర్వజ్ఞ! వ్యాళభూష
జయపినాకధనుర్ధర జయప్రమథప
వ్యోమకేశ గంగాధర భీమరూప
గిరిశ పరమేశ జయ సర్వగేయకీర్తి. 354

వ. గంగాధర మృగవ్యాధ కృత్తివాసోవిభూషిత కృపానిధి కృతాను
రేతోనామకా! నీకు వందనములు. నిరంతర కైలాసవాసా! నమ
స్కృతులు. 355

క. భవదాజ్ఞ వీచువాయువు, భువనభరం బాదిశేషువు వహించుఁ జుమీ
శివ! నీదునానతిఁ సూర్యవిధుల్ వెలుఁగొందుచుందురభవ! త్వదాజ్ఞన్.

క. సాగరమున బ్రహ్మాండము, తేలెడు నీశాసనమున దీప్తిం గనుఁ దా
రాళియు వియదంతరమున,వాలాయము సంచరించు వరుసగ్రహముల్.

క. నేను విరించియు లోకము, లూనినశక్తిఁ భరింపఁ నొగిఁబుట్టింపన్
గా నర్హుల మాటకు నీ,శానా! నీశాసనంబె శక్తిద మయ్యెన్. 358

వ. నీశాసనంబున మేదిని సస్యంబులం బ్రసవించు. సముద్రంబులు జలౌ
ఘంబున భూతలంబు నావరింపఁజాలకున్నవి. అణిమాది మహాసిద్ధి
నీయసాధారణవైభవంబున నత్యల్పంబె యగు. నిన్నుఁ బొగడఁ
జాలనియమరు లల్పమతు లనంబడుదురు. శోకరహితకాలంబునందు
నిన్ను విస్మరింతుము. సంకటకాలంబున సంస్మరింతుము. మఱియు.

ఆ. భక్తులపయి నీకుఁ బర్వదు రోష మొ
కప్పుడేఁ బ్రసాద మొప్పు నెపుడు
భక్తి నెపుడు మదిని బాదుకొల్పుదో మోహ
మావరింపఁజేయ నటు తలఁతువు. 360

ఆ. బంధమోక్షములకుఁ బరమేశ! కల్పింతు
మోహబోధములను పూరుషులకు
నని నుతించి భక్తి నంజలి బంధించి
నిలిచియుండె భక్తి పొలయు మదిని. 361

క. పరమేష్ఠి మదోద్ధతుఁడై, హరి నపహాసమునఁ గనుచు నందుండెను వా
రిరుపురి యెదుటం దోఁచెను, బరమేశుఁడు భూరికరుణ భాసిల్లంగన్.

---

## పంచదశాధ్యాయము.

శివుఁడు విష్ణువు ననుగ్రహించి కేతకిని శపించుట.

క. అత్తఱిఁ దేజస్స్తంభము, నెత్తిన భక్తానుకంప నీశుఁడు హరి దా
నుత్తలపాటు నడంపఁగఁ, జిత్తమునం దలఁచి రెండు చేసి వెలువడెన్.

తే. అమృతకిరణుండు సంధ్యాభ్ర మమరశక్తిఁ
బాయఁగాఁ జేసి వెలువడుభంగి వచ్చి
స్తంభ భేదనమున విచిత్రంబుగాఁగ
వెండికొండను బోలిన వృషభ మెక్కి. 364

సీ. చారుజటాజూటసంసక్తిఁ బొలుపాఱి బాలచంద్రాంకితపరమచూడ
మగుమస్తకంబు చెన్నొంది వెలుంగఁగ బ్రహ్మ దైన్యట్టికపాలమాల
తెలపూదండయు వోలిఁ గంఠంబునఁ గ్రాలుచుండఁగ నాగకాండకుండ
లములు భాసిల్ల ఫాలఫలకభాసురవహ్ని నేత్రము శశిభానునయన

తే. ములు విరాజిల్ల నుద్దీప్తము లగుపంచ
వదనములు క్ష్వేడకల్మాషభవ్యకంధ
రములుగాఁ బ్రజ్వరిల్ల శూలము కపాల
పరశుసారంగడమరుచాపములు మెఱయ. 365

క. అమలంబయి తగుఖట్వాంగముఖడ్గము నాగవరము కడు మెఱసెడుహ
స్తము లొప్ప దంతివరచర్మము మేనఁ జెలంగుచుండు రమ్యతరుండై.

వ. భస్మోద్ధూళితాకారుండై సర్వాలంకారసంపన్నుండై సర్వదేవ
దేవసంస్తూయమానుండై పరిధానీకృతవ్యాఘ్రచర్ముండై హరిసరసి
జభవులయెదుట సాక్షాత్కరించె నంత. 367

చ. వనరుహనేత్రుఁ డల్లెదుట భవ్యతమాకృతితో వెలుంగు శం
భుని గని పట్టరానిదగు మోదమునన్ నటనంబు సల్పె సుం
త వెఱుఁగమిన్ సరోజజని తానట మూర్ఛమునింగె నత్తఱిన్
ధనయెదుటం గృతాంజలిగ దాసతనుండిన శ్రీపతిన్ హరిన్. 368

క. నయనోత్పలములఁ గని యను,నయమొప్పఁబహూకరించినై జకరుణనా
ర్ద్రి యడంగఁజేసి కడహుం,క్రియ కన్నడ లేపె నవ్విరించిని గ్రుధచేన్.
చ. ఇరువురఁ గాంచి యిట్టు లనియెఁ బరమేశుఁడు మీర లిర్వురి
వ్వరుసమహాధికారమదభారమునఁ గడు విఱ్ఱవీఁగి నా
రరయఁగ సిగ్గునొందఁ దగునట్టిది లే దధికారివర్గ మి
క్కరణిని విఱ్ఱవీఁగుటయె కానఁబడుంగద విశ్వసంతతిన్. 370
క. పరికించి నాదువైభవ, మురుతర మని నమ్మి బోధయుక్తిఁ జెలంగెన్
హరి,యీ బ్రహ్మయొదుర్మతి,పరిణతివ్యాజంబుఁబూనిపలికెననృతమున్.
క. నను గలిసేయ నైదవ, దనఁదగుశీర్షంబు ద్రుంచి యత్తఱి గర్వం
బును మాన్చితి మరలందన,దినయారతిశిక్షితుఁడుగఁ దానయ్యెఁగదా?
తే. ఇద్ది మూఁడవ యపరాధ మెట్లు నైనఁ
దగినదగు దుష్టవృత్తి నీతంపు విడువఁ
డింక భూమిఁబ్రతిష్ఠలే కీతఁడుండుఁ
గాక పూవిది యనృతవాక్యంబుపల్కె. 373
క. కనుకం గేతకి యిఁక మీఁ, దనాదు శీర్షంబునందుఁ దా నుసుపంగా
గనఁజాలకుండుఁగావుత, మని యిటు శపియించిప్రీతిహరిఁగని పలికెన్.
తే. సుప్రసన్నుఁడనైతి నీశుభ్రభక్తి
మెచ్చుగూర్చెను మదికి నోసచ్చరిత్ర
భయము నొందకు మిఁక నాదు వపువునుండి
జననమందితి వైతివి సాత్త్వికుఁడవు. 375
సీ.మాహేశ్వరులయందుమన్ననఁగాంచితివగ్రగణ్యుఁడవయియఖిలజగము
లందుబూర్వమురీతి ఖ్యాతిఁగాంచుముభక్తిహాని నీకెప్పుడేనూనకుండుఁ
గాక నాపయిఁ బ్రతిక్షణమందు వృద్ధినేగాంచుచునుండెడుఁగాకయద్ది
ముక్తికిహేతువై పొలిచెడుఁగాకయం చాదిదేవుండు భక్తాగ్రణ్యుఁ
తే. డై యహంకృతిశూన్యుఁడౌ హరిని గాంచి
కరుణ వరమీచు భీతిల్లి కంజభవుఁడు
వందనంబు నొనర్చి స్తవంబు సలుపఁ
బూనె నాత్మీయదోషంబు బుద్ధిఁ దలఁచి. 376

## షోడశాధ్యాయము.



### బ్రహ్మ శంకరు స్తుతించుట.

క. దేవా! నీయైశ్వర్యం, బీవిధమని తెలిసికొనఁగ నెవ్వనితరమౌఁ
దావక పూర్ణానుగ్రహ, పావనభాగ్యంబు మదిని భాసిలకున్నన్. 377

వ. వాక్యంబు లకర్తృకంబులు. నీయైశ్వర్యంబు నిరత్యయంబు. స్తుతింపఁ దరముగామి నెఱింగి దూరమునుండి నమస్కరించుచున్నవి. వేదోపనిషత్తులగతి యిట్టులుండ విష్ణువు నేను దిక్పాలకులగు నీవాసవాదులు నెంతవారము. 378

తే. సర్గరక్షణకార్యముల్ శర్వ నీవె
పార్వతీనాథ! మేమెల్లఁ బశువులముగఁ
బశుపతిగ నీవు తలపంగ భద్రమగును
బాశములఁ గట్ట విడువ సర్వేశ నీవె. 379

చ. ఇరువదియాఱుతత్త్వము లవే భవదంగము లెల్లతావులన్
బరమశివా! కనంబడుచు భాసిలుచుండువు కోవిదుండ శం
కరుమహిమం బెఱుంగఁదగు గాటపుశక్తిగలాఁడ నంచు నె
వ్వరుస వచింపఁగాఁ దగినవాఁ డెవఁ డారయఁ గానరాఁడుసూ. 380

చ. నిగమములెల్లఁ గుక్కలయి నీవెనువెంటఁ జరింపఁ గామమౌ
దిగఁదగు సత్త్వమట్కమును ద్రెంపఁగ వ్యాధుఁడవై మనంబునన్
మృగయను సల్పఁ గౌతుకము మిక్కిలి నొందుదు విట్టి నిన్నెఱుం
గఁగఁ దగువాఁడు లోకములఁగల్గునె చూడఁగ నెన్నిభంగులన్. 381

మ. మును దక్షాధ్వరమందు శంకర! భవత్పుత్త్రిందు నీయాజ్ఞఁజే
సిన శిక్షం గనియున్నవారము భవచ్చిత్తంబునం దావిడం
బన యొక్కొక్కపు డావహిల్లునది యిబ్భంగిం బ్రవర్తిలునం
చన శక్యంబగునే మహేశ! భవదీయం బౌను విశ్వౌఘముల్. 382

తే. ఎల్లబ్రహ్మాండములఁ గాల్ప నెన్ని నీవు
కాలపావకరూపంబుఁ దాలుతుగద

పుష్పచాపునిఁ బోషింపఁ బూను టెన్న
శేముషియుఁ గుంటువడియెడు సిగ్గుకతన. 382

క. అపరాధి జలంధరుఁ డీశ! పరమశూలంబుచేతఁ జంపఁబడియె దై
త్యపతి యనంబడు నంధకుఁ, డపారబలుఁడో యముండు హతులైరికదా?

క. ప్రతివీరుఁ డెవఁడు నీకు జ, గతిఁ గ్రూరతరం బనంగఁ గ్రాలువిషము ను
న్నతశక్తిఁ గంఠసీమను, స్థితిగాంచఁగ నిల్పవేని శివ నీవు కృపన్.

క. మేమెల్ల జీవితంబున, దేమాడ్కి ధరించియుందు మీశ్వర! మున్నా
త్మామరమానుల దారుక, నామకవనవాసుల సుమనస్సుల నెల్లన్. 386

క. కేవలకర్మఠులనుగా, భావించుచు ధూర్తవేషభాషలదయచే
నీవే క్షోభిల్లంగాఁ, గావించి యనుగ్రహింపఁగా లేదె హరా!. 387

సీ. అత్యంతభయద మానట్టియపస్మృతిఁ గాలిచే ద్రొక్కి నిక్కమగుశక్తి
నీవడంపకయున్న నీవిశ్వమంతయుఁ దద్వ్యాప్తినెంతయుఁ దమసు గ్రమ్మ
నడఁగియుండునుగాదె యర్ధనారీశ్వరరూపంబు నీవిట్లు చూపకున్న
సృష్టికార్యం బెట్లు చేయఁజాలుదు నేను దేవేంద్రుబాహువు దివ్యశక్తి
తే. నీవు స్తంభింపఁజేయవే నీమహత్త్వ
మెట్టు లెఱుఁగంగఁజాలుదు మేము శర్వ
బాహు వద్ది జయస్తంభభంగి నుండఁ
గాల మెంత గతించెనో గానరాదు. 388

వ. హరియు నాత్మరుధిరంబున భిక్షుకకపాలంబు నిండించి శూలంబునఁ
బైకెత్తి మూర్ఛిల్లుట నీ వవధరింపుము. సర్వశస్త్రాస్త్రంబుల నీవీయ
కున్న జమదగ్నితనయుం డాత్మక్రోధానలంబు నెట్లు చల్లార్పఁ జాలి
యుండు? 389

చ. వరహరి కోపఘూర్ణనయనంబుల నొక్కటఁ బెల్లురేఁగఁగా
శరభమృగాకృతిం గొనుచు శంకర! నీవు తదీయపౌరుషం
బురవడి సంహరింపకయె యూరకయున్న నతండె రాక్షసే
శ్వరుగతి లోకజాలములఁ జంపయుండునె మే మెఱుంగమే. 390

వ. కల్పాంబుధియందుఁ జెలరేఁగినమత్స్యకచ్ఛపంబులఁ గైవర్తరూపంబున నీవ హిరణ్మయసూత్రంబులబంధించి యాకర్షించితివి. *సూకరనృసింహరూపుం డగుహరిని నాగపాశంబుల బంధించి యుద్రేకం బడంచితివి. ఏకోనపద్మసాహస్రంబున స్వకీయనేత్రంబున నిన్నర్చించు శ్రీనాథునకు సుదర్శనం బొసంగి దైత్యవైరిం గావించి సఫలమనోరథుని గావించితివి గాదే అట్టి నీకు నమస్కరింతు నని పలుకుటయు. 391

చ. వనరుహనేత్రుఁ డవ్విధి స్తవంబులఁ దన్పెడు బ్రహ్మఁ గాంచి నె
మ్మనము దయార్ద్రమై తగ నుమాపతి వేఁడిన నంత శంకరుం
డనునయమూని సృష్టిదగు నట్టి స్వకర్మము నాచరింపఁగాఁ
జను నను చున్ వరం బొసఁగె సారససూతికి నెమ్మి మించఁగన్. 392

క. ధరణీసురు లొనరించెడు
గురుముఖములయందుఁ బూజఁగొను భాగ్యంబున్
హరుఁడు ప్రసాదించెను వా
రిరువురు సంతోషమంది రీశునిదయచేన్. 393

చ. ప్రమథవిభుండు వారిరువురం దమిమీఱ బహూకరించి నె
య్యము దళుకొత్త నిట్లనియె న్యాయ్యమురీతిని వర్తిలందగున్
సమయమునం దెప్పుడును శత్రువు మీకగుగర్వ మిట్టి చం
దమున వహింపఁబూనకుఁడు నన్నుగురూత్తముగా స్మరింపుఁడీ! 394

ఆ. సర్గరక్షణములఁ జక్కఁగా నొనరింపుఁ,డీప్రదేశమందు నిట్లు మీకు
నే ననుగ్రహంబు నెఱపితిఁ గావున, క్షేత్ర మిది కనం బవిత్రతమము.

చ. మనుజుల కిద్ది మోక్ష మనుమానము లేక యొసంగుఁగాక యో
జనములు మూఁడుసీమ యనఁజాలెడు దీనికి నిందు వాసమే
జను లొనరింత్రు దీక్ష వెలిసల్పకయుండిన నాదులోకముం
గనుదురు నాదుశాసనమె కారణమై తగు దీని కంతకున్. 396

క. స్థావరములు తిర్యక్కులు, పావనములుగా గణింపఁబడుయత్నములే
కావహిలున్ మోక్షేచ్ఛయు,నాపరమహిమంబువలననైజముగాఁగన్.

* నృహరిం శరభాకారస్సమహర్షిన్నచేద్భవాన్, స ఏవ సంహరేద్విశ్వం హిరణ్యకశిపోరపి, ౧౭.

ఉ. దూరమునుండిచూచినను దోరపుభక్తి స్మరించినన్ జవం
బారఁగ మోక్షకాంక్షఁ దగునట్లు లొనర్చెడు జ్ఞానసిద్ధి చే
కూరుఁ బ్రయాస మేది యొనఁగూడకయే; సకలార్థసిద్ధులుం
బూరుషరాజికిం గలుగుఁబొందెను మూమకమూర్తి యీస్థలిన్. 398

క. స్థావరమై తైజసినాఁ, గా వర్ధిల్లుచు స్థిరత్వకలన మెఱయుచున్.
బావనతమాఁరుణాద్రిగ, నీవసుధన్ ఖ్యాతిఁ గాంచు నిత్యవిభూతిన్.

చ. ప్రళయమునందుఁగూడ జలరాసులు దీనిని ముంచఁజాలవూ
ర్మ్ముల వెలయించిరైనను; మరుత్తులు సప్తక మీస్థలంబునే
చలనము నొందఁజేయుటకుఁ జాలదు కాల్చఁగఁజాల వెట్లు వ
హ్నులు వినుఁడీమహాత్త్వము వినూత్నము మత్కరుణైకలబ్ధముల్.

తే. ఇద్ది జోతిర్మయంబన నెసఁగు లింగ, మెల్ల జ్యోతిస్సులందుని దెన్నసతుల
మెల్ల ఖేచరసేవిత మిద్ది; దేని, నుద్ధరింపఁ దలంతు న దొప్పు నిందు.401

సీ. దేహాంతమున నేల దేహుల కిట నుపనిషదోఘవాక్యముల్ నేర్వకుండ
ముక్తిఁగల్పించితి భూధరం బిది దూరముననుండి మ్రొక్కిన భూరిభక్తి
జెంతను జేరి సుచిత్తము దగఁ బ్రదక్షిణ మొనర్చిన గురుశ్రేయ మొసఁగుఁ
బాపాత్ములకుఁగూడ శ్రీపతీ! పద్మజా! యనవరతంబు మహాత్ములకు ని

ఆ. వాస మిందుఁగల్గు భద్రదం బటుగాన, స్థలము దీనిమాని జనఁదలంపఁ
గూడ దెట్టివారు కూడ నొకప్పుడే, ముక్తిఁగోరి క్షేత్రమున నడెందు.

చ. ఇరువురు మీరు గూడ నిట నెంతయు వేడ్క వసింపుఁ డీమనో
హరతమ మిద్ది యూట నని యాదృతిమీఱఁగఁ బల్కుచున్న శం
కరునకు వందనంబు లిడి కంజవిలోచన కంజసూతు ల
త్తరుణమునం దహంకృతి నితాంతము దూరముగాఁ దొలంగఁగన్.

ఆ. విన్నవించి రిట్లు సన్నుత మిది జగ, త్తునకు నీదుకరుణఁ దనరెఁ జుమ్మ
హర్ష దంబు నగుచు నాధారభూతమై, ధరణిధరము కాంతిధామ మగుత.

సీ. తన్మోధరం బియ్యది సామాన్యగిరు లట్లు
గాక శంకర తేజ మీాకరణిగ
నొలసియుండుట నుత్తమోత్తమంబయి యభే
ద్యమహిమ మొప్పు సద్యశోములకు ని

ధానమై నిజతేజ మూని లోకసమృద్ధి
కాదికారణమయి యలరుచుండఁ
బ్రతివత్సరమునందుఁ బరమహా కార్తికి
కం బనుమాసమందుం బటిష్ఠ
తే. ఫలదకృత్తికలందును భాస్కరాస్త
సమయమునఁ బూజచేయంగ సమధికఫల
దమగుఁగాక భవచ్ఛాసనమున నెల్ల
మానవులు పూజసేయువా రూనినతము. 405
క. దీని యుపత్యకదేవా!, మానవులం గావఁ బూని మహాప్రార్థనముం
బూని ఫలాన్వితమౌనటు, గా నిల్వఁగవలయు నీవు కలకాలంబున్.
ఆ. లింగరూప మూని సంగతి నీభూమి,కొనఁగవలయు దాని నెనఁగుభక్తి
బూజచేయుచుందు మీజగచ్ఛ్రీయార్థ, మేము శోణగిరిశ నీమమలర.
సీ. అభిషేక మొనరించి యనులేపనాదులౌ
నుపచారములను శాస్త్రోక్తములను
సహచార నాగకేసరములు పున్నాగ
కురవకారగ్వధసురుచిరతర
మాలూరపాటల తమ్మోరుహంబులు కాన
నిండె వాసముచేయ నెంచవలయుఁ
గరుణాకరా! భవచ్చరణభక్తి దృఢంబు
గా నెనంగుచు నుండుఁగాక నీయు
ఆ. పాసనమున వేఱుపద్ధతిచే మన, శ్శుద్ధిగలుగ దట్టి శుద్ధివృద్ధి
యగుట కిందు నీవు హరితేజోలింగ, తనువు గ్రాల నిల్వఁదగు మహేశ!
వ. అనాద్యవిద్యావృత్తికొఱకు నెవండు నిత్యనివాసంబు చేయునో యరు
ణాచలపూర్వదిగ్భాగంబున నాభాగంబే యుత్కృష్టంబై యుండు. ఆ
భాగంబే శంకరునకుఁ బ్రీతిదాయకంబు.సాంగవేదంబులు ధర్మశాస్త్ర
పురాణశివాగమంబులు నీచేతనే నిర్మితంబులు. భక్తులనిశ్శ్రేయ
స్సంపత్తికొఱకు గురురూపుండవగు నీచేతనే నిర్మితంబు లని యెఱుం
గుదుము. ఇరువదెనిమిది విఖ్యాతాంగమంబులు శైవంబులు, వాని

యందుఁ జెప్పఁబడినపద్ధతుల దేని ననుసరించి ని న్నారాధింపందగునో
దాని నానతీయవలయు, అజ్ఞానజనితార్తిని బొందకుండ నాయుపాసన
యుండం దగునని ధాతృగోవిందులు పాదపద్మంబులపై వ్రాలి
ప్రార్థించుటయుఁ గరుణామూర్తి యగుపార్వతీపతి యిట్లనియె. 409

క. అడుగంగఁ దగినదానినె, యడిగితి రిది నాకు సమ్మదావహమే యౌ;
నుడుగనిభక్తిని నన్నిటఁ, దడయక గొల్వుండు మేలు తప్పక కల్గున్.

సీ. కామికోక్తం బగుఖ్యాతమార్గంబున సేవింపుఁడీ నను జిత్తశుద్ధి
కలుగునుమీకుదప్పకమాన్యులార యాశైవసంహిత మోహభావమూన
కుండఁగా నొనరించునిండుఁ గోర్కెలు ఫలసంసిద్ధి నాసుప్రసాదమునను
మఱువక మీరునామాటలఁ దలఁపుడీ యనిపల్కి వారలుకనుచునుండ

తే. శంభుఁ డంతర్హితుండయ్యె సరగ నపుడె;
మంగళాలయమై తగులింగ మొండు
కానఁబడె నందు దానిని గాంచి నార
లచ్చెరువునొంది నతు లిడి రార్తి వదల. 411

క. వినుతించిరి లింగేశ్వరు, మనముల నుప్పొంగు వేడ్క మహితానందం
బునుగూర్చునాలయోత్తమ,మునునిర్మించిరి సుశిల్పముగఁ జిత్రముగన్.

ఆ. విశ్వకర్మ యట్లు విష్ణుసరోజసం, భవుల నాజ్ఞఁ బూని భవన శాల
యంబుఁ గట్టె నచట నతిపావంబగు, కొలను ద్రవ్వఁబంచి రలఘుతరము.

క. హరు నభిషేకార్థము పు, ష్కర మెప్పుడు వాయకుండఁ గమ్రసుతీర్థో
త్కరమయముగ నవ్యంబై, పరమంబై తనర నద్ది భవముత్ప్రదమై.

క. అరుణాహ్వయమున నొప్పెడు, పురమున్ నిర్మించిర ద్ధషోడఁగనినన్ శం
కరుఁ డెదఁ గైలాసంబును, స్మరింపకుండంగఁ జాలు సరణిగ నచటన్.

సీ. అందు బ్రహ్మర్షులు నమరులు గంధర్వు లచ్చరల్ సిద్ధవిద్యాధరులును
యక్షులు పౌరత్వమందిరి కూపమ్ము లగుచు తీర్థమ్ములం దమరియుండె
గంగాదినదులు నక్కరణిగ నివసించె నందాదికోపవనములు సదన
సంఘోపవనములై సతతవాసంబున నానందముందంగ నాత్మఁ దలఁచె

తే. స్వర్గలోకము గోనివాసత నమరె మ
హాగమంబులు పౌరత నమరియుండె.

శైలములు గోపురత్వము లీలనొందె
స్మృతులు విధితను దత్పురిఁ జెలఁగుచుండె. 416

వ. భూతప్రేతపిశాచ బేతాళకటపూతన ప్రభృతులు మానుషదేహం
బులం బడసి క్రొత్తవారుగాఁ దిరుగుచుండి రంత. 417

చ. హరుఁడును సిద్ధరూపధరుఁడై ప్రమదంబున యోగి తెఱగనం
గరము కుతూహలంపడుచుఁ గంజజుముండము గోచి దాల్చి యె
వ్వరికి నెఱుంగరాక పురవర్యమునందు సమస్తవీథులన్
దిరుగుచునుండె దివ్యమగు తేజము గ్రమ్ముచు నుండ నెల్లచోన్.

క. హరివిధులు భస్మధారణ, నిరతిం గని జడలఁ దాల్చి నిశ్చలశాంతిం
బరము నరుణాద్రినాథుని, జిరకాలము భక్తిఁ బూజచేసిరి నియతిన్.

తే. అందునివసించువర్ణంబులలరునట్లు, వారియాచారములకునెబ్బంగిగనిన
నుంతయేని విరోధంబు సోఁకకుండ,నాచరించిరి పూజల హరున కందు

క. గురువులు తార్పై యొటఁగల,పురుషులచే దీక్షలెల్లఁ బోలఁగఁ జేయిం
చిరి నిర్మాల్యవిసర్జన,ము రహిన్ విని చెప్పునట్టిపోలిక మీఱన్. 421

సీ. చేయించి రాగమాశ్రితరహస్యంబుల నెఱిఁగినవారొట నిట్లు వారు
జరపి ప్రాతస్స్నానసరణిని బుష్పపత్త్రిఫలాదికంబు సంగ్రహమొనర్చి
యరుణాచలేశ్వరు నభిమతమంత్రము కోరినవారలకోర్కెఁ దీర్చ
నుపదేశ మొనరించి జప మొనరుచు నట్లొనర్చిరి మంత్రమనంగసర్వ

తే. మంత్రవర్యంబుగా నంత మంత్రయుక్తి
ధూపదీపనైవేద్యగీతులను నృత్య
వాద్యనిస్వనముల నమోవాకములఁ బ్ర
దక్షిణంబుల ముద్రాప్రదర్శనముల. 422

క. విమలాసనార్పణమ్ముల, సమత్రకంబులను శాస్త్రసరణి రవంతేఁ
గ్రమమును దప్పకయుండఁగ,నమరించిరి సాంబమూర్తి కర్చల భక్తిన్.

వ. పంచబ్రహ్మషడంగాదుల శివు నారాధించుచుండిరి. ఇట్లు పదాఱువేల
సంవత్సరము లాయరుణాచలేశ్వరు నారాధించిరి. అట్లు లారాధించు
నాబ్రహ్మవిష్ణువుల సేవించి యితరులు శివజ్ఞానంబు నార్జించిరి. 424

చ. ఇది శివు నర్చనక్రమ మహీనవిభూషణభక్తిధుర్యుఁడై
పొదలు శిలాదునుండి కడుమోదమునన్ వినినాఁడ దీని నే
నది యటులే వచించితి మహాముని! యింకెది వీనులార నా
వదనమునుండియే వినఁగ వాంఛను బూనెదొ తెల్పఁగాఁదగున్. 425

---

## స ప్త ద శా ధ్యా య ము

శివపార్వతులవిహారవర్ణనము

చ. అని తెలియంగఁజెప్పి ప్రమదాంబుధి మున్గెదు శౌనకాదులం
గనుఁగొని సూతుఁ డిట్లనియె క్ష్మాసురమౌనివరేణ్యులార! యి
ట్లని వచియించు నందిఁ గని యమ్ముని యిట్లని వేఁడె నీముఖం
బున వినినాఁడ శంకరుని పూజ్యమహత్త్వము నందికేశ్వరా!. 426

క. ఐనను గౌతూహలమును, బూనుట మఱియొక్క విషయమును జక్కంగా
నేను నిటగల్గుభూసుర, మానులు వినఁగోరుదుము సమంచితభక్తిన్.

ఉ. గౌరి యదెవ్విధిం దప మఖండమహత్త్వము గల్గియుండి యు
పార నొనర్చె దాని తెలగంతయుఁ జెప్పుము నాఁగ నంది వే
సారకప్రీతి నిట్లనియె సర్వముఁ దత్కథ నేను విన్నయ
ట్లే రహిఁదెల్పువాఁడ విను మీయవధానముతోడఁ దత్కథన్. 428

క. తెలియంజాలుదు వక్కథ
నెలమిన్ దాక్షాయణిన్ మహేశ్వరుఁ డెటు పెం
డిలియాడెనో లోకములం
గలసతులకు మేలుబంతిగాఁ దగుకన్యన్. 429

క. పతికపకృతి నొనరించిన,పిత దక్షునిగ్రుధను దిట్టి పృథుయోగాగ్నిన్
క్షితిభసితముగాఁ దను న,చ్యుతశక్తి నొనర్చె దాని నొగివింటిగదా.

చ. పిదప హరాజ్ఞమాళి నిడి పెంపుచెలంగఁగ వీరభద్రుఁ డె
ట్లొదవిన కోపవహ్ని నమరోత్కరముం గడు నొంచి మించుచున్
మొదలిడినట్టి యాక్రతువు పూర్ణముగాఁగ నశింపఁజేయుటల్
విదితముగాదె దక్షుతల వేతెగవ్రేయుట ఖడ్గధారచేన్. 431

ఆ. పద్మసంభవునకుఁ బద్మాక్షునకు నింద్ర,ముఖులకెల్ల శిక్ష పూని వీర
భద్రుఁ డటనొనర్చుపద్ధతియును విని, యున్నవాఁడ వీవు సన్నుతమతి.
సీ. కంజాప్తునకు దండఘాతమువహ్నికి హస్తపాటనముశ్లైదిత్యాదులకును
గల్గిన యవమతిఁ గడఁగి వింటివిగాదె; యా దేవిహిమవంతునమలగేహ
మందుఁబునర్జని నవధరించెనుగదా యుమ యనఁ బార్వతియుననునామ
ములఖ్యాతిఁ గాంచె; నాపురహరుం డాకన్యస్థాణువనంబున ధర్మరీతిఁ
తే. దనకుఁ బరిచర్యచేయ నీకొనియె నేక
తంబ యావ్యాజమునఁ బుష్పధన్వుఁ డేచి
విరిశరంబుల నొప్పింప విభుఁ డెఱింగి
కాలవహ్ని మదనునిఁ గాల్చె యంత. 433
క. ఇచ్చోనుండఁగ రాదని, హెచ్చినపూన్కి నిబరేశుఁ డేచటికొ గణముల్
హెచ్చరికలఁ దనుఁగొల్వఁగ,నచ్చటువాసియె చనంగనంబికయంతన్.
ఆ. నిర్జితేంద్రియుఁ డగునీలకంఠునిఁగాన,కందెయుండి నీమ మలరఁ దపము
నాచరించి శివుని హర్షింపఁగాఁజేసెఁ బరమశివుఁడు తృప్తినటులవచ్చి.
చ. అతివను బెండ్లియాడి ప్రణయంబున మానసముం గలంచు నా
రతిపతి గెల్వఁ గేళులవిరాళిని బాపఁగఁ దేల్చె నింక స
న్మతిఁ దగుశాంతినూనినను మానిని వీడకయుండు మంచు నా
దృతి వచియించె హైమవతి యెంతయుఁ దృప్తిని చేలె నంతటన్.
చ. రతియును నాథుఁ డీల్గుట విరాళి తనుక్ వ్యథపాలుచేయు దు
ర్గతి నిడఁజాలి సన్మతిని గల్మషవంతముచేయు భర్తృహీ
నతఁ గడుశోకమంది గిరినాథుని పుత్రిని వేఁడె నమ్మరో!
పతి గనుభాగ్య మిమ్ము ననుఁబాలనచేయుము ప్రీతిమీఱఁగన్. 437
క. అని వేఁడి తపోబలమున,ననంగుభార్యయును గామమంతట హెచ్చె
తనువును బాధింపఁగఁ జే,సిన నీశుం డార్తినొందెఁ జిత్తములోనన్.
తే. అపుడు హిమవంతుఁడును భార్యయైనమేన
వెంటరాఁబోయి పార్వతి వినమనయనుఁ
దోడుకొనివచ్చె నింటికిఁ దోరపుఁ దమి
వారు సుఖ ముండి రందు విహారగతుల. 439

క. అత్తఱి శుంభనిశుంభులు, చిత్తంబుల నీమమూని చేసిరి తప మా
యుత్తమతపమున కెంతయు, మెత్తంబడి బ్రహ్మ యిచ్చె మేటివరంబుల్.

క. సురదానవమర్త్యులలోఁ, బురుషుఁడునను జంపకుండఁ బొలుచుబలంబున్
గరుణింపుము సరసిజభవ, దురమున నాకనుచుఁ గోరఁ దోషజభవుఁడున్.

చ. వరము నొసంగె నప్పగిది వారికి నవ్విధమెల్ల దేవతో
త్కర మెుగి నాలకించి వితతం బగుసాధ్వస మంకురింప శం
కరుఁ గని పత్నినిన్ గిరినికాయవరేణ్యభవన్ మహామతిన్
శరణ మొసంగఁజాలు గురుశక్తి సమన్విత నప్పురాంబికన్. 442

చ. కనుఁగొను శంభుఁ గాంచి! సురకాండము నార్తిని బాప నీవె ది
క్కని చనుదెంచినార మనఁగా విని చక్రధరాదులన్ ముదం
బునఁ గని పల్కె నిట్లు భయముం గననేటికి! సర్వకాలమం
దొనరుతు వారికిం దగినయుత్తమశాస్తిని జూచుచుండుఁడీ. 443

క. దానన్ వారలు మృత్యువు, గానం బోవంగఁ గలరు కావున భయముం
బూనకుఁ డీఁక నని దమినీ, శానుం డని యంతిపురిని జాయాయుతుఁడై.

ఆ. చొచ్చి దేవితోడ నిచ్ఛమై విహరించె
నొక్కనాఁడు వేడ్క యుబ్బ నర్క
లక్ష్యమైన ప్రీతి లలితాంగిఁ గని కాళి
యనుచుఁ బల్కె నింద యనుచుఁ దోఁప. 445

చ. విని గిరిజాత శంకరుని వేడ్కఘటింపఁగఁ జేయఁగాఁ ద్యజిం
చెను దనమేనిచర్మమును జెచ్చెర నెం దది స్వేచ్ఛమైఁ ద్యజిం
చెనొ యలభూమి పావనతఁ జెంది మునీశ్వర యోగసిద్ధిదం
బనుపెను ఖ్యాతిఁ గాంచుచు మహాముని సేవితమయ్యె నోమునీ!

వ. మహాకాళీప్రపాతాఖ్యం బను క్షేత్రోత్తమం బయ్యె నది యని యెఱుం
గుము. ఆత్వక్కు కౌశికి యనుపేరఁబరఁగు కాళియై వింధ్యాద్రివాసిని
యయ్యె. తపస్సుచేయుచు నాదేవి కాముకులగు నాశుంభనిశుంభులం
జంపె.

ఉ. గౌరియుఁ దన్మనోజ్ఞగిరి కాంతునికూటమునందు నుండియే
సారతపఃఫలంబన నెసంగినగౌరితఁ బ్రాణనాయకున్

గోరికలూరఁ గేళుల నికుంజతలంబులఁ దేల్చి దాహ్యాద
శ్రీరమణీయుడై కనియె శ్రీగజవక్త్రుని నాషడాననున్. 448

చ. వరుసగఁబుట్టి యిర్వురను వారు మహాగమవేత్త లాచు నా
సరసిజనేత్ర పంకరుహాసంభవులం గని పూర్వమందు మీా
రిరువు రొనర్చియున్న పరమేశుని గూర్చినదోషజాలమున్
బరుగిడఁజేయ నేర్వఁదగుభవ్యతమాగమపంక్తి శ్రద్ధఁగన్. 449

క. అని బోధించిరిమఱియా,తనయులు తలిదండ్రు లెంతో తమిఁ జూడంగా
మనములు హార్దాంభోధిన్,మునుఁగంగా జేసి రెంతొ ముచ్చటలొప్పన్.

సీ. గౌరియు శివుఁడు నొక్కట విపంచీభవ్యనాదంబులన్ మఱి నవ్యచిత్ర
లేఖనంబుల సై్వరలీలలమండనంబుల దివ్యసల్లాపములను జిత్ర
వస్తుదర్శనముల బలపౌరుషంబులఁ జెలరేఁగువారి క్రీడలవినుటను
బుష్పాపచయములఁబొలుచు ఖేలనముల విహరించి రెంతయు వేడ్క-మిగుల

తే. డోలికా కేళులను మఱి తేలుచుండి
రంత మైనాకుఁడును దుహినాద్రివరుఁడు
తమ్ము మర్యాదలం గడుఁదన్ప మోద
మందుచుండిరి సంతత మాత్మలందు. 451

క. ద్యూతవినోదంబుల వర,గీతంబుల దానలీలఁ గేవలతృప్తిన్
బూతమతు లొందనుండిరి, శ్రీతరుణీవల్లభాదిసిద్ధిదు లగుచున్. 452

వ. ద్యూతనిర్జితుండై యుత్సంగమందుండి వలయీాకృతుండగు నేణాంకుని నుమయుఁ దాటంకీకృతనై యూఅడించె. ఇట్లు చరాచరపితరులు కనకాచలాదిప్రదేశంబుల నింకను సురుచిరప్రదేశంబుల నిచ్ఛావిహారంబులం జాలకాలం బుండి రంత. 453

---

## అష్టాదశాధ్యాయము

### పార్వతి యరుణాచలేశ్వరు సేవించుట.

తే. గేస్తుతనముపహించి యాగిరిజ యేక
చూతతలవాసినై యుండుభూతపతికిఁ

గమ్రుపక్వాన్నపానముఖంబులైన
వాని నర్పించుచుండె సద్భక్తి తనర. 454

సీ. అక్కడ శివుఁడు సంధ్యానుసంధానస
మ్ముకుళీకృతాక్షుఁడై పూనియంజ
లిని యోగపరతనుండి నఁబార్వతీదేవి
కని యెంచె నిక్కాల గళుఁడు సుంద
రాంగిని దేనినో ధ్యానించు నిత్తఱిఁ
గాకున్న నన్ను నేకాంక్షమీఱఁ
బ్రేమించుచున్నాఁడో యీమార్గ మరయఁగా
వంచనమే యని యెంచఁదగును

తే. దెలియ నెట్లగుఁ బురుషులధిగతమగు
కుటిలవర్తన; మీతండు పటుతరమతి
యగును మిథ్యోపచారముల్ తగినరీతిఁ
జేయఁగలవారియందెల్ల శ్రేష్ఠుఁ డగును. 455

క. నను వంచించెను దక్షుం, డనఁదగు మిథ్యోపచారహర్షం బిడఁగా
మనమున దాక్షిణ్యం బీ,తనికిం గలదేని దాని దాఁచినవాఁడేన్.

తే. దేన సౌభాగ్యభాజనం బౌనొ స్నేహ
మద్దియే వృద్ధిచేయు నీహరుఁడు నన్నుఁ
గూర్చి యీనాఁటినుండి నీకు నరయంగ
దాసుఁడనె యైతిఁ గొంటివి తమము కలిమి. 457

క. స్మరవైరి యిట్లు నన్నుఁ, గరుణాపరతంత్రుఁడై నకరణిని వంచిం
చె రహీనిశ్చయ మీయది, హరుఁడీతఁడు వంచకుఁడె యగుననితలతున్.

సీ. దృఢచిత్తలై నట్టి తెలువమిన్నల కసమానానురాగు లౌమనుజులందుఁ
గల్గెడు సౌభాగ్యగర్వంబు పరిహాసమునకె యయ్యెడు నంచు భూధరవర
తనయయుఁ బ్రణయైక జనితరోషంబు జిత్తంబునఁ గుటిలతఁ జెందఁగ వద
నాబ్జంబు హవ్యవాహనకీల మట్లుగఁ గనన య్యె నంతటఁ గన్నుగవయు

తే. బాష్పవారిప్లుతంబయి పరమదారు
ణాకృతిం బూని యాతామ్రమై కనంగఁ

జాలియుండె; జలాపూర్ణనీలకుముద
యుగముభాతిఁ బ్రకాశించె నుగ్రకాంతి. 459
క. కనుబొమలనడుమఁ బెట్టిన, మనోజ్ఞరీతిం జెలంగు మహితతిలకమ
మ్మనసిజరుచిరశరాసన,మును రెండుగఁజేసినట్టిపోల్కి వెలింగెన్.
చ. మనమునఁ గల్గుభూరితరమన్యువుచే నధరచ్ఛదంబుకం
పనమునఁ జూడనయ్యెఁ గడుఁబంతమునం బగడంపురాశిలో
నునిచిన యయ్యశోకరుచిరోత్తమరక్తనవీనపల్లవం
బనఁగ భయంకరాకృతిని నత్తఱి నయ్యుమ గండయుగ్మమున్. 461
క. అరుణతవహించెఁ జూడఁగ, నరుదౌనటు శాణఘర్షణాయతకాంతిఁ
గరమలరు కెంపుటద్దము,కరణింజూడంగ నూత్నకాంతి వెలయుటన్.
చ. అతివ పయోధరద్వితయ మంతరమం దొగిఁ జంచలత్వము
న్నతగతిఁ బర్వఁగా మనమునం దలపోయఁగ వే వడంకె భృం
గతతియు లోఁ గదల్పఁగడుఁ గంపము నొందెడుపద్మకోశమే
యితరము కాదటంచు జను లెంచెడునట్లుగఁ గోపసంగతిన్. 463
చ. ధరణిధరేంద్రపుత్రికయుఁ దక్షిణమే యిటు లెంచె నంద మొ
క్కరణిని జూడ నాయెడను గన్పడకుండుట యన్యనారిపై
నిరతిని బూనె నిక్కరణి నీలగళుం డిఁక నిందు నుండరా
దరుగుట మేలు శంభు విడి యర్ధపుఁగార్యము లేమి నిచ్చటన్. 446
చ. తపమును బూనియే యిఁక నితాంతమనోరథభాగ్య మేను మా
నిపతులు మెచ్చఁ గూర్చెదగు నీలగళుండు నిమీలితాక్షుఁడై
యిప్పుడు చెలంగువాఁ డితని కించుకయే దెలియఁగరానియ
ట్లు పరుగువాఱఁగాఁ దగుఁ గడుంగడుమేలిది త్రచ్చి చూచినన్. 465
చ. తెలియఁగఁజేసి పోవఁగ మదిం దలపోయుదునేని శంకరుం
డెలమిని జూపుభూషణము లేర్పడఁబల్కును నాల్కసుండియే
వెలువడుఁగాని యవ్విపది వేలవిధంబుల నెంచి చూచినన్
వెలువడ వాత్మనుండి యిది వృత్తియె యీతని కౌటఁ దెల్లమా.
తే. పరమపావని గంగయూఁ బరమసాధ్వి
మన్ననలఁ దన్పుచుండుటమాత్ర మెన్న

సత్యమగు శంకరుం డన్య సారసాక్షి
యందుః జిత్తంబు నిలిపె నల్లాట నన్ను. 467

క. స్మరియింపఁ డించు కేనియు
నరుగుటయే లెస్స యంచు నంబ తలఁచి వే
మరలి శివాంతికముఁ విడి
త్వరఁబోయెను వ్యగ్ర యగుచుఁ దపమొనరింపన్. 468

తే. ఎచ్చటికిఁ బోవవలయునో యెన్నకుండ
బరుగువారలంగ నల్లేగుపార్వతిఁగని
జయయు విజయయు మాలినీసంజ్ఞకయుఁ జ
లావతియు మాల్యవతియు నా లలితమతులు. 469

క. జనకుఁడు పంపఁగవచ్చిన, తనసఖులే యైనవారితలఁ పెదలుఁగకయే
చనుచుండ వారలాదృతి, జని వారించిరి మనోజ్ఞసల్లాపములన్. 470

చ. నిలువకపోవుచున్నయవనీధరపుత్త్రిక వెంటఁబోయి రే
పలుకులు నిల్పఁజాలవని భావమునం దలపోసి యంత నా
జలరుహనేత్ర పుణ్యగిరిజాలము సాధుతపోవనంబులన్
లలితజలాశయాళి నదులన్ గనుచున్ జరియింపఁ బూనుచున్. 471

సీ. సహ్యపాదంబుల సంచరించుచు ద్రావి
డాఖ్య దేశోత్తరమందు వెలయు
దేశంబుఁ దరియించి తివిరి శక్త్యాపగఁ
గనుఁగొని విజయను గాంచి పలికె ;
ననతిదూరంబున నరుణాకృతిం బొల్చు
పర్వత మొండు కన్పడెడుఁ గంటె
శృంగాష్టకంబునఁ జెలువారి మాహాత్మ్య
మమరుచుండఁగ నిద్ది యతిమనోజ్ఞ
ఆ. మగుచుఁ జెలియ! దీని నగునుపత్యకలందు
దాపసాశ్రమములు ధన్యతమము
లెంతొపావనములు శాంతములును బుణ్య
కాననయుతములును గా వెలయుచు. 472

ఉ. చెంతకుఁబోయి వీనిడగుచెల్వము నింకను గాంత మిన్వినా
స్వాంతము దర్శనంబునఁ బ్రసన్నతగాంచఁగఁ జేయుచున్నవం
చెంతయు నూఅడిల్లు వచియించుచు వారలఁగూడి తద్గిరీ
శాంతిక మొందెఁ జేడియలు నామెనుగూడియె యుండి రంతటన్.

చ. కనుఁగొనియెం దలోదరియుఁ గమ్రతరాశ్రమ మొక్కఁ డందుఁ దం
తునికరమూర్ణనాభములు దొంతరమీఱఁగఁ గూర్చుచుండు భీ
తినిగలిగించు నక్రములు తెచ్చుచు నుండును శైవలంబులన్
గనుఁగొనఁ జిత్రమాకరణిఁ గన్పడెఁ గంటికిఁ గ్రొత్తఁజేయుచున్. 474

సీ. జంబుకంబులు శిశుసంతతులన్ గడ్డి
గింజలఁబెట్టి రక్షించుచుండుఁ
జమరీమృగంబులు చారువాలంబులఁ
గసవు కుప్పఁగఁ జేయఁ గడఁగుచుండుఁ
గారెనుఁబోతులుఁ కడుఁబూన్కి స్వవిషాణ
ముల హెచ్చుతగ్గుల గలుపుచుండు
వానరములు ప్రసవంబుల ఫలపుష్ప
ములఁ దెచ్చి యిచ్చుచుఁ జెలఁగుచుండు

ఆ. భల్లుకమ్ము లుచితభక్తిని మధుపత్ర
ములను దెచ్చియిచ్చి లలితలాస్య
ముల నొనర్చుచుండు భూదారములు శుద్ధి
యోగ్యమృత్స్నఁగూర్చుచుండు నందు. 475

క. కాకులు గూబలు వ్యాఘ్రానీకము జింకలు మృగేంద్రనికరమ్ము మహా
నేకపములు బర్హిణములు, భీకరసర్పవ్రజంబు పిల్లు లెలుకలున్. 476

ఆ. శ్యేన శుకము లొకటఁ జేరి స్నేహం బొప్ప
సంచరించుచుండు సరసగతుల
నించుకేని భయము నెఱుఁగక సతతంబు
గనఁగఁ దోఁచుఁ జిత్ర మనుచు మదుల. 477

చ. తరువులనందునుండి స్థిరధర్మము గావఁగ హోమ మొప్ప మహా
నిరమణు లగ్నియందుఁ గడునిష్ఠ నొనర్పఁగ హోమవస్తువుల్

గరఁగెడు వేళ సౌరభము గల్గఁగ దానిని గొంచు ధూమముల్
పరమపవిత్రముల్ వెడలు పట్టునఁ జూడఁగ నొప్పు నచ్చటన్. 478

చ. పరభృతముల్ పఠించుఁ గడుఁబంతము మీఱఁగ వేదరాశి శం
కరునిమహత్త్వముం దెలుపఁగాఁగలదానిని గాకముల్ మహే
శ్వరుస్తవముల్ వచించు మఱిశారిక లొయ్యన సామగానముల్
నిరతి నొనర్చు నంతయును నెమ్మికి లోపము లేకయుండఁగన్. 479

తే. శాకశాలిస్థలంబుల భీకరంబు, లైనవ్యాఘ్రంబులు చరింప ధేనువులట
సంచరించుచు నుండుస్వచ్ఛందగతుల, సాధ్వసంబన లేమినిసంతసమున.

క. ఏనుంగులు పుష్కరజల,మానుచుఁ దొండముల నిండ నర్కులఁదడుపం
బూనిచరించుచునుండును,మానిమహత్త్వంబుఁదెల్పుమాడ్కిఁగనందున్

క. ఆభవ్యతమాశ్రమమున,శోభనభాగంబునందు సుకృతనిధి యనన్
గా భాసిల్లుచుఁ దపమున్,బ్రాభవమొప్పారఁజేయు పరమమునీంద్రున్.

తే. సప్తవర్ణమహీరుహచ్ఛాయయందు
చిత్రమైన వ్యాఘ్రాసనాసీనుఁ డగుచు
బద్ధవీరాసనుండయి పావనకుశ
విస్తరంబు పయింబొల్చు వీతతమసు. 483

సీ. శాలిశూకారుణచ్ఛవిగల్గుజటలను ధరియించి భస్మము తనువునిండ
నలఁది చంచలత లేనట్టి విద్యుత్కాండకాంతిఁ బొల్చెడుశరద్ఘనమురీతి
గననొచునాసికాగ్రన్యస్తదృష్టియైసమముగానధరముల్ చలనమొంద
లలితరుద్రాక్షమాలను ద్రిప్పుచున్ బాణిభాగాగ్రముననప్డె బాగుచేయఁ

తే. బడిన యెండకయున్న యవ్వల్కలములు
తనువునం గానఁబడఁగ సంధ్యను ఘనంబు
గప్పఁ గన్పడు పర్వతకాంతురీతి
గానఁబడియెను హిమవంతుకన్య కపుడు. 484

వ. షడ్వర్గహింస్రబంధంబుకొఱకుఁ బఱువంబడిన వాగురవలెఁ గనం
బడు నుపవీతత్రయంబును హృదయగర్తంబున ధరియించియున్న
యమ్మానిం గాంచి కృతోచితోపచారయయి పార్వతి వినయంబున
నిట్లనియె. 485

చ. ధరణిధరం బిదెద్ది? మునితల్లజ! మీవరనామ మెద్ది? భూ
ధరమున నిందుఁ జేసెద వుదారతపంబును గారణం బెదో?
నిరతిశయప్రమోదమున నీవు వచింపుమ యన్న నమ్ము నీ
శ్వరుఁ డిటుపల్కెఁ బుణ్యగిరివారమునం దిది పూజ్యమాఁ జుమీ!

క. అరుణాచలనామమ్మునఁ, బరఁగుఁ గౌతముఁడ నేనుఁ బడఁతీ! మోక్షే
చ్ఛరహిఁ గల్గుటఁదపమున,హరుని సేవించువాఁడ ననియు త్తరముఁ.

ఆ. పలికి విజయలోను గలచేడియలనుండి
యుమగ నామె నెఱిఁగి యమలభక్తి
వందనం బొనర్చి బహువారములుగ నా
శ్రమముఁజేర్చి వేడ్క లమరుచుండ. 488

క. ఫలకందమూలముల నా, జలజాక్షికి నాతిథేయసత్కారంబుఁ
వెలయించి జగన్మంగళ,ములఁ గల్గింపఁగఁదపమ్ము పూనుము చేయఁ.

క. అని పురికొల్పుచుఁ దేజము,మును స్తంభాకృతిగ నున్న పోలికలెల్లఁ
ముని తెల్పియరుణగిరిమహి,మనుబోధించెనుయథార్థమహితముగాఁగఁ.

చ. జననిరో శోణశైలపతి శక్రునిదిక్కున నుస్థలం బొకం
డనఘునుసేవితంబుగల దచ్చటఁ దేజమె లింగరూపతఁ
గన నొనరించె శంకరుఁడు కాంచనచేలుఁడు బ్రహ్మలోనుగాఁ
గనఁబడు దేవనాయకులు కాంచుచు నుందురు దాని భక్తితోఁ.

ఉ. అందుఁ దపంబుచేయుటకు నర్హముగాదు మహేశ్వరీ! సదా
యింహాధరుండు తేజమున నెంతయు వెల్గును లింగరూపతఁ
విందొనరించుఁ గన్నులకు విశ్వవిభూత్తము నాజ్ఞలేక యే
నందు వసింపఁజాలక మహానియమంబున నిందుఁ జేరితిన్. 492

చ. ఇది యరుణాద్రిపాదమగు నిద్ది ప్రవాళధరంబు నా జగ
ద్విదితయశంబు గాంచినది వీతతమస్సున నొప్పుచుండుఁ బు
ణ్యాదవిపినావృతంబయి రహస్యవనం బనఁగాఁదగుఁ స్థలం
బిది మహితం బటంచు మది నెంచి త్రిలోచను నిందు నిల్పితిన్. 493

తే. ఇట యథాశక్తిఁ దపమున నీశుఁ గొల్చు
చున్నవాఁడ మదీయమహా నుటజమునకుఁ

జెంతనే యున్నదే నన్నక్షేత్ర మంబ
యందు నుటజంబు నిర్మించి హరుని గూర్చి. 494

మ. చిరకాలంబు తపం బొనర్ప మదియే సిద్ధిం గనంజేయునం
చురుకారుణ్యము మీఱ మౌనిపతి తన్నుద్యోగముం జేయఁగాఁ
బురికొల్పెన్ జతనంబుమీఱ నుటజంబున్ బ్రీతి నిర్మించి శం
కరుసంతుష్టు నొనర్పఁగాఁ దపము నాకాత్యాయనీదేవి తాన్. 494

క. ఒనరింపఁబూనె నిష్ఠన్, వినుతాత్మను సత్యవతిని విపిననివాసం
బున నున్నతపస్విని బూ, న్చను గావఁగ నాశ్రమంబు సిద్ధఫలదమున్.

వ. ప్రాగాదిదిక్కులం గాపాడ ధుంధుమారి యనుదేవతం బ్రతిష్ఠించె.
తపోవనంబు సర్వంబు రక్షింప ననర్గళస్ఫూర్తి యగుదుర్గను బ్రతి
ష్ఠించి యాజ్ఞానిర్వహణక్షమ యని యెఱింగి నియమించె నంత. 497

క. తరువాత హైమవతి సుర,తరువరమందారకుసుమదామార్హ్వంబై
పరమం బగుధమ్మిల్లము,విరతి జటాభరము దాల్పనియమించియటన్.

తే. హంసచిహ్నదశం బగునాదుకూల
మప్డె వదలుచు నతికోమలాంగియయ్యుఁ
బరుష మగువల్కలంబును గరము మోద
మందుచుం దాల్చెఁ దపము చేయంగఁగోరి. 499

చ. సుమములు గోయ గాసివడుచున్ వడకాడెడుకోమలాంగుళుల్
ప్రమదము గాంచఁజేసి గిరిరాజకుమారిక సూచిఁబోలు న
గ్రముగలయట్టి దర్భలను గ్రన్ననఁ గోయఁగ నెట్టి దేవికా
రమః గనకుండ నుండ మునిరాజహితోక్తుల గారవించుచున్. 500

తే. వజ్రసూచిక లట్లు నిర్భరములైన
కంటకంబులు నంతటఁ గల్గు బిల్వ
పల్లవంబులఁ గోయంగఁ బ్రమద మొందె
హరుని పత్ని శిరీషమృద్వంగి యయ్యు. 501

క. పావనమగు శ్రీనదియం దేవిధిమజ్జన మునస్సు హితముగ రాఁగాఁ
గావించుచుండె నిత్యం, బావిధముగ రక్తపంకజాళిదినకరున్. 502

ఆ. పూజచేయుచుండెఁ బుణ్యాదర్భాక్షత, తిలలఁ గూడియుండుజలముల రవి

కర్ఘ్య మిచ్చుచుండె నటు దేవర్షిపితృగణతర్పణంబు తగ నొనర్చు.

సీ. వాలుకామండలవాసునిగాఁ జేసి
సూర్యునిఁ గంజప్రసూనములను
బూజించుచుండె; నప్పొలిక్కుఁ బ్రదక్షిణము
లఁ జేయుచుఁ మేయిమ్రొక్కులిడుచు
శంకరు లింగవర్ష్మమున భాసిల్లఁగా
నిలిపి యాగమపద్ధతులనుమీఱఁ
బూజించె; నాసనమ్మున మూర్తిచేత మూ
లముచేత నంగములను దపనుని

తే. దండిపింగళముఖ్యులఁ దగినరీతి,శక్తులను దీప్తలోనగుసన్నుతలను
దత్తదాశాంతరములఁజంద్రప్రముఖుల,ధేనుముద్రాదికములను దెలివమిన్న.

వ. బహుమానంబుమీఱ నారాధించె. తేజశ్చండుని బూజించి నిర్మా ల్యంబు నివేదించె. అతిశుద్ధం బగునర్ఘ్యంబు నిడియె. ద్వారవాస్తువు నర్చించి యాసనాదు లిచ్చె. పిదప భూతశుద్ధి నొనరించి యంతర్యా గంబు నిర్వర్తించి హృదయంబునఁ బద్మాసనంబున నారాధించి జ్ఞాన ధర్మాదికంబులఁ బూజించి దళంబులయందు వామాదిశక్తుల నర్చించి దళాగ్రంబుల సూర్యవేధసులం బూజించి కేసరాగ్రంబుల సోమవిష్ణు వులను గర్ణికాగ్రంబుల నగ్నిధూర్జటులను, దదూర్ధ్వభాగంబుల శక్తిచక్రంబును నిలిపి పూజించె. చందనపుష్పాదుల నారాధించె. ధూపదీపాదుల నొసంగి మరలఁ బంచబ్రహ్మల షడంగంబుల నర్చించె. ఆయాదిక్కుల శక్త్రాదులను వజ్రాద్యాయుధంబులను నిలిపి సర్వోప చారంబుల నారాధించి యష్టపుష్పిక నిలిపి పంచవక్త్రంబుల నారా ధించి చండేశ్వరుం గొల్చి ప్రదక్షిణనమస్కారంబుల నర్పించి శివ పూజనం బొనరించె. శివాగమోక్తప్రకారంబున సౌభాగ్యదంబు లగుద్రవ్యంబులఁ బూజాంతమందు హోమంబు గావించి యంతట.

క. పరికల్పితోపచారో,త్కర యయ్యెడు సుఫలమూలకందంబుల నీ
శ్వరు నర్చించుచు నతిథుల, నరసి సమర్పించె భక్తి యలరారంగన్.

సీ. అంగుష్ఠమునఁ గొనయవని మోపుచు నిల్చి తపము నొనర్చె నత్తరుణి యంత
బంచాగ్నిమధ్యమభాగమునఁ గ్రీష్మమున శిశిరమునఁ జల్లనిజలముల
నిలిచి శశాంకుని నిర్మలపీయూషకరపానమునఁ దృప్తిఁ గాంచి మించి
వర్ష రాత్రులయందు వారిదంబులు ధారలనువడిఁ గురియంగఁ దనుదడియఁ
తే. గదలకయె నిల్చి చంచలకరణిఁ దపము
చేయుచుం గాన నయ్యె నిశ్చింతచిత్త
మలరుచుండంగ నగ్గౌరి యంతఁ బూన్కి
తనర హేమంతరాత్రుల ధర్మనిష్ఠ. 507

క. కరపాదంబులచేఁ బం,కరుహంబుల ముఖముచేత గ్లాబింబంబున్
గరమరుదుగఁ గనఁబఱచుచు, స్థిరతం గనిగడపెని యతితీవ్రతఁ గాంచన్.

క. నీవారబీజదానము, చే వన్యమృగాళి తృప్తిఁ జెందఁగఁ జేసెన్
శ్రీవామదేవుపత్ని య, దేవిఁకమునఁ గొఱత లేనిదే యగునియతిన్.

తే. ఆశ్రమోపాంతమున నున్నయట్టిభయద
మృగములును హింసమానియే తగఁ జరింప
నాలవాలంబులం గూర్చి యమలకలశ
జలములం బోసి యుటజవృక్షములఁ బెంచు. 510

క. వలగొనితిరుగుచు నరుణా,చలవర్యము సఖులఁ గూడి స్వాంతార్థములున్
ఫలియింపఁ గొల్చుచుండును, జలిమలకూఁతురు తపంబు సల్పెడు వేళన్.

క. హరమంత్రంబును బంచా, క్షరపూతముఁ దా జపించు శంకరుని స్తవో
త్కరమును బఠించు నెమ్మది, నరుణాచలనాథు నిల్పి ధ్యానించుఁ దగన్.

చ. ప్రతిదివసంబు శోణగిరిపాలుని శాస్త్రహితప్రదక్షిణ
ప్రతతిని సత్కరించు మదిఁ బర్వెడుభక్తి నమస్కరించు నా
శితిగళునాగమోక్తవిధిఁ జిత్తమునం గడుశ్రద్ధ నిల్పి సం
తతము తపంబొనర్చె మునితల్లజు లాత్మలఁ దన్ను మెచ్చఁగన్. 513

మహిషాసురసంహారము.

క. అని తెలిపి నంది కేశ్వరుఁ, డనుమార్కండేయ! యవలిదౌచరితంబున్
వినుపింతుఁ బరమపావన, మనఁదగు నద్దాని వీనులలరన్ వినుమా.

చ. అరుణగిరీంద్రమందు నిష్ఠాత్మతఁ బార్వతి శంకరున్ మన
స్సరసిజమందు నిల్పి శివశాస్త్రవిధానము మించ కేతపం
బరుదుగఁ జేయుచుండ మహిషాసురుఁ డవ్విధ మాలకించె నె
వ్వరుసనొ దైత్యనాయకుఁడు వాఁడగుధ్వంసిత దేవనేతయా. 515

సీ. అజ్ఞానతిమిరమే యాకృతిఁ గొనె నంచు నతని వర్ణింపఁగనొను సర్వ
జగముల నోడించి జయలక్ష్మినిం గాంచి సిద్ధవిద్యాధరుల్ చెదరిపాఱఁ
గాఁ జేసి పద్మజుకరుణనొందినవరములనుదుర్నిగ్రహుఁ డనఁ జెలంగి
ధర్మమర్మోపఘాతకుఁ డౌచు నముచి నివృత్రపులోములన్ వీరవరుల

తే. బలమున నడంపఁజాలుచుఁ బ్రబలశస్త్ర
వేత్త యౌచు నస్త్రంబులవిధ మెఱుంగు
వారిలో నగ్రగణ్యుఁడై వరమును లిడు
శాపముల లెక్కపెట్టనిశక్తి కలిగి. 516

చ. బలయుతులై నకోణపు లవార్యరణంబుల నాఱితేఱుదై
త్యులు గురుదర్పులై చెలఁగు నుద్ధతదానవు లన్వహంబు తన్
బలసి వినమ్రులై కొలువ వర్ధిలుచున్ మునివర్యపత్నులన్
జెలఁగి హరించుచున్ దనదుచిత్తము మోదము నొందఁ జేయుచున్.

క. జని గాంచి ఖ్యాతిమించిన, దనువంశమునందు నెందు దారుణతేజం
బునఁదగుహిరణ్యకశిపుఁడు,జనియించెనొయట్టిభయదసంతతియందున్.

తే. అందుఁగాదె హిరణ్యాక్షుఁ డనెడువాఁడు
సంభవం బందె యట్టివంశమునఁ బుట్టి
సర్వదేవతలకు నెప్డు సాధ్వసంబు
గలుగఁజేయుచు నుండె రక్షఃప్రభుండు. 519

ఉ. ఆగిరిజాత తన్నుఁ దగి నట్టివరుం డని కోరునట్లుగా
భోగము లొందఁజేయఁ దనభూరిమనోహరసంపదల్ గనం
గాఁ గనువిందుచేయఁ దనకాంక్షలు పండఁగఁజేయ నొప్పుకోఁ
గాఁ గడుసౌఖ్యమొందఁ దమకంబున దూతికఁ బంచె నేర్పునన్. 520

చ. అదియుఁ దపస్వినీ సువిహితార్హముగాఁ దగువేషమూని యా
సుదతిని జేరఁబోయి సతిచుట్టును జేడియ లుండువేళ స
మ్మదమునఁ బల్కె దైత్యపతిమాటల నెల్ల ననర్హ మిద్ది యం
చెదఁ దలపోయ కాత్మ విభుఁ డెప్పగిదిన్ వచియించె నట్టులే 521

క. ఔరౌరా! భయదాటవి, భీరూ! యీరీతినుంట వింతయె కాదే
గారుత్మతమణికుట్టిమ, హారిప్రాసాదవాసమర్హమయి తగన్. 522

చ. జననుతిఁ గాంచ నర్హములు సౌధములందు విహార మొప్పఁజే
యనుదగు దీవు కంజనయనా! పటుయౌవన మొప్పియుండ నె
మ్మనమును భోగనిస్పృహత మైకొన జేసి వనంబులందు ని
త్యనివసతిం గనంగఁ దగునట్టి ద దెయ్యదొ కారణం బిటన్ 522

ఉ. దైవతదుష్కరంబయి నితాంతమనఃప్రమదంబుఁ జెందఁగా
నేవిధిం జూచినందగిన యిట్టితపం బొనరింపదీనిచేఁ
గావలయున్ ఫలం బిదనఁగాఁదగు నెయ్యదియో? ఫలంబు, నీ
భావముఁ దెల్పఁజాలుదువె పద్మదళాయతచారులోచనా! 523

సీ. హంసతూలమయంబుహారితరంబునై ముక్తామయవితానముగఁ జెలంగు
నట్టివితానిక యరుదుగఁ గన్పడ నలరారు శయనీయమందుఁ బవ్వ
ళింపఁగాఁ బూనక తెంపున నద్దాని విడనాడి మృదుతమవిగ్రహావయి
యుండియుఁ గఠినత నొప్పు పాషాణములందుఁ బండుకొనంగనభిలషించి

తే. తేటికిఁ? దపోజదుండగు నీకు నీ వ
దృష్టవశమున వదలితి వింతకు మును
పమరులందును నీడుజో డనఁగఁ దగిన
వాఁడు గనరాఁడు శ్రమపడి చూడ నొకఁడు. 524

చ. విను మొకమాటఁ దెల్పెదను విశ్రుతుఁ డీభువనత్రయేశుఁడున్
దనుజవరుండు రూపమున దర్పకు మించినవాఁడు శౌర్యమం

దనుపముఁ డెల్లలోకముల నాతఁడెపో మహిషాసురుండు నా
వినుతుఁడు వానిఁజూడ నలివేణిరో! కోరుదువే మనంబునన్. 525
చ. వదలుదు పీతపంబుఁ గడువైళమ నిన్నావ మేల యింకనో
సుదతి! భవద్విధంబు విని సోఁగుగ మంతయు నాలకించి ని
న్నొదవినప్రీతిఁ దోడుకొని యెయ్యన రా నను మాతికామణిన్
ముదమునఁ బంపె నమ్మదనభూతశరావళి తన్ను నేఁచఁగన్. 526
చ. అని యిటు ధర్మదూరమయి యూరసి చూడ విరుద్ధమై వినన్
వినఁ గడునేవగింపు నెద వింతయుఁ గల్గఁగఁ జేయువాక్యముల్
దనుజకుమారి పల్కుటయుఁ దద్గిరిజాశయ మాత్మ నెంచి దా
నిని నిరసించి యవ్విజయ నేర్పునఁ బల్కిన దైత్యదూతియున్. 527
తే. కినుక నెంతయు వహియించి కృతమహాప్ర
తిజ్ఞ గావున దైత్యమూర్తిని ధరించి
యప్పుడేపోయి జరగిన దంతయున్ దు
రాత్మునకుఁ దెల్పె నాతండు నంతయు విని. 528
ఉ. పట్టఁగరానిరోషమునఁ బర్విడు పూనిక రక్తనేత్రముల్
నెట్టన భీతి నింప నల నీరజనేత్రను సంగ్రహింపఁగాఁ
బుట్టినవాంఛ నాపుకొనుబుద్ధియె లేమి జవంబుమీఱ నా
గట్టులఱేనికూఁతు నొకకామినియే యనునూహఁ బర్విడెన్. 529
చ. దితిసుతకోటు లెంతయు మదించినవారగుటన్ దలోదరిన్
బ్రతియనలేనివిక్రమము భాసిలు నాపరదేవిగాఁగఁ ను
ద్ధతిఁ దలపోయుచున్ దితిజతల్లజు వెన్కనెపోయి రట్టులే
యతనిని వెన్కొనెన్ బలము లన్నియు నాల్గుతెఱంగు లొక్కటన్.
ఉ. దానవసేన లత్తఱిని ధాత్రిని గప్పె మహాధ్వజంబులన్
గానఁగరాకయుండ గగనంబు నొనర్చెను; క్ష్వేళితంబులున్
మాననివాద్యఘోషములు మ్రాన్పడఁజేసె జగంబు వ్యోమమున్
బూనిక బ్రద్దలై పడఁ బ్రభుత్వముమీఱ నొనర్చె నత్తఱిన్. 531
క. దైతేయ వీరపాదా, ఘాతములం జూర్ణమయ్యెఁ గనుఁగొన నరుదై
భూతలమెల్ల నమర్త్యుల, చేతంబులు కంపమొందె సిద్ధతతిపడెన్,

వ. అత్తఱిఁ గరాళుండును, దుర్ధరుండును, విచిష్ణువును, వికరాళకుండును, బాష్కల, దుర్ముఖులును, జండ, ప్రచండచామరులును, మహాహను మహామాళులు, సుగ్రాస్య,వికటేక్షణ,జ్వాలాస్యదహనులను మహిషాసురసేనానులు పెలుచ నడిచి రంత. 533

క. కోలాహల మీఁగతి నియ,మాళికి విఘ్నంబుగాఁగ నత్తఱిఁ గలుగన్
గా లలిత నెమ్మనంబున,నోలిఁ బ్రయోజించి దైత్యు నుద్యమ మెల్లన్.

క. తలపోసి వారి నొంపఁగ, బలమున రాజిల్లు దుర్గఁ బంచెను దివిష
ద్బలములువడంకసాగెను,గలఁగిరి దేవేంద్రముఖులుకడుభయమడరన్.

వ. ఆదుర్గయు నరుణాద్రిరహోద్రోణియందు సింహస్కంధాధిరూఢయై దీప్తాయుధప్రజ్వలద్బాహువు లలరఁ గాళికవలె భూస్థలిం జేరె నంత.

సీ. ఘనఘనాఘనరావమున దిక్కు లదరంగ
జేయు సింహము నెక్కి చిత్రగతుల
నది చరించుచు దంష్ట్రి లోదవిన కినుకమై
నొండొంటి నొరయంగ నుద్ధతిఁ దన
జిహ్వ నల్లార్చుచుఁ జెలఁగి యంగుళితతి
నిక్కపెట్టుచు నంగనిచయమునను
యోగినీచక్రంబు నొగి మాతృగణమును
బుట్టించె రోషంబు పెంపుగాంచ

తే. నంబికాప్రీతికొఱకు దైత్యాళిఁ జంపఁ
బెక్కువేలను సృజియించెఁ బృథుతరాత్త
శక్తి యలరారఁ గొందఱు శక్తులందు
నరుణకాంతి డాడినులను నాఖ్య యమర. 537

క. తమకుఁ రాయంచలు మో,దమునిచ్చెడువాహనములుదగియుండఁగనా
స్యములు చతుస్సంఖ్యలుగా,నమరఁ రోషమున నధర మట్టెవడంకఁ.

చ. కరములశూలముల్ వెలయఁగా గ్రుధ పెంపున దానవాళిసం
హారణముదంబు మించ భయదారవముల్ వరభూషణంబు లై
పరఁగ లలాటముల్ కృశత భాసిలి క్రోధగుణంబుఁ దెల్ప భీ
కరవృషవాహనంబుల నికామరణోత్సవ మొప్ప యోగినుల్. 539

ఆ. నెమలివాహనములు తమకలరారఁగ, బలములెల్లఁ గొలువభద్రకాళి
ప్రియముగోరి భూత భీతిదరూపంబు, లమరఁ గొంద అరిగిరనికి నపుడు.
సీ. శక్తిదండాభయసాధనంబులు కర
ములఁ గ్రాలుచుండంగమోములాఱు
కనఁబఱచుండఁగా గరుడవాహనములఁ
గోపంబు రూపంబు గొన్న కరణి
వెడలిరి కొంద ఱవ్విమతులఁజెండాడ
శంఖంబు భీకరచక్రము కర
ములఁ దాల్చి సూర్యచంద్రులఁ దాల్చు నంబర
మువలె వ్యాఘ్రంబుల మూఁపులందుఁ
ఆ. గూరుచుండి రుచిర కువలయకాంతుఁలు, గలిగి రిపులఁజంపు కౌతుకంబు
మనసులందుఁబొంగమానినుల్ కొందఱు,సమర మొనరుపంగఁజనిరి వేగ.
చ. కిరితతిఘుర్ఘురారవని కృత్తదిగంతము నొచు వాహనో
త్కరముగ నొప్పఁగా హలముఖప్రతిరోధివిమర్దనక్షమ
స్ఫురదురుకాంతి రాజిత విభూషిత హారమహాయుధంబులన్
గరములు వెల్గ రోషమునఁ గన్నులు వేయియు నెఱ్ఱనైతగన్ · 542
క. శ్వేతద్వీపవాహనసం,ఘాతము పరవీరహృదయగాఢవిదళన
స్ఫీతగురుశక్తియుతమై, చేతస్సమ్మోద మొసఁగఁజేయుచు నుండన్.
క. శతకోటినామకాయుధ, వృతిఁగరములు శోభిలంగ వెడలిరిశక్తుల్
శతకోటులు సంగరమ, ప్రతిమానపరాక్రమమునఁ బర్వం జేయన్.
క. చని రవ్వీధి మఱికొందఱు, వినీతగురు ఘోటకములు వింతగఁ దమవా
హనములుగాఁ గన్పడఁ గాం,తిని విద్యుల్లతికఁబోలి తీవ్రతతోఁపన్.
ఉ. చేతులఖడ్గఖేటములు శీఘ్రమవై రివిదారణోద్యమ
స్ఫీతములై చెలంగఁ గ్రుధపెంపుననే కపిలాననంబు లెం
తే తగ సర్వదింటికిఁ బయిన్ గణియింపఁగ నాల్గుకోట్లుగా
బ్రీతి జనింప దేవికిని వెల్వడె శక్తిగణంబు వింతగన్. 546
చ. వెలువడి యోగినీగణము భీకరరాక్షససంహతిన్ వడిం
గలహమునందు నొంపఁగ నికామము కోరుచు నంధకారరా

సుల రవికాంతు లట్టు కడుశూరత్వమై నెదిరించె రాక్షసా
వళులకు యోగినీతతికిఁ బర్వెఁ బరస్పరయుద్ధ మయ్యెడన్. 547

క. అనియదిముష్టాముష్టిగఁ, గనఘోరముగాఁగఁ బ్రళయకాలంబెయిదో
నవఁగఁ గచాకచిగా సా, గెను యోగిను లప్డు చెలఁగు కినుక నదులపై.

క. నారాచపరంపరలన్ భయ,దారావము చెలఁగ వైవ నాశరబలముల్
ధారణిఁ గప్పిరి స్వశిరో,వారములన్ స్థలజములగువారిజములనన్. 549

సీ. కైశికశైవలకాండమ్ము లమర ద్వీపాతపాఠీనముల్ పరుగు లిడఁగ
స్మితహారి దేవీముఖతతిసరోజముల్ చెలువార రక్తనదులు రణాంగ
ణమునఁ బాఱెను; గజేంద్రములతుండంబులపై నెక్కి వేడుకల్ పఱఁగ విల్లఁ
గాఁ బిశాచంబులు కవ్రసౌధములపై విహరించుచుం దానవిమతు లడల

ఆ. నాట్యమాడుచుండె నల్లమెల్లనఁ ద్రావి, దనుజబలకపాలతతులరక్త
మాంసములనునింపిమఱిమఱిత్రాగుచుఁ, దినుచుసంతసములఁదృప్తినుండె.

వ. కంకౌఘంబులు మహాసంతోషంబునఁ బాశశంకం గని దనుజ
వీరాంత్రంబులఁ బరిహరించుచుఁ బలలంబుల మెసఁగుచుండె. నక్కలు
క్షుధితంబులయియు సశల్యమాంసంబుల దినక భయంపడిపాఱుచుండె.
సిద్ధవిద్యాధరోన్ముక్తమందారప్రసవాసవంబుల భూపరాగం బడంగె.
యోగినీముక్తశల్యానామకనారాచంబులు తనువులు విదళింప శల్య
మృగంబులంబోలి దానవహయంబులుచూపట్టె. అత్తఱి యోగినులు
చెలరేఁగి కొందఱు దనుజవీరుల దండాయుధంబులను, మఱికొందఱు
శూలంబుల నింకఁ గొందఱు నిశితశక్తులను విశేషించి యింకఁ
గొందఱుఁ జక్రంబులను మఱియుహలాది ఘోరాయుధంబుల దానవులఁ
జించి చెండాడె నత్తఱి సేనాధిపతులు దక్కఁ దక్కినదానవబలంబులు
నిశ్శేషంబు లయ్యె నప్పుడు. 551

తే. బ్రాహ్మి యదుదెంచి వికరాళ భాసమాన
దండ మట్టె జ్వలింపంగ దనుజవరుని
జంపెను గరాళనామకు సమరసీమ
దాఁ బ్రయోగించి సురలు సంతసమునొంద. 552

క. మాహేశ్వరి సంగ్రామము, బాహాబల మొప్పఁజేసి పౌరుష మొప్పం

గా హుంకరించి రాక్షసు,లాహాకారములొనర్ప నాదుర్ధరునిన్. 553

క. శూలంబున మదియించెను, వ్రాలినసంతోష మొప్ప వజ్రప్రముఖుల్
చాల నుతించిరి రణమా, భీలంబుగఁ జెల్లె నంతఁ బృథుకోపమునన్.

క. కౌమారి చిక్షురాసురు, భీమాకృతి గాంచి శక్తిఁ బృథువేగమునన్
వేమాఱు ద్రిప్పివైచిన, భూమింబడె నంత శీర్షము తెగుట కతనన్.

ఆ. వైష్ణవి యనుదేవి వరచక్రమున వికరాళుమస్తకంబు లీలఁ ద్రుంచె
వానిపాటుగాంచివారాహియును బాష్క,లాఖ్యుశిరమునిర్జరాళిపొగడ.

క. ముసలంబున ఛేదించెను, వెస నైంద్రియు దుర్ముఖాఖ్యు వీరవరునిదే
వసమితిపొగడన్ వజ్రము,న సంహరించెన్ దురంబునఁ గడుఁబూన్కిన్.

సీ. ఎవ్వరి వధియింప నెల్లెడఁ జాముండ యనుపేరు విఖ్యాత మయ్యె నట్టి
చండముండులనేచిమండలాగ్రంబునమడియించెదుర్గయిమ్మాడ్కి సమర
మమరజయావహంబై యప్పుసాగంగఁగనుఁగొనిభీకరాగ్రహముపొంగ
మహిషాసురుండుదుర్మదుఁడుతానడువంగబూనుటెఱింగిమర్త్యానధనులు

ఆ. నుగ్రరూపులు నగునుగ్రాస్యవికటాక్షులనుసరించి రతని నాహవమున
విక్రమంబుఁ జూప వీరులౌ జ్వాలాస్య, దహను లిర్వురల్లె దర్పమడర.

చ. చెలఁగుచుఁ గాలనేమి జయసిద్ధిని గూర్పఁగ విప్రచిత్తిము
ఖ్యులు బహుళాయుధద్యుతుల నొప్పుచు వెంబడిపోయి రుగ్రులై
కలహమునందు కామినుల కాండముఁ జెండ రథంబు లెక్కి యు
జ్జ్వలతరచాపహస్తులయి సామజముఖ్యబలంబుఁగూడరాన్. 559

చ. చని చని యుద్ధభూమిని ధ్వజంబులు కంపము నొందుచుండ భీ
తిని సకలామరుల్ వెఱచి దిక్కుల కత్తఱిఁ బాఱుచుండ సిం
హనినదపూరితాశులయి యాశుగవృష్టిరణాంగణంబు నిం
డునటులుచేయుచున్ వితతినూతనశక్తులఁ జూపఁగోరుచున్. 560

తే. నడిచి రత్తఱి మాతృమండలముఁ జెండు
వాంఛ లెంతయుఁ బొంగ నవ్వరుసమాతృ
మండలంబులు వారల మార్కొని క్రుధఁ
బోరి దుర్గను సాయంబుఁగోరి రపుడు. 561

చ. మృగపతివాహనంబున నహీనపరాక్రమ ముప్పతిల్ల శ
త్రుగణముఁ జెండువాంఛ మదిఁ దోఁపఁగ నుండిన దుర్గచెంతకుం
మగిడి చనంగ వారిబహుమానముమీఱఁగఁ గాంచి సంగరం
బు గడిచి రాఁగతం బెదియు పోల నచింపుఁడు వాఁగ వారలున్. 562

చ. దనుజవరేణ్యుపౌరుషము దారుణమౌను దురాత్ము నాతనిన్
గనుఁగొనరాదు దుర్జయునిఁగాఁ దలపోయుము నీవుదక్క వా
నిని సమరాంగణంబున ననింద్యపరాక్రమ మొప్ప మార్కొనం
గను బొలియింప నీకె తగుఁగాని యశక్యము మాకు నిత్తఱిన్. 563

ఆ. అనుచుఁ బెక్కుభంగులను వినుతించిరి,సప్తమాతృకలును జనని ! నీవు
యోగనిద్ర యనఁగ నొప్పినరూపంబుఁ, దాల్చి విష్ణునేత్రధామవగుచు.

చ. అలరుచు నుందువట్లగుట నమ్మధుకైటభులన్ జయించె నా
జలరుహనేత్రుఁ డవ్విధిని సాయము నీవటఁ జేయకున్న నె
ట్లలవిగు వధింప భవదాజ్ఞయె సర్వము నిర్వహించు ని
స్తులమహిమాఢ్య నీవు వినుతుల్ పచరింపఁగ మాకు శక్యమే? 565

తే. నీవు కౌశికి యనఁగ జనింపకున్న
నెట్లు శుంభనిశుంభులు మృత్యువక్త్ర
గహ్వరంబును జొత్తురు కలుగు నెట్లు
దిక్పతులకు నైశ్వర్యంబు దేవి! చెపుమ. 566

వ. వింధ్యవాసినీ! కిరాతీగణంబు సేవింపనున్న నిన్నుఁ గూర్చి వింధ్యుం డవంధ్యతపం బొనరించి యిష్టసిద్ధులం బడసె. ధనదుండు పాయనంబున నొసంగిన కాపిశాయనం బనువారుణిం గ్రోలి యిష్టార్థంబు లొసంగితివికదా? దైత్యశక్తుల నడంచి దేవతలం గాపాడితివి,మఱియు.

సీ. సృష్టిశక్తివిగాఁగ హేమగర్భునికడ స్థితిశక్తివిగ మధుద్విషునిచెంత
సంహారశక్తివై శంభునిసన్నిధి నలరారుచుందువో యంబ! నీవు
నందయశోద లానందంబునం బొంగ నీవె పుత్రివిగ జనించితిగద?
కంసాదిదానవకాండసంహారంబునందుఁ దోడ్పడితివో యఖిలజనని!

ఆ. విద్య యనఁగ నీవె వెలయు మహామాయ
యనఁగ నీవె లక్ష్మి యనఁగ నీవె

సకలవంద్యమైన శారదవన నీవె,
పార్వతి యనఁబరఁగు ప్రమద వీవె. 568

చ. సకలము నీవె యయ్యు గురుశాత్రవవిక్రమ మెట్టి దంచు వ
మ్మొకపరిప్రశ్నరూపమున నుద్యమమే యెఱుఁగంగఁజాలన
ట్లకట! మముం గలంచు టిది యర్హమె సర్వమెఱుంగు దీవె వ
మ్మిఁకఁ గృపగావకున్నఁ గలదే బ్రదుకం దగురీతి యెద్దియేఁ. 569

చ. అని వినుతింపఁగా వినుచు నాద్యశక్తి దుర్గయు మాతృసప్తకం
బున కభయం బొసంగి కడుఁబూనికమై మహిషాసురుఁ దురం
బున నెదిరింపబోయెఁ గరభూషణమై తగుమండలాగ్రముల్
ఘనతరభిండిపాలమును గాంచఁదరం బెటుగానిశక్తినిన్. 570

క. ధరియించి వెడలి యనిఁ జా
మరు నొంచెను భయదనూచు మహిషాకృతితో
బరఁగెడుఖడ్గంబున ని
గ్గరు లెల్లం బొగడ నొంచె సాహస మొప్పన్. 571

క. ఛురిక మహామాలిని గర్పరమున దను జేంద్రుఁ డనఁగఁబౌరుషమున భీ
కరుఁ డనఁదగినమహాహను,నుర్వైరిం గొట్టెఁ దనదు శూరత పొంగన్.

సీ. ఉగ్రవక్త్రిని నొంచె నురుకుఠారంబున వికటచక్షుస్సను ప్రకటబలుని
దనుజవరేణ్యుశక్తిని బ్రహరించెను ముద్గరంబును వైచి పూన్కిమీఱ
జ్వాలాముఖునినొంచె వరముసలంబునదహనుడన్ దనుజుని దండధరుని
పీటికిం బంపె నివ్విధమున మహిషుండుకనుచుండ రోషంబు గ్రాలఁజంపి

ఆ. సింహనాదమున విజృంభింప నాదుర్గ,గాంచి మహిషదనుజకాంతుఁ డేచి
చక్రనిహతిఁదన్నుఁ జంపయత్నించుట,నెఱిఁగి తీవ్రబాణవృష్టి ముంచి.

క. ఫాలంబున వక్షోరుహ, మూలంబున గండయుగ్మమున బెక్కమ్ముల్
కీలించి నొంపఁ దుర్గయు, నాలోలభయంకరాస్యయై యవ్వైరిన్.

క. కరమూలంబులముఖమును, నురమును లక్షించి మంట లొప్పు ఛురప్రో
త్కరమున భేదించెను దైత్యవరమణుఁ డత్యంతకోపతామ్రాక్షుండై.

చ. శితవిశిఖంబులన్ ధనువుఁ జేర్చి ముఖంబును జక్కఁజూచి య
య్యతివ పరాక్రమంబునకు నచ్చెరువందియు నైపరామి వై

చి తనదువిక్రమంబు తగఁజెప్పక చెప్పుచు నంతఁ బోక దో
ర్ద్వితయము పంచపంచశరవిద్ధముగా నొనరించె దుర్గయున్. 576

తే. దృష్టియుగళంబు నొంచి రెండేసితూపు
లను శరంబున సారథి నెనిమిదివిశి
ఖముల రథ్యంబులను గార్ముకమును మూఁట
ధ్వజము నాలుగుశరములు వైచి త్రుంచి. 577

చ. అనుపమసింహనాదమున నంబరముం బగులింప భూస్థలం
బున నిలుచుండి దైత్యపతి భూతభయంకరవహ్నికీలమో
యనఁ దగునాశతఘ్ని యనునాయుధవర్యము చేతఁబట్టె నా
ఘనతరసాధనంబు లయకాలుని దండమునాఁ గనందగెన్. 578

ఉ. దానిని వైచె దుర్గపయి దారుణవిక్రమ మొప్ప నద్దిరాఁ
గా నిఖిలామరుల్ వెతలఁ గాంచుచు దీనరవంబు లొక్కటన్
మానిని గాంచి చేసి రభిమానము వీడి నిరాశులైన చం
డానఁ దదాకృతిం గనుచుఁ డారొగిఁ బాఱిరి మాతృకల్ వెసన్. 579

ఉ. దుర్గయుఁ బైఁబడంగడఁకతోఁ జనుదెంచు శతఘ్నిఁ జేతితో
స్వర్గనివాసు లచ్చెరువు వర్ధిలఁజూడఁగ లీలఁబట్టెఁ ద
ద్దుర్గతిఁ గాంచి దానవుఁడు తోడనె యంకుశముం గృపాణమున్
భర్గునినే నడఁపఁ దగుపాశభుశుండులశంకుశక్తులన్. 580

సీ. కరవాలచక్రతోమరముల గదఫలకంబును సృణి యనుగాఢసాధ
నముభిండిపాలంబుసుమహితమౌ పరశ్వధముఁబట్టిశమునువైచెలగుడ
మనుదాని దుర్గపై నపుడె ప్రయోగించె లయకాలమునను జలదమశనిని
బఱపురీతిని వచ్చువాని భయంకరసాధనంబుల శత్రుసమితి గుండ

తే. దుర్గకరములఁ బట్టుచుఁ దూర్ణమునసె
వానిశకలంబులై పడ వరుసఁ జేసెఁ
గడువిలాసంబుగా నిక్షుకాండము ద్విప
మట్లుగాఁ జూచు ఖేచరు లార్వ మింట. 581

శా. పంచాస్యంబు మహేశ్వరీవహానసంపల్లబ్ధశక్త్యన్వితిం
గాంచంజాలితి నన్నసంతసము పొంగం బౌరుషావేశమున్

మించన్ వాలము ద్రిప్పుచున్ భయదమై మిన్నందు దంష్ట్రాళిహతిన్
జించెన్ దద్రథవాహనాళిరథముం జెండాడెఁ గోళ్లన్ ద్వరన్. 582

ఉ. ఆవిధ మెల్లఁ గాంచి మహిషాసురుఁ డెంతయు మాయఁబూని సిం
హావయవంబు గన్పడ క్షణార్థము క్రోడముగా క్షణంబు వ్యా
ఘ్రావయవంబుఁ దాలిచి గజాకృతిఁబూని క్షణంబు కాసరం
బై వరపౌరుషంబున రవంత దురం బొనరించె దేవితోన్. 583

ఉ. అంతటఁ బోక యమ్మహిషుఁ డాత్మవిషాణములన్ శితాగ్రసం
క్రాంతములన్ మహాత్తరరుడావిలమానసుఁ డౌచు సింహమున్
బంతము మించఁగాఁ బొడిచెఁ బాయనిపూనిక దుర్గనుం గదున్
వింతపడంగ దేవతలబృందము తాఁబొడిచెన్ బలంబునన్. 584

శా. మాయం దాల్చి క్షణంబు భీకరవియన్మధ్యంబునన్ నిల్చి యెం
తో యత్నంబున బాణవృష్టిఁ ద్రిదశవ్యూహంబు భీతిల్లఁగాఁ
జేయంజాలుచు నంతలోపల మహిం జేరంగఁదాఁ జాలి తీ
క్ష్ణాయఃపుంఖకలంబకౌఘమున దుర్గాంగమ్ము నొప్పించుచున్. 585

సీ. క్షణమున దిక్కులఁగనఁబడఁజాలుచుక్షణమదృశ్యతనొందిశాతవిశిఖ
వర్షంబుగురియుచు వర్తిల్లఁగాఁజూచిన ప్తమాతృకలు చంచలతగాంచి
ప్రార్థించి రోయంబ! యీమరారిఁజంపుమావైళంబ యన విని వారిపలుకు
లత్తఱిఫలయుక్తి నందఁజేయఁగఁబూని సస్మితాననపంకజాతయగుచు
తే. దా నమోఘత్రిశూలంబుఁ దాల్చి మహిష
దనుజు నొప్పించె ఘర్ఘరధ్వని చెలంగ
నతఁడు భ్రాన్తిఁ ద్రెళ్లెడునంతలోన
స్కంధపీఠంబునం జేర్చి చరణ మలుక. 586

క. గళపీడన మొనరిచి యసు, విలయంబునఁ బడినదనుజు విపులశిరముఁ బెం
పలరఁగ భేదించి కర, స్థలమున ధరియించి యాడె సంతోషమునన్.

ఆ. లోకకంటకుఁ డగుభీకరమహిషాఖ్య, దనుజనాయకుండు దారుణాహ
వమునఁ దెగినఁగాంచి యమరులునర్తన, మాచరించియంబనభినుతించి.

క. తమసంతసమును దెల్పిరి, ప్రమదంబునమానివరులు ప్రస్తుతులను లో
కములకు మేలొనరించితి, వమరులకున్ జీవ మిచ్చి తంబా! దయతోన్.

క. అని స్వాశయములఁ దెల్పిరి
ఘనసుమవర్షంబు గురియఁగాఁజేసెను మే,
ఘనికరము జగత్కంటకుఁ
డనఁదగుమహిషుండు దెగుట కతిమోదమునన్. 590

## వింశోధ్యాయము

పార్వతి యరుణాచలేశ్వరుస్తుతించుట.

క. అని తెలుపంగ మృకండుని,తనయుం డచ్చెరువుదోఁప దానవనాథుం
డనఁబడుమహిషుని మర్వ, ర్తన మివ్విధి నుండెనే నితాంతభయదమై.
ఆ. దురితహారిణి యగుదుర్గాపరాక్రమ,మిట్టిదగునె మహిషుఁ డిట్లు తెగినఁ
బర్వతేంద్రపుత్రి పదపడి తపమున,నెట్లు వర్తిలెనొ వృషేంద్ర! చెపుము.
చ. అనుటయు నందికేశ్వరు డయారె! యనందగువాంఛ యిద్ది య
ద్దనుజుఁడు చాపదుర్గయును దద్గురుమస్తక మూని హస్తమం
దనుపమభక్తి గౌరిచరణాంబుజయుగ్మముపైన వ్రాలి వం
దన మొనరించె భక్తిభరితం బగుచిత్తమునన్ ద్వితీయహ
స్తనళిన మెత్తి ఖడ్గమును దాల్చియె యత్తఱి గౌరి ప్రీతియై. 593
చ. ప్రమదభరంబునన్ మనము రంజిలఁగాఁ దనమ్రోలనాట్యమున్
సమదనిశాచరేంద్రవధ సంజనితాధృతిఁ జేయుదుర్గఁ గాం
చి మహితసమ్మదేక్షణవిజృంభితదృష్టిని గాంచి శుభ్రదం
తసముదయప్రభాధవళితత్రిదశవ్రజమార్గమై వెసన్. 594
చ. పలికెను దుష్కరంబె యని పల్కఁగ నొప్పినకార్య మీవుదో
ర్బలమువనే యొనర్చితి తపం బిది విఘ్నము లేక సాగె ని
మ్ములభవదీయహా మహిమఁ బోలదె సన్నుతిచేయ వింధ్యవా
సలలితచిత్త! యీదనుజసత్తము శీర్షము భీతిదంబగున్. 595
క. అపవిత్రము మాహిషమహా, సుపవిత్రవుగాన దీని శుభదంబగు నీ
దుపరమహస్తము దాల్పఁగ,నిపు డర్హముగాదు వదలు మిద్దాని వెసన్
చ. అని బహుమాన ముట్టిపడ నాహిమవత్సుతయాజ్ఞచేయఁగాఁ
వినుచు జుగుప్సచే మనము వేమఱుచింతమునుంగ నాశిరం

బును బడవేయుయత్నమును బూని విదల్చెను బెక్కుసారు లా
త్మనియతి మీఱ హస్తమును దావినయంబున గౌతముండనున్. 597

క. పాపవినాశన తీర్థం, బీపట్టున గల్గఁజేయు మీశ్వరి నూత్నం
బై పరమపావనంబయి, యేపాఱుత నద్ది యిచట నెల్లరు మునుఁగన్.

తే. అందు మునుఁగఁ బ్రాయశ్చిత్త మౌను దేవి
యనుచు వేఁడిన గౌతము నాశయంబు
నెఱిఁగి యఘశంక కలుగంగ నిలను ద్రవ్వె
ఖడ్గధారను దీర్ఘసంకల్పమొలయ. 599

వ. పాతాళపర్యంతముగఁ ద్రవ్విన నందలి పాషాణతలంబునుండి నిర్మల పయఃపూరంబు సచ్చిత్తంబుం బోలి పైకెగసె. ఆగంభీరోదకంబున దుర్గాంబ స్నానం బొనరించె, ఆకాలంబున శోణాచలేంద్రునకు నమస్కార మనుమంత్రం బుచ్చరించె. అత్తఱి నామహిషాసురకంఠంబునఁగల శివలింగంబు తటాలున నందుం బడియె. దాని నాతీరంబునం బ్రతిష్ఠ యొనరించి పాపనాశననామంబు నునిచె. ఆతీర్థంబున స్నానం బాచరించి ధూతకల్మష యయ్యె. అత్తఱిఁ దత్కరంబుననుండి మహిషమస్తకంబుపడియె. పాపనాశనేశ్వరునకుఁ బ్రదక్షిణం బాచరించి గౌతమముని యెంతయు నానందింప గౌరి యెదుట నిలిచె నంత,

చ. విని హతపాపబృందయయి విశ్వసమాకృతకీర్తియౌచు నా
ప్పినయలదుర్గఁ గాంచి గిరిబృందవరాత్మజ సంతసంబునుం
గని యటనున్న గౌతముని గాంచి మహాత్మ! మహాసురుఁ దురం
బున వధియింప నేన యిటఁ బూనఁగఁ జేసితి నీమె నెంతయున్. 601

సీ. వింధ్యవాసిని యన వెలయునీదుర్గయుమహిషాసురుం జంపి మానకతని
కంఠంబునందుండు కాలకంఠునిలింగవరమును భక్షించెఁ ద్వరపడి యటు
గానఁ బాచితమును మానివర్యా! నాకు నానతిమ్మని వేఁడ నతఁడు పలికె
జగములఁగలిగింప సంరక్షణ మొనర్ప సంహరింపఁగఁ గలశక్తి వీవె

తే. యట్టి నిన్ను ధ్యానింపఁగ నఖిలపాప
ములును లయమొందు నైన లోకులప్రవృత్తి

యాశ్రయించుట ధర్మమే యగుట నడిగి
తీవు నీచేయుమర్యాద నెన్నవలయు. 602

క. తనవిధిని దానె దాటఁడు, మనుజుం డుత్తముఁడు శాస్త్రమర్యాదను నీ
వును బూని ప్రశ్నచేసితి, మనమునఁ గలపాపపంకమారణమునకై.

ఆ. ఒక్కక్రియవచింతునోయంబయవహిత,వగుముశైలమిద్ధియరుణసంజ్ఞ
దనరుచుండుఁగానిదహనాద్రియే యిది, కానరాదుమహిమమానవులకు.

క. జ్వలితజ్యోతి స్సంయుతి, జలజాక్షీ! కృత్తికాఖ్యఁ జనుతారకతో
వెలనెడుపున్నమరేయిని, నలరాఋగిరీంద్ర మిద్ది యనలునిమాడ్కిన్.

సీ. ఆదినంబునఁ బూజ నతిభక్తిఁ గావింపు ముత్తమతపమున నొప్పు నీవు
తజ్జ్యోతినింగాంచఁదావకాభీష్టముల్ ఫలియించుననిమాని తెలుపవినుచు
నదిమొదలుగ శివునందెభక్తిచెలంగఁదత్పూజలను జేయుతలఁపులొప్పఁ
దపమొనరించె నాతన్వీపంచాగ్నిమధ్యమమున నెల్లచోనల మొలయ.

ఆ. వాని నడుమనుండి భానునిపై దృష్టి,నిలిపియుండె నప్పు నెలఁత హేమ
మయశలాకవోలె మహితతేజమ్మున,జూడ వింతగొలుపుచుం జెలంగె.

క. గిరివరతనయాప్రేమాం
కురపాశము లట్టె పర్వి కోరికలాగన్
బరఁగినక్రియనాపున్నమ
యరుదుగఁదోతెంచెఁ గోర్కులన్నియు నొసఁగన్.

సీ. ఆదినాంతంబున నరుణాద్రిశృంగమునందు ననిర్వాచ్య మైనజ్యోతి
యనుపాధికం బగునట్టిదై భవమునఁ గనఁబడె నద్దాని గనఁగ వచ్చి
నట్టి పద్మజ మాధవామరేంద్రాదు లచ్చట నిల్చి వందనసమితిఁజేసి
సేవింప మానీంద్రు లావిధంబునఁ గొల్వఁగాననింధనమయి గ్రాలి స్నేహ

ఆ. హీన మగుచు వర్తియే లేక వెల్గుచు, నలరు దీపవరము నపుడుగాంచి
విస్మయంబునొందెవితతభక్తిని బ్రదక్షిణమొనర్చిమ్రొక్కెఁజిత్తమలర.

చ. అరుణగిరీంద్రుఁ దృష్టిమెయి నద్రికుమారి నుతించె నిట్టులో
ధరణిధరేంద్ర చాపరజతక్షితిభృత్సుఖవాసశోణభూ
ధరవరరూప, పాశిముఖ దైవతనాయకపూజితాంఘ్రిపం
కరుహాయుగా! మనోజ్ఞరవికాంతి సహస్రసమానవర్చసా! 609

సీ. కరుణారసాపూర్ణ గంగాశశాంకలేఖాసమలంకృతకమ్రశీర్ష!
సౌందర్యమోహిత సకలమునీశ్వరపత్నీజనా! శైలపతికుమారి
కాసంగసంభృతకామవైభవపూర్ణ!మాయాచ్యుతాభోగమహితతృప్త
మానసా!సంధ్యాసమయసమోపేతప్రమోదతాండవ,మహాభూతమూర్తి
తే. సకల గీర్వాణ గంధర్వ సాధ్య సిద్ధ, భవ్యవిద్యాధరార్చిత దివ్యపాద
విఘ్ననాయకజనక,కృతఘ్నహరణ,యగ్నిభవవత్సలావందనాళిగొనుము
క. పామరదుర్లభుఁడవు నీ,వోమాన్యా! నన్నుఁ బ్రోవు నుద్యమ మింకన్
శ్రీమహితకంఠ! చేయుము నామానసవాంఛఁదీర్ప నయహితచరితా!
క. అనివినుతించుచు జ్యోతి,ర్వనిహితనయనాబ్జయగుచు వెలఁదిసిలిచియుం
డినఁగాంచి శంకరుఁడు నె, మ్మనమున సంతృప్తియలర మానినిగావన్.
చ. తనదగుపూర్వమూర్తిఁగొని తద్దయు సుందరతం జెలంగి వా
హనమగు నెద్దునెక్కి తన యగ్రమహీస్థలి నిల్చి భక్తి వం
దన మొనరించి తృప్తిమెయిఁ దన్ను గనుంగొను పార్వతిన్ దపం
బునకయి సర్వభోగములఁ బూనికఁబాసిన కోమలాంగినిన్. 613
ఆ. ముగ్ధయగుచుఁదనదుమూర్తినేకనుచుండు,నబలనూఱడింప నాత్మ నెంచి
తన్మనఃప్రవృత్తిఁదానెఱింగియనూన, కరుణఁబల్కఁబూనుకాలమందు.

---

## ఏకవింశాధ్యాయము

శివుఁడు పార్వతికిఁ బ్రత్యక్షమగుట.

చ. సరసిజసూతిశారదయుఁ జక్రియు లక్ష్మియు శక్రుఁడున్ శచీ
తరుణియుఁ దక్కుదిక్పతులు దారలతోఁ జనుదెంచి రగ్ని ని
ర్జరులును దేవకామినులు సర్వమునీంద్రులు రుద్రభాస్కరుల్
మరుదధినాథకుల్ త్రిదశమాన్యులుగాఁ దగుఖేచరవుల్ తమిన్. 615
సీ. బేతాళముల్ కటపూతనల్ మఱిపిశాచంబులు యక్షరాక్షసులు నురగ
ములునుభూతంబులుభూతేశకింకరుల్ సంతోషముప్పొంగశంకరుహరుఁ
గొలిచియుండిరి వేలకొలఁదిగ నంతట యోగినీదానవవ్యూహనిర్మి
త మగువీరాశంసనముగాంచి విస్మయమంది రెల్లరునుగల్పాంతభీష

ధరవరమేను నుర్వర నీవు శక్రుండనేఁ బులోమజవునా నెగడు నీవు
కాముఁడనేను దత్కాంతయగు రతివీవు రాజరాజను నేనురమణి! బుద్ధి

ఆ. వగుదు నీవు నేను ననిలుండ నగుదు నీ
వపుడు శమ యనంగ నలరుదు మఱి
సలిలనేత్ర నేను జాన! వీచివి నీవు
పురుషుఁ డనఁగ నేను బొల్తుతుఁ జుమ్ము. 623

వ. నీవు ప్రకృతివనం బ్రఖ్యాతిఁ గాంతువు. వేదితవ్యుండ నేను విద్యవు నీవు. వాగర్థంబులు నీవు. ఈశ్వరుండ నేను. నీవు మదంశసంభూతవు. ఆజ్ఞాస్వరూప వగు నీచేత సృష్టిస్థిత్యుపసంహారవిధానములు సాగింపఁ బడుచుండు. కావున భేదభావ మూనకుము. పామరులద్దానిం బాటింతురు. చిత్ప్రకాశాత్ముల మగు మన మిరువురియందు స్వేచ్ఛాధృత శరీరవగు నీచేత వ్యాకులితము చేయఁబడుభేదభావ మూనఁబడుట న్యాయ్యముకాదు. ప్రతిక్రియ దీని కెద్ది యని యూహించి నిశ్చయించితి నని పలికి యాదేవి తనపార్శ్వంబున నునుచుకొని యె నప్పుడు. 624

ఉ. గౌరి స్వకీయపార్శ్వమున గాఢతరం బగులజ్జగ్రమ్మ నిం
పారగణాధిపుల్ గనఁగ నావృషభేశ్వరుపై నెసంగె; న
ప్డారయఁ బ్రేమసాగరమునందు మునింగినవారిమేను లెం
తో రమణీయతల్ వెలయ నొందె నభేదతఁ జిత్రరీతిగన్. 625

సీ. పగటికాలము రెండుభాగంబులయినట్లు కానఁబడెఁ సన్నికర్షత నొక
భాగము కర్పూరవర్ణము రెండవభాగము సింధూరపాటలంబు
నయ్యెనీవిధమున నంగద్వయం బేకతంగనఁ గనఁగఁ జిత్రంబుగాఁగఁ
దోఁచె నెల్లరకు నందుఁ సగభాగము చారుకుంతలరత్నహారవిలసి

తే. తముగఁ దన్మధ్యభాగము నమలకుంచి
కాన్వితంబుగఁ గననయ్యె నవలిభాగ
మందుఁ జంద్రార్ధచూడంబు నమలసితరు
చియును గానంబడెఁ మునిశ్రేష్ఠు లలర. 626

వ మఱియు నొకభాగం బేకనూపురతాటంక పరిహార్యమనోహారంబు నేకస్తనవిరాజితంబు నగు. శివుండు స్వశరీరంబున వామభాగంబు పార్వతి కొసంగి స్మితపూర్వకంబుగా నిట్లనియె. 627

ఆ. ఇంకమీఁద రోష మింతయుఁ గనఁబోకు, కాపురంబుచేయఁగా సమస్త విధములం జెలంగు వీటిని విడనాడి, తపము చేయఁజనితి తగునె చెప్పుమ.

తే. అతివ స్తన్యంబు గోరెడునర్భకుని ద్యజించిపోయితి వట్లాట క్షితినపీత కుచయనం జేరుఁగాంచుముకూడినన్ను, నిటవసింపుముభక్తులనెపుడుకావ.

వ. అపీత స్తనియనునామంబునం దగు నిన్ను శోణాచలేంద్రుఁ డవంబరగు నన్నును జను లారాధించి భోగమోక్షఫలంబులం గాంతురుగాక. భవ దంశసంభూత యగుదుర్గాదేవి మహిషాసురుం బొలియించెఁ గాన నిందె నివసించుఁగాక. ఆరాధించినవారలకు మంత్రసిద్ధిప్రదయాను గాక. 630

క. ఇది ఖడ్గతీర్థ మతిపుణ్యదమై నొకసారిమున్గ నమలఫలములన్ గదియంగఁజేయుభక్తుల, కిది రోగవ్రజము నఘము నెంతయుఁజెండున్.

ఆ. ఈప్రవాళభూధ రేశుండు సర్వాఘహర్త యగును శ్రద్ధ యతిశయింప భక్తిఁ జూపునట్టివారికి సంపన్ని, కాయ మిచ్చుచుండు గౌతమముని.

క. నిను నెప్పు డాశ్రయించెడుఁ, గనుకం ద్వత్కృపకుఁబాత్రకల్పుండగుశ్ర ద్ధనునిన్నుఁదపమునకుఁదగు, ననువునఁ బూజించుచుండు నన్వహమతివా!

వ మఱియు నిన్నారాధించువా రాచంద్రతారకంబుగా స్థిరపదంబునుండఁ గలరు ఈమాతృసప్తకంబు సప్తలోకైకమాతృకలై యిది మొదలిందె సాన్నిధ్యంబు నొసంగియుండఁగలరు. లోకక్షేమార్థ ముపాసింపందగియుందురు. శాస్తలు భైరవులు క్షేత్రపాలకులు వటుకాదులు నీయరుణాచలక్షేత్రవర్యంబున నిత్యనివాసంబు గల్గియుందురు. 634

క. అరుణాహ్వయమున నే నీ, యరుణాచలమందు నుండు నట్లే నీవున్ స్థిరవాస మిందుఁ జేయుము. కరుణానిధి వౌచు నరుణకర్ప్రాఖ్యతగున్.

చ. మన మిట నుంట భక్తులకు మంచిఫలంబులుగల్గు టబ్రమే విను మిపు డీవొనర్చిన సువిస్తృతభావసమన్వితస్తుతిన్

మనుజుఁ డెవండు శ్రద్ధవిను మానితభక్తిఁ బఠించు నాతఁడు
ర్వ్రని రిపుహీనుఁడై సురలవీటిసుఖంబుల నొంది యవ్వలన్. 636
క. పరమపదంబునయందుఁ, స్థిరముగ నివసించుఁ గోర సిద్ధులుగల్గుఁ
బురుషోత్తముఁ డనఁబరఁగుఁ, దరుణీ! నీయాజ్ఞదలనుదాల్పఁగొదువయే?

---

## ద్వావింశోధ్యాయము



వజ్రాంగదమహారాజచరిత్రము.

క. అన విని మార్కండేయుం, డను నిత్యశివార్చనావిహారానం దా
యనఘాత్మ నందికేశ్వర, మనసారఁగ శోణశైలమాహాత్మ్యసుధన్.
తే. తనివిదీఱంగఁ గ్రోల నీదయసమర్థ
తముఁడ నైతిని పాండ్యభూధవుఁడు ఖ్యాత
చరితుఁడైన వజ్రాంగదుఁ డరుణశైల
రాడ్వ్యతిక్రమ మెట్లు జరపెనో దాని. 639
చ. మరలఁ దదీయభక్తి బహుమానము పూర్వపుసంపదున్నతిన్
నిరుపమభోగజాలము ననింద్యయశంబును గాంచె నెట్లు ల
చ్చెరు విది దానినే వినఁగఁ జిత్తసమాధియుఁ గల్గునంచు నీ
శ్వరపదభక్త నమ్మేదను సర్వము నాకు నెఱుంగఁ జెప్పుమా. 640
తే. కాంతిశాలికళాధరుల్ ఖ్యాతయశులు
చెలఁగు విద్యాధరేశ్వరులు మునీంద్రుఁ
డైనదుర్వాసుశాపమహాగ్నిఁ ద్రెళ్లి
యరుణగిరిపతి రక్షింప నలరి రెట్లు? 641
చ. అని యడుగంగ నంది కనుహర్షము నొందుచు నోమృకండునం
దన! యమితాయువుం గనితి దర్పకభంజనుభక్తి యిట్టిదై
తనరుటఁ దత్ఫలంబె కద ధాతను మించినజీవితంబు నీ
కొనరుట నీదుప్రశ్నమున కుత్తర మిచ్చెద నాలకింపుమా. 642
తే. తొలుత వజ్రాంగదునికతఁ దెలుపువాఁడ
నవలవిద్యాధరులగాథ ననువదింతు

దేనశోణాద్రినాథుని దివ్యవైభ
వము దెసల్ నిండఁజాలెనో భద్రదనుయి. 643

మ. ఇలఁబాండ్యక్షితినాథులందు మహితుండే యన్నవిఖ్యాతిని
మ్ములఁ దాఁ గాంచి మహామునీంద్రులదయా పూర్వోక్తులంబొంది ని
స్తులశక్తిం దగుభూధవేంద్రుఁడు మహాశూరుండు వజ్రాంగదుం
డలఘుప్రాభవ మొప్ప రాజ్యమును బూజ్యప్రక్రియం గాచుచున్.

తే. తనభుజస్తంభమున భూతధాత్రిసాల
భంజికాకృతి నిల్వంగఁ బరమధార్మి
కోత్తముఁడు నాఁగవిఖ్యాతి నొంది వెలసె
న్యాయ మెఱిఁగినప్రోడయా నన నుతిఁ గని. 645

సీ. క్షమభూషణంబుగఁ గ్రాలగంభీరుఁడై
శాంతుడై వినయార్ధవంతుఁ డగుచు
ధీమంతుఁ డేకపత్నీవ్రతుండు నగుచుఁ
గృతియయి శంకరాంఘ్రిద్వయంబుఁ
బూజింప నాసక్తిఁ బూనుచు శీలవ
దగ్రగణ్యుండయి యామ్యజలధి
కేదారపర్యంత మేదినిఁ గాపాడె
విజితశాత్రవుఁడయి విశ్వవినుత

ఆ. చరితుఁ డొచు నొక్క సమయంబునన్ మృగ
యాభిరతిని ఘోటకాధిరూఢుఁ
డై చరించె వేడ్క నరుణాద్రిపర్యంత
కాననముల దుర్మృగములఁ జెండ. 646

చ. అతఁ డరుణాద్రికాననములందు మనోజ్ఞపరీమళంబులన్
క్షితి వెదఁజల్లుచుం బొలుచు చిత్రమృగంబును గస్తురిన్ మనో
జ్ఞతమము నిచ్చుదానిఁ గని చయ్యన దానిని వెంటనంటి యాం
దృతిమెయిఁబట్టఁగా హృదయ మెంతయుఁగోరఁగఁ బాఱెఁ బూన్కిమై.

తే. అదియె కస్తూరికామృగంబనఁ బ్రసిద్ధి
గాంచు భూమిని దన్నువెన్ దగిలివచ్చు

భూధవుం గాంచి సాధ్వసంబునఁ బరుగిడె
నరుణభూధ్రంబుచెంతకు నామృగంబు.

చ. క్రమమునఁ గొండచుట్టుఁ దిరుగాడుచు మానసవేగ మొప్పఁగా
క్షమఁ బడియెం దటాలున జగత్పతియుం బరిభగ్నసారుఁడై
శ్రమము తనుంగలంపఁగఁ దురంగమవర్యమునుండి పూర్వపు
ణ్యము చ్యుతిఁ గాంచ మర్త్యుఁడు వియత్పదముం విడిత్రెళ్లునట్లుగన్.

ఆ. మోముకాంతి వాయ భూమిపైఁబడియును
గారణంబిదంచుఁ గానఁబడమి
గజము పీడసేయఁగా గాసి గనునట్లు
క్షణము గ్రహముసోఁకఁగాఁ బడినటు. 650

క. పడియుండి సత్త్వవిప్లుతి,ఉడుగక వాటిల్ల హేతువుండు నెదియొ నఁట
బడవైచి వాహనం బెక్కడ కేగెనొ తెలియరాదుగా తలపోయన్.

క. అని చింతాకులుఁడై యు, జ్జనపతి విజ్ఞాన మెటకొచనఁగఁబడియె యుం
డెను యోజించుచుఁ గారణ,మునంత విద్యుత్ప్రకాశమున నభమెల్లన్.

ఆ. ఆవరించినట్లు లగపడె బానిని, జూచునంతలోనఁ దోఁచె నభము
నందుసత్వరము గనామృగ ఘోటక,ములుస్వకీయగాత్రములఁద్యజించి.

సీ. ఖేచరత్వమునొంది కీర్ణరత్నకిరీట
కుండలకేయూరమండితులయి
హారముల్ వెలయ క్షౌమాంతరీయోత్తరీ
యము లొప్పఁగుసుమహారాళి పొలయ
దివిజులవలె రుచిఁ దేజరిల్లుచు నిట్లు
పలికి రాశ్చర్యసంభరితుఁ డగుచుఁ
గనుచున్న నరపతికాంతునితో దంత
కాంతిఁ దదార్జితగాఢతమము

ఆ. నపహరింపఁ బూనినట్లు రాజా! యింకఁ, జాలు నిర్విషాద సరణిఁబట్ట
నరుణశైలపతిమహత్త్వమునఁ మాకు,నీశరీరము లిటు లేర్పడెఁగద.

క. నూతనదశ యిది చేకుఱె, నీతీరున నిర్వ్యరకు మహీశా! యనఁగాఁ
జేతస్తృప్తిని గననిటు, భూతలపతి పలికె హస్తములమోడ్పుతగన్.

చ. వినయము గన్పడంగఁ బృథివీపతి నాదును మీర లెవ్వరో
కనఁబడుచున్నవారు కుతుకం బొనఁగూర్చుచు భద్రులార! యా
ర్తనికరరక్షణం బెకద యార్యులధర్మము నాకు దర్శనం
బు నొసఁగి పల్కరించుగుణముం గనఁజాలిన మీచరిత్రముల్. 656

ఆ. తెలియఁజెప్పఁడన్న నలరి కళాధరుం, డవనినాథు నచ్చెరువున బ్రుంగి
యున్నవానిఁజూపిమన్ననమెయిఁగాంతి, శాలి హెచ్చరింప సరసఫణితిఁ.

క. తెలుపంబూనెను స్వచరిత, ముల రా జాపూర్వకాలమున నిర్వర ము
జ్జ్వలతేజులమై మైత్రిం, జెలఁగెడు విద్యాధరులము స్థిరవిభవులమై.

సీ. ఒండొరులను బాయ కొక్కెడ నుండుచు
మదనవసంతులమాడ్కి నొకట
స్వర్ణమహీధరస త్తమపార్శ్వంబునందు
దుర్వాసుని యాశ్రమమును
గనుకాంతున త్తపోవనమున కేగితి
మదిదురాసదమగు హృదయమునకుఁ
గూడ మహాదేవుఁగూర్చి యారాధన
మొనరింపఁ దగునట్టు లొప్పు పుష్ప

తే. వాటికం గాంచితిమి మోదభరము నింపు
నద్ది క్రోశార్ధమునఁ గాననయ్యె నుండ
రాకృతిం దాల్చి దానిమే నుడఁకువమెయిఁ
జొచ్చితిమి సాధుమతులును జోడుగాఁగ. 659

మ. సుమకాండాపచయోత్సుకంబు మదులం జూపట్ట నచ్చోట మో
దమె చేకూరఁగఁ గాంతిశాలి తనచి త్తంబందు గర్వంబు త
త్సమయంబం దుబుకంగఁ బాదములచే ధాత్రీస్థలం బెల్లఁ గం
పము నొందం జరియించె నేను వరపుష్పవ్యా ప్తగంధంబునన్. 660

ఆ. మోహితుండ నగుచు ముగ్ధాశయుఁడనయి, వికసనస్వభావ విలసితంబు
లై నసుమములందుహ స్తంబులం బెట్టి, నిలువఁబడితిఁగోయుతలఁపు లెసఁగ.

ఉ. అంతట బిల్వనామకమహాద్రుమమూలనిషణ్ణుఁడై తపం
బెంతయు నీమమూని హృదయేష్టదమై తగువ్యాఘ్రచర్మమ

త్యంతభయంకరాకృతిగ నందఱకుం గనరానొనర్చుచున్
జింతయె లేనిసన్మతి విశిష్టధనంబున నొప్పి ధన్యుఁడై. 662

ఆ. మండుచుండు నగ్నిమాడ్కిఁ దేజంబున, వెలుఁగుచున్నయట్టి విమలమూర్తి
దుష్టనికరభయదదుర్వాసుఁడనుమౌని, నన్నుఁ గాంచి కార్యమెన్నియపుడు.

సీ. భరియింపరానికోపమున నించుక యెడమనలేక కంపించునధరపల్ల
వముగల్గి భీకరభంగి నమర్చెడుకనుబొమముడి యెంతొ కలఁతనొరుల
కును గల్గఁజేయగఁ గ్రూరతేజంబున నధికరోషంబున నంగమెల్ల
స్వేదబిందువులను విషమముగానుండ దృష్టులఁ గాల్పంగఁ దివురునట్లు

తే. మమ్ము నదలించె నిర్వర మౌని! యంత
నొర! పాపాత్ములార! యాచారహీను
లరయి వర్తించు మీరెవ్వ రరయ జవ్వ
నమున గర్వించుచుండునై జమున వెలసి. 664

క. జ్వలియించు మత్క్రోధాగ్నికి, శలభత్వమునొందినారు సాధుమునిజనం
బులు నివసించువనంబిది, యలఘుతపోభూతి నొప్పునది మామకమున్.

క. పావనము భూతసంతతి, భావన మానట్టిదానిఁ బొదస్పర్శం
బీవిధి నొనరుప రవిశశు, లోలిఁ భీతిల్లువార లోడక మీరల్. 666

చ. చెలఁగుచు సంచరించెదరు శీఘ్రగతుల్ దగ శంకరాంఘ్రులం
గొలువఁగ నర్హమౌ కుసుమకుట్మలపత్త్రఫలాన్వితంబుగా
నలరెడు నీవనం బనుచు నాత్మఁదలంపరు గాలివీవ భీ
తిలు నళిబృంద మిందుఁ గలతేనియఁ ద్రావఁగరా దొకప్పుడేన్. 667

చ. వన మిది పావనం బనెడువార్త మదిం దలపోయ కీతఁ డే
పునఁ బదనాట్యపద్ధతిని బొంగుచు లెక్కగొనంగనైనఁ బూ
ననిదురహంకృతిఁ జెలఁగునాదగు శాపము నొంద నర్హుఁడౌఁ
గనుక హయాకృతిఁ జెలఁగుఁగాక క్షితిఁ బరవాహ్యతఁ వెతల్.

చ. కలుగుచు నుండుఁగాక మఱిగర్వమునొంది ద్వితీయుఁ డిందుఁ బూ
వులఁ దగుగంధసారమునఁ బొందినలోలతచే నెసంగె ని
య్యలఘుతరాఘసంగతి మహాచలభీకరకందరంబునన్
గలమృగసంఘమందున నొకండయియుండుతమామకోక్తిచేన్. 669

తే. గంధసారంగ మనఁగ నాఖ్యను ధరించి
తిరుగుఁగాన కని శపియించి తీవ్రకోప
మున మముం గాంచె నేమనఁ జనుమహీశ
మాని భీకరశాపవై శ్వానరుండు. 670

క. మముఁ గాల్చె; శాపవజ్రము,సమగ్రముగఁబైనఁబడిన క్షణముననే గ
ర్వముఁబాసిమానివరుశరణమునొందితిమింక మానినాయకమాకున్.

ఆ. శరణ మీవె గాన సంరక్షణోపాయ
మరయవలయు ననుచు నంఘ్రులపయిఁ
బడి త్వదీయశాప ముడుగదు ఫల మీక
తన్నివృత్తి యెట్లొ దయఁదలఁపుము. 672

చ. అని యతిదీనవృత్తిఁ గొనియాడెడుమమ్మతఁ డట్టె చూచి నె
మ్మనము దయాసముద్రమున మగ్నముగాఁగఁ దృగుత్పలద్వయం
బనుపమశీతలత్వమున నప్పుడు గన్పడఁ బల్కె నివ్విధం
బున నిఁకమీఁద మీకు నిటు బుద్ధిపొసంగకయుండుఁగావుతన్! 672

క. అరుణాద్రిచుట్టు మీరలు, తిరిగిన మచ్ఛాపభీతి తెగుఁ బూర్వము శం
కరుఁడు సభాపీఠంబున,స్థిరముగఁ గూర్చుండె దేవసిద్ధులు గొలువన్.

చ. శతమఖముఖ్యదిక్పతులు సాధుసపర్యలు చేయుచుండి ర
వ్వితతమున సర్వదేవతలు వేడ్క సపర్యలు చేయుచుండ నా
శతమఖునందనోపవన సత్తమదేవత యేగుదెంచి స
న్నతిమెయిఁ బాటలంబయిన మంచిఫలంబు నొసంగెఁ గాన్కగన్.

శా. బాలత్వంబున స్కందదంతివదనుల్ పండద్ది లోభంబునే
చాలం గూర్పఁగఁ గౌతుకంబున మనోజ్ఞం బైన యద్దాని సు
శ్శీలం గాంచినదాని నిమ్మనుచుఁ గోర్కిం దెల్పి రాశంభుఁ డ
వ్వేళం బల్కెను వారు పండుగొనఁగా వేవేగ తన్గోరుటన్. 676

క. కరసంపుటమునుఫలమును,నొరులకుఁగనరానియట్టు లొక్కటఁబృథులా
దరమునదాఁచి కుమారులఁ,బరికించివచించెఁ బ్రౌఢభావము వెలయన్.

సీ. విపులలోకాలోక వేష్టితం బగుఁగడ
యిద్దాని వలగొన నెవఁడు చాలు

నతని కీఫలము మహోద్ధృతి నిచ్చెద
నని శంకరుఁడు మోమునను స్మితంబు
షోడసరూపఁగాఁ జంద్రముని బురుడించుచుఁ
బలుకఁగా మేదినీస్థలమునకుఁ బ్ర
దక్షిణంబొనరింపఁ దాఁబూనె స్కందుఁడు
లంబోదరుండు శైలపతియైన

తే. యరుణశంకరుఁ దండ్రిని నమలభక్తి
మించుచుండఁ బ్రదక్షిణ మెంచి చేసి
ముందు నిలువంగఁబడియుండె నిందుధరుఁడు
విఘ్ననాథుని చాతుర్యవిధి నెఱింగి. 678

క. ఫలమొసఁగెఁ బ్రణయ మొప్పఁగఁ, దలనాఘ్రాణించి నాదుతనయుండితఁడే
ఫలములకెల్ల నధీశత, వెలయునిదే మొదలటంచు వేడుక మించన్. 679

క. వర మొసఁగె నంతసభ్యో,త్కరమును గని యిట్లుపలికె దనుజులసురలన్
బరికించి యిట్లు తెలిపెన్, దరహాస రుచిప్రసార ధవళితగృహుఁడై.

క. ధారణి శోణాద్రిమదా,కారమ్మగు దాని కెవఁడు కడుభక్తి నమ
స్కారము ప్రదక్షిణాన్విత,మై రంజిలఁ జేయు నతఁడు హర్షము పొంగన్.

తే. నాదుసారూప్యమును బొంద నర్హుఁడగుఁ బ్ర
దక్షిణము శైలమునకు నీతం డొనర్చ
బరమపావనుఁడయ్యె నేనరుఁడు వీని
పదరజము నొందు నుత్కృష్టపదమునందు. 682

క. ఆతఁడు సన్మాత్సదమును, బ్రీతిం గైకొనఁగఁదగును బెక్కుల నుడుల్
ఖ్యాతింగనుఁ ద్రిజగంబుల, నేతన్మాత్రుండుగలఁడె యెందు ననఁదగున్.

క. అని శాసించెను గావున, ననఘా! యరుణాద్రినామకాచలమునకుం
బొనరించు ప్రదక్షిణమది, యనుపమఫలమిచ్చుఁగాన నమరులు మునులున్.

చ. వలగొని పర్వతంబును స్వవాంఛలఁ గాంచిరి మీర లిర్వురీ
స్థలిమదజాఘయుక్తులయి శాపమునావలనం గఠోరమౌ
ఫలమిడుదానిఁ గాంచి గిరిపాలు ప్రదక్షిణపుణ్యసంతతిం
దొలఁగిన శాపశిక్షణముతో సుఖమొందుదు రిద్ది సత్యమౌ. 685

క. వినుఁడీ పశుపత్యాదుల,కును గూడఁ బ్రదక్షిణంబు కూర్చుశుభములన్
గనుకనరుణాచలేశ్వరుఁ,డనుపమఫలమిచ్చుటరుదె యమలమతులకున్.

తే. పాండ్యుఁడైన వజ్రాంగద పార్థివేంద్రు
సంగతిన్ మేలుగల్గు నిస్సంశయముగ
నని మహర్షి యమర్షణ మపుడు వదలి
పలుక నమ్మునివరునిశాపవిషమంత. 687

చ. తముఁ ద్వరసోఁకఁ బాపభరతాపము నత్తఱి నార్తిఁ గూర్చ న
శ్వము హరిణంబునై పడిరి సత్త్వము దూలఁగ గర్వ మిట్లు శా
పమునకుఁ గారణంబయినభంగి విచారముఁ గూర్చుచుండ మో
క్షమునకుఁ గాల మెప్పుడనుగాంక్షలు చిత్తములందుఁ గల్గఁగన్. 688

---

త్ర యో విం శా ధ్యా య ము

విద్యాధరవృత్తాంతము.

క. అని తెలిపి కళాధరుఁ డీ,టని తెల్పెను శిష్టచరిత మంతట మిత్రుం
డనఁదగినకాంతిశాలియు, జనియించె హయంబుగాఁగ క్ష్మాధవవర్యా!

తే. అద్రికాంభోజసంభవం బౌట మీకు
వాహనం బయ్యె నేను నోవసుమతీంద్ర!
గంధమృగతనుగంటి స్వాంగప్రభూత
పరిమళమదంబునన్ శోణగిరివనమున. 690

క. చరియించుచుమృగయూధము,ధరణీధర! మీరురాఁబ్రదక్షిణమును మే
మిరువురము శోణగిరి శం,కరునకు నొనరించితిమి దెకరుణయనఁదగున్.

వ. వాహారోహణదోషంబున నీకిట్టి దశప్రాప్తించె. పాదప్రచారపుణ్యం
బున మాకుఁ బ్రాక్తనపదంబు గలిగె. రాజేంద్రా! భవత్సంబంధంబున
నీతిర్యక్త్వబంధనంబునుండి విముక్తిం గాంచితిమి. స్వకీయధామమును
జేరఁగల్గితిమి. నీకు మేలగుంగాక యని పలికి తమ యిరువుల కరుగఁ
దలంచువారింగని కళాధరకాంతిశాలినామమహామహులారా! మీ
కిదె యంజలిఘటించువాఁడ నని రాజిట్లనియె. 692

సీ. ఈరీతి శోణాచలేశ్వరుమహిమచే శాపసాగరమును సంతరింపఁ
గల్గితిరిఁక నాకుఁగల్గునెల్లుచ్ఛ్రియం బస్మదీయస్వాంతమూర్తిమీఱ
భ్రమియింపసాగె నాప్రాణముల్ చనునట్టు లున్నవి చూడబలోత్తరంబు
దైవంబ యనిత్రోఁచు నావిని విద్యాధరులు చక్కయోజించి పలికిరిట్లు

తే. శ్రద్ధ వినవయ్య నీకు నిస్తార మెట్లు
కల్గునో తెల్పువార మొక్కట విధాత
సకలవిధదుస్తరాధియాస్వాంతమును స
మాధిగలదానిగాఁజేసి మానధుర్య! 693

క. జగముల సృజియింపఁగఁ బెం
పగఁ ద్రుంపఁగఁ గరుణఁ జూపఁ బ్రభువయి తగు శో
ణగిరీశునందుఁ జిత్తము
సాగయంగాఁ జేయవయ్య క్షోణీనాథా! 694

చ. కనఁబడుఁ దన్మహత్త్వము నికామముగాఁ దగువైభవంబు; మే
మనఁ బహుజాతి సంభవుల మైనను మాకిటు సత్ఫలంబు ల
బ్బెనుగద పాదచారివయి ప్రీతియు భక్తియు నొప్పఁగా నొ
ర్వను జతనంబుచేయుము ధరాపరిపాలవరా! ప్రదక్షిణం
బును బరమేశ్వరుండు ప్రియముంగనుఁ గస్తురియందు నెప్పుడున్. 695

చ. పరశివుఁ గస్తురం గలిపి భవ్యతమామలచందనంబునం
బరిమళపుష్పహారముల భక్తిమెలర్పఁగఁ బూజసేయు మో
ధరణిప! యెంతసంపదయొ దానికి నర్హముగా భజింపు మీ
శ్వరునకుఁ గోపురంబులును సాలగృహంబులుఁ గ్రొత్త లౌనటుల్. 696

తే. నియతిఁ జేయింపు మాత్వర నీకు మిగుల
సిద్ధులలవడుమాంధాత క్షితిపముఖ్యు
లైనమనుభగీరథముఖ్యు లర్హసంప
దలను గాంచిరి తదధికఫలము నీకు. 697

క. కలుగం గల దిది సత్యపుఁ,బలుకే యని నమ్మవయ్య పార్థివవర్యా!
కలుగు శుభంబులునీకన,నిలాధిపతి వారిపల్కు లెలమి వినంగన్. 698

ఉ. వారలు రాజమౌళికి శుభంబులు గల్గఁగఁ బల్కి యంత స్వా
గారము లొందు వేడుకలు గ్రాలఁగఁ బోయిరి సంశయంబుల
వ్వారి వచస్సులే తొలఁగుభంగి నొనర్చఁగ నెమ్మనంబు దు
ర్వార విపత్సముద్రతరణంబుల శంకరు నంఘ్రులం దగన్. 699

ఆ. నిలువఁజేసి భక్తి నిశ్చలంగాంచఁ, జేయఁజాలి యల్ల క్షితిపమౌళి
శంకరునిభజంచుసరణిఁబూనెనుసుహృ, త్తములపలుకుతనహితమునుగూర్ప

---

# చతుర్వింశాధ్యాయము.

---

క. క్షితిసురమౌని మృకండుని, సుతుఁ డానందీశు భక్తిఁజూచి మహాత్మా!
శితిగళు మాహాత్మ్య సరి,త్పతిచంద్రముఁ జిత్రతరము భవ్యతమమ్మున్.

క. పరిపూర్ణ మోదదమునగు, చరితము విద్యాధరు లది చక్కఁగ విన ని
త్తరుణమున నోచఁజాలితి,నిరుపుర వారెంతొ ధన్యు లిట్టిం డ్రగుటన్.

తే. ఎట్లు వజ్రాంగదుఁడు సిద్ధులెల్లఁ బొలయ
శంకరుని బూజచేసె? నేసరణి నరుణ
గిరివిభుని గరుణఁబూని యుత్కృష్టవరము
లీయఁ దమిగల్గఁజేసెనో యెలమిఁ జెపుమ? 703

చ. అనవిని నందికేశుఁ డను నవ్వలిదాక్షితినాథు గాథనున్
వినుఁ; మతఁ డంత నెయ్యమున వీటికిఁ బోఁదగుకాంక్ష మాని శం
భునిపదపంకజాతములఁ బూనికఁ గొల్వఁగఁ గొండచెంతనే
తనకు నివాస మేర్పడినఁ దద్దయు మే లని యెంచి యచ్చటన్. 704

సీ. నివసించె నంత నానృపతి సైన్యము ఘోట
కము పోయినట్టి మార్గము వెదకుచు
స్యందన దంతీంద్రహయభటాన్వితముగఁ
జనుదెంచి నరపతి శాంతధైర్య
ముల నప్పు డొందుటఁ దెలియంగఁ జాలెనా
ధారణీపతి పురోధసుఁడు మంత్రి

సామంతనరపతి సైన్యపాలకులు రాఁ
గనుఁగొని శోణాద్రికిని వెలుపల
తే. నిలువఁబంచె వజ్రాంగదుఁ డలఘుకోశ
దేశముల సాంబశివుని తృప్తికి నొసంగి
గౌతమాశ్రమమునకుఁ జెంగటఁ దపోవ
నమును నిర్మించుకొని పురోధుమతమూని. 705
చ. తనసచివోత్తముల్ పొగడ దర్పకభంజనుఁ బూజచేయఁ బూ
నెను దనదేశమందుఁగల నిర్మలపద్ధతులెల్లఁ గావఁగాఁ
దనయుని నిల్పి మానవుల ధర్మముఁ బూనకయుండుమార్గముల్
మనమునకెక్కఁ దెల్పి స్మృతిమండలసమ్మతధర్మభేదముల్. 706
తే. తెలిపి రత్నాంగదా! మనుష్యులను గాచు
పనియె ముఖ్యంబు తక్కువే యనఁగఁ జనును
దక్కినవి దానికంటె భూధవుల ధర్మ
మదియె యని తెల్పి యతఁ డట్లె యాచరింప. 707
చ. విని ముదమందుచుం విహితవృత్తిని శంకరుఁ బూజ చేయుచున్
దనయుఁడు పంపు వస్తుసముదాయముతో హరుఁ దృప్తఁజేయుచున్
వనపరిపూర్ణమై వివిధవర్ణమనోజ్ఞసుమాన్వితంబులై
తనరు జలాశయంబులను దద్దిరి కెల్లెడలం జెలంగఁగన్. 708
తే. ధనము వెచ్చించి త్రివ్వించి ధరణిసురుల
కగ్రహారముల నొసంగి యధికఫలము
లవ్వి యొసఁగంగ సంతృప్తి నంది వారు
తన్ను నాశీర్వదింప ముదంబు గనుచు. 709
క. జ్వలనస్తంభాకృతి నుజ్జ్వలకాంతి వెలుంగు శోణశైలపతికి ని
స్తులమోదమొప్ప నికట, స్థలి దీర్ఘికలం రచించె శతములుగాఁగన్.
చ. జలరుహనేత్రలం దనదు సన్నిధిఁ గొల్వఁగ నుండి సోయగం
బలరఁగ నప్సరోవితతి హారితనూరుచి గెల్వఁజాలి సే
వల నలరింపఁగాఁ దగిన వర్ణ్యగుణంబున నొప్పువారి నీ
శలలిత సేవకై నిలిపె క్ష్మాపతి యూహలుపర్వ భక్తితోన్. 711

క. లోపాముద్రాసహితుం, డై పరమతపోవిభూతి నలరు నగస్త్యుం
డా పరమశంకరుం గనఁ, దాపసయుతిరాఁగ భక్తి దర్శించి యటన్.

చ. తన యొనరించుపూజల ముదంబును బొంది యగస్త్యమౌనితన్
గనుఁగొని నీవు ధన్యుఁడవు, కామహరప్రియవర్తనంబునన్
వినుతిని గాంచి తీవనుచు వేడుకమీఱఁగ నాశిషంబులం
దనుపఁగఁ దృప్తినొందె సతతంబు నవంబగు తీర్థమందొగిన్. 713

వ. స్నానంబు నిర్వర్తించుచుఁ బాపనాశప్రవాహేశులను బ్రయతుండై
పూజించుచుండె మఱియును. 714

సీ. మహిషాసురుంజంపిమహనీయకీర్తిచే వెలయుదుర్గాంబనువిశ్వవిభుఁడు
నిత్య మారాధించునియతిని బూనెను; దుర్గతిహారిణి దుర్గయన్న
విశ్వాసమున బ్రహ్మవిష్ణుపూజ్యుండయి లింగరూపంబును లీలఁదాల్చి
యున్నశంకరునకు నున్నతపూజలఁ గల్పించి ప్రత్యూషఃకాలమందుఁ

ఆ. దాను లేచి సరసుదగ్గఱకుం బోద, చారి యొగుచుఁబోయి స్నానమువిధి
తప్పకుండఁజేసి తన్మంత్రమైనపం,చాక్షరిని జపించి యవలభక్తి. 715

చ. వలగొనుమూఁడుసారులు ప్రభంజితశాత్రవుఁడౌ నృపుం డుమా
జలరుహనేత్రతో శివుని జక్కనిపున్నమయూర్జమాసమం
దొలయఁగ వేలసంఖ్యలయి యొప్పెడుదీపములన్ భజించుభ
క్తులును దదుత్సవంబుఁ గనుఁగొన్నమహాఫలమంచు రాఁగనున్. 716

క. భువనత్రయి నాదీపో,త్సవ మెంతయు ఖ్యాతిఁగాంచు సాధుపరిమళం
బు వఱలఁ దగుకహ్లారా, ఖ్యవిమలకుసుమాళిఁ బూజఁగావించుఁడమిన్.

సీ. అట్టి కహ్లారసుమావళిఁ గర్పూరజలపూరితములయి వెలయఁజేసి
యర్చించు స్వర్ణమయములైన కుంభసహస్రంబులజలంబునమరఁదెచ్చి
యభిషేక మొనరించునట్టులేప్రతిమాసమునధ్వజారోహణము మొదలైన
తీర్థోత్సవంబులఁ దీరుతప్పకయుండఁ జరపించు లోకాళి! సమధికమగు

ఆ. పుణ్యఫల మొసంగు పూతరథోత్సవం,బెలమిఁజేయఁ బంచు నీశులింగ
మునకు నిత్యపూజమునుకొని చేయించు,నటు ప్రదక్షిణంబులాచరించు.

వ. యోజనత్రయాయామవ్యాపి యగుశోణాచలంబునకుఁ బ్రదక్షిణం
బాచరించుచు, నరుణాచలనాథా యనియుఁ గరుణామృతసాగరా

యనియు నరుణాంబాసనాథా యనియు మరల మరల సంస్తుతుల
శంకరు నలరించు మఱియు. 719

క. వివిధద్రవ్యంబుల నేర్పవఱలఁ బంచామృతాదిపూజ్యపదార్థ
ప్రవిమలసమ్మేళనమును, శివునకు నర్పించుభక్తి చెలువారంగన్. 720

ఆ. గంధసారపంక కర్పూరసమ్మిళిత మగులేపనంబు దర్పహరున
కాచరించు మృగమదాదివస్తూత్కర,ముల పరిమళంబు గలసుమముల.

క. కమలంబుం గహ్లార, ప్రముఖంబులఁ బూజచేయుఁ బ్రాతఃకాలం
బు మొదలుగ విధివిధానం, బమరం బూజించుభక్తు లానందింపన్.

క. వరివస్యాసంయుతు శం, కరు నీగతి నేండ్లు మూఁడు కడునియమమునన్
బరిపూజింపఁగ దుష్టని,హరుఁ డొంది మహీధ్రవేంద్రు నగ్రతలమునన్.

చ. కనఁబఱచెన్ స్వకీయమగు కమ్రవృషంబు హిమాచలంబునాఁ
గనఁదగియుండ దానిపయిఁ గాంతయుఁ దానును గూరుచుండి యిం
పున నొకమేనుగా నొరులు బుద్ధిఁ దలంప వసిష్ఠముఖ్యులౌ
మునిపతు లట్లె దేవముని ముఖ్యులు కుంభనికుంభులుం దమిన్. 724

క. జయజయరవములలోక,త్రయముం బ్రతిగా ధ్వనింప భక్తి నొనరుపన్
దయ కెన్నఁ బెన్నిధానం, బయిచూపులు లక్ష్మికిన్ సదావాసములై.

క. కరుణాసింధువు లగుచుం, బరఁగన్ గలుషంబుఁ జెండఁ బ్రత్యక్షంబై
హరుఁడెదుటఁదోఁపఁగాభూ, వరుఁడౌవజ్రాంగదుండుభవునింగనుచున్.

తే. భూమి నష్టాంగసంయుక్తముగఁబడి నతి
యొనరిచెన్ భక్తిరసమెల్ల నుబుకుచుండ
నంజలింబట్టి శీర్షంబు నట్టె వంచి
దంతరుచిజాలములఁ దత్పదముల నపుడు. 727

ఆ. కడుగునట్లు చూచి తడఁబడువాక్కులఁ,బలికె దేవదేవ పరమమాధ్య
మునను భూరిపాపముల నొనర్చితి నట్టి,ననుక్షమింపవలయు నాథ! నీవు.

చ. అని తను వేఁడు నానృపుదయామతి శంకరుఁ డట్టె చూచి వి
శ్వనికరనాయకుండయిన శంకరుఁ డయ్యరుణాద్రినాథుఁ డి
ట్లనుభయ మొందఁబోకు తనయాపరిత్రప్తుఁడ నీదుపూజచేఁ
గనుదు శుభంబు లింక వినఁగాఁ దగుమద్వచనంబుఁ జక్కఁగన్. 729

సీ. అష్టమూర్తులునాకునగుసర్వభూతార్థమయియవియలరారునమరపతివి
మును వీవు కైలాసమూర్ధంబునందున్న ననునవజ్ఞనుగంటివనియెఱింగి
స్తంభించితిని దాన క్షణకాలమున గర్వమును బాసితివి లజ్జఁగనితివట్టి
కార్యంబునకు నన్నుఁ గాంచి సర్వైశ్వర్యకారణమగుశివజ్ఞానమిూవు.
తే. కోరితివి నేను బల్కితిఁ గులిశధారి, భూతలంబున జన్మింపఁబోలు నీకు
నచట వజ్రాంగదుండను నాహ్వాయమున,నుందువ త్తఱినాకృపనొందుదీవు.
క. అని శాసించితి ననఘా, పని దానిం దీర్ప శోణపర్వతరూపం
బునుగాంచితిముగ్ధుఁడవై, తనిచాలఁగ శ్రమములొందునటు చేసితిఁజూ.
ఆ. పరమభక్తుఁడవయి నిరుపమసేవల, సంతతంబు నన్ను నెంతొ తృప్తి
గా నొనర్చితీవు కావున సంతుష్టహృదయుఁడ నయినిన్ను నిచటఁగంటి.
సీ. హితమునుబోధింతునెదియనవినవయ్యయంబరానిలములునగ్నిజలము
లవనియుభాస్కరుఁడమృతమరీచియుఁబురుషుండునననునివిమూర్తులగును
నాయవి వీనిచే నీయఖిలప్రపంచము సచరాచరసంజ్ఞఁ దనరు
నదివ్యాప్తమైయుండుననినిశ్చయింపుముకాలరూపుఁడనయికడఁగియర్థ
తే. ములను సత్త్వంబులను ధర్మములను వెలయఁ
జేయుచుందుఁ దత్త్వాతీతుఁడే యనంగఁ
బరఁగుదుఁ నేను శివుఁడను బర మనునది
నాకు లేదన్నియును నే ననంగఁదగుదు. 733

వ. చిదానందసింధు వగునాయూర్ములు కొన్ని వెలయు. బ్రహ్మవిష్ణు రుద్రేంద్రముఖులే యాయూర్ము లని యెఱుంగుము. వాణియు లక్ష్మియు క్షమాశ్రద్ధాప్రజ్ఞలు స్వాహాస్వధాదులు ననంఖ్యేయమహాశక్తి యగు నావిసృష్టశక్తులే యని తెలియవలయు. ఈగౌరి నామహాశక్తియగు. ఈమెయే మాయయు జగజ్జననియునగు. ఈమెచే విశ్వము విస్తరింపఁజేయంబడుచుండు. నేనీశక్తింగూడి సృష్టిస్థితిసంహారంబుల నొనరింతు. జగచ్చిత్ర మిది నిజేచ్ఛచే సాగుచుండం గాంచుచుండుదు. నీ వింక నిర్మోహుండవై నామహత్త్వముచే సముద్రతరంగములకు వలె నీయాత్మ మదభిన్నమని విచారింపుము. మద్రూపశాలిని యగు భూమికధిపతివైతివి. నాప్రసాదంబున భోగజాలంబుల ననుభవింపుము.

మరలఁ బురందరత్వ మలవడు. మదేకరూపతను గనుఁగొనంగల వని
పలికి, శంకరుండు తిరోహితుం డయ్యె నంత. 734

క. కృతియయి వజ్రాంగదభూ,పతిశోణాచలవిభుఁ విభాసురలింగా
కృతిఁ బూజించుచు భోగ,ప్రతతిం దాఁబొందె శివుని పరమకరుణచేఁ.

క. అని తేటపఱచి మునిపతి,తనయాశివభక్తిమహిమఁ దగినట్లుగ నీ
కును దెల్పితి వలగొనినం, గననగుఫల మిద్దికలుగఁగాఁదగు ననుచుఁ.

సీ. వినిపించితిని వేయివిధముల ననసేల? యరుణాచలేశున కమరవినుత
కీర్తిశాలికిఁ బ్రదక్షిణమను సేవయే యశ్వమేధశతంబు నాచరింపఁ
గలుగునట్టియనంతఫలములమించెడునయనసంక్రాంతులయంసుమఱివ్య
తీపాతమాదియౌ దివ్యపరములందు నరుణాద్రిపతిఁబూజ నలరఁజేయఁ

తే. గాఁబ్రదక్షిణమును జేయఁగాననంత,ఫలములబ్బునుశోణాద్రిపతినిబోలు
భక్తవరదానదక్షదైవంబు నట్టి, క్షేత్రమెయ్యదిలేదుగా క్షితినదెందు.

క. అరుణాచల నాథునకుఁ,సరిచేయఁదగిన దేవసత్తముఁ డెందేఁ
బరికింపఁగలడె వేదో, త్కరవినుతుం డరుణశిఖరి విభుఁ డెల్లపుడుఁ.

క. వలగొనుకార్యము మించిన, దిలనే తపమెన్న లేదదే సకలంబుఁ
గలిగించుసుఖము దుఃఖం,బులఁ దోలును జెంతనుండఁబోలదటంచుఁ.

చ. అని యిటు నందికేశుఁడు మహర్షికిఁ దెల్పిన నామృకండునం
దనుఁడు భరింపరానిప్రమదంబుమెయిం బులకల్ జనింపఁగాఁ
గనులను బాష్పపూరములు గ్రమ్మఁగ శంకరు సర్వలోకనా
థునిఁ దలపోయుచుఁ ముదముతోఁ జెలువారుచుండె నచ్చటఁ. 740

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్తగీర్వాణాంధ్రకవి
తాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీ
మిత్ర, సుబ్రహ్మణ్యమనీషిపుత్త్రి, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రి
నామధేయ,వినిర్మితంబైన శ్రీమదరుణాచలఖండంబు సర్వంబు సంపూర్ణము.

---

శ్రీ గోపాలకృష్ణాప్రెస్సునన ముద్రితము, మద్రాసు, 21 1950.